ఖున్నోందకున్నావు? అని, తాత్పర్యము.

మదాన్వితానాం ఘోరాణాం కుంజరాణాం తరస్వినామ్
కథ మేకా మహారణ్యే న బిభేషి వరాననే. ౩౦

టీక॥ వరాననే = సుందరమగుముఖము గలచిన్నదానా! ఏకా = ఒకర్తె లేవు; మహారణ్యే = గొప్పయడవియందు ; మదాన్వితానాం = మదముతోఁగూడినవియు; ఘోరాణాం = భయంకరములును ; తరస్వినాం = బలవంతములునగు ; కుంజరాణాం = ఏనుఁగులకు; కథం = ఎట్లు; నబిభేషి = భయపడకున్నావు?

సుందరముఖంబగు చిన్నదానా! ఇమ్మహారణ్యంబునసీవొకర్తె తెవెమదించియున్న భయంకరాకారంబులను బలవంతంబులునగు నేనుంగులకు భయపడకెట్లున్నావు? అని, తాత్పర్యము.

కాసి కస్య కుతశ్చ త్వం కిన్నిమి త్తంచ దండకాన్
ఏకా చరసి కల్యాణి ఘోరాన్ రాక్షససేవితాన్. ౩౧

టీక॥ కల్యాణి = మంగళరూపిణివగు చిన్నదానా! త్వం = నీవు; కా = ఎవ్వతెవు; అసి = అగుచున్నావు? కస్య = ఎవ్వనిసంబంధినివి? కుతః = ఎందుండి; ఆగతా (అధ్యాహృతము) = వచ్చినావు? కిన్నిమిత్తంచ = ఎందుకొఱకును; ఏకా = ఒకర్తెవు; ఘోరాన్ = భయంకరములును; రాక్షససేవితాన్ = రాక్షసులచే సేవింపఁబడినవియునగు; దండకాన్ = దండకాటవిని; చరసి = సంచరించుచున్నావు.

మంగళరూపిణివగుచిన్నదానా! నీ వెవ్వతెవు; ఎవ్వరిసంబంధముదానవు? ఎందుండివచ్చినావు? భయంకరంబును రాక్షస వాసస్థలంబునగు నీదండకారణ్యంబున, నొంటిమైయి సంచరించుచున్నావేల? అని, రావణుండు, సీతాదేవితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇతి ప్రశస్తా వైదేహీ రావణేన దురాత్మనా
ద్విజాతివేషేణ హితం దృష్ట్వా రావణ మాగతమ్. ౩౨

సర్వైరతిథి సత్కారైః పూజయామాస మైథిలీ

టీక॥ వైదేహీ = విదేహదేశరాజు కొమార్తె యగు; మైథిలీ = సీతాదేవి; దురాత్మనా = దుష్టమయినమనస్సుగల; రావణేన = రావణునిచేత; ఇతి = ఇట్లు; ప్రశస్తా = పొగడఁబడినదై; ద్విజాతివేషేణహి = బ్రాహ్మణవేషముచేతనె; ఆగతం = వచ్చిన; తం = ఆ; రావణం = రావణుని; దృష్ట్వా = చూచి; సర్వైః = సమస్తములయిన; అతిథిసత్కారైః = అతిథికిఁ జేయవలసినపూజలచేత; పూజయామాస = పూజించెను.

సీతాదేవి, యట్లు దురాత్ముండగు రావణునిచేఁ బ్రశంసింపంబడి, బ్రాహ్మణసన్న్యాసివేషంబు దాల్చి వచ్చిన యా రావణుంగని, నిక్కంబుగ సన్న్యాసియె యని భ్రమించి, యతనికర్ఘ్యపాద్యాద్యతిథిసత్కారంబులు యథావిధిం గావించెను. అని, తాత్పర్యము.

ఉపనీయాసనం పూర్వం పాద్యేనాభినిమంత్ర్య చ. 33
అబ్రవీత్సిద్ధ మిత్యేవ తదా తం సౌమ్యదర్శనమ్

టీక॥ సా (అధ్యాహృతము) = ఆసీతాదేవి; పూర్వం = ముందట; ఆసనం = పీటను; ఉపనీయ = తెచ్చి; పాద్యేన = పాద్యముచేత; అభినిమంత్ర్య చ = పూజించియు; తదా = అప్పుడు; సౌమ్యదర్శనం = శాంతమయినచూపుటగల; తం = ఆరావణునిగూర్చి; సిద్ధం = సిద్ధమయినది; ఇత్యేవ = అనియె; అబ్రవీత్ = చెప్పెను.

ఆసీతాదేవి, పీటదెచ్చి వేసి, రావణునకుఁ బాద్యంబొసంగి, యింత, సౌమ్యవేషంబు వేసికొనియున్న యా రావణుఁజూచి, "పక్వాన్నంబు సిద్ధంబయ్యె," భుజింపుమని, చెప్పెను.

అని, తాత్పర్యము.

ద్విజాతివేషేణ సమీక్ష్య మైథిలీ
సమాగతం పాత్రకుసుంభధారిణమ్. 34
అశక్య ముద్వేష్టు ముపాయదర్శనం
న్యమంత్రయ ద్బ్రాహ్మణవత్తదాంగనా

టీక॥అంగనా=స్త్రీయగు;మైథిలీ=సీతాదేవి;తదా = అప్పుడు;ద్విజాతివేషేణ=బ్రాహ్మణవేషముచేత; సమాగతం=వచ్చినవాఁడును; పాత్రకుసుంభధారణం= కమండలువును గాషాయవస్త్రమును ధరించినవాఁడును; ఉద్వేష్టుం=ద్వేషించుటకు;అశక్యం = అలవిగానివాఁడును;అపాయదర్శనం = అపాయంబునందు దృష్టిగలవాఁడునగు; తం(అధ్యాహృతము)= ఆరావణుని; బ్రాహ్మణవత్ = బ్రాహ్మణునివలె న్యమంత్రయత్ = భోజనార్థము పిలిచెను.

సీతాదేవి, బ్రాహ్మణసన్న్యాసివేషంబు నొందికమండలువునుధరించి గాషాయవస్త్రంబుగట్టుకొనివచ్చుటవలన నెంతమాత్రముదుర్మార్గుఁడని సంశయింపనలవిగానివాఁడును దుర్మార్గంబు సేయుటకేవచ్చియున్నవాఁడునగు నా రావణుని, బ్రాహ్మణునింబోలె, భుజింపంబ్రార్థించెను. అని, తాత్పర్యము.

ఇయం బ్రసీ బ్రాహ్మణ కామ మాస్యతా
మిదంచ పాద్యం ప్రతిగృహ్యతా మితి. ౩౫
ఇదంచ సిద్ధం వనజాత ముత్తమం
త్వదర్థ మవ్యగ్ర మిహోప భుజ్యతామ్

టీక॥బ్రాహ్మణ=బ్రాహ్మణుఁడా! ఇహ=ఇచ్చట;ఇయం=ఇదిగో; బ్రసీ=ఋషులుగూర్చుండునట్టి యాసనము; కామం=యథేచ్ఛముగా; ఆస్యతాం=కూర్చుండుటయగుగాక.ఇదం= ఈ; పాద్యంచ=పాదజలమును ; ప్రతిగృహ్యతాం=స్వీకరింపఁబడుఁగాక. త్వదర్థం=నీకొఱకైన;సిద్ధం= పక్వమయిన;ఇదం=ఈ;ఉత్తమం= శ్రేష్ఠమయిన; వనజాతం=వనంబునఁబుట్టిన పదార్థము;అవ్యగ్రం= కొంతలేకుండునట్లు; ఉపభుజ్యతాం=భుజింపఁబడుఁగాక.ఇతి=అని;న్యమంత్రయత్ (అధ్యాహృతము)=ప్రార్థించెను.

బ్రాహ్మణుఁడా ! ఇదిగో ఆసనము కూర్చుండుము;ఇదిగో పాద్య మంగీకరింపుము; నీకొఱకుఁబక్వము చేయఁబడినయుత్తమంబగువన్య పదార్థములిదిగో భుజింపుము. అని,సీతాదేవి,రావణుంబ్రార్థించెను. అని, తాత్పర్యము.

నిమంత్ర్యమాణః ప్రతిపూర్ణభాషిణీం
నరేంద్రపత్నీం ప్రసమీక్ష్య మైథిలీమ్. ౩౬
ప్రసహ్య తస్యా హరణే ధృతం మన
స్సమర్పయామాస్వాత్మ వధాయ రావణః

టీక॥ రావణః=రావణుఁడు; నిమంత్ర్యమాణః=భోజనమునకుఁ బ్రార్థింపఁబడుచున్నవాఁడై; ప్రతిపూర్ణభాషిణీం= నిండుగా మాటలాడుచున్నదియు;నరేంద్రపత్నీం= మనుజనాథుండగు రాముని భార్యయునగు; మైథిలీం=సీతను;ప్రసమీక్ష్య= చక్కఁగాఁజూచి; ఆత్మవధాయ=తనవధముకొఱకు ; ధృతం=ధైర్యముగలుగునట్లుగా;తస్యాః=ఆసీతాదేవియొక్క; ప్రసహ్య=బలాత్కారమగు;హరణే=హరించుటయందు;మనః=మనస్సును; సమర్పయామాస=ఉంచెను.

రావణుండు,అట్లుసీతచేఁ బ్రార్థింపఁబడుచున్నవాఁడై , కపటములేక నోటినిండుగా మాటలాడుచున్న రామభార్యయగునా సీతాదేవిం జక్కఁగాఁజూచి,తనచావుకొఱకై ,ధైర్యంబున, బలాత్కారంబున నావిడనపహరింప దలఁచెను. అని, తాత్పర్యము.

తతస్సువేషం మృగయాగతం పతిం
ప్రతీక్షమాణా సహలక్ష్మణం తదా. ౩౭
వివీక్షమాణా హరితం దదర్శ తత్
మహద్వనం నైవ తు రామలక్ష్మణౌ

టీక॥ తతః=అంత; తదా= అప్పుడు; సా(అధ్యాహృతము)=ఆసీత; సువేషం=సుందరమయినయాకారముగలవాఁడును; సహలక్ష్మణం= లక్ష్మణునితోఁగూడినవాఁడును;మృగయాగతం=వేఁటకొఱకుఁబోయినవాఁడునగు ; పతిం=పెనిమిటిని; ప్రతీక్షమాణా=ఎదురుచూచుచు; హరితం=దిక్కులను; వివీక్షమాణా=నానావిధంబులఁజూచుచు; తత్ =ఆ; మహత్ = గొప్పదగు; వనం=అడవిని; దదర్శ=చూచెను . రామలక్ష్మణౌ తు= రామలక్ష్మణులనుమాత్రము; నైవ(దదర్శ)=చూడనేలేదు.

అంత, నప్పుడాసీతాదేవి , సుంద

రాకారుండగు వేటకుబోయినతన పెనిమిటిని రామునిలక్ష్మణుని, ఎదురుచూచుచు, నానావిధంబులవాదికుకొం బట్టియెంతచూచినను, అబిడకువట్టియరణ్యమేకానవచ్చెను గాని, రామలక్ష్మణులెంతమాత్రముకానరారైరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

అరణ్యకాండే,షట్చత్వారింశస్సర్గః.

ఇది , స్పష్టార్థము.

ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర

వ్యాఖ్యానంబునందు,అరణ్యకాండషట్చత్వారింశసర్గటీక,

ముగిసినది.

---

సప్తచత్వారింశసర్గప్రారంభః.

రావణేనతు వైదేహీ తథా పృష్టా జిహీర్షతా

పరివ్రాజక లింగేన శశంసాత్మాన మంగనా. ౧

టీక॥ అంగనా=స్త్రీయగు; వైదేహీ=సీత;జిహీర్షతా= అపహరింపఁగోరుచున్నవాఁడును ; పరివ్రాజకలింగేన=సన్న్యాసివేషముగలవాఁడునగు; రావణేన=రావణునిచేత;తథా=అట్లు; పృష్టాతు=అడుగఁబడినదైనంతనే; ఆత్మానం=తన్ను;శశంస=చెప్పెను.

సీతాదేవి,యట్లుతన్నపహరించుటకై సన్న్యాసివేషము వేసికొనివచ్చియున్నరావణుండడుగఁగానే, తనవృత్తాంతమంతయునీప్రకారంబునం జెప్పం దొడంగెను.అని, తాత్పర్యము.

బ్రాహ్మణశ్చాతిథిశ్చాయ మనుక్తోహి శపేత మామ్

ఇతి ధ్యాత్వా ముహూర్తంతు సీతా వచన మబ్రవీత్.౨

టీక॥సీతా=సీత; అయం = ఈతఁడు;బ్రాహ్మణశ్చ = బ్రాహ్మణుఁడును;

అతిధిశ్చ=అతిథియు;అనుక్తః= చెప్పఁబడనివాఁడై;మాం = నన్ను; శపేతహి=శపించునుగదా!ఇతి=అని ; ముహూర్తం=కొంచెముసేపు;ధ్యాత్వా తు=ధ్యానించి;వచనం=మాటను ; అబ్రవీత్=చెప్పెను.

సీతాదేవి , ఈతండుబ్రాహ్మణుండు అతిథియుఁగావున , నీతండడిగినదిచెప్పకుందునేని,నన్నుశపించును"అని, కొంచెముసేపాలోచించి, యింతయుఁట్లని,చెప్పెను. అని,తాత్పర్యము.

దుహితా జనకస్యాహం మైథిలస్య మహాత్మనః
సీతానామ్నాస్మి భద్రం తే రామభార్యా ద్విజోత్తమ. ౩

టీక॥ ద్విజోత్తమ = బ్రాహ్మణశ్రేష్ఠుఁడా! తే=నీకు; భద్రం=మంగళము; అస్తు(అధ్యాహృతము)=అగుగాక. అహం=నేను; మహాత్మనః=అధికమయినప్రభావముగల; మైథిలస్య=మిథిలకుఁబ్రభువైన; జనకస్య= జనకమహారాజుయొక్క; దుహితా = కొమార్తెను. నామ్నా=పేరుచేత; సీతా=సీతను; అస్మి=అగుచున్నాను. రామభార్యా=రామునిభార్యను.

బ్రాహ్మణశ్రేష్ఠుఁడా!నీకుమంగళముగలుగుఁగాక; నేనుమహాత్ముండును మిథిలానాయకుండునగు జనకమహారాజుకొమార్తెను; రామునిభార్యను.
అని, తాత్పర్యము.

ఉషిత్వా ద్వాదశసమా ఇక్ష్వాకూణాం నివేశనే
భుంజానా మానుషాన్ భోగాన్ సర్వకామసమృద్ధినీ. ౪

టీక॥ అహం(అధ్యాహృతము)=నేను;ఇక్ష్వాకూణాం= ఇక్ష్వాకువంశపురాజులయొక్క;నివేశనే = ఇంటియందు;ద్వాదశ=పండ్రెండు;సమాః=సంవత్సరములను;ఉషిత్వా = ఉండి;సర్వకామసమృద్ధినీ= సమస్తములయినకోరఁదగినపదార్థసమృద్ధిగలదాననై;అమానుషాన్ = మనుష్యసంబంధులుకానట్టి, మనుష్యదుర్లభములయినయనుట;భోగాన్ = భోగములను;భుంజానా=అనుభవించుచు;ఆసం(అధ్యాహృతము)=ఉంటిని.

నేను, వివాహమయినపిమ్మట, న త్త గారింటఁ, బండ్రెండు సంవత్సరములు, సమస్త కావ్యపదార్థంబులతోను స మృద్ధంబుగాఁగూడి, పెనిమిటితోఁగూడ, నానావిధంబులగుమనుష్యదుర్లభం బులయిన భోగంబు లనుభవించుచుంటి ని. అని, తాత్పర్యము.

తత స్త్రయోదశే వర్షే రాజా మంత్రయత ప్రభుః
అభిషేచయితుం రామం సమేతో రాజమంత్రిభిః. ౫

టీక॥తతః=అంత; త్రయోదశే=పదుమూఁడవదైన; వర్షే= సంవత్సరమునందు; ప్రభుః=ప్రభువైన; రాజా= దశరథమహారాజు; రాజమంత్రిభిః=రాజులతోను మంత్రులతోను; సమేతః=కూడినవాఁడై; రామం = రాముని; అభిషేచయితుం=అభిషేకించుటకు; అమంత్రయత=ఆలోచించెను.

అంతఁ బదుమూఁడవ సంవత్సరంబున, మామామదశరథమహారాజు, సామంతరాజులతోను మంత్రులతోనుం గూడ, రామునకుఁ బట్టాభిషేకము సేయఁ దలెననియాలోచించెను;

అని, తాత్పర్యము.

తస్మిన్ సంభ్రియమాణే తు రాఘవస్యాభిషేచనే
కైకేయీ నామ భర్తారం మార్యా సా యాచతే వరమ్. ౬

టీక॥తస్మిన్=ఆ, రాఘవస్య= రామునియొక్క; అభిషేచనే= పట్టాభిషేకము; సంభ్రియమాణే తు = ఆరంభింపఁబడుచుండఁగానే; ఆర్యా= అత్తగారైన; సా=ఆ; కైకేయీ = కైకేయి యనునది; భర్తారం= పెనిమిటినిగూర్చి; వరం=వరమును; యాచతే= యాచించినది.

అట్లు రామునకుఁ బట్టాభిషేకము సేయనారంభించు కాలంబునందు, నాయత్తగారొకతెకైకేయియనునాబిడ, పెనిమిటినిప్రకారంబున వఁ౦బడిగెను.

అని, తాత్పర్యము.

ప్రతిగృహ్యాతు కైకేయీ శ్వశురం సుకృతేన మే

స ౪౨

మమ ప్రవ్రాజనం భర్తుః భరతస్యాభిషేచనమ్. ౭
ద్వే వయాచత భర్తారం సత్యసంధం నృపోత్తమమ్

టీక॥ కైకేయీ=కైకేయి; మే=నాయొక్క; శ్వశురం=మామయును; సత్యసంధం= సత్యప్రతిజ్ఞుండును ; నృపోత్తమం = రాజశ్రేష్ఠుండునగు; భర్తారం=తనపెనిమిటిని; సుకృతేన= ఉపకారముచేత; ప్రతిగృహ్యాతు=వశీకరించుకొనియు; మమ=నాయొక్క ; భర్తుః=పెనిమిటికి;ప్రవ్రాజనం=అడవికిఁబంపుటను; భరతస్య= భరతునికి; అభిషేచనం=పట్టాభిషేకమును;ద్వే=రెంటిని;అయాచత=అడిగెను.

ఆకైకేయి, సత్యసంధుండునురాజశ్రేష్ఠుండునగుదశరథమహారాజును , తానుమున్నాయనకుఁగావించియున్న యుపకారముచే స్వాధీనప్రఱచుకొని , నాపెనిమిటియగురామునివనంబునకుఁ బంపుట,తనకొడుకుభరతునకుఁబట్టాభిషేకముసేయుట, యనునీరెండువరములనడిగెను.అని, తాత్పర్యము.

నాద్య భోక్ష్యే నచస్వప్స్యే నపాస్యేచ కథంచన. ౮
ఏష మే జీవితస్యాంతో రామో యద్యభిషిచ్యతే

టీక॥ అద్య=ఇప్పుడు; కథంచన = ఎట్లయినను;నభోక్ష్యే =భుజింపను.నస్వప్స్యేచ=నిద్రయుబోవను.నపాస్యేచ=నీళ్లనుద్రాఁగను; రామః=రాముఁడు; అభిషిచ్యతేయది= అభిషేకింపఁబడునేని; ఏషః=ఇది; మే=నాయొక్క; జీవితస్య=ప్రాణముయొక్క;అంతః=తుది.

నీవేమిచేసినను, నేనింక, భోజనముసేయను; నిదురపోవను ; నీళ్లుత్రాఁగను , రామునకుఁబట్టాభిషేకముగావించెదవేని , యిప్పుడెప్రాణంబులవిడిచెదను. అని, కైకేయిదశరథునితోఁజెప్పెను.అని, తాత్పర్యము.

ఇతి బ్రువాణాం కైకేయీం శ్వశురో మే స మానదః. ౯
అయాచతార్థై రన్వర్థై ర్న చ యాచ్ఞాం చకార సా

టీక॥ మానదః=బహుమానములనిచ్చునట్టి ; సః=ఆ; మే= నాయొక్క;

శ్వశురః=మామ; ఇతి=ఇట్లు; బ్రువాణాం=చెప్పుచున్న; కైకేయీం=కైకేయిని; అన్వర్థైః=ప్రయోజనముతోఁగూడిన; అర్థైః=ధనములచేత; అయాచత=యాచించెను. సా=ఆకైకేయి; యాచ్ఞాం=ప్రార్థనను; నచకారచ=చేయనేలేదు.

నానావిధబహుమానంబుల నిచ్చిన ట్టియా దశరథమహారాజు, కైకేయియా ప్రకారమునం జెప్పటఁ జూచి, యమూల్యంబులగు నానావిధధనంబుల నొసంగ, యూరకుండుమని యెంతప్రార్థించినను, ఆబిడ యంగీకరింపదయ్యె.

అని, తాత్పర్యము.

మమ భర్తా మహాతేజా వయసా పంచవింశకః. ౧౦
అష్టాదశ హి వర్షాణి మమ జన్మని గణ్యతే

టీక॥ మహాతేజాః=అధికమయినపరాక్రమముగల; మమ=నాయొక్క; భర్తా=పెనిమిటి; వయసా=వయసుచేత; పంచవింశకః= ఇరువదియయిదేండ్లవాఁడు. మమ=నాకు; జన్మని = పుట్టుక మొదలు; అష్టాదశ = పదునెనిమిది; వర్షాణి=సంవత్సరములు; గణ్యతేహి=లెక్కపెట్టఁబడుచున్నదిగదా!

అప్పుడు, మహాపరాక్రమశాలియగు నా పెనిమిటి యిరువదియయిదేండ్లవాఁడు; నేను బుట్టినప్పటికిఁ బదునెనిమిదేండ్లయినవి. అని, తాత్పర్యము.

రామేతి ప్రథితో లోకే గుణవాన్ సత్యవాన్ శుచిః. ౧౧
విశాలాక్షో మహాబాహు స్సర్వభూతహితే రతః

టీక॥ సః(అధ్యాహృతము)= ఆనా పెనిమిటి; లోకే=లోకమునందు; రామ ఇతి=రాముఁడని; ప్రథితః = ప్రసిద్ధుఁడు. గుణవాన్= అధికములయిన గుణములు గలవాఁడు; సత్యవాన్= అధికమయిన సత్యముగలవాఁడును. శుచిః= పరిశుద్ధుఁడు. విశాలాక్షః= వెడల్పులయిన కన్నులుగలవాఁడు. మహాబాహుః= పెద్దచేతులుగలవాఁడు. సర్వభూతహితే = సమస్తభూతములయొక్క యుమేలునందు; రతః=ఆసక్తుఁడు.

నా పెనిమిటి, రాముఁడను పేరలోకంబునం బ్రసిద్ధుఁడు; గుణవంతుండు; సత్యవాది; పరిశుద్ధాత్ముండు; విశా

లంబులగు కన్నులుగలవాఁడు; ఆజానుబాహువుండు; సర్వభూతంబులకును మేలు సేయువాఁడు. అని, తాత్పర్యము.

కామార్త స్తు మహాతేజాః పితా దశరథ స్స్వయమ్. ౧౨
కైకేయ్యాః ప్రియకామార్థం తం రామం నాభ్యషేచయత్

టీక॥ మహాతేజాః—అధికమయినప్రభావముగల; పితా=తండ్రియగు; దశరథః=దశరథుండు; స్వయంతు=తానే; కామార్తః=మన్మథపీడితుండై; కైకేయ్యాః = కైకేయియొక్క; ప్రియకామార్థం= సంతోషమునందలి కోర్కెకొఱకై; తం=ఆ; రామం = రాముని; నాభ్యషేచయత్ = అభిషేకింపఁడయ్యెను.

మహాతేజుండగు తండ్రిదశరథుండును, మన్మథపీడితుండై, కైకేయిమాటకు మాఱువలుకంజాలక, కైకేయికిసంతోషంబుగలుగుటకై, యట్టిరామునకుఁబట్టాభిషేకంబు సేయుటనుమానెను.

అని, తాత్పర్యము.

అభిషేకాయతు పితు స్సమీపం రామ మాగతమ్. ౧౩
కైకేయీ మమ భర్తార మిత్యువాచ ధృతం వచః

టీక॥ కైకేయీ=కైకేయి; అభిషేకాయతు = పట్టాభిషేకముకొఱకై యే; పితుః=తండ్రియొక్క; సమీపం=సమీపమునకు; ఆగతం = పొందిన; మమ=నాయొక్క; భర్తారం=పెనిమిటియయిన; రామం=రామునిఁగూర్చి; ఇతి=ఈ; వచః=మాటను; ధృతం=ధైర్యముగా; ఉవాచ=చెప్పెను.

కైకేయి, పట్టాభిషేకార్థమయియే తండ్రిసమీపంబునకువచ్చిన, నాభర్తను రామునింజూచి, ధైర్యంబున, నీమాటను జెప్పెను. అని, తాత్పర్యము.

తవ పిత్రా సమాజ్ఞప్తం మమే దం శృణు రాఘవ. ౧౪

టీక॥ రాఘవ=రాముఁడా ! తవ=నీకు; పిత్రా=తండ్రిచేత; ఇదం=ఇది; సమాజ్ఞప్తం=ఆజ్ఞాపింపఁబడినది. మమ (మత్)=నావలన; శృణు=వినుము.

రాముఁడా! నీకు నీతండ్రి యీప్రకారంబున నాజ్ఞాపించినాఁడు; చెప్పెదను వినుము. అని, తాత్పర్యము.

భరతాయ ప్రదాతవ్య మిదం రాజ్య మకంటకమ్

టీక॥ అకంటకం= శత్రువులు లేని; ఇదం=ఈ; రాజ్యం=రాజ్యము; భరతాయ=భరతునికొఱకు; ప్రదాతవ్యం=ఇవ్వఁబడవలసినది.

శత్రురహితమయిన యీరాజ్యమును భరతునికివ్వవలయును.

అని, తాత్పర్యము.

త్వయాహి ఖలు వస్తవ్యం నవవర్షాణి పంచచ. ౧౫
వనే ప్రవ్రజ కాకుత్స్థ పితరం మోచయానృతాత్

టీక॥ కాకుత్స్థ=రాముఁడా! త్వయాహి ఖలు=నీచేతను మాత్రము; వనే=అడవియందు; నవ=తొమ్మిదియు; పంచచ=అయిదును; వర్షాణి=సంవత్సరములను; వస్తవ్యం=ఉండుటకావలయును. ప్రవ్రజ=పొమ్ము. అనృతాత్=అబద్ధమునుండి; పితరం=తండ్రిని; మోచయ=విడిపించుము.

రాముఁడా! నీవుమాత్రము, పదునాలుగుసంవత్సరములడవిలో వాసము సేయవలయును; కాఁబట్టి శీఘ్రముగాఁబొమ్ము; నీతండ్రికి, అసత్యదోషము తగులకుండునట్లు చేయుము.

అని, తాత్పర్యము.

తథేత్యుక్త్వాచ తాం రామః కైకేయీ మకుతోభయః. ౧౬
చకార తద్వచ స్తస్యా మమ భర్తా దృఢవ్రతః

టీక॥ అకుతోభయః = ఎందువలననుభయము లేనివాఁడును; దృఢవ్రతః=దృఢమయినవ్రతముగలవాఁడును; మమ=నాయొక్క; భర్తా=పెనిమిటియునగు; రామః=రాముఁడు; తాం=ఆ; కైకేయీం=కైకేయినిగూర్చి; తథేతి=అట్లేయని; ఉక్త్వాచ=చెప్పియు; తస్యాః=ఆకైకేయియొక్క; తత్=ఆ; వచః=మాటను; చకార=చేసెను.

ఎందునుభయపడనివాఁడును దృఢ

వ్రతుండునగునాభర్తరాముండు, ఆకైకేయికి,అట్లెచేసెదనని చెప్పి, యాబిడమాటప్రకారము, వనమునకువచ్చెను. అని,తాత్పర్యము.

దద్యా న్నప్రతిగృహ్ణీయా త్సత్యం బ్రూయా న్నచానృతమ్. ౫౩
ఏత ద్బ్రాహ్మణ రామస్య ధ్రువం వ్రత మనుత్తమమ్

టీక॥బ్రాహ్మణ = బ్రాహ్మణుఁడా! దద్యాత్=ఇచ్చును. నప్రతిగృహ్ణీయాత్=పుచ్చుకొనఁడు.సత్యం = సత్యమునే;బ్రూయాత్=చెప్పును. అనృతం = అబద్ధమును:నచబ్రూయాత్=చెప్పనేచెప్పఁడు.ఏతత్=ఇది;రామస్య = రామునియొక్క;ధ్రువం=దృఢమును ; అనుత్తమం=ముఖ్యమునైన;వ్రతం = వ్రతము.

బ్రాహ్మణుఁడా! రాముండు , ఒరులకిచ్చునుగాని ప్రతిగ్రహింపఁడు ; సత్యమునే చెప్పునుగాని యబద్ధము నెంతమాత్రమును జెప్పఁడు ; ఇది రామునిముఖ్యవ్రతము;దీని నెప్పుడునువదలఁడు.

అని, తాత్పర్యము.

తస్య భ్రాతాతు వైమాత్రో లక్ష్మణో నామ వీర్యవాన్. ౫౪
రామస్య పురుషవ్యాఘ్ర స్సహాయ స్సమరేఽరిహా

టీక॥వీర్యవాన్ = అధికమయినపరాక్రమముగలవాఁడును; సమరే=యుద్ధమునందు; అరిహా=శత్రువులవధించువాఁడును; పురుషవ్యాఘ్రః=పురుషశ్రేష్ఠుండునగు;లక్ష్మణో నామ=లక్ష్మణుండను; తస్య= ఆ రామునియొక్క;వైమాత్రః = చవతితల్లికొడుకైన;భ్రాతాతు = తమ్ముఁడుమాత్రము;రామస్య=రామునికి;సహాయః=తోడు.

మహాపరాక్రమశాలియుయుద్ధంబునశత్రువధంబు సేయువాఁడును బురుషశ్రేష్ఠుండునగువాఁడు, రామునిచవతితల్లికొడుకు లక్ష్మణుండనువాఁడుమాత్రము, ఎల్లప్పుడు రామునకుసహాయుఁడుగానుండును.అని, తాత్పర్యము.

స భ్రాతా లక్ష్మణోనామ ధర్మచారీ దృఢవ్రతః. ౫౫

అన్వగచ్ఛ ద్ధనుష్పాణిః ప్రవ్రజంతం మయాసహ

టీక॥ధర్మచారీ= ధర్మమునాచరించువాఁడును; దృఢవ్రతః=దృఢమయినవ్రతముగలవాఁడునగు; సః=ఆ; లక్ష్మణో నామ = లక్ష్మణుండనెడు; భ్రాతా=తమ్ముఁడు; మయాసహ=నాతోఁగూడ; ప్రవ్రజంతం=అడవికివచ్చుచున్న రామునిః ధనుష్పాణిః= ధనుస్సుచేతంగలవాఁడై; అన్వగచ్ఛత్= వెంబడించెను.

పరమధార్మికుండును దృఢవ్రతుండునగు నా లక్ష్మణుండు, రాముండు నాతోఁగూడవనంబునకు వచ్చునప్పుడు, ధనుర్ధరుండై, యతని వెంబడివచ్చెను. అని, తాత్పర్యము.

జటీ తాపసరూపేణ మయాసహ సహానుజః. ౧౦
ప్రవిష్టో దండకారణ్యం ధర్మనిత్యో జితేంద్రియః

టీక॥ధర్మనిత్యః=ధర్మమునందుఁ జలనములేనివాఁడును; జితేంద్రియః=జయింపఁబడిన యింద్రియములుగలవాఁడునగు రాముఁడు; జటీ=జడలుగలవాఁడై; తాపసరూపేణ= మునిరూపముచేత; మయాసహ=నాతోఁగూడ; సహానుజః= తమ్మునితోఁగూడినవాఁడై; దండకారణ్యం = దండకారణ్యమును; ప్రవిష్టః=ప్రవేశించినాఁడు.

ధర్మమునం దెంతమాత్రము చలనములేనివాఁడును జితేంద్రియుఁడునగు రాముండు, తాపసవేషంబుధరించి, జటలుదాల్చి, నేనును లక్ష్మణుండును వెంబడింప, నీదండకారణ్యంబునకు వచ్చినాఁడు. అని, తాత్పర్యము.

తే వయం ప్రచ్యుతా రాజ్యా త్కైకేయ్యాస్తు కృతే త్రయః. ౧౧
విచరామో ద్విజశ్రేష్ఠ వనం గంభీర మోజసా

టీక॥ ద్విజశ్రేష్ఠ = బ్రాహ్మణశ్రేష్ఠుఁడా! కైకేయ్యాః కృతే తు=కైకేయినిమిత్తమైయె; రాజ్యాత్= రాజ్యమునుండి; ప్రచ్యుతాః=భ్రష్టులమయిన; తే=అట్టి; వయం= మేము; త్రయః = ముగ్గురమును; గంభీరం= ప్రవేశింపన

లవిగాని; వనం = అడవిని; ఓజసా = బలముచేత; విచరామః = సంచరించుచున్నాము.

బ్రాహ్మణశ్రేష్ఠుఁడా! అట్లుకైకేయి నిమిత్తమయి రాజ్యభ్రష్టులమయిన మేము మువ్వురమును, అతిభయంకరంబగు నిరరణ్యంబునఁ, బరాక్రమాతిశయంబుచే, సంచరించుచున్నాము.

అని, తాత్పర్యము.

సమాశ్వస ముహూర్తంతు శక్యం వస్తుమిహ త్వయా. ౨౨
ఆగమిష్యతి మే భర్తా వన్య మాదాయ పుష్కలమ్
రురూన్ గోధావరాహాంశ్చ హత్వాదా యామిషాన్ బహూన్

టీక॥ ముహూర్తంతు = కొంచెముచేపుమాత్రము; సమాశ్వస = ఊఱడిల్లుము. త్వయా = నీచేత; ఇహ = ఇచ్చట; వస్తుం = ఉండుటకు; శక్యం = అలవియగును. మే = నాయొక్క; భర్తా = పెనిమిటి; పుష్కలం = సమృద్ధముగా; వన్యం = అడవియందుఁబుట్టిన పదార్థమును; ఆదాయ = తీసికొని; రురూన్ = జింకలను; గోధాః = ఉడుములను; వరాహాంశ్చ = పందులను; హత్వా = చంపి; బహూన్ = అనేకములయిన; ఆమిషాన్ = మాంసములను; ఆదాయ = తీసికొని; ఆగమిష్యతి = వచ్చును.

కొంచెము సేపుశ్రమము దీర్చుకొనుచు, నిచ్చటనుండుము; ఇచ్చటనీకు సుఖముగానుండును; నాభర్త, జింకలను ఉడుములవరాహంబులనువధించి, పెక్కుమాంసములను ఇతరవన్యపదార్థంబులనందీసికొని, శీఘ్రంబుగావచ్చును.

అని, తాత్పర్యము.

స త్వం నామచ గోత్రంచ కులంచా చక్ష్వ తత్త్వతః. ౨౩
ఏకశ్చ దండకారణ్యే కిమర్థం చరసి ద్విజ

టీక॥ ద్విజ = బ్రాహ్మణుఁడా! సః = అట్టి; త్వం = నీవు; నామచ = పేరును; గోత్రంచ = వంశమును; కులంచ = కులమును; తత్త్వతః = యాథార్థ్యముచేత; ఆచక్ష్వ = చెప్పుము. దండకారణ్యే = దండకారణ్యమునందు, ఏకశ్చ = ఒకఁడవయ్యు; కిమర్థం = ఎందుకొఱకు; చరసి = తిరుగుచున్నావు?

బ్రాహ్మణుఁడా! ఇంక, నీవును, నీ పేరునుగోత్రంబును జెప్పుము; ఇట్లేకాకిగా నీదండకారణ్యంబున నేలతిరుగుచున్నావు? అని, సీతాదేవి, రావణునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఏవం బ్రువంత్యాం సీతాయాం రామపత్న్యాం మహాబలః. ౨౪
ప్రత్యువాచోత్తరం తీవ్రం రావణో రాక్షసాధిపః

టీక॥ రామపత్న్యాం= రామునిభార్యయయిన; సీతాయాం= సీత; ఏవం= ఇట్లు; బ్రువంత్యాం= చెప్పుచుండఁగా; మహాబలః = అధికమయినబలముగలవాఁడును; రాక్షసాధిపః= రాక్షసరాజుండునగు; రావణః = రావణుఁడు; తీవ్రం= తీక్ష్ణమయిన; ఉత్తరం = బదులుమాటను; ప్రత్యువాచ= చెప్పెను.

రామభార్యయగుసీతాదేవి, యీప్రకారంబునం జెప్పఁగా, నంత, మహాబలుండును రాక్షసేశ్వరుండునగు రావణుండు, భయంకరంబగునీమాటను, బదులుచెప్పెను. అని, తాత్పర్యము.

యేన విత్రాసితా లోకా స్సదేవా సురపన్నగాః. ౨౫
అహం తు రావణో నామ సీతే రక్షోగణేశ్వరః

టీక॥ సీతే= సీతా! యేన= ఎవ్వనిచేత; సదేవాసురపన్నగాః= దేవతలతోనుఅసురులతోను సర్పములతోనుంగూడిన; లోకాః = లోకములు; విత్రాసితాః = భయపఱుపఁబడినవో; సః (అధ్యాహృతము) = అట్టి; రావణోనామ= రావణుండనుపేరుగల; రక్షోగణేశ్వరః= రాక్షససమూహంబులకుఁ బ్రభువైనవాఁడు; అహంతు= నేనే!

సీతా! దేవాసురులు మున్నుగా సమస్తలోకంబులును ఎవ్వనికిభయపడునో, అట్టిరాక్షససమూహనాథుండగు రావణుండనువాఁడను నేనే!

అని, తాత్పర్యము.

త్వాంతు కాంచనవర్ణాభాం దృష్ట్వా కౌశేయవాసినీమ్. ౨౬
రతిం స్వకేషు దారేషు నాధిగచ్ఛామ్యనిందితే

టీక॥ అనిందితే=నిందింపఁబడనట్టిసీతా! కాంచనవర్ణాభాం = బంగారురంగువంటి కాంతిగలదానవును; కౌశేయవాసినీం = పట్టువస్త్రములనుగట్టుకొన్నదానవునగు; త్వాం = నిన్ను; దృష్ట్వాతు=చూచినంతనె; స్వకేషు=నావారలయిన; దారేషు = భార్యలయందు; ధృతిం= సంతోషమును; నాధిగచ్ఛామి=పొందకున్నాను.

నిందింపఁబడగనట్టిసీతా! బంగారువంటిమేనిచాయతోఁ బట్టువస్త్రముకట్టుకొని తేజరిల్లుచున్న నిన్నుఁ జూచినది మొదలు, నాభార్యలయందునాకెంతమాత్రము, ఇచ్ఛగలుగకున్నది!

అని, తాత్పర్యము.

("ఇట్టిస్థలములయందంతయు, సుందరకాండములోనియీస్థలములయందు వ్రాయఁబడినరహస్యార్థములెల్ల, సరిపడుచున్నవిగాన, నిచ్చట వ్రాయఁబడవయ్యె.")

బహ్వీనా ముత్తమస్త్రీణా మాహృతానా మిత స్తతః. ౨౭
సర్వాసామేవ భద్రం తే మమాగ్ర మహిషీ భవ

టీక॥ తే=నీకు; భద్రం=మంగళము; అస్తు(అధ్యాహృతము)=అగుఁగాక. ఇత స్తతః=ఇచ్చటచ్చటనుండి; ఆహృతానాం=తేఁబడిన; బహ్వీనాం=పెక్కండ్రయిన; ఉత్తమస్త్రీణాం = ఉత్తమస్త్రీలలో; సర్వాసామేవ=అందఱిలోపల నె; మమ=నాయొక్క; అగ్రమహిషీ=మొదటిభార్యవు; భవ=అగుము.

నీకు మంగళము గలుగుఁగాక; అచ్చటచ్చటనుండి, తేఁబడినయుత్తమస్త్రీలు పెక్కండ్రున్నారు; వారియందఱిలోను నీవునాకుమొదటిభార్యవుగానుండుము. అని, తాత్పర్యము.

లంకానామ సముద్రస్య మమ మధ్యే మహాపురీ. ౨౮
సాగరేణ పరిక్షిప్తా నివిష్టా నగమూర్ధని

టీక॥ మమ=నాయొక్క; మహాపురీ=పెద్దపట్టణము; లంకానామ= లంకయనుపేరుగలది. సముద్రస్య - సముద్రముయొక్క; మధ్యే=నడుమను; సాగరేణ=సముద్రముచేత; పరిక్షిప్తా=చుట్టఁబడినదై; నగమూర్ధని = పర్వతాగ్రమునందు; నివి

ష్ఠానమున్నది.

నాకులంకయను మహాపురియున్నది; అదిచుట్టునుసముద్రముచేనావరింపఁబడి, సముద్రమధ్యంబునఁ, బర్వతాగ్రంబుపైఁబ్రతిష్ఠితమయియున్నది.

అని, తాత్పర్యము.

తత్రసీతే మయా సార్ధం వనేషు విహరిష్యసి. ౨౯
నచారణ్యస్య వాసస్య స్పృహయిష్యసి భామిని

టీక॥ భామిని=స్త్రీవగు; సీతే=సీతా! తత్ర=అలంకయందు; మయాసార్ధం=నాతోఁగూడ; వనేషు=వనములయందు; విహరిష్యసి = క్రీడింపఁగలవు. అరణ్యస్య=అడవియందలిదైన;వాసస్య= (ద్వితీయార్థమందుషష్ఠి)ః వాసమును; నచస్పృహయిష్యసి= ఎంతమాత్రమాశింపకుము.

సీతా! ఆలంకయందు, నీవు, నాతోఁగూడ నుద్యానవనంబులంగ్రీడించుచుండవచ్చును; అట్టిసుఖంబులకుఁదగిన నీవు , ఈవనములోనింకనెంతమాత్రముండవలదు. అని, తాత్పర్యము.

పంచదాస్య స్సహస్రాణి సర్వాభరణ భూషితాః. ౩౦
సీతే పరిచరిష్యంతి భార్యా భవసి మే యది

టీక॥ సీతే=సీతా! మే = నాయొక్క; భార్యా=భార్యవు;భవసియది= అగుదువేని; సర్వాభరణభూషితాః= సమస్తాభరణములచే నలంకరింపఁబడిన; దాస్యః=పనికత్తెలు;పంచ=ఐయిదు; సహస్రాణి = వేలు; పరిచరిష్యంతి=పరిచర్యచేయఁగలరు.

సీతా! నీవు, నాకుభార్యవగుదువేని, సమస్తాభరణభూషితలగు, నైదువేలదాసీలు, నీకెల్లప్పుడుసు పరిచర్యసేయుచుందురు. అని, రావణుండు, సీతతోఁజెప్పెను. అని, తాత్పర్యము.

రావణేనైవ ముక్తాతు కుపితా జనకాత్మజా. ౩౧
ప్రత్యువాచా నవద్యాంగి త మనాదృత్య రాక్షసమ్

టీక॥ అనవద్యాంగీ=నిందింపఁదగనియవయవములుగల;జనకాత్మజా = జ




నకమహారాజు కొమార్తెయయిన సీతాదేవి; ఏవం=ఇట్లు; రావణేన=రావణుని చేత; ఉక్తాతు= చెప్పఁబడినదై; తం= ఆ; రాక్షసం=రాక్షసుని, అనాదృత్య=లక్ష్యముసేయక; ప్రత్యావాచ=బదులుచెప్పెను.

అతిసుందరంబులగు నవయవములుగలసీతాదేవి, ఈప్రకారంబున రావణుండు చెప్పినమాటలువిని, పరమకుపితయయి, యారావణునెంతమాత్రము సరకుసేయక, యిట్లనియుత్తరముచెప్పెను. అని, తాత్పర్యము.

మహాగిరి మివాకంప్యం మహేంద్ర సదృశం పతిమ్. ౩౨
మహోదధి మివాక్షోభ్య మహం రామ మనువ్రతా

టీక॥ అహం=నేను; మహాగిరిమివ=మహాపర్వతమువలె; అకంప్యం=కదలింపరానివాఁడును; మహేంద్రసదృశం=దేవేంద్రునితోసమానుఁడును; మహోదధిమివ=మహాసముద్రమువలె; అక్షోభ్యం= కలఁతపెట్టరానివాఁడునగు; పతిం=పెనిమిటియయిన; రామం=రాముని; అనువ్రతా= అనుసరించియున్నాను.

రాముండు, మహాపర్వతముంబోలె నెట్టివారికిని గదలింప నలవిగానివాఁడు; మహాసముద్రమువలెనఁగంభీరుండు, ఎట్టికష్టమునకేని కలఁతనొందఁడు; దేవేంద్రునకుసరివచ్చువాఁడు; అట్టినాథుఁడయినరాముని నేననువర్తించి యున్నాను; ఇట్టిమాటలాడుచున్నావేనీకు భయములేదాయేమి?

అని, తాత్పర్యము.

సర్వలక్షణసంపన్నం న్యగ్రోధ పరిమండలమ్. ౩౩
సత్యసంధం మహాభాగ మహం రామ మనువ్రతా

టీక॥ అహం=నేను; సర్వలక్షణసంపన్నం=సమస్తలక్షణములతోనుం గూడినవాఁడును; న్యగ్రోధపరిమండలం=మఱ్ఱిచెట్టునకుంబోలెఁజుట్టును సమూహముగలవాఁడును; సత్యసంధం= సత్యప్రతిజ్ఞుండును; మహాభాగం = పూజ్యమయినయదృష్టముగలవాఁడునగు; రామం=రాముని; అనువ్రతా=అనుసరించియున్నాను.

నేను, సమస్త శుభలక్షణములతో




నుంగూడినవాఁడును, మఱ్ఱిచెట్టునకుఁ గొమ్ములుండునట్లు అనేకబంధువులుగలవాఁడును సత్యసంధుండునుమహాభాగుండునగు రామునననువర్తించిన దాననుఁ;నీయట్టినీచునిగంటనైనం జూతునా! అని, తాత్పర్యము.

మహాబాహుం మహోరస్కం సింహవిక్రాంత గామినమ్. ౩౭
నృసింహం సింహసంకాశ మహం రామ మనువ్రతా

టీక॥అహం=నేను; మహాబాహుం=పెద్దచేతులుగలవాఁడును; మహోరస్కం=విశాలమగుఱొమ్ముగలవాఁడును;సింహవిక్రాంత గామినం=సింహముయొక్క పరాక్రమమువంటి పరాక్రమముగలుగునట్లు గానడచువాఁడును; నృసింహం=పురుషశ్రేష్ఠుండును; సింహసంకాశం=సింహముతో సమానుండునగు,రామం=రాముని; అనువ్రతా= అనుసరించియున్నదానను.

నేను,మహాబాహుండును విశాలవక్షుండును సింహంబునకుంబోలె మహాపరాక్రమంబుగలవాఁడగుటచేసగర్వంబుగానడుచువాఁడును బురుష శ్రేష్ఠుండును సింహంబువంటివాఁడునగు రామునననువర్తించియున్నాను; తప్పుడుమాటలాడకుము. అని, తాత్పర్యము.

పూర్ణచంద్రాననం రామం రాజవత్సం జితేంద్రియమ్. ౩౫
పృథుకీర్తిం మహాత్మాన మహం రామ మనువ్రతా

టీక॥అహం = నేను;పూర్ణచంద్రాననం=నిండుచందురునివంటిమొగముగలవాఁడును; రామం=సమస్తలోకములనురమింపఁజేయువాఁడును; రాజవత్సం= రాచకొమరుండును; జితేంద్రియం= జయింపఁబడినయింద్రియములుగలవాఁడును;పృథుకీర్తిం= అధికమయినకీర్తిగలవాఁడును;మహాత్మానం=అధికమయిన ప్రభావము గలవాఁడునగు; రామం=రాముని;అనువ్రతా= అనుసరించినాను.

నేను,నిండుచందురుంబోలె మొగంబుగలవాఁడునుసమస్తలోకంబులను రమింపంజేయువాఁడును రాజకుమారుండునుజితేంద్రియుండును మహాయశుండును మహాత్ముండునగు రామునననువ

తిరించినాను; ఇంకనొరులం గన్నెత్తిచూతునా? అని, తాత్పర్యము.

త్వంపున ర్జంబుక స్సింహం మామిచ్ఛసి సుదుర్లభామ్. ౩౬
నాహంశక్యా త్వయాస్ప్రష్టు మాదిత్యస్య ప్రభాయథా

టీక॥జంబుకః=నక్కవయిన; త్వం పునః=నీవును;సుదుర్లభాం = ఎంతమాత్రముపొందనలవి గాని; సింహీం= ఆడుసింహమయిన;మాం = నన్ను;ఇచ్ఛసి=కోరుచున్నావు. అహం=నేను; ఆదిత్యస్య = సూర్యునియొక్క;ప్రభా యథా=కాంతివలె;త్వయా = నీచేత; స్ప్రష్టుం=తాంకుటకు; నశక్యా=అలవి కాను.

నీవునక్కవు, ఆడుసింహమునునీకెంతమాత్రముపొందనలవిగానిదానన గునన్నుంగోరెదవు; సూర్యుని కాంతి స్పృశింపనలవిగానట్లు, నన్నుస్పృశింపనీకెంతమాత్రమలవిగాదు.
అని, తాత్పర్యము.

పాదపాన్ కాంచనా న్నూనం బహూన్ పశ్యసి మందభాక్. ౩౭
రాఘవస్య ప్రియాంభార్యాం యస్త్వమిచ్ఛసి రావణ

టీక॥ రావణ=రావణుఁడా! యః=వీ; త్వం=నీవు; రాఘవస్య= రాముని యొక్క; ప్రియాం=ప్రియురాలయిన; భార్యాం=భార్యను; ఇచ్ఛసి=కోరుచున్నావో; సః(అధ్యాహృతము)=అట్టి; మందభాక్= క్షీణించినభాగ్యముగలసీవు; బహూన్=పెక్కులయిన; కాంచనాన్ = బంగారువికారములయిన; పాదపాన్=వృక్షములను; పశ్యసి = చూడఁగలవు.నూనం-నిశ్చయము.

రావణుఁడా! రామునిప్రియభార్యనగునన్నుఁగోరుచున్నావు, కావున,మందభాగ్యుండవగునీవు, ఇంక,శీఘ్రంబుగ బంగారువృక్షంబులనేకంబులంజూడఁగలవు, ఇదినిశ్చయము. (చావుసమీపించినప్పుడు, బంగారువృక్షంబులగపడునని ప్రసిద్ధి.) అని, తాత్పర్యము.

క్షుధితస్యహి సింహస్య మృగశత్రో స్తరస్వినః. ౩౮

ఆశీవిషస్య వదనా ద్దంష్ట్రా మాదాతు మిచ్ఛసి

టీక॥ క్షుధితస్య= ఆఁకలిగొన్నదియు; తరస్వినః=అధికమయినబలము గలదియునగు; మృగశత్రోః=జింకలకు శత్రువయిన; సింహస్య=సింహముయొక్కయు; ఆశీవిషస్య= మహాసర్పము యొక్కయు; వదనాత్=నోటనుండి; దంష్ట్రాం=కోఱను; ఆదాతుం=తీసికొనుటకు; ఇచ్ఛసిహి=కోరుచున్నావుగదా! ఆఁకలిగొన్నదియు బలవంతంబులునగు సింహసర్పంబులనోటనుండికోఱం బెఱుకఁగోరినట్లునన్నుఁగోరుట, నీకుమరణముగల్గించును;సిద్ధము.అని, తా

మందరం పర్వతశ్రేష్ఠం పాణినా హర్తు మిచ్ఛసి. ౩౯
కాలకూటం విషం పీత్వా స్వస్తిమా న్గంతు మిచ్ఛసి

టీక॥ పర్వతశ్రేష్ఠం= పర్వతములలోనుత్తమమయిన ; మందరం=మందరపర్వతమును; పాణినా=చేతిచేత; హర్తుం=హరించుటకు; ఇచ్ఛసి=కోరుచున్నావు. కాలకూటం= కాలకూటమును;విషం=విషమును;పీత్వా=త్రాగి; స్వస్తిమాన్=మంగళముగలవాఁడవై ; గంతుం=పోవుటకు; ఇచ్ఛసి=కోరుచున్నావు.

నీవు , పర్వతోత్తమమయినమందరపర్వతమును, చేతండీసికొనఁగోరుచున్నావు; అదినీకెట్లుసిద్ధింపదో,అట్లు నేనునునీకుసిద్ధింపను ; మఱియుఁగాలకూటమును త్రావి సుఖంబుగానింటికిఁబోగోరెదవు;కాలకూటంబుత్రావినట్లు నన్నుఁగోరుటవలన, నీవుఇంకనిల్లుఁబూడఁబోవునదిలేదు; ఇక్కడనెమరణము నొందుదువు.అని,తాత్పర్యము.

అక్షిసూచ్యా ప్రమృజసీ జిహ్వయా లేక్షి చక్షురమ్. ౪౦
రాఘవస్య ప్రియాం భార్యాం యోధిగంతుం త్వమిచ్ఛసి

టీక॥యః=ఏ;త్వం=నీవు ; రాఘవస్య=రామునియొక్క;ప్రియాం = ప్రియురాలయిన;భార్యాం = భార్యను; అధిగంతుం=పొందుటకు;ఇచ్ఛసి= కోరుచున్నావో;సః (అధ్యాహృతము)= అట్టినీవు;సూచ్యా=సూదిచేత; అక్షి=

కంఠిని;ప్రమృజసి = తుడుచుకొనుచున్నావు. జిహ్వయా=నాలుకచేత; క్షురం=కత్తిని; లేక్షిచ = నాకుచున్నావు.

నీవు, రాముని ప్రియభార్యనగునన్నుం బొందఁగోరుటవలన, సూదితోఁగన్నుతుడుచుకొనుటవలనఁ గన్ను నశించునట్లు, కత్తినాలుకతో నాకుటవలన నాలుక చెడునట్లు,నాశంబునొందుదువు.

అని, తాత్పర్యము.

అవసజ్య శిలాం కంఠే సముద్రం తర్తు మిచ్ఛసి. ౪౧
సూర్యాచంద్ర మసౌ చోభౌ పాణిభ్యాం హర్తు మిచ్ఛసి
యో రామస్య ప్రియాం భార్యాం ప్రధర్షయితు మిచ్ఛసి. ౪౨

టీక॥యః(త్వం)=నీవు; రామస్య=రామునియొక్క; ప్రియాం=ప్రియురాలగు;భార్యాం=భార్యను ; ప్రధర్షయితుం=అవమానించుటకు;ఇచ్ఛసి = కోరుచున్నావో;సః (అధ్యాహృతము)=అట్టినీవు;కంఠే=మెడయందు; శిలాం=తాయిని;అవసజ్య=కట్టుకొని ; సముద్రం=సముద్రమును; తర్తుం=దాఁటుటకు;ఇచ్ఛసి=కోరుచున్నావు. సూర్యాచంద్రమసౌ=సూర్యునిచంద్రుని; ఉభౌచ=ఇద్దఱను; పాణిభ్యాం=చేతులచేత; హర్తుం=హరించుటకు;ఇచ్ఛసి= కోరుచున్నావు.

నీవురాముని ప్రియభార్యనగునన్ను ధర్షింపఁగోరుటవలన, మెడరుతాయి గట్టుకొని, సముద్రంబు దాఁటఁగోరినవాఁడవగుచున్నావు; చంద్రసూర్యులనిద్దఱను, జేతులఁబట్టుకొనంగూడఁబ్రయత్నించువు. అని, తాత్పర్యము.

అగ్నిం ప్రజ్వలితం దృష్ట్వా వస్త్రేణా హర్తు మిచ్ఛసి
కల్యాణవృత్తాం రామస్య యోభార్యాం హర్తు మిచ్ఛసి. ౪౩

టీక॥యః(త్వం)=ఏనీవు; రామస్య=రామునియొక్క;కల్యాణవృత్తాం=మంగళకరమయిన యాచారముగల; భార్యాం=భార్యను;హర్తుం= హరించుటకు;ఇచ్ఛసి=కోరుచున్నావో; సః(అధ్యాహృతము)=అట్టినీవు;ప్రజ్వలితం=మండుచున్న;అగ్నిం=నిప్పును; వస్త్రేణ=వస్త్రముచేత;ఆహర్తుం= ఎత్తు

కొనుటకు; ఇచ్ఛసి=కోరుచున్నావు.

నీవు, మహాపతివ్రతను రాముని ప్రియ భార్యనగు నన్ను హరింపఁగోరుటఁజూడఁగా, మండుచున్న నిప్పును, గుడ్డలోఁగట్టుకొనిపోఁగోరినట్లున్నది.

అని, తాత్పర్యము.

అయోముఖానాం శూలానా మగ్రే చరితు మిచ్ఛసి
రామస్య సదృశీం భార్యాం యోఽధిగంతుం త్వ మిచ్ఛసి. ౪౪

టీక॥ యః=ఏ; త్వం = నీవు; రామస్య=రాముని యొక్క; సదృశీం=ఆయన కుఁదగిన; భార్యాం=భార్యను; అధిగంతుం=పొందుటకు; ఇచ్ఛసి = కోరుచున్నావో; సః(అధ్యాహృతము)- అట్టినీవు; అయోముఖానాం = ఉక్కుకొనలయందుఁగల; శూలానాం= శూలముల యొక్క; అగ్రే=మీఁదను; చరితుం= తిరుగుటకు; ఇచ్ఛసి=కోరుచున్నావు.

నీవు, రాముని ప్రియభార్యనగు నన్నుఁ బొందఁగోరుటం జూడఁగా, ఉక్కుశూలంబుల సమూహముపై నడవఁగోరినట్లున్నది; అదియెట్లపాయకరమో, నన్నుఁగోరుటయు నట్లని తలంపుము. అని, తాత్పర్యము.

యదంతరం సింహస్య గాలయో ర్వనే
యదంతరం స్యందినికాసముద్రయోః
సురాగ్ర్యసౌవీరకయో ర్యదంతరం
తదంతరం వై తవ రాఘవస్యచ. ౪౫

టీక॥ వనే=అడవియందు; సింహస్యగాలయోః = సింహమునకును నక్కకును; యత్=ఏ; అంతరం=భేదమో; స్యందినికాసముద్రయోః- చిన్నయేఁటకును సముద్రమునకును; యత్ = ఏది; అంతరం = భేదమో; సురాగ్ర్యసౌవీరకయోః= మద్యశ్రేష్ఠమునకును కడుగునీళ్లకును; యత్=ఏది; అంతరం=భేదమో; తవ=నీకును; రాఘవస్యచ=రామునకును; తత్=ఆ; అంతరం=భేదము ("వై" అనునది పాదపూరణార్థము); అస్తి (అధ్యాహృతము)=కలదు.

సింహమునకును నక్కకును ఎంత భేదమున్నదో, చిన్న చెలమకును సముద్ర

స ౪౭.

మునకును ఎంత భేదమున్నదో, ఉత్తమమ యినమద్యమునకును కడుగునీళ్లకును ఎంత భేదమున్నదో, రామునకును, నీకును, అంత భేదమున్నది. అని, తాత్పర్యము.

యదంతరం కాంచనసీసలోహయో
ర్యదంతరం చందనవారిపంకయోః
యదంతరం హస్తిబిడాలయోర్వనే
తదంతరం దాశరథే స్తవైవచ. ౪౮

టీక॥ కాంచనసీసలోహయోః = బంగారమునకును సీసమునకును; యత్ = ఏ; అంతరం = భేదమో; చందనవారిపంకయోః = చందనపుముద్దకును బురదకును; యత్ = ఏ; అంతరం = భేదమో; వనే = అడవియందు; హస్తిబిడాలయోః = ఏనుగునకును, పిల్లికిని; యత్ = ఏ; అంతరం = భేదమో; దాశరథేః = రామునకును; తవైవచ = నీకును; తత్ = ఆ; అంతరం = భేదము.

బంగారమునకును సీసమునకును ఎంత భేదమున్నదో, చందనపుముద్దకును బురదకును ఎంత భేదమున్నదో, ఏనుంగునకును పిల్లికిని ఎంత భేదమున్నదో, రామునకును నీకును అంత భేదంబున్నది.

అని, తాత్పర్యము.

యదంతరం వాయసవైనతేయయో
ర్యదంతరం మద్గుమయూరయోరపి
యదంతరం సారసగృధ్రయోర్వనే
తదంతరం దాశరథే స్తవైవచ. ౪౯

టీక॥ వాయసవైనతేయయోః = కాకికిని గరుడపక్షికిని; యత్ = ఏ; అంతరం = భేదమో; మద్గుమయూరయోరపి = నీరుకాకికిని నెమిలికిని; యత్ = ఏ; అంతరం = భేదమో; వనే = అడవియందు; సారసగృధ్రయోః = హంసకును గద్దకును; యత్ = ఏ; అంతరం = భేదమో; దాశరథేః = రామునకును; తవైవచ = నీకును; తత్ = ఆ; అంతరం = భేదము.

కాకికిని గరుత్మంతునకును ఎంత భేదమున్నదో, నీరుకాకికిని నెమిలికిని ఎంత భేదమున్నదో, గద్దకును హంసకును ఎంత భే

దమున్నదో,నీకును రామునకును అంత భేదంబున్నది.అని, తాత్పర్యము.

తస్మింత్సహస్రాక్షసమప్రభావే
రామే స్థితే కార్ముకబాణపాణౌ
హృతాపి తేఽహం నజరాం గమిష్యే
వజ్రం యథా మక్షికయావగీర్ణమ్. ౪౮

టీక॥సహస్రాక్షసమప్రభావే= ఇంద్రునితోసమానమయిన ప్రభావముగల;తస్మిన్=ఆ; రామే=రాముఁడు;కార్ముకబాణపాణౌ=ధనుర్బాణములు చేతంగలవాఁడై;స్థితే=నిలుచుండఁగా; తే(త్వయా)=నీచేత; అహం= నేను; హృతాపి=అపహరింపఁబడినదాననైనను;మక్షికయా= ఈఁగచేత ; అవగీర్ణం=మ్రింగఁబడిన; వజ్రంయథా= వజ్రమువలె; జరాం=జీర్ణతను; నగమిష్యే=పొందను.

దేవేంద్రసమప్రభావుండగు రాముండు ధనుర్బాణధరుండై నిలిచి యుండఁగా,నీవునన్నపహరించినను, ఈఁగ వజ్రముపలుకుమ్రింగినచో నదిదానికి జీర్ణముగానట్లునీకునేను స్వాధీనఁగాను మఱినీకుమరణమెగల్గింతును. అని, సీతాదేవి,రావణునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇతీవ తద్వాక్య మదుష్టభావా
సుధృష్ట ముక్త్వా రజనీచరం తమ్
గాత్రప్రకంపవ్యథితా బభూవ
వాతోద్ధతా సా కదళీవ తన్వీ. ౪౯

టీక॥అదుష్టభావా= దుష్టముకాని హృదయముగల;సా=ఆ; తన్వీ=స్త్రీ; తం=ఆ;రజనీచరం=రాక్షసునిఁగూర్చి; ఇతి=ఇట్లు ("ఇవ" అనునదివాక్యాలంకారార్థము);తత్=ఆ; వాక్యం=మాటను;సుధృష్టం=మిక్కిలియు ధైర్యముగా;ఉక్త్వా=చెప్పి ; వాతోద్ధతా= గాలిచేఁగదలింపఁబడిన; కదళీవ= అరటిచెట్టువలె; గాత్రప్రకంప వ్యథితా= దేహమువడఁకుటచేఁ బీడింపఁ బడినది;

బభూవ=అయెను.

పరిశుద్ధహృదయయగు నాసీతాదేవి, యీప్రకారంబుననతి ధైర్యముగా నారావణాసురునితోఁజెప్పి, యంతభయంబున, గాలిచేఁ గదలింపఁబడిన యరఁటిచెట్టుకైవడి, గడగడవడఁకసాగెను. అని, తాత్పర్యము.

తాం వేపమానా ముపలక్ష్య సీతాం
స రావణో మృత్యుసమప్రభావః
కులం బలంనామచ కర్మచ స్వం
సమాచచక్షే భయకారణార్థమ్. ౫౦

టీక॥మృత్యుసమప్రభావః=మృత్యువుతోసమానమయిన ప్రభావముగల ; సః=ఆ;రావణః=రావణుఁడు ; వేపమానాం=వడఁకుచున్న;తాం=ఆ; సీతాం=సీతాదేవిని;ఉపలక్ష్య= చూచి; భయకారణార్థం= భయముగలిగించుటకొఱకు;స్వం=తనదైన ; కులం=వంశమును;బలం=బలమును;నామచ=పేరును;కర్మచ=కార్యమును; సమాచచక్షే=చెప్పెను.

మృత్యువునకుంబోలె మహాప్రభావంబుగలయారావణుండు, అట్లుసీతాదేవి,భయంబునవడఁకుటంజూచి , మఱియుభయంబుగలిగించుటకై , తనకులంబునుబలంబును పేరునుదానుగావించినమహాకార్యంబులనుజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
ఆరణ్యకాండే,సప్తచత్వారింశస్సర్గః.

ఇది , స్పష్టార్థము.

ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు,ఆరణ్యకాండసప్తచత్వారింశసర్గటీక,
ముగిసినది.



శ్రీః

అష్టచత్వారింశస్సర్గప్రారంభః.

ఏవం బ్రువంత్యాం సీతాయాం సంరబ్ధః పరుషం వచః
లలాటే భ్రుకుటీ కృత్వా రావణః ప్రత్యువాచహ. ౧

టీక॥ సీతాయాం=సీతాదేవి ; ఏవం=ఇట్లు; బ్రువంత్యాం=చెప్పుచుండఁగా; రావణః=రావణుఁడు; సంరబ్ధః=కుపితుఁడై; లలాటే=నొసట ; భ్రుకుటీ=బొమముళ్లను; కృత్వా=చేసి; పరుషం=కఠినమయిన; వచః = మాటను; ప్రత్యువాచ=బదులుచెప్పెను. "హ" అనునది పాదపూరణార్థము.

సీతాదేవిచెప్పినమాటనువిని , రావణుండు, కుపితుండై, నొసటబొమముడిపాటుగదురఁ , బరుష వచనంబున నిట్లనిబదులుచెప్పెను.

అని, తాత్పర్యము.

భ్రాతా వైశ్రవణ స్యాహం సాపత్న్య వరవర్ణిని
రావణోనామ భద్రంతే దశగ్రీవః ప్రతాపవాన్. ౨

టీక॥ వరవర్ణిని=ఉత్తమస్త్రీవగు సీతా! అహం=నేను; వైశ్రవణస్య=కుబేరునియొక్క; సాపత్న్యః=సవతితల్లికొడుకైన; భ్రాతా= తమ్ముఁడను. రావణోనామ = రావణుండనుపేరుగలవాఁడను; దశగ్రీవః= పదికంఠములుగలవాఁడను; ప్రతాపవాన్= అధికమయిన పరాక్రమముగలవాఁడను.

ఉత్తమస్త్రీవగుసీతా! నేను, కుబేరునితమ్ముఁడను; అతనిసవతితల్లికొడుకును; నాపేరురావణుండందురు; పదితలలుగలవాఁడను; మహాపరాక్రమశాలిని. అని, తాత్పర్యము.

యస్య దేవా స్సగంధర్వాః పిశాచపతగోరగాః
విద్రవంతి భయా ద్భీతా మృత్యోరివ సదా ప్రజాః. ౩

టీక॥ సగంధర్వాః=గంధర్వులతోఁగూడిన; దేవాః=దేవతలును; పిశాచపత

ఘోరగాః=పిశాచములును పక్షులును సర్పములును; యస్య=ఎవ్వనియొక్క; భయాత్=భయమువలన; మృత్యోః=మృత్యువువలన; భీతాః=భయపడిన; ప్రజా ఇవ=ప్రజలువలె; సదా=ఎల్లప్పుడును; విద్రవంతి=పరుగెత్తుచున్నారో; సః(అధ్యాహృతము)=అట్టివాఁడను.

మృత్యువుఁ జూచి ప్రజలు భయపడి పాఱిపోవునట్లు, దేవతలును గంధర్వులును పిశాచములును బక్షులును సర్పములును, నాభయంబున, ఉన్నచోటనిలువక పాఱిపోవుచుందురు. అని, తాత్పర్యము.

యేన వైశ్రవణో రాజా వైమాత్రః కారణాంతరే
ద్వంద్వ మాసాదితః క్రోధా ద్రణే విక్రమ్య నిర్జితః. ౪

టీక॥ యేన=ఎవ్వఁడు చేత; కారణాంతరే=ఒకానొక కారణమునిమిత్తమయి; ద్వంద్వం=యుద్ధమును; ఆసాదిత=పొందిన; వైమాత్రః= సవతితల్లికొడుకైన రాజా=రాజయిన; వైశ్రవణః= కుబేరుఁడు; క్రోధాత్=కోపమువలన; పరాక్రమ్య=పరాక్రమించి; నిర్జితః = జయింపఁబడినాఁడో; సః(అధ్యాహృతము)=అట్టివాఁడను.

మున్ను, ఒక కారణంబున, నాయన్న కుబేరునకును నాకును మహాయుద్ధము గలిగినప్పుడు, నేను బరాక్రమంబున, నతని జయించియున్నాను.

అని, తాత్పర్యము.

యద్భయార్తః పరిత్యజ్య స్వ మధిష్ఠాన మృద్ధిమత్
కైలాసం పర్వతశ్రేష్ఠ మధ్యాస్తే నరవాహనః. ౫

టీక॥ నరవాహనః=కుబేరుఁడు; యద్భయార్తః= ఎవ్వనిభయముచేఁ బీడింపఁబడినవాఁడై; ఋద్ధిమత్=అధికమయిన సంపదగల; స్వం=తనదైన ; అధిష్ఠానం=పట్టణమును, పరిత్యజ్య = విడిచి; పర్వతశ్రేష్ఠం = పర్వతోత్తమమయిన; కైలాసం=కైలాసపర్వతమును; అధ్యాస్తే=అధిష్ఠించియున్నాఁడో ; సః ( అధ్యాహృతము ) = అట్టివాఁడను.

కుబేరుండు, నాభయంబువలననె, సమృద్ధంబగు తనపట్టణమును లంకను విడిచి, కైలాసపర్వతంబు శివస్థానంబు కావున, నేనచ్చటఁ దొందరచేయనని,

యప్పవఁడతోఁ త్తమంబుపైనున్నాఁడు. అని, తాత్పర్యము.

యస్య తత్పుష్పకంనామ విమానం కామగం శుభమ్
వీర్యా దేవాజితం భద్రే యేన యామి విహాయసమ్. ౬

టీక॥భద్రే=మంగళరూపిణివగు సీతా!యేన=దేనిచేత;విహాయసం= ఆకాశమును;యామి = పోఁదుచున్నానో;తత్=అట్టి;కామగం = ఇచ్ఛకువచ్చినట్లుపోవునదియు;శుభం=మంగళకరమైనదియు;పుష్పకంనామ= పుష్పకమనెడు;యస్య=(తస్య)ఆకుబేరునియొక్క;విమానం=విమానము ; వీర్యాదేవ=పరాక్రమమువలననె; అజితం=సంపాదింపఁబడినది.

మంగళరూపిణివగుసీతా! ఇప్పుడు నేను దేనినారోహించి యాకాశంబున సంచరించుచున్నానో , కామగమనం బగునాపుష్పకవిమానంబు, ఆకుబేరుని యొద్దనుండి,పరాక్రమబలంబునఁ నేను బెలుకుకొన్నదే అని, తాత్పర్యము.

మమ సంజాతరోషస్య ముఖం దృష్ట్వైవ మైథిలి
విద్రవంతి పరిత్రస్తా స్సురా శ్శక్రపురోగమాః

టీక॥మైథిలి=సీతా! సంజాతరోషస్య=కలిగినకోపముగల;మమ=నాయొక్క;ముఖం=మొగమును;దృష్ట్వైవ=చూచినంతనె;శక్రపురోగమాః = ఇంద్రుఁడుమున్నునడచువాఁడుగాఁగల; సురాః=దేవతలు;పరిత్రస్తాః = భయపడినవారలయి;విద్రవంతి= పరుగెత్తుచున్నారు.

ఇంద్రుండుమొదలగుదేవతలందఱునేను కోపమునొందియుండునప్పుడు నామొగంబుఁజూచి రేని,తత్క్షణంబున, భయంబుచేఁ బరుగెత్తుదురు.
అని, తాత్పర్యము.

యత్ర తిష్ఠా మ్యహం తత్ర మారుతో వాతి శంకితః
తీవ్రాంశు శ్శిశిరాంశుశ్చ భయా త్సంపద్యతే రవిః. ౮

టీక॥ అహం=నేను; యత్ర=ఎచ్చట; తిష్ఠామి=ఉన్నానో;తత్ర=అచ్చట;

మారుతః=వాయువు; శంకితః=భయపడినవాఁడై; వాతి=వీచును. తీవ్రాంశుః=తీక్ష్ణములయినకిరణములుగల; రవిశ్చ=సూర్యుఁడును; భయాత్=భయమువలన; శీతాంశుః=చల్లనికిరణములుగలవాఁడు; సంపద్యతే=అగుచున్నాఁడు.

నేనెచ్చటనుందునో, అచ్చటనంయు, వాయువు, భయంబున, అనుకులుండైవీచును; వేఁడికిరణములుగలసూర్యుఁడును, భయంబునఁ, జల్లనికిరణంబులుగలవాఁడగును. అని, తాత్పర్యము.

నిష్కంపపత్రా స్తరవో నద్యశ్చ స్తిమితోదకాః
భవంతి యత్ర యత్రాహం తిష్ఠామి విచరామి చ. ౯

టీక॥ అహం=నేను; యత్రయత్ర=ఎచ్చటెచ్చట; తిష్ఠామి=నిలుతునో; విచరామిచ=సంచరింతునో; తత్రతత్ర (అధ్యాహృతము)=అచ్చటచ్చట; తరవః=వృక్షములు; నిష్కంపపత్రాః=కదలనియాకులుగలవిగాన; నద్యశ్చ=నదులును; స్తిమితోదకాః=నిశ్చలమయినజలముగలవిగాను; భవంతి=అగుచున్నవి.

నేనెచ్చటెచ్చటనిలుచుందునో, ఎచ్చటెచ్చటసంచరించుచుందునో; అచ్చటంతయు, వృక్షంబులపత్రములుగూఁడఁజలింపవు; నదులుప్రవహింపకనిశ్చలజలంబులయ్యేయుండును.
అని, తాత్పర్యము.

మమ పారే సముద్రస్య లంకానామ పురీ శుభా
సంపూర్ణా రాక్షసై ర్ఘోరై ర్యథేంద్ర స్యామరావతీ. ౧౦

టీక॥ ఇంద్రస్య=ఇంద్రునకు; అమరావతీవ=అమరావతీపట్టణమువలె; మమ=నాకు; సముద్రస్య=సముద్రముయొక్క; పారే=అవలిగట్టునందు; ఘోరైః=భయంకరులగు; రాక్షసైః=రాక్షసులచేత; సంపూర్ణా=నిండినదియు; శుభా=మంగళకరయునగు; లంకానామ=లంకయను; పురీ=పట్టణము; అస్తి (అధ్యాహృతము)=కలదు.

ఇంద్రునకమరావతీపట్టణముండునట్లు, నాకు, సముద్రదక్షిణతీరంబునందు, భయంకరాకారులగురాక్షసులతో

స ౪౮

నిండినలంకయనెడు మహాపట్టణముగలదు. అని, తాత్పర్యము.

ప్రాకారేణ పరిక్షిప్తా పాండురేణ విరాజతా
హేమకక్ష్యా పురీ రమ్యా వైడూర్యమయతోరణా. ౧౧

టీక॥ పురీ = లంకాపురి; పాండురేణ = తెల్లనిదియు; విరాజతా = ప్రకాశించుచున్నదియునగు; ప్రాకారేణ = ప్రహరిచేత; పరిక్షిప్తా = చుట్టఁబడినది. హేమకక్ష్యా = బంగారుమేడలుగలది. రమ్యా = సుందరమయినది. వైడూర్యమయతోరణా = వైడూర్యమణివికారములయినప్రరద్వారములుగలది.

ఆలంకాపురికిఁజుట్టును తెల్లనిగొప్ప ప్రాకారంబుండును; అందు మేడలుబంగారముతోఁగట్టఁబడియుండును; పురద్వారంబులు వైడూర్యమణిమయంబులయియుండును. అని, తాత్పర్యము.

హస్త్యశ్వరథసంబాధా తూర్యనాదవినాదితా
సర్వకాలఫలైర్వృక్షైస్సంకులోద్యానశోభితా. ౧౨

టీ॥ సా (అధ్యాహృతము) - ఆపట్టణము; హస్త్యశ్వరథసంబాధా = ఏనుంగులచేతను గుఱ్ఱములచేతను రథములచేతను నిండినది. తూర్యనాదవినాదితా - వాద్యములయొక్క ధ్వనులచే ధ్వనింపఁజేయఁబడినది. సర్వకాలఫలైః = సమస్తకాలములయందును ఫలంబులుగల; వృక్షైః = వృక్షములచేత; సంకులోద్యానశోభితా = నిండినయుద్యానవనములచేఁ బ్రకాశింపఁజేయఁబడినది.

ఆలంక, యేనుంగులచేతను గుఱ్ఱములచేతను రథములచేతను నిండినదై, యెల్లప్పుడును, వాద్యధ్వనులతోఁగూడి, సమస్తకాలంబులందును ఫలించునట్టి వృక్షములతో నిండిన యుద్యానవనంబులతో నెంతయునొప్పుచుండును. అని, తాత్పర్యము.

తత్ర త్వం వసతీ సీతే రాజపుత్రి మయా సహ
నస్మరిష్యసి నారీణాం మానుషీణాం మనస్విని. ౧౩

టీక॥మనస్విని=మంచిమనస్సుగలదానవు; రాజపుత్రి= రాచకొమార్తెవునగు;సీతే=సీతా!త్వం=నీవు; తత్ర=అచ్చట; మయాసహ=నాతోఁగూడ; వసతీ = వాసముసేయుచు; మానుషీణాం = మనుష్యసంబంధినులగు; నారీణాం(ద్వితీయార్థమందుషష్ఠి)= స్త్రీలను; నస్మరిష్యసి=తలంపవు.

మంచిమనస్సుగలదానవు రాచకొమార్తెవునగుసీతా! అలంకాపురియందు,నీవు,నాతోఁగూడ, విహరింపుచుందువేని, యామనుష్యస్త్రీలనెంతమాత్ర మస్మరింపకుందువు.

అని, తాత్పర్యము.

భుంజానా మానుషాన్ భోగాన్ దివ్యాంశ్చ వరవర్ణిని
నస్మరిష్యసి రామస్య మానుషస్య గతాయుషః. ౧౪

టీక॥వరవర్ణిని = ఉత్తమమగుసీతా!త్వం(అధ్యాహృతము)=నీవు;మానుషాన్= మనుష్యసంబంధములయిన; భోగాన్=భోగంబులను; దివ్యాంశ్చ=స్వర్గమునందలిభోగములను; భుంజానా=అనుభవించుచు;మానుషస్య= మనుష్యుఁడును;గతాయుషః = పోయినయాయుస్సుగలవాఁడునగు; రామస్య=(ద్వితీయార్థమందుషష్ఠి) రాముని; నస్మరిష్యసి=తలంపవు.

ఉత్తమస్త్రీవగుసీతా! అచ్చటనీవు, నాతోఁగూడ, మనుష్యలోకంబునందలి భోగంబులను, దేవలోకంబునందలిభోగంబులనుఅనుభవించుచు, మనుష్యుండును ఆసన్నమరణుండునగు రామునెంతమాత్రమున్మరింపవు.అని, తాత్పర్యము.

స్థాపయిత్వా ప్రియం పుత్రం రాజ్ఞా దశరథేన యః
మందవీర్య స్సుతో జ్యేష్ఠ స్తతః ప్రస్థాపితో హ్యయమ్. ౧౫

టీక॥రాజ్ఞా=రాజయిన; దశరథేన=దశరథునిచేత;ప్రియం= ఇష్టుఁడయిన;పుత్రం=కొడుకునుభరతుని ; స్థాపయిత్వా=రాజ్యంబునునుంచి;యః= ఎవ్వఁడు;జ్యేష్ఠః= మొదటఁబుట్టిన ; సుతః=కొడుకైనను;మందవీర్యః= స్వల్పమయినపరాక్రమముగలవాఁడని ; తతః=అందువలన;ప్రస్థాపితః= పంపఁబడినాఁడో;అయం=ఈరాముఁడు; సోహి=అట్టివాఁడుగదా!

దశరథమహారాజు ! తనప్రియపుత్రుండగుభరతుని రాజ్యంబుననుంచి, రాముండు జ్యేష్ఠపుత్రుండయినను బరాక్రమహీనుండగుటచేఁగదాయరణ్యంబునకుఁబంపినాఁడు ; అట్టిరాముని , ఏలయూరకపొగడెదవు.

అని, తాత్పర్యము,

తేన కిం భ్రష్టరాజ్యేన రామేణ గతచేతసా
కరిష్యసి విశాలాక్షి తాపసేన తపస్వినా. ౧౬

టీక॥ విశాలాక్షి= వెడల్పులయినకన్నులుగలసీతాదేవీ! భ్రష్టరాజ్యేన= పోయినరాజ్యముగలవాఁడును; గతచేతసా=పోయినబుద్ధిగలవాఁడును; తాపసేన=ఋషియు; తపస్వినా= శోచనీయుండునగు; తేన=అట్టి;రామేణ-రామునిచేత; కిం=ఏమిటిని;కరిష్యసి=చేయఁగలవు!

విశాలములగుకన్నులుగలసీతా! అట్టుపరాక్రమహీనుండును రాజ్యభ్రష్టుండును బుద్ధిహీనుండును దాపసుండగుటచే శౌర్యంబులేనివాఁడును శోచనీయుండునగు రామునింబెట్టుకొని నీవేమి చేయఁగలవు! అని, తాత్పర్యము.

సర్వరాక్షసభర్తారం కామాత్స్వయమిహాగతమ్
న మన్మథశరావిష్టం ప్రత్యాఖ్యాతుం త్వమర్హసి. ౧౭

టీక॥త్వం=నీవు;కామాత్= కామమువలన; స్వయం=తానె;ఇహ=ఇచ్చటికి; ఆగతం=వచ్చినవాఁడును, మన్మథశరావిష్టం=మన్మథబాణములచే నావేశింపఁబడినవాఁడునగు; సర్వరాక్షసభర్తారం=సమస్తరాక్షసులకును బ్రభువైనవాని; ప్రత్యాఖ్యాతుం = తిరస్కరించుటకు;నార్హసి=తగవు.

సమస్తరాక్షసేశ్వరుండనగు నేను, నేనైయెకామావేశంబున నీయొద్దకువచ్చిమన్మథశరపీడితుండనై నిన్నువేఁడుకొనుచుండునప్పుడు , నీవునన్నుఁ దిరస్కరింపఁదగదు.అని, తాత్పర్యము.

ప్రత్యాఖ్యాయ హి మాం భీరు పరితాపం గమిష్యసి

చరణే నాభిహత్యేవ పురూరవస మువర్శీ. ౧౮

టీక॥భీరు = భయముగలదానా! మాం=నన్ను; ప్రత్యాఖ్యాయ = తిరస్కరించి;ఊర్వశీ=ఊర్వశి ; పురూరవసం = పురూరవస్సును ; చరణేన= పాదముచేత; అభిహత్యేవ= తన్నినట్లు;పరితాపం=పశ్చాత్తాపమును; గమిష్యసిహి=పొందుదువుగదా!

భయముగలదానా! ఒకవేళ నామ భయంబునవన్నిప్పుడు నీవు తిరస్కరించినచో, ఊర్వశి మొదట జరణపతితుండగు పురూరవస్సును గాలందన్ని, యావల నతనిం బొందఁ బరితపించినట్లు,నీవు, అట్టిమహాస్నేహంబుఁ గోలుపోయిన పశ్చాత్తాపంబునొందఁగలవు.

అని, తాత్పర్యము.

అంగుళ్యా నసమో రామో మమ యుద్ధే స మానుషః
తవ భాగ్యేన సంప్రాప్తం భజస్వ వరవర్ణిని. ౧౯

టీక॥వరవర్ణిని= ఉత్తమస్త్రీవగు సీతా!మానుషః=మనుష్యుఁడగు; సః= ఆ; రామః=రాముఁడు;యుద్ధే= యుద్ధమందు;మమ = నాయొక్క;అంగుళ్యా=వ్రేలితో;సమః= సమానుఁడు; న=కాఁడు.తవ=నీయొక్క,భాగ్యేన= అదృష్టముచేత; సంప్రాప్తం=వచ్చినవన్ను;భజస్వ=పొందుము.

ఉత్తమస్త్రీవగు సీతా! మనుష్యుఁడగు రాముఁడు , యుద్ధంబున నాయొక్క వ్రేలికిసరిచాలడు నీవు యతనికి భయపడవలదు; నేను భాగ్యవశంబున నీయొద్దకువచ్చినన్నవాఁడను గాన నన్నుఁ బొందుము. అని, రావణుండు, సీతతోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తాతు వైదేహీ క్రుద్ధా సంరక్తలోచనా
అబ్రవీ త్పరుషం వాక్యం రహితే రాక్షసాధిపమ్. ౨౦

టీక॥వైదేహీ=సీతాదేవి;ఏవం=ఇట్లు;ఉక్తాతు = చెప్పఁబడినదై;క్రుద్ధా=కోపించినదై;సంరక్తలోచనా= ఎఱ్ఱనికన్నులుగలదై,రహితే= నిర్జనప్రదేశమునందు; రాక్షసాధిపం= రాక్షసరాజుఁడగు రావణునిగూర్చి; పరు

స ౪౮.

...ం=కఠినమయిన; వాక్యం=మాటను; ...బ్రవీత్=చెప్పెను.

సీతాదేవి, రావణుండు చెప్పినమాటను విని, కోపంబునొంది కన్నులనెఱ్ఱఁజేయుచు... నంబుగ మరి, విజనప్రదేశంబున, రాక్షసరాజుఁడగు రావణుంజూచి, పరుషవచనంబున నిట్లనియె. అని, తాత్పర్యము.

కథం వైశ్రవణం దేవం సర్వభూతనమస్కృతమ్
భ్రాతరం వ్యపదిశ్య త్వ మశుభం కర్తు మిచ్ఛసి. ౨౧

టీక॥ త్వం = నీవు; సర్వభూతనమస్కృతం= సమస్తప్రాణులచేతను నమస్కరింపఁబడినవాఁడును; దేవం=దేవుఁడునగు; వైశ్రవణం = కుబేరుని; భ్రాతరం=అన్ననుగా; వ్యపదిశ్య= చెప్పుకొని; కథం=ఎట్లు; అశుభం=పాపమును; కర్తుం=చేయుటకు; ఇచ్ఛసి=కోరుచున్నావు?

నీవు, సమస్తభూతనమస్కృతుండును ఋద్ధ్యాత్ముండును అగు కుబేరుండు నాకన్నయని చెప్పుకొనుచు, నిట్టిపాపము చేయఁబూనితివేమి?

అని, తాత్పర్యము.

అవశ్యం వినశిష్యంతి సర్వే రావణ రాక్షసాః
యేషాం త్వం కర్కశో రాజా దుర్బుద్ధి రజితేంద్రియః. ౨౨

టీక॥ రావణ = రావణుఁడా! యేషాం=ఎవ్వరికి; కర్కశః=క్రూరుండవును; దుర్బుద్ధిః=దుష్టబుద్ధిగలవాఁడవును; అజితేంద్రియః=జయింపఁబడని యింద్రియములుగలవాఁడవునగు; త్వం=నీవు; రాజా=ప్రభుండవో; తే(అధ్యాహృతము)=ఆ; రాక్షసాః = రాక్షసులు; సర్వే=అందఱును; అవశ్యం=అవశ్యము; వినశిష్యంతి=నశింపఁగలరు.

రాక్షసులకు రాజయిన నీవిట్లు క్రూరుండవుగాను దురాత్ముండవుగాను ఇంద్రియలోలుండవుగాను న్నావు గావున, రాక్షసులందఱు తప్పక నాశంబునొందుదురు. అని, తాత్పర్యము.

అపహృత్య శచీం భార్యాం శక్య మింద్రస్య జీవితుమ్

నచ రామస్య భార్యాం మా మపనీయాస్తి జీవితమ్. ౨౩

టీక॥ఇంద్రస్య= ఇంద్రునియొక్క; భార్యాం=భార్యయగు; శచీం= శచీదేవిని; అపహృత్య=అపహరించి ; జీవితుం=బ్రతుకుటకు; శక్యం= అలవియగును. రామస్య= రామునియొక్క ; భార్యాం=భార్యనగు; మాం=నన్ను; అపనీయచ=అపహరించిమాత్రము ; జీవితుం=బ్రతుకుటకు; నాస్తి=లేదు.

ఇంద్రునిభార్యనుశచీదేవినపహరించియయినను బ్రాణముతోనుండవచ్చును గాని, రామునిభార్యనగు నన్నపహరించిమాత్రము, ఎంతజీవింపనలవిగాదు.

అని, తాత్పర్యము.

జీవేచ్చిరం వజ్రధరస్య హస్తా
చ్ఛచీం ప్రధృష్య ప్రతిరూపరూపామ్
సమాదృశీం రాక్షస దూషయిత్వా
పీతామృతస్యాపి తవాస్తి మోక్షః. ౨౪

టీక॥వజ్రధరస్య = దేవేంద్రునియొక్క; హస్తాత్=చేతనుండి; అప్రతిరూపరూపాం=సరిలేనిరూపముగల ; శచీం=శచీదేవిని; ప్రధృష్య=అవమానించి; జీవేత్=బ్రతుకవచ్చును. రాక్షస=రావణుఁడా! మాదృశీం= నాయట్టిదానిని; దూషయిత్వా=దూషించి; పీతామృతస్యాపి=త్రాగఁబడినయమృతముగలవాఁడవైనను; తవ=నీకు; మోక్షః= విడుదల; నాస్తి=లేదు.

వజ్రాయుధంబుదాల్చియుండు దేవేంద్రునియెదుటఁ బరమసౌందర్యశాలినియగుశచీదేవినవమానించియైనను బ్రతుకవచ్చునుఁ గాని ; నాయట్టిదానినవమానించినీవు ; అమృతంబుద్రావినను బ్రాణముతోనుండఁజాలవు. అని, సీతాదేవి. రావణునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

అరణ్యకాండే, అష్టచత్వారింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికావ్యాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అరణ్యకాండాష్టచత్వారింశసర్గటీక. ముగిసినది.

౪౯

ఏకోనపంచాశసర్గప్రారంభః.

సీతాయా వచనం శ్రుత్వా దశగ్రీవః ప్రతాపవాన్
హస్తే హస్తం సమాహత్య చకార సుమహ ద్వపుః. ౧

టీక॥ప్రతాపవాన్= అధికమయిన పరాక్రమముగల; దశగ్రీవః= రావణుండు; సీతాయాః = సీతాదేవియొక్క; వచనం=మాటను; శ్రుత్వా=విని ; హస్తే=చేతియందు; హస్తం = హస్తమును; సమాహత్య=కొట్టి ; సుమహత్= మిక్కిలియుఁగొప్పదగు; వపుః = శరీరమును; చకార=చేసెను.

మహాపరాక్రమశాలియగు రావణుండు , సీతాదేవి చెప్పిన మాటనువిని కోపంబున చేయిమీఁద చేయిగొట్టి, భయంకరాకారంబగు రూపముఁదాల్చెను. అని, తాత్పర్యము.

స మైథిలీం పునర్వాక్యం బభాషేచ తతో భృశమ్

టీక॥సః=ఆరావణుఁడు ; పునః= మరల; మైథిలీం=సీతనుగూర్చి ; తతః= అంతకన్న; భృశం = మిక్కిలికౄరమయిన; వాక్యం=మాటను; బభాషేచ= పలికెను.

ఆరావణుండంత, మఱలసీతాదేవింజూచి, మఱియుఁగఠినంబుగా నిట్లనిచెప్పెను. అని, తాత్పర్యము.

నోన్మత్తయా శ్రుతౌ మన్యే మమ వీర్యపరాక్రమౌ ౨

టీక॥ఉన్మత్తయా= పిచ్చిపట్టిననీచేత; మమ= నాయొక్క ; వీర్యపరాక్రమౌ

మా=బలపరాక్రమములను; శ్రుతౌ=వినఁబడినవానిఁగా; వమన్యే=తలంపను. నీవుపిచ్చిదానవుగాను న్నావు; నాబలపరాక్రమములను నేనుమున్ను చెప్పినప్పుడు నీవువినలేదని తలంచెదను.

అని, తాత్పర్యము.

ఉద్వహేయం భుజాభ్యాంతు మేదినీమంబరే స్థితః
ఆపిబేయం సముద్రంచ హన్యాం మృత్యుం రణే స్థితః. ౩

టీక॥ అహం(అధ్యాహృతము) = నేను; అంబరే= ఆకాశమునందు; స్థితః=ఉన్నవాఁడనై ; భుజాభ్యాం = చేతులచేత; మేదినీంతు=భూమిని; ఉద్వహేయం=ఎత్తుదును. సముద్రంచ= సముద్రమునుగూడ; ఆపిబేయం= త్రాగుదును. రణే=యుద్ధమునందు; స్థితః= ఉన్నవాఁడనై; మృత్యుం= మృత్యువును; హన్యాం=చంపుదును.

నేను,ఆకాశంబునఁనిలిచి, రెండుచేతులచే,నీభూమినంతయు నెత్తుదును; సముద్రం బంతయుఁ దాగివేయుదును; యుద్ధంబునమృత్యువునుంగూడవధించివుత్తును.అని, తాత్పర్యము.

అర్కం రుంధ్యాం శరై స్తీక్ష్ణై ర్విభింద్యాంహి మహీతలమ్
కామరూపిణ మున్మత్తే పశ్య మాం కామదం పతిమ్. ౪

టీక॥ తీక్ష్ణైః= కఱకులయిన; శరైః=బాణములచేత; అర్కం= సూర్యుని; రుంధ్యాం=అడ్డగింతును; ధరణీతలం=భూమిని; విభింద్యాం= పగులఁజేయుదును. ఉన్మత్తే=పిచ్చిదానా! కామరూపిణం = ఇచ్ఛాధీనమగురూపముగల; కామదం=కోర్కులనొసంగునట్టి; పతిం=పెనిమిటినగు; మాం= నన్ను; పశ్య=చూడుము.

తీక్ష్ణబాణంబుల సూర్యునడ్డగింతును; భూమినంతయు భేదింతును; పిచ్చిదానా! నాసంగతినీకుఁదెలియలేదు; కామరూపిని కోరినవానినెల్ల నొసంగువాఁడనునీకుఁదగినపెనిమిటినగు నారూపం బుఁజూడుము. అని, రావణుండు, సీతతోఁజెప్పెను.అని, తాత్పర్యము.

ఏవ ముక్తవత స్తస్య సూర్యకల్పే శిఖిప్రభే

క్రుద్ధస్య హరిపర్యంతే రక్తే నేత్రే బభూవతుః. ౫

టీక। ఏవం=ఇట్లు; ఉక్త్వా=చెప్పి నట్టి; క్రుద్ధస్య = కోపము నొందిన; తస్య= ఆరావణుని యొక్క ; సూర్యకల్పే= సూర్యసమానములును; శిఖిప్రభే=అగ్ని యొక్క కాంతివంటి కాంతిగల వియు; హరిపర్యంతే= గోరోచనవువన్నెగల కొనలుగలవియునగు; నేత్రే=కన్నులు; రక్తే = ఎఱ్ఱనివిగా; బభూవతుః=అయినవి.

ఇట్లు చెప్పుచున్న క్రుద్ధుండగు నారావణుని యొక్క సూర్యాగ్నిసమానము లును గొనలం బింగళవర్ణములు నగు నేత్రంబులు మిక్కిలియు నెఱ్ఱనివయ్యె.

అని, తాత్పర్యము.

సద్య స్సౌమ్యం పరిత్యజ్య భిక్షురూపంచ సమ్మతమ్
స్వం రూపం కాలరూపాభం భేజే వైశ్రవణానుజః. ౬

టీక॥ వైశ్రవణానుజః= కుబేరుని తమ్ముండగు రావణుండు; సద్యః = తత్క్షణమె; సౌమ్యం=శాంతమును; సమ్మతం చ=పూజితమునగు; భిక్షురూపం = సన్యాసిరూపమును; పరిత్యజ్య= విడిచి; కాలరూపాభం = యమునిరూపము యొక్క కాంతివంటి కాంతిగల; స్వం= తనదైన; రూపం=రూపమును; భేజే= పొందెను.

కుబేరుని తమ్ముండగు నారావణుం డంతట క్షణమె, సౌమ్యంబును బూజనీయంబునగు నాసన్న్యాసిరూపంబు విడిచి, యమునిరూపమువలె నతిభయంకరంబగు తనరూపము ధరించెను.

అని, తాత్పర్యము.

సంరక్తనయన శ్శ్రీమాం స్తప్తకాంచనకుండలః
క్రోధేన మహతా విష్టో నీలజీమూతసన్నిభః. ౭
దశాస్యః కార్ముకీ బాణీ బభూవ క్షణదాచరః

టీక॥ క్షణదాచరః = రాక్షసుండైన రావణుండు; మహతా= అధికమయిన; క్రోధేన=కోపముచేత; ఆవిష్టః= ఆవేశింపఁబడినవాఁడై; సంరక్తనయనః= మిక్కిలియు నెఱ్ఱనైన కన్నులుగలవాఁడును; శ్రీమాన్= అధికమయిన కాంతిగ



లవాఁడును ; తప్తకాంచనకుండలః= కాఁచఁబడిన బంగారుపోఁగులు గలవాఁడును; నీలజీమూతసన్నిభః = నల్లని మేఘముతో సమానుఁడును ; దశాస్యః= పదితలలుగలవాఁడును; కార్ముకీ= ధనుస్సుగలవాఁడును; బాణీ= బాణములు గలవాఁడును; బభూవ= అయ్యెను.

రావణుండు పరమకుపితుండై , కన్నులనెఱ్ఱఁదనంబుగదురనప్పుడు, ఆ భిక్షురూపంబు విడిచి, శ్రీమంతుండును మంచిబంగారు పోఁగులుగలవాఁడును నీలమేఘవర్ణుండును బదితలలుగలవాఁడును ధనుర్బాణంబులుగలవాఁడునై పొడసూపెను. అని, తాత్పర్యము.

స పరివ్రాజకచ్ఛద్మ మహాకాయో విహాయ తత్. ౮
ప్రతిపద్య స్వకం రూపం రావణో రాక్షసాధిపః
సంరక్తనయనః క్రోధా జ్జీమూతనిచయప్రభః. ౯
రక్తాంబరధరస్తస్థౌ స్త్రీరత్నం ప్రేక్ష్య మైథిలీమ్

టీక॥ మహాకాయః= పెద్దదేహము గల; రాక్షసాధిపః = రాక్షసరాజుఁడగు; సః= ఆ; రావణః = రావణుఁడు; తత్ =ఆ; పరివ్రాజకచ్ఛద్మ= సన్న్యాసివేషమును; విహాయ= విడిచి; స్వకం= తనదైన; రూపం= రూపమును; ప్రతిపద్య= పొంది; క్రోధాత్= కోపమువలన; సంరక్తనయనః= మిక్కిలియెఱ్ఱనైనకన్నులుగలవాఁడై; జీమూతనిచయప్రభః= మేఘసమూహముల కాంతివంటికాంతి గలవాఁడై; రక్తాంబరధరః= ఎఱ్ఱనివస్త్రములను దాల్చినవాఁడై; స్త్రీరత్నం= స్త్రీశ్రేష్ఠయయిన; మైథిలీం= సీతాదేవిని; ప్రేక్ష్య= చూచి; తస్థౌ= నిలిచెను.

మహాకాయుండును రాక్షసేశ్వరుండునగు నా రావణుఁడు, ఆ సన్న్యాసిరూపము విడిచి, నిజరూపంబుఁ దాల్చి, కోపంబునఁ గన్నులనెఱ్ఱఁదనంబు గదుర, మేఘసమానవర్ణుండై, రక్తవస్త్రధరుండై, యుత్తమస్త్రీయగు సీతాదేవిం జూచుచు, నిలుచుండెను.

అని, తాత్పర్యము.

స తా మసితకేశాంతాం భాస్కరస్య ప్రభా మివ. ౧౦
వసనాభరణోపేతాం మైథిలీం రావణో బ్రవీత్

టీక॥ సః= ఆ; రావణః = రావణుఁడు; అసితకేశాంతాం= నల్లని వెంట్రుకల




కొనలుగలదియు; భాస్కరస్య=సూర్యునియొక్క; ప్రభామివ (స్థితాం)=కాంతివలెనున్నదియు; వసనాభరణోపేతాం=వస్త్రములతోను ఆభరణములతోనుంగూడినదియునగు; తాం= ఆ; మైథిలీం=సీతాదేవింగూర్చి ; అబ్రవీత్=చెప్పెను.

ఆరావణుండు,నల్లనివెంట్రుకలకొనలుగలదియు సూర్యకాంతివలెం రేజిచూడనలవిగాకున్నదియుమంచివస్త్రంబునుఆభరణంబులనుధరించి యున్నదియునగు నాసీతాదేవిం జూచి యిట్లనియె. అని, తాత్పర్యము.

త్రిషు లోకేషు విఖ్యాతం యది భర్తార మిచ్ఛసి. ౧౧
మా మాశ్రయ వరారోహే తవాహం సదృశః పతిః

టీక॥ వరారోహే=సుందరమయినపిఱుందులుగలసీతా! త్రిషు= ముల్లోకములయందు; విఖ్యాతం=ప్రసిద్ధిఁబొందిన;భర్తారం=పెనిమిటిని; ఇచ్ఛసియది=కోరుదువేని;మాం=నన్ను ; ఆశ్రయ=పొందుము. అహం=నేను;తవ=నీకు;సదృశః=సరియయిన;పతిః= పెనిమిటిని.

సుందరమయిన పిఱుందులుగల సీతా! ముల్లోకంబులయందును ప్రసిద్ధిఁగాంచినపెనిమిటికావలెనని కోరెదవేని,నన్నాశ్రయింపుము; నీకుసరియయినపెనిమిటిని నేను. అని, తాత్పర్యము.

మాం భజస్వ చిరాయ త్వ మహం శ్లాఘ్యః పతిస్తవ. ౧౨
నైవచాహం క్వచి ద్భద్రే కరిష్యే తవ విప్రియమ్

టీక॥భద్రే= మంగళకరివగుసీతా! త్వం=నీవు;చిరాయ = బహుకాలమునకు;మాం=నన్ను;భజస్వ = పొందుము.అహం=నేను;తవ=నీకు;శ్లాఘ్యః=కొనియాడఁదగిన;పతిః=పెనిమిటిని. అహం=నేను;క్వచిత్ = ఒకానొకప్పుడును;తవ=నీకు;విప్రియం= అనిష్టమును; నకరిష్యేచైవ=చేయనేచేయను.

మంగళరూపిణివగుసీతా!బహుకాలమునకునీకుఁదగినశ్లాఘ్యభర్తను నేను దొరికితిని; కావుననన్నాశ్రయింపుము; నేను, నీకెప్పుడును , ఏవిధమయినయ

పకారమును జేయను. అని, తాత్పర్యము.

త్యజ్యతాం మానుషే భావో మయిభావః ప్రణీయతామ్. ౧౩

టీక॥మానుషే=మనుష్యునియందు; భావః=మనసు; త్యజ్యతాం= విడువఁబడుఁగాక. మయి=నాయందు; భావః= మనసు; ప్రణీయతాం = ఉంచఁబడుఁగాక.

నీవు మనుష్యునిపైమనస్సువిడిచి, నాపైమనసునుంచుము. అని, తాత్పర్యము.

రాజ్యాచ్చ్యుత మసిద్ధార్థం రామం పరిమితాయుషమ్
కైర్గుణై రనురక్తాసి మూఢే పండితమానిని. ౧౪
యస్స్త్రియా వచనా ద్రాజ్యం విహాయ ససుహృజ్జనమ్
అస్మిన్ వ్యాళానుచరితే వనే వసతి దుర్మతిః. ౧౫

టీక॥మూఢే = ఏమియుఁ దెలియని దానవు; పండితమానిని= పండితురాలనని యహంకారముగలదానవునగు సీతా! యః=ఏ; దుర్బుద్ధిః = దుర్మతి; స్త్రియాః= స్త్రీయొక్క; వచనాత్= మాటవలన; ససుహృజ్జనం=స్నేహితులతోఁగూడిన; రాజ్యం=రాజ్యమును; విహాయ=విడిచి; అస్మిన్ = ఈ; వ్యాళానుచరితే=దుష్టమృగములచేసంచరింపఁబడిన; వనే=అడవియందు; వసతి = ఉన్నాఁడో; తం=అట్టి; రాజ్యాత్ = రాజ్యమునుండి; చ్యుతం=భ్రష్టుండును; అసిద్ధార్థం=ఈడేఱనిప్రయోజనముగలవాఁడును; పరిమితాయుషం= మిక్కిలితక్కువయయిన యాయుస్సుగలవాఁడునగు; రామం = రామునిఁగూర్చి; కైః=ఏ; గుణైః=గుణములచేత; అనురక్తా=అనురాగముగలదానవు; అసి=అగుచున్నావు.

సీతా! నీకేమియుఁ దెలియకున్నను బండితురాలనని యహంకారము మాత్రముగలదు; స్త్రీమాటవిని యకంటకంబగు రాజ్యమును బంధువులను విడిచి, క్రూరమృగసేవితంబగు నీయరణ్యంబున నున్నాఁడే, యిట్టిదుర్బుద్ధియు రాజ్యభ్రష్టుండును కార్యముఁ దెలియనివాఁడును ఆసన్నమరణుండునగు రామునియందు, ఏగుణములుచూచి, నీవతనిపైనను

రాగమునొందియున్నాఁడు? అని, రావణుండు, సీతతోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వా మైథిలీం వాక్యం ప్రియార్హాం ప్రియవాదినీమ్
అభిగమ్య సుదుష్టాత్మా రాక్షసః కామమోహితః. ౧౬
జగ్రాహ రావణ స్సీతాం బుధః ఖే రోహిణీమివ

టీక॥సుదుష్టాత్మా=మిక్కిలియదుష్టమయినమనస్సుగల; రావణః= రావణుఁడు; ప్రియార్హాం= ప్రియవచనములకుఁదగినదియు; ప్రియవాదినీం= ప్రియములె చెప్పునదియునగు; మైథిలీం= సీతనుగూర్చి; ఇతి=ఇట్లు; వాక్యం= మాటను; ఉక్త్వా=చెప్పి; అభిగమ్య= సమీపించి; సీతాం=సీతను; ఖే = ఆకాశమునందు; బుధః = బుధుఁడు; రోహిణీమివ= రోహిణీదేవినివలె; జగ్రాహ=పట్టుకొనెను.

దుష్టాత్ముఁడగురావణుండు, ప్రియవచనంబులకె దగినదియు నొకప్పుడేని యొరులంజూచి యప్రియంబులాడనదియునగు సీతంజూచి, యిట్టిక్రూరవచనంబులాడి, ఆకాశంబున, బుధుండు, రోహిణింబట్టునట్లు, సీతం బట్టుకొనెను.

అని, తాత్పర్యము.

వామేన సీతాం పద్మాక్షీం మూర్ధజేషు కరేణ సః. ౧౭
ఊర్వోస్తు దక్షిణేనైవ పరిజగ్రాహ పాణినా

టీక॥సః= ఆరావణుండు; పద్మాక్షీం=కమలములవంటికన్నులుగల; సీతాం=సీతను; వామేన=ఎడమదైన; కరేణ=హస్తముచేత; మూర్ధజేషు= వెండ్రుకలయందును; దక్షిణేన= కుడిదైన; పాణినా=చేతిచేత; ఊర్వోస్త్వేవ= తొడలయందునుమాత్రమె; పరిజగ్రాహ=పట్టుకొనెను.

ఆరావణుండు, కాపభయంబున, సీతాదేవిదేహముతనచేయి దగులకుండునట్లు, వామహస్తంబున వెండ్రుకలనుగుడిచేతందొడలను బట్టుకొనెను.

అని, తాత్పర్యము.

తం దృష్ట్వా మృత్యుసంకాశం తీక్ష్ణదంష్ట్రం మహాభుజమ్. ౧౮

ప్రాద్రవన్ గిరిసంకాశం భయార్తా వనదేవతాః

టీక॥ వనదేవతాః = వనదేవతలు; మృత్యుసంకాశం = మృత్యువుతో సమానుఁడును; తీక్ష్ణదంష్ట్రం = కఱుకులయిన కోఱలుగలవాఁడును; మహాభుజం = పెద్దచేతులుగలవాఁడును; గిరిసంకాశం = పర్వతముతో సమానుఁడునగు; తం = ఆ రావణుని; దృష్ట్వా = చూచి ; భయార్తాః = భయముచేఁ బీడింపఁబడినవారలయి; ప్రాద్రవన్ = పరుగెత్తిరి.

వనదేవతలందఱు, ఆసీతాదేవిని ఎత్తుకొనుచున్న మృత్యువుంబోలె భయంకరాకారుండును బర్వతాకారుండును దీక్ష్ణదంష్ట్రుండును మహాబాహుండునగు రావణుంజూచి, భయంబునంబరుగెత్తిరి. అని, తాత్పర్యము.

సచ మాయామయో దివ్యః ఖరయుక్తః ఖరస్వనః. ౧౯
ప్రత్యదృశ్యత హేమాంగో రావణస్య మహారథః

టీక॥ మాయామయః = మాయావికారంబును; దివ్యః = శ్రేష్ఠమును; ఖరయుక్తః = గాడిదలతోఁ గూడినదియు; ఖరస్వనః = ఉగ్రమయినధ్వనిగలదియు; హేమాంగః = బంగారుచక్రములుగలదియునగు; సః = ఆ; రావణస్య = రావణునియొక్క; మహారథశ్చ = గొప్పరథమును; ప్రత్యదృశ్యత = చూడఁబడెను.

మాయచేనింతవఱకుఁ బ్రచ్ఛన్నమయియుండిన, దివ్యంబును గాడిదలుపూన్చినదియు మహాధ్వనిగలదియు బంగారు చక్రములుగలదియునగు నా రావణునిమహారథమునప్పుడుపొడసూపెను. అని, తాత్పర్యము.

తతస్తాం పరుషైర్వాక్యైః భర్త్సయన్ స మహాస్వనః. ౨౦
అంకేనాదాయ వైదేహీం రథమారోపయత్తదా

టీక॥ తతః = అంత; తదా = అప్పుడు; మహాస్వనః = అధికమయినధ్వనిగల; సః = ఆ రావణుఁడు; తాం = ఆ; వైదేహీం = సీతాదేవిని; పరుషైః = కఠినములగు; వాక్యైః = మాటలచేత; భర్త్సయన్ = బెదరించుచు; అంకేన = తొడచేత; ఆదాయ = ఎత్తి; రథం = రథమును; ఆరోపయత్ = ఎక్కించెను.

స ౪౯

మహాధ్వనియగు నారావణుండంతట, బరుషవచనంబుల నాసీతనుబెదరించుచు, ఎత్తితనరథముపైఁ గూర్చుండఁబెట్టెను. అని, తాత్పర్యము.

సా గృహీతా విచుక్రోశ రావణేన యశస్వినీ. ౨౧
రామేతి సీతా దుఃఖార్తా రామం దూరగతం వనే

టీక॥యశస్వినీ = అధికమయినకీర్తిగలది; సా=ఆ; సీతా=సీతాదేవి; రావణేన = రావణునిచేత; గృహీతా= పట్టుకొనఁబడినదై; దుఃఖార్తా=దుఃఖముచేఁబీడింపఁబడినదై; వనే=అడవియందు; దూరగతం=దూరమునసున్నట్టి; రామం = రామునిగూర్చి; రామేతి=రాముఁడాయని; విచుక్రోశ = అఱచెను.

మహాపతివ్రతయగు నాసీత, అట్లు రావణునిచే గ్రహింపఁబడినదై, యరణ్యంబునందు దూరమునసున్న రామునిం బేరొకొని మొఱయిడిపిలిచెను. అని, తాత్పర్యము.

తా మకామాం స కామార్తః పన్నగేంద్రవధూ మివ. ౨౨
వివేష్టమానా మాదాయ ఉత్పపాతా౽థ రావణః

టీక॥అథ=అంత; కామార్తః= మన్మథునిచేఁబీడింపఁబడిన; సః=ఆ; రావణః=రావణుఁడు; అకామాం=ఇచ్ఛలేనిదియు; పన్నగేంద్రవధూమివ= నాగకన్యకవలె; వివేష్టమానాం=పొరలాడుచున్నదియునగు; తాం=ఆసీతను; ఆదాయ=తీసికొని; ఉత్పపాత=ఎగిరెను.

కామాతురుండగు నారావణుండు తననొంగూడవచ్చుట కెంతమాత్రము నిచ్ఛలేనిదియు నాగకన్యకవలెఁ బొరలాడుచున్నదియునగు నాసీతాదేవిం దీసికొని, యంతనాకాశంబునకుద్గమించెను. అని, తాత్పర్యము.

తత స్తాం రాక్షసేంద్రేణ హ్రియమాణా విహాయసా. ౨౩
భృశం చుక్రోశ మత్తేవ భ్రాంతచిత్తా యథాతురా

టీక॥ తతః=అంత; సా= ఆసీతాదేవి; రాక్షసేంద్రేణ = రాక్షసరాజుచే

డగు రావణుః చేత; విహాయసా=ఆకాశము చేత; హ్రియమాణా=అపహరింపఁబడుచున్నదై; మత్తేవ=మదమునొందినదివలె; భ్రాంతచిత్తాయథా=భ్రమమునొందినమనస్సుగలదివలె; ఆతురా=పీడింపఁబడినదై; భృశం=మిక్కిలి; చుక్రోశ=అఱచెను.

అంత, నా సీతాదేవి, యట్లు రాక్షసరాజుఁడగు రావణునిచే నాకాశమార్గంబునం గొనిపోఁబడుచు, క్రైవు నొందినదివలె మోహమునొందినవలెం బరిమదుఃఖితయయి యఱచెను.

అని, తాత్పర్యము.

హా లక్ష్మణ మహాబాహో గురుచిత్తప్రసాదక. ౨౪
హ్రియమాణాం నజానీషే రక్షసా మా మమర్షణ

టీక॥ హా=అయ్యో! గురుచిత్తప్రసాదక = అన్నమనసునకు సంతోషము కల్గించువాఁడవు; మహాబాహో=పెద్దచేతులుగలవాఁడవునగు; లక్ష్మణ = లక్ష్మణుఁడా! అమర్షణ= కోపముగల; రక్షసా=రాక్షసునిచేత; హ్రియమాణాం = అపహరింపఁబడుచున్న; మాం=నన్ను; నజానీషే = ఎఱుంగవుగదా!

అయ్యో! అన్నమనస్సునకెప్పుడును సంతోషంబుగలుగఁ జేయువాఁడవు మహాబాహుండవునగు లక్ష్మణుఁడా! కుపితుండగు నీరాక్షసుండు నన్నిప్పుడపహరించుకొనిపోవుచున్నాఁడనుట, నీవుఁ దెలియదుగదా! అని, తాత్పర్యము.

జీవితం సుఖ మర్థాంశ్చ ధర్మహేతోః పరిత్యజన్. ౨౫
హ్రియమాణా మధర్మేణ మాం రాఘవ నపశ్యసి

టీక॥ రాఘవ=రాముఁడా! ధర్మహేతోః = ధర్మనిమిత్తమయి; జీవితం=ప్రాణమును; సుఖం=సుఖమును; అర్థాంశ్చ=ధనములను; పరిత్యజన్=విడుచునట్టి; త్వం(అధ్యాహృతము) = నీవు; అధర్మేణ = అధర్మముచేత; హ్రియమాణాం= అపహరింపఁబడుచున్న; మాం=నన్ను; నపశ్యసి= చూడకున్నావుగదా!

రాముఁడా! ధర్మమునిమిత్తమయి, ప్రాణంబును సుఖంబును ధనంబులును అన్నిటినివిడుచునట్టిమహానుభావుండవు

స ౪౯

నీవుగూడ, అధర్మంబున నన్నీరావణుండపహరించుకొని పోవుటఁజూడ | చున్నావుగదా! అని, తాత్పర్యము.

నను నామా ఽ వినీతానాం వినేతా ఽసి పరంతప. ౧౬
కథ మేవంవిధం పాపం న త్వం శాసిహి రావణమ్

టీక॥ పరంతప=శత్రువులఁదపింపఁజేయునట్టి రాముఁడా! త్వం=నీవు; అవినీతానాం=దుష్టులయొక్క; వినేతా=శిక్షించువాఁడవు; అసినను = అగుచున్నావుగదా! ("నామ" అనునది వాక్యాలంకారార్థము) కథం=ఎట్లు; ఏవంవిధం=ఇట్టి; పాపం=పాపిష్ఠుఁడైన; రావణంహి=రావణునే; నశాసి=శిక్షింపకున్నావు?

శత్రువులవధించునట్టి రాముఁడా! నీవుదుష్టులనందఱనుశిక్షించువాఁడవే; ఇట్టిపరమదుష్టుండగు నీరావణునిశిక్షింపకున్నావేల? అని, తాత్పర్యము.

నను సద్యో ఽవినీతస్య దృశ్యతే కర్మణః ఫలమ్. ౧౭
కాలో ప్యంగీభవ త్యత్ర సస్యానా మివ పక్తయే

టీక॥ నను=ఓయి! అవినీతస్య=దుష్టునియొక్క; కర్మణః=కార్యముయొక్క; ఫలం=ఫలము; సద్యః = తత్క్షణమె; దృశ్యతే=చూడఁబడును. అత్ర=ఈ విషయమునందు; కాలోపి=కాలమును; సస్యానాం=పైరులయొక్క; పక్తయ ఇవ= పాకముకొఱకువలె; అంగీభవతి=సహాయమగుచున్నది!

ఓయి! దుష్టకార్యముచేసినట్టయిన దానికి ఫలముతత్క్షణమే యనుభవమునకువచ్చును; పైరుపండుటకుఁగాలము సహాయపడునట్లు దీనికిఁగాలమె సహాయపడును. అని, తాత్పర్యము.

స కర్మ కృతవా నేత త్కాలోపహతచేతనః. ౧౮
జీవితాంతకరం ఘోరం రామా ద్వ్యసన మాప్నుహి

టీక॥ సః(త్వం)=అట్టినీవు; కాలోపహతచేతనః = కాలముచేతఁగొట్టఁబ

సర్గ

మిమ్ము బిలిచి వేడుకొనెదను; రావణుండు సీతనపహరించుకొని పోవుచున్నాఁడని శీఘ్రముగ రామునకుఁ జెప్పుఁడు. అని, తాత్పర్యము.

మాల్యవంతం శిఖరిణం వందే ప్రస్రవణం గిరిమ్. ౩౧
క్షిప్రం రామాయ శంస త్వం సీతాం హరతి రావణః

టీక॥ మాల్యవంతం = మంచిపుష్పములుగలదియు; శిఖరిణం = మంచిశిఖరములుగలదియునగు; ప్రస్రవణం = ప్రస్రవణమను; గిరిం = పర్వతమును; వందే = నమస్కరించెదను. త్వం = నీవు; రావణః = రావణుండు; సీతాం = సీతను; హరతి = హరించుచున్నాఁడు. ఇతి = అని; క్షిప్రం = శీఘ్రముగ; రామాయ = రామునకొఱకు; శంస = చెప్పుము.

ప్రస్రవణపర్వతమా! పుష్పములుగలవాఁడవును మంచిశిఖరములుగలవాఁడవునగు నిన్ను నమస్కరించెదను; నీవు, రావణుండు సీతాదేవినపహరించుకొనిపోవుచున్నాఁడని శీఘ్రముగ, రామునకుం జెప్పుము. అని, తాత్పర్యము.

హంససారససంఘుష్టాం వందే గోదావరీం నదీమ్. ౩౨
క్షిప్రం రామాయ శంస త్వం సీతాం హరతి రావణః

టీక॥ హంససారససంఘుష్టాం = హంసపక్షులచేతను సారసపక్షుల చేతను ధ్వనింపఁజేయఁబడిన; గోదావరీం = గోదావరియను; నదీం = నదిని; వందే = నమస్కరించెదను. త్వం = నీవు; రావణః = రావణుఁడు; సీతాం = సీతను; హరతి = హరించుచున్నాఁడు. ఇతి = అని; క్షిప్రం = శీఘ్రముగా; రామాయ = రామునికొఱకు; శంస = చెప్పుము.

మనురంబుగాఁగూయు హంససారసపక్షులతో నొప్పుచున్న గోదావరీనదీ! నిను నమస్కరించెదను; నీవు రావణుండు, సీతను అపహరించుకొనిపోవుచున్నాఁడని శీఘ్రముగా రామునకుఁ జెప్పుము. అని, తాత్పర్యము.

దైవతాని చ యాన్యస్మిన్ వనే వివిధపాదపే. ౩౩
నమస్కరోమ్యహం తేభ్యో భర్తుః శంసంతు మాం హృతామ్

టీక॥ వివిధపాదపే=నానావిధములయినవృక్షములుగల; అస్మిన్=ఈ; వనే=అడవియందు; యాని = ఏ; దైవతాని=దేవతలు; సంతి (అధ్యాహృతము)=ఉన్నారో; అహం= నేను; తేభ్యః = ఆదేవతలకొఱకు; నమస్కరోమి=నమస్కరించెదను. భర్తుః= పెనిమిటియగురామునకు; మాం = నన్ను; హృతాం = అపహరింపఁబడినదానినిగా; శంసంతు=చెప్పుదురుగాక.

నానావిధములగు వృక్షములుగల యీవనమునందుండు దేవతలకందఱకు నమస్కరించెదను; వారలైనను, నన్ను రాక్షసుండపహరించినాఁడని నాపెనిమిటికిఁజెప్పుదురుగాక.

అని, తాత్పర్యము.

యాని కాని చిదప్యత్ర సత్త్వాని నివసంత్యుత. ౩౪
సర్వాణి శరణం యామి మృగపక్షిగణానపి

టీక॥అత్ర = ఈవనమునందు; యాని=ఏ; కానిచిదపి = కొన్నియునగు; సత్త్వాని=జంతువులు; నివసంతి = ఉన్నవో; తాని(అధ్యాహృతము)=వాని; సర్వాణ్యుత= అన్నిటినిగూడ; మృగపక్షిగణానపి= మృగపక్షిసమూహములనుగూడ; శరణం=రక్షకముగా; యామి= పొందుచున్నాను.

ఈవనంబునందు నివసించుజంతువులలో, మృగపక్షులు మొదలుగాఁగల వానినన్నింటిని, శరణుపొందెదను.

అని, తాత్పర్యము.

హ్రియమాణాం ప్రియాం భర్తుః ప్రాణేభ్యోపి గరీయసీమ్. ౩౫
వివశాఽపహృతా సీతా రావణేనేతి శంసత

టీక॥యూయం=మీరలు; భర్తుః= పెనిమిటికి; ప్రాణేభ్యోపి = ప్రాణములకన్నను; గరీయసీం= అధికురాలను; ప్రియాం = ప్రియురాలను; హ్రియమాణాం= అపహరింపఁబడుచున్నదానను; మాం (అధ్యాహృతము)= నన్ను; సీతా; సీత; వివశా = పరవశురాలై; రావణేన=రావణునిచేత ; అపహృతా=అపహరింపఁబడినది. ఇతి= అని; శంసత=చెప్పుఁడు.

మీరలు, రామునొద్దకుఁబోయి, నీకుఁ బ్రాణంబులకన్నఁ బ్రియురాలగుసీ

స ౪౯

భార్యసీత పరవశురాలయి రావణుఁచే నపహరింపఁబడినదని, రాముసకుఁజె ప్పఁడు. అని, తాత్పర్యము.

విదిత్వా మాం మహాబాహు రముత్రాపి మహాబలః. ౩౬
ఆనేష్యతి పరాక్రమ్య వైవస్వతహృతామపి

టీక॥ మహాబాహుః= పెద్దచేతులు గలవాఁడును; మహాబలః=అధికమయి నబలము గలవాఁడునగు రాముఁడు; మాం=నన్ను; విదిత్వా=తెలిసికొని; అముత్రా౽పి(గతాం) = స్వర్గలోకము నొందినదానినైనను; వైవస్వతహృతామపి= యమునిచేనపహరింపఁబడినదాని నైనను; పరాక్రమ్య=పరాక్రమించి; ఆనేష్యతి=తెచ్చును.

మహాబాహుఁడును మహాబలుఁడు నగురాముఁడు, నేనున్నస్థలముఁదెలి యునేని, నేనస్వర్గమునన్నను యమలోకంబుననున్నను, బరాక్రమబలంబున, నన్నుఁదెచ్చుకొనను. అని, సీతాదేవి, యఱచినది. అని, తాత్పర్యము.

సా తదా కరుణా వాచో విలపంతీ సుదుఃఖితా. ౩౭
వనస్పతిగతం గృధ్రం దదర్శాయతలోచనా

టీక॥ తదా=అప్పుడు; ఆయతలోచనా = విశాలములయినకన్నులుగల; సా=ఆసీతాదేవి; సుదుఃఖితా = మిక్కి-లియుదుఃఖము నొందినదై; కరుణాః=దుఃఖకరములగు; వాచః= మాటలను; విలపంతీ=విలపించుచు; వనస్పతిగతం = వృక్షమునుబొందియున్న; గృధ్రం = జటాయువును; దదర్శ= చూచెను.

అప్పుడు, విశాలంబులగునేత్రంబులుగలయాసీతాదేవి, పరమదుఃఖితయయి, వినువారికిఁగూడదుఃఖంబుగలుగునట్లురోదనంబుసేయుచు, వృక్షగతుండైయున్నజటాయువుంజూచెను. అని, తాత్పర్యము.

సా తముద్వీక్ష్య సుశ్రోణీ రావణస్య వశంగతా. ౩౮
సమాక్రందద్భయపరా దుఃఖోపహతయా గిరా

టీక॥సుశ్రోణీ = సుందరములయిన పిఱుఁదులుగల; రావణస్య = రావణుని యొక్క; వశం = అధీనతను ; గతా = పొందిన; సా = ఆసీతాదేవి; తం = ఆజటాయువును; ఉద్వీక్ష్య = చూచి; భయపరా = భయాధీనయయి; దుఃఖోపహతయా = దుఃఖముచేఁగొట్టఁబడిన; గిరా = మాటచేత; సమాక్రందత్ = అఱచెను.

అట్లు రావణవశంగతయయియున్న సుందరములగుపిఱుఁదులుగల యాసీతాదేవి, ఆజటాయువుఁజూచి, భయదుఃఖంబులు మనంబునఁ బెనంగొన, నీప్రకారంబున నఱచెను.

అని, తాత్పర్యము.

జటాయో పశ్య మా మార్య హ్రియమాణా మనాథవత్. ౩౯
అనేన రాక్షసేంద్రేణ కరుణం పాపకర్మణా

టీక॥ఆర్య = పూజ్యుఁడవగు; జటాయో = జటాయువా! పాపకర్మణా = పాపముగలిగించు కార్యములుగల ; అనేన = ఈ; రాక్షసేంద్రేణ = రాక్షసరాజుఁడగురావణునిచేత ; కరుణం = దుఃఖముగలుగునట్లుగా; అనాథవత్ = నాథుఁడులేనిదానియట్లు; హ్రియమాణాం = అపహరింపఁబడుచున్న; మాం = నన్ను; పశ్య = చూడుము.

పూజ్యుఁడవగుజటాయువా! పాపిష్ఠుండగునీరాక్షసరాజురావణుండు, నన్ను, దిక్కులేనిదానింబోలెనపహరించుకొనిపోవుచున్నాఁడు చూడుము.

అని, తాత్పర్యము.

నైష వారయితుం శక్య స్తవ క్రూరో నిశాచరః. ౪౦
సత్త్వవాన్ జితకాశీచ సాయుధశ్చైవ దుర్మతిః

టీక॥క్రూరః = కఠినుండును; సత్త్వవాన్ = అధికమయిన బలముగలవాఁడును; జితకాశీచ = జయముచేఁబ్రకాశించువాఁడును; సాయుధశ్చైవ = ఆయుధముతోఁగూడినవాఁడునగు ; దుర్మతిః = దుర్బుద్ధియయిన; ఏషః = ఈ; నిశాచరః = రాక్షసుఁడు; తవ = నీకు ; వారయితుం = అడ్డగించుటకు; నశక్యః = అలవికాఁడు.

ఈరాక్షసుండు , బలవంతుండును జయశీలుండు నాయుధధరుండును క్రూరుండునుగావున, నీకితని నెదిరింప నలవి

గాదు. అని, తాత్పర్యము.

రామాయతు యథాతత్త్వం జటాయో హరణం మమ. ౪౧
లక్ష్మణాయచ తత్సర్వ మాఖ్యాతవ్య మశేషతః

టీక॥ జటాయోః=జటాయువా! తత్=అందువలన; మమ=నాయొక్క; హరణం=అపహరించుట; సర్వం= అంతయు; అశేషతః=నిశ్శేషముగా; యథాతత్త్వం=యథార్థముగా; రామాయతు=రామునికొఱకును; లక్ష్మణాయచ=లక్ష్మణునికొఱకును; ఆఖ్యాతవ్యం=చెప్పబడవలసినది.

జటాయువా! అందువలన, నీవు, రావణుఁడు నన్నపహరించిన సమాచారమునంతయు యథార్థముగా నిశ్శేషముగా, రామునకును లక్ష్మణునకును జెప్పుము. అని, సీత, జటాయువుతోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అరణ్యకాండే, ఏకోనపంచాశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అరణ్యకాండైకోనపంచాశసర్గటీక, ముగిసినది.



స ౫౦

౩౭

పంచాశసర్గప్రారంభః.

తం శబ్ద మవసుప్తస్తు జటాయు రథ శుశ్రువే
నిరీక్ష్య రావణం క్షిప్రం వైదేహీంచ దదర్శ సః. ౧

టీక॥అథ=అంత; అవసుప్త = నిదురించియున్న; జటాయుస్తు=జటాయువును; తం=ఆ; శబ్దం=ధ్వనిని; శుశ్రువే=వినెను. సః=ఆజటాయువు; క్షిప్రం=శీఘ్రముగా; రావణం = రావణుని; నిరీక్ష్య=చూచి; వైదేహీంచ= సీతాదేవినిగూడ; దదర్శ=చూచెను.

అంత, చెట్టుమీఁదనిద్రించుచుండినజటాయువు, ఆశబ్దమునువిని మేలొ్కని, రావణుని, సీతాదేవినింజూచెను. అని, తాత్పర్యము.

తతః పర్వతకూటాభ స్తీక్ష్ణతుండః ఖగోత్తమః
వనస్పతిగత శ్శ్రీమాన్ వ్యాజహార శుభాంగిరమ్. ౨

టీక॥తతః = అంత; పర్వతకూటాభః= పర్వతశిఖరముయొక్క కాంతివంటికాంతిగలవాఁడును; తీక్ష్ణతుండః= కఠినమయిన ముక్కు గలవాఁడును; శ్రీమాన్= అధికమయినకాంతిగలవాఁడునగు; ఖగోత్తమః = పక్షిశ్రేష్ఠుఁడగుజటాయువు; వనస్పతిగతః = వృక్షమును బొందినవాఁడై; శుభాం=మంగళకరమయిన; గిరం=మాటను; వ్యాజహార=చెప్పెను.

అంతఁ, బర్వతశిఖరాకారుండునుతీక్ష్ణనాసుఁడును శ్రీమంతుండునగునాజటాయువు, చెట్టుమీఁదనుండియె, రావణుంజూచి, మంగళకరంబగు, నీమాటం జెప్పెను. అని, తాత్పర్యము.

దశగ్రీవ స్థితో ధర్మే పురాణే సత్యసంశ్రయః
జటాయుర్నామ నామ్నాహం గృధ్రరాజో మహాబలః. ౩

స ౫౦

టీక॥ దశగ్రీవ = రావణుడా! అహం = నేను; పురాణే = పురాతనమయిన; ధర్మే = ధర్మమునందు; స్థితః = ఉన్నవాడను. సత్యసంశ్రయః = సత్యమే యాశ్రయము గాఁ గలవాఁడను; నామ్నా = పేరుచేత; జటాయు ర్నామ = జటాయువని ప్రసిద్ధుఁడను. గృధ్రరాజః = గద్దలకుఁ బ్రభుఁడను. మహాబలః = అధికమయిన బలము గలవాఁడను.

రావణుఁడా! నేను, ధర్మంబుదప్పనివాఁడను; సత్యవాదిని; నాపేరు జటాయువందురు; గృధ్రరాజుఁడను; మహాబలశాలిని; నేను చెప్పుమాటను వినుము. అని, తాత్పర్యము.

రాజా సర్వస్య లోకస్య మహేంద్రవరుణోపమః
లోకానాంచ హితే యుక్తో రామో దశరథాత్మజః. ౪

టీక॥ దశరథాత్మజః = దశరథపుత్రుఁడగు; రామః = రాముఁడు; సర్వస్య = సమస్తమయిన; లోకస్య = లోకమునకు; రాజా = రాజు. మహేంద్రవరుణోపమః = దేవేంద్రునితోను వరుణునితోను పోలిక గలవాఁడును. లోకానాం = జనుల యొక్క; హితే = మేలునందు; యుక్తశ్చ = ఆసక్తుఁడును.

దశరథమహారాజకుమారుఁడగు రాముఁడు, సమస్తలోకంబునకును ప్రభువు; దేవేంద్రవరుణులకు సమానుఁడు; సమస్తలోకంబులకును హితంబు సేయువాఁడు. అని, తాత్పర్యము.

తస్యైషా లోకనాథస్య ధర్మపత్నీ యశస్వినీ
సీతా నామ వరారోహా యాం త్వం హర్తు మిహేచ్ఛసి. ౫

టీక॥ త్వం = నీవు; ఇహ = ఇప్పుడు; యాం = ఎవ్వతెను; హర్తుం = అపహరించుటకు; ఇచ్ఛసి = కోరుచున్నావో; ఏషా = ఈ; సీతా నామ = సీతయనుపేరుగల; వరారోహా = ఉత్తమస్త్రీ; తస్య = ఆ; లోకనాథస్య = లోకనాథుండగు రామునియొక్క; ధర్మపత్నీ = ధర్మపత్ని; యశస్వినీ = అధికమయిన కీర్తిగలది.

ఈ సీతాదేవి, లోకనాథుండగు నా రాముని ధర్మపత్ని; మహాపతివ్రత, ఆబిడను నీవు, అపహరించుట, ఎంత

మాత్రముతగదు. అని, తాత్పర్యము.

కథం రాజా స్థితో ధర్మే పరదారాన్ పరామృశేత్
రక్షణీయా విశేషేణ రాజదారా మహాబల. ౬

టీక॥ మహాబల= అధికమయినబలముగలరావణుఁడా! ధర్మే= ధర్మమునందు; స్థితః=ఉన్నట్టి; రాజా=రాజు; కథం=ఎట్లు; పరదారాన్=ఇతరులభార్యలను; పరామృశేత్=తాఁకవచ్చును? రాజదారాః= రాజభార్యలు; విశేషేణ=విశేషించి; రక్షణీయాః=రక్షింపఁదగినవారలు.

మహాబలుండవగు రావణుఁడా! ధర్మంబునవలంబించియున్న నీయట్టి రాజు, పరస్త్రీలం దాఁకవచ్చునా? అందును విశేషించి, రాజస్త్రీలనేమఱకరక్షింపవలెను. అని, తాత్పర్యము.

నివర్తయ మతిం నీచాం పరదారాభిమర్శనాత్
న తత్సమాచరేద్ధీరో యత్పరోఽస్య విగర్హయేత్. ౭

టీక॥ పరదారాభిమర్శనాత్=పరస్త్రీలం దాఁకుటనుండి; నీచాం=నీచమయినట్టి; మతిం=బుద్ధిని; నివర్తయ = మఱలింపుము. అస్య=ఈతనియొక్క; యత్= ఏకార్యమును; పరః=అన్యుఁడు; విగర్హయేత్=నిందించునో; తత్= ఆకార్యమును; ధీరః=పండితుఁడు; న సమాచరేత్= చేయఁగూడదు.

నీచమయినయీపరదారాభిమర్శనబుద్ధిని వదలుము; పండితుండగు వాఁడు తానేకార్యముచేసిన నితరులుతన్నునిందింతురో, ఆకార్యము నెంతమాత్రముచేయఁగూడదు. అని, తాత్పర్యము.

యథాత్మన స్తథాన్యేషాం దారా రక్ష్యా విమర్శనాత్

టీక॥ ఆత్మనః= తనయొక్క ; దారాః=భార్య; యథా=ఎట్లో; తథా=అట్లే; అన్యేషాం=ఇతరులయొక్క ; దారాః(అధ్యాహృతము)=భార్యలును; విమర్శనాత్ =పరపురుషాభిమర్శనమునుండి; రక్ష్యాః= రక్షింపఁదగినవారలు.

స. ౩౦

ఎట్లుతనభార్యనుబరపురుష సంబంధ ముగలుగకుండునట్లుతాను రక్షించుకొనునో, అట్లుఇతరభార్యలనుగూడ రక్షింపవలెను. అని, తాత్పర్యము.

ధర్మ మర్థంచ కామంచ శిష్టా శ్శాస్త్రే ష్వనాగతమ్. ౮

న వ్యవస్యంతి రాజానో ధర్మః పౌలస్త్యనందన

టీక॥ పౌలస్త్యనందన = రావణుఁడా! శిష్టాః = సత్పురుషులగు ; రాజానః = రాజులు; శాస్త్రేషు = శాస్త్రములయందు; అనాగతం = పొందఁబడని; ధర్మం = ధర్మమును; అర్థంచ = ధనమును; కామంచ = కామమును; నవ్యవస్యంతి = ఇచ్ఛింపరు. ధర్మః = ధర్మము; ముఖ్యః (అధ్యాహృతము) = ముఖ్యము.

రావణుఁడా ! శిష్టులగు రాజులు, శాస్త్రనిషిద్ధమయిన ధర్మమునుగాని యర్థమునుగాని కామమునుగాని, యెంతమాత్రముకోరరు; కావున, నీవు, ధర్మంబునప్పకుము.

అని, తాత్పర్యము.

రాజా ధర్మస్య కామస్య ద్రవ్యాణాం చోత్తమో నిధిః. ౯

ధర్మ శ్శుభంవా పాపంవా రాజమూలం ప్రవర్తతే

టీక॥ రాజా = రాజు; ధర్మస్య = ధర్మమునకును; కామస్య = కామమునకు; ద్రవ్యాణాం = అర్థములకును ; ఉత్తమః = శ్రేష్ఠమయిన; నిధిః = బొక్కసము. ధర్మః = ధర్మముగాని ; శుభంవా = పుణ్యముగాని; పాపంవా = పాపముగాని; రాజమూలం = రాజుమూలముగాఁగల్గునట్లు; ప్రవర్తతే = ప్రవర్తించుచున్నది.

రాజు, ధర్మమునకును గామమునకునుఅర్థమునకునుమూలము ; రాజు ధర్మమునాచరించిన, జనులునుధర్మమునాచరింతురు; రాజుపాపము , నాచరించిన జనులును బాపమునాచరింతురు; కావునరాజవగునీవు ధర్మముదప్పరాదు. అని, తాత్పర్యము.

పాపస్వభావ శ్చపలః కథం త్వం రక్షసాంవర.. ౧౦

ఐశ్వర్య మభిసంప్రాప్తో విమానమివ దుష్కృతిః

టీక॥ రక్షసాం = రాక్షసులలో; వర = శ్రేష్ఠుఁడవగు రావణుఁడా! పాపస్వ

స ౫౦

భావః = పాపమెస్వభావముగాఁగల వాఁడవును; చపలః = చంచలుఁడవునగు; త్వం = నీవు; కథం = ఎట్లు; ఐశ్వర్యం = ఐశ్వర్యమును; దుష్కృతిః = పాపముగల వాఁడవు; విమానమివ = విమానమునువలె; అభిసంప్రాప్తః = పొందినావు?

రాక్షసశ్రేష్ఠుఁడవగు రావణుఁడా! పాపస్వభావుఁడవు విషయలోలుఁడవునగు నీవు, పాపిష్ఠునకు దేవవిమానము లబ్ధమయినట్లు, ఈ మైశ్వర్యమెట్లులబ్ధమయినది? ఇఁక శీఘ్రమున నశింపఁగలదు. అని, తాత్పర్యము.

కామం స్వభావో యో యస్య నశక్యః పరిమార్జితుమ్. ౧౧
నహి దుష్టాత్మనా మార్య మావసత్యా లయే చిరమ్

టీక॥ యః = ఏది; యస్య = ఎవ్వనియొక్క; స్వభావః = స్వభావమో; సః (అధ్యాహృతము) = అది; పరిమార్జితుం = పోఁగొట్టుటకు; నశక్యః = అలవిగాదు. కామం = వాస్తవమె. దుష్టాత్మనాం = దుష్టస్వభావులయొక్క; ఆలయే = గృహమునందు; ఆర్యా = సంపద; చిరం = బహుకాలము; నావసతిహి = ఉండదుగదా!

వారివారిస్వభావమును పోఁగొట్టుట కెంతమాత్రము శక్యము కాదు; అయితే, దుష్టాత్ములయింట నైశ్వర్యము చిరకాలముండఁజాలదు; శీఘ్రముగనె నశించును. అని, తాత్పర్యము.

విషయే వా పురే వా తే యదా రామో మహాబలః. ౧౨
నాపరాధ్యతి ధర్మాత్మా కథం తస్యాపరాధ్యసి

టీక॥ యదా = ఎప్పుడు; మహాబలః = అధికమయినబలముగల; ధర్మాత్మా = ధర్మస్వభావుఁడగు; రామః = రాముఁడు; తే = నీయొక్క; విషయే వా = దేశమునందుఁగాని; పురే వా = పట్టణమునందుఁగాని; నాపరాధ్యతి = అపరాధముసేయకున్నాఁడో; తదా (అధ్యాహృతము) = అప్పుడు; కథం = ఎట్లు; తస్య = అతనికి; అపరాధ్యసి = అపరాధముచేసెదవు?

మహాబలశాలియు ధర్మాత్ముండునగు రాముండు, నీరాజ్యంబునందుఁగాని, పట్టణమునందుఁగాని, యేవిధమయినయపరాధమును జేయకుండునప్పుడు,

నీవేలయితని కపరాధముగావించెదవు? అని, తాత్పర్యము.

యది శూర్పణఖా హేతో ర్జనస్థానగతః ఖరః. ౧౩
అతివృత్తో హతః పూర్వం రామేణా క్లిష్టకర్మణా
అత్ర బ్రూహి యథాతత్త్వం కో రామస్య వ్యతిక్రమః. ౧౪
యస్య త్వం లోకనాథస్య భార్యాం హృత్వా గమిష్యసి

టీక॥ అక్లిష్టకర్మణా=దుఃఖకరముకానికార్యముగల; రామేణ=రామునిచేత; శూర్పణఖాహేతోః=శూర్పణఖనిమిత్తమయి; అతివృత్తః=అతిప్రసంగముచేసిన; జనస్థానగతః=జనస్థానముసుబొందిన; ఖరః=ఖరుఁడు; పూర్వం=మున్ను; హతో యది=చంపఁబడెనేని; త్వం=నీవు; లోకనాథస్య=లోకేశ్వరుఁడగు; యస్య=ఏరామునియొక్క; భార్యాం=భార్యను; హృత్వా=అపహరించుకొని; గమిష్యసి=పోవుచున్నావో; తస్య(అధ్యాహృతము)=ఆ; రామస్య=రామునియొక్క; వ్యతిక్రమః=అపచారము; కః=ఏది? అత్ర=ఈవిషయమునందు; యథాతత్త్వం=యథార్థముగా; బ్రూహి=చెప్పుము.

ఎవ్వరికిని దుఃఖముగలిగింపని రాముఁడు, మున్ను శూర్పణఖనిమిత్తమయి యధికప్రసంగముగావించిన ఖరునివధించినాఁడు; అందుకు నేను రాముని భార్యనపహరించుకొని పోయెదనని చెప్పదువు కాఁబోలు; ఈవిషయమునందు, రామునితప్పేమియున్నది; నీవు యథార్థముగాఁజెప్పుము. అని, తాత్పర్యము.

క్షిప్రం విసృజ వైదేహీం మా త్వా ఘోరేణ చక్షుషా. ౧౫
దహే ద్దహనభూతేన వృత్ర మింద్రాశనిర్యథా

టీక॥ క్షిప్రం=శీఘ్రముగా; వైదేహీం=సీతను; విసృజ=విడువుము. రామః(అధ్యాహృతము) రాముఁడు; ఘోరేణ=భయంకరమయిన; దహనభూతేన=అగ్నిమాత్రమయిన; చక్షుషా=నేత్రముచేత; త్వా=నిన్ను; ఇంద్రాశనిః=ఇంద్రునివజ్రాయుధము; వృత్రం యథా=వృత్రాసురునివలె; మా దహేత్=దహింపకుండుఁగాక.

సీతాదేవిని శీఘ్రముగా విడువుము;

లేని మెడఁ గోపముతోఁగూడినభయం
కకారంబగు రా రాముని నేత్రమునిప్పులు
గ్రక్కుచు, నింద్రునివజ్రాయుధమువ్ర
తునివధించినట్లునిన్నుదహించును.
అని, తాత్పర్యము.

సర్ప మాశీవిషం బద్ధ్వా వస్త్రాంతే నావబుధ్యసే. ౧౬

టీక॥ఆశీవిషం= కోఱలయందువిష
ముగల; సర్పం= పామును; వస్త్రాంతే=కొంగునందు; బధ్వా= కట్టుకొని;
నావబుధ్యసే= తెలియకున్నావు.

మహావిషంబగుసర్పమును కొంగు
నంగట్టుకొని , యేమియుఁ దెలియకు
న్నావు. అని, తాత్పర్యము.

గ్రీవాయాం ప్రతిసక్తం చ కాలపాశం న పశ్యసి

టీక॥గ్రీవాయాం= కంఠమునందు;
ప్రతిసక్తం=తగిలియున్న; కాలపాశం
చ=యమునిపాశమును; నపశ్యసి= చూ
డకున్నావు.

నీకంఠమునకుఁబ్రాణహరంబగు కా
లపాశంబు తగులుకొని యుండుటను
గూడఁజూచుకొనకున్నావు.
అని, తాత్పర్యము.

స భార స్సౌమ్య భర్తవ్యో యో నరం నావసాదయేత్. ౧౭
త దన్నమపి భోక్తవ్యం జీర్యతే యదనామయమ్

టీక॥సౌమ్య=తిన్ననివాఁడవగు రా
వణుఁడా! యః=ఏది; నరం = మనుష్యు
ని; నావసాదయేత్=నశింపఁజేయదో;
సః=ఆ; భారః=బరువు ; భర్తవ్యః=
మోయఁబడవలసినది. యత్ =ఏది; అ
నామయం=రోగములేనట్లుగా ; జీర్య
తే=జీర్ణమగునో; తత్ = ఆ; అన్నమ
పి=అన్నమె; భోక్తవ్యం = భుజింపఁ
బడవలసినది.

సౌమ్యుఁడా ! దేనిమోసినమనిషికి
నుపాధిగలుగదో ఆబరువును మోయ
వలయును; ఏదిరోగమేమియుఁగలిగిం
పకసుఖముగాజీర్ణమగునో , ఆయ
న్నమునుభుజింపవలయును; ఆలోచిం
చుము. అని, తాత్పర్యము.

స ౫౦

యత్కృత్వా నభవే ద్ధర్మో నకీర్తి ర్నయశో భువి. ౧౮
శరీరస్య భవే త్ఖేదః కస్తత్కర్మ సమాచరేత్

టీక॥యత్= ఏకార్యమును ; కృత్వా=చేసి;ధర్మః=ధర్మము; నభవేత్=కలుగదో;భువి= భూమియందు; కీర్తిః=ఐశ్వర్యమువలనగలుగ కీర్తిగాని;న=కలుగదో; యశః = భోగాదులచేఁగలిగినకీర్తిగాని;న = కలుగదో; శరీరస్య=దేహమునకు;ఖేదః = దుఃఖము;భవేత్=కలుగనో;తత్ = ఆ; కర్మ=కర్మమును;కః=ఎవ్వఁడు; సమాచరేత్=చేయును?

ఏనిచేసినచో,ధర్మముగానికీర్తిగాని కలుగదో, దేహమునకుదుఃఖమమాత్రము కలుగునో,అట్టికార్యము నెవ్వఁడు సేయును? అని,తాత్పర్యము.

షష్టి ర్వర్షసహస్రాణి మమ జాతస్య రావణ. ౧౯
పిత్ర్యపైతామహం రాజ్యం యథా వదనుతిష్ఠతః

టీక॥రావణ=రావణుఁడా! జాతస్య = పుట్టినవాఁడను; పిత్ర్యపైతామహం= తండ్రితాతలవలనవచ్చిన;రాజ్యం=దొరతనమును; యథావత్=యథాక్రమముగా;అనుతిష్ఠతః=చేయుచున్నవాఁడనగు;మమ=నాకు;షష్టిః= అఱువది;వర్షసహస్రాణి= సంవత్సరములవేలు;అభవన్(అధ్యాహృతము)=అయినవి.

రావణుఁడా! నేనుబుట్టి,నాపిత్ర్యపైతామహమయిన గృధ్రరాజ్యంబుఁ గ్రమంబుగఁబరిపాలించుచు, నిప్పటికిఅఱువదివేలయేండ్లుగడపినాను.

అని,తాత్పర్యము.

వృద్ధోహం త్వం యువా ధన్వీ సశరః కవచీ రథీ. ౨౦
తథా ప్యాదాయ వైదేహీం కుశలీ న గమిష్యసి

టీక॥ అహం=నేను;వృద్ధః=ముసలివాఁడను.త్వం=నీవు;యువా= యౌవనముగలవాఁడవు.ధన్వీ= ధనుస్సుగలవాఁడవు.సశరః=బాణములతోఁగూడినవాఁడవు.కవచీ=కవచముగలవాఁడవు.రథీ = రథముగలవాఁడవు. తథాపి=అట్లయిన

ను; వై దేహీం=సీతను; ఆదాయ=తీసికొని; కుశలీ=క్షేమముగలవాఁడవై; నగమిష్యసి=పోఁజాలవు.

నేను మనుసలివాఁడను నిరాయుధుండను; నీవుయౌవనవంతుండవుధనుర్బాణంబులుదాల్చి కవచంబుఁదొడుగుకొని రథగతుండవైయున్నావు; అట్లయినను నిన్నుసీతందీసికొని క్షేమంబుగఁబోనివ్వను. అని, తాత్పర్యము.

న శక్త స్త్వం బలాద్ధర్తుం వైదేహీం మమ పశ్యతః. ౨౧
హేతుభి ర్న్యాయసంయుక్తై ర్ధ్రువాం వేదశ్రుతీమివ

టీక॥ మమ=నేను; పశ్యతః=చూచుచుండఁగా; త్వం=నీవు; వైదేహీం=సీతాదేవిని; న్యాయసంయుక్తైః=తర్కముతోఁగూడిన; హేతుభిః=కారణముల చేత; వేదశ్రుతీమివ(వేదశ్రుతిమివ)=వేదశ్రుతినివలె; బలాత్=బలాత్కారము వలన; హర్తుం=అపహరించుటకు; శక్తః=సమర్థుఁడవు; న=కావు.

తర్కముతోఁగూడినకారణముచేవేదముఖండింపనలవిగానట్లు, నేనుజూచుచుండఁగా, సీతాదేవిఁగొనిపోవ నీకెంతమాత్రమలవిగాదు.

అని, తాత్పర్యము.

యుద్ధ్యస్వ యది శూరోసి ముహూర్తం తిష్ఠ రావణ. ౨౨
శయిష్యసే హతో భూమౌ యథా పూర్వం ఖర స్తథా

టీక॥ రావణ= రావణుఁడా! శూరః=యుద్ధమునందుభయము లేనివాఁడవు; అసి యది=అగుదువేని; యుద్ధ్యస్వ=పోరుము. ముహూర్తం = స్వల్పకాలము; తిష్ఠ=నిలువుము. పూర్వం=మున్ను; ఖరః=ఖరుఁడు; యథా = ఎట్లో; తథా=అట్లు; హతః=చంపఁబడినవాఁడవై; భూమౌ = నేలయందు; శయిష్యసే=పరుండఁగలవు.

రావణుఁడా! శూరుండవగుదువేని, కొంచెముసేపునిలిచి యుద్ధముసేయుము; మున్నుఖరుండువలె, నీవును, హతుండవై నేలంబరుండెదు.

అని, తాత్పర్యము.

అసకృ త్సంయుగే యేన నిహతా దైత్యదానవాః. ౨౩

నచిరా చ్చీరవాసా స్త్వాం రామో యుధి వధిష్యతి

టీక॥ యేన=ఎవ్వనిచేత; అసకృత్ = పలుమారు; సంయుగే= యుద్ధమునందు; దైత్యదానవాః=దైత్యులునుదానవులును; నిహతాః=చంపఁబడినారో; సః(అధ్యాహృతము) = అట్టి; చీరవాసాః = నారచీరలేవస్త్రముగాఁగల; రామః=రాముఁడు; నచిరాత్= శీఘ్రమునసై; త్వాం=నిన్ను ; యుధి=యుద్ధమునందు; వధిష్యతి=చంపును.

ఎవ్వండు, యుద్ధంబునఁ బలుమా... దైత్యదానవులంజంపినాఁడో, అవఁ... లధరుండగురాముండు , శీఘ్ర...బు... నిన్నుయుద్ధంబునవధించివ్రచ్చును.

అని, తాత్పర్యము.

కిన్ను శక్యం మయాఽఽ హర్తుం గతౌ దూరం నృపాత్మజౌ. ౫౪
క్షిప్రం త్వం నశ్యసే నీచ తయో ర్భీతో నసంశయః

టీక॥ నీచ= నీచుండవగురావణుఁడా! నృపాత్మజౌ= రాచకొమరులగు రామలక్ష్మణులు; దూరం=దూరము; గతౌ=పోయినారు. మయా=నాచేత; ఆహర్తుం= తెచ్చుటకు; శక్యంకిన్ను= అలవియగునా? ఇతి(అధ్యాహృతము)= అని; త్వం=నీవు; తయోః= ఆరామలక్ష్మణులకు; భీతః = భయపడినవాఁడవై; క్షిప్రం=శీఘ్రముగా; నశ్యసే = అగపడకపోవుచున్నావు. సంశయః=సందేహము. న=లేదు.

నీచుఁడా! రామలక్ష్మణులుబహుదూరముపోయియున్నారు; నేనవారలనుశీఘ్రముగాఁబిలుచుకొని రాఁజాలనని, నీవు,వారలభయంబున, శీఘ్రమున, వారలకంటంబడకపోవలెనని పోవుచున్నావు; సందియములేదు.

అని, తాత్పర్యము.

నహి మే జీవమానస్య నయిష్యసి శుభా మిమామ్. ౫౫
సీతాం కమలపత్రాక్షీం రామస్య మహిషీం ప్రియామ్

టీక॥ మే=నేను; జీవమానస్య=బ్రతికియుండఁగా; కమలపత్రాక్షీం=తామరపూరేకులవంటికన్నులుగలదియు; రామస్య=రామునియొక్క; ప్రియాం=ప్రియురాలగు; మహిషీం= భార్యయును; శుభాం=మంగళరూపిణియునగు ; ఇ

మాం=ఈ; సీతాం=సీతను; నయ=వ్యసి హి=కొనిపోఁజాలవుగదా!

నేను బ్రతికియుండునంతవఱకు, నీవు, తామరపూరేకులవంటి విశాలనేత్రం బుగలదియు, రామునిప్రియభార్యయు, మంగళరూపిణియునగునీసీతాదేవింగొనిపోఁజాలవు. అని, తాత్పర్యము.

అవశ్యంతు మయా కార్యం ప్రియం తస్య మహాత్మనః. ౨౬
జీవితేనాపి రామస్య తథా దశరథస్యచ

టీక॥మయా = నాచేత; జీవితేనాపి=ప్రాణముచేనైనను; అవశ్యంతు=అవశ్యముగానే; మహాత్మనః= పూజ్యమయినమనస్సుగల; తస్య = ఆరామునకును; తథా=అట్లు; దశరథస్యచ = దశరథునకును; ప్రియం = సంతోషము; కార్యం=చేయఁదగినది.

నేనవశ్యము ప్రాణమువిడిచియయినను, మహాత్ముఁడగురామునకునుఅతనితండ్రియు నాస్నేహితుండునగు దశరథునకును బ్రియముసేయవలయును.

అని, తాత్పర్యము.

తిష్ఠతిష్ఠ దశగ్రీవ ముహూర్తం పశ్య రావణ. ౨౭
యుద్ధాతిథ్యం ప్రదాస్యామి యథాప్రాణం నిశాచర

టీక॥నిశాచర=రాక్షసుఁడవగు; దశగ్రీవ= పదికంఠములుగల; రావణ=రావణుఁడా! తిష్ఠతిష్ఠ=నిలునిలు, ముహూర్తం = కొంచెముసేపు; పశ్య= చూడుము. యథాప్రాణం=నాబలమునతిక్రమింపక; యుద్ధాతిథ్యం = యుద్ధరూపమయినయతిథిసత్కారమును; ప్రదాస్యామి=ఇచ్చెదను.

రావణుఁడా! నిలునిలు; కొంచెముసేపుచూడుము; నాబలముకొలఁదియుద్ధముగావించెదను. నిన్నెమియూరకపోనివ్వను అని, తాత్పర్యము.

వృంతాదివ ఫలం త్వాంతు పాతయేయం రథోత్తమాత్. ౨౮

టీక॥వృంతాత్= తొడిమనుండి; ఫలం=పండునువలె; త్వాంతు = నిన్ను ("తు" అనునది పాదపూరణార్థము); రథోత్తమాత్ = రథశ్రేష్ఠమునే

నుండి; పాతయేయం = పడఁద్రోసె దను.

తొడిమనుండి ఫలమును బడఁద్రో యునట్లు, నిన్నురథంబుననుండి నేలంబ డఁద్రోసెదను.అని,జటాయువు, రావ ణునితోఁజెప్పెను.అని,తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అరణ్యకాండే, పంచాశస్సర్గః.
ఇది , స్పష్టార్థము.

ఇది,పరమార్థచంద్రికాఖ్యాపంబగు,శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు,అరణ్యకాండపంచాశసర్గటీక,
ముగిసినది.

శ్రీః

ఏకపంచాశసర్గప్రారంభః.

ఇత్యుక్తస్య యథాన్యాయం రావణస్య జటాయుషా
క్రుద్ధస్యాగ్నినిభాస్సర్వా రేజు ర్వింశతిదృష్టయః. ౧

టీక॥ఇతి=ఇట్లు;జటాయుషా= జటాయువుచేత;యథాన్యాయం=న్యాయమునతిక్రమింపక;ఉక్తస్య= చెప్పఁబడినవాఁడును; క్రుద్ధస్య=కోపమునొందినవాఁడునగు;రావణస్య= రావణుని యొక్క;వింశతిదృష్టయః = ఇరువదికన్నులు;సర్వాః = అన్నియు; అగ్నినిభాః = నిప్పుతోసమానములయి; రేజుః=ప్రకాశించినవి.

ఇట్లుజటాయువు న్యాయమునవలంబించిచెప్పఁగానే,రావణునియొక్క, ఇరువదికన్నులనిప్పులురాలఁ,బరమకుపితుండయ్యెను అని, తాత్పర్యము.

సంరక్తనయనః కోపాత్తప్తకాంచనకుండలః
రాక్షసేంద్రోభిదుద్రావ పతగేంద్ర మమర్షణః. ౨

టీక॥తప్తకాంచనకుండలః = కాఁచఁబడినబంగారుపోఁగులుగలవాఁడైన; రాక్షసేంద్రః=రాక్షసరాజుఁడగురావణుఁడు, అమర్షణః= కోపమునొందినవాఁడై; కోపాత్=కోపమువలన; సంరక్తనయనః= మిక్కిలియెఱ్ఱనికన్నులుగలవాఁడై; పతగేంద్రం=పక్షిరాజయినజటాయువును; అభిదుద్రావ = తఱిమెను.

మంచిబంగారు పోఁగులు ధరించియున్నరాక్షసరాజురావణుండు, కుపితుండై, కోపంబునఁగన్నులెఱ్ఱఁదనంబుగదురఁ, బక్షిరాజుండగుజటాయువుపైకడరెను. అని, తాత్పర్యము.

స సంప్రహార స్తుముల స్తయో స్తస్మి న్మహావనే
బభూవ వాతోద్ధతయో ర్మేఘయో గగనే యథా. ౩

టీక॥తస్మిన్=ఆ; మహావనే = గొప్పయడవియందు ; తయోః=ఆరావణజటాయువులయొక్క; తుములః = దొమ్మియయిన; సంప్రహారః=యుద్ధము; గగనే = ఆకాశమునందు; వాతోద్ధతయోః=గాలిచేనెగురఁగొట్టఁబడిన; మేఘయోః=మేఘములయొక్క; సంప్రహారః(అధ్యాహృతము) యథా= యుద్ధమువలె; బభూవ=ఉండినది.

ఆకాశంబున, మేఘంబులు, వాతోద్ధతంబులయియొండొంటిం దాఁకునట్లు, అమ్మహావనంబునందు, ఆరావణజటాయువులు, ఒండొరులందాఁకి, తుములంబుగాఁబోరిరి. అని, తాత్పర్యము.

తద్బభూవా ద్భుతం యుద్ధం గృధ్రరాక్షసయో స్తదా
సపక్షయో ర్మాల్యవతో ర్మహాపర్వతయో రివ. ౪

టీక॥తదా=అప్పుడు; గృధ్రరాక్షసయోః = జటాయురావణులయొక్క; తత్=ఆ; యుద్ధం=యుద్ధము ; సపక్షయోః=ఱెక్కలతోఁగూడిన; మాల్యవతోః=మాల్యవంతములను; మహాపర్వతయోః=పెద్దపర్వతములయొక్క; యుద్ధం(అధ్యాహృతము)ఇవ=యుద్ధమువలె; అద్భుతం=ఆశ్చర్యకరము; బభూవ=ఆయెను.

అప్పుడు, మాల్యవంతములనుపేరుగలపర్వతములు రెండును, ఱెక్కలనొందిపోరునట్లు, ఆజటాయురావణులు, ఆ

శ్చర్యకరంబుగాఁబోరిరి. అని, తాత్పర్యము.

తతో నాళీకనారాచై స్తీక్ష్ణాగ్రైశ్చ వికర్ణిభిః
అభ్యవర్ష న్మహాఘోరై ర్గృధ్రరాజం మహాబలః. ౫

టీక॥ తతః=అంత; మహాబలః=అధికమయినబలముగలరావణుఁడు; మహాఘోరైః=మిక్కిలిభయంకరములైన; నాళీకనారాచైః= నాళీకబాణములచేతనుఇనుపబాణములచేత; తీక్ష్ణాగ్రైః=కఱకులయినకొనలుగల; వికర్ణిభిశ్చ=కర్ణాకారబాణములచేతను; గృధ్రరాజం=జటాయువునుగూర్చి; అభ్యవర్షత్=కురిపించెను.

అంత, మహాబలుఁడగు రావణుండు, గృధ్రరాజుండగు జటాయువుపై, తీక్ష్ణంబులును మహాభయంకరములు నగు నానావిధబాణంబులం బ్రయోగించెను. అని, తాత్పర్యము.

స తాని శరజాలాని గృధ్రః పత్రరథేశ్వరః
జటాయుః ప్రతిజగ్రాహ రావణాస్త్రాణి సంయుగే. ౬

టీక॥ గృధ్రః=గద్దయును; పత్రరథేశ్వరః=పక్షిరాజునైన; సః=ఆ; జటాయుః=జటాయువు; సంయుగే= యుద్ధమునందు; రావణాస్త్రాణి= రావణునిచేఁబ్రయోగింపఁబడిన యాయుధములయిన; తాని=ఆ; శరజాలాని= బాణసమూహములను; ప్రతిజగ్రాహ = పుచ్చుకొనెను.

పక్షిరాజుండగుజటాయువు, రావణుండుప్రయోగించిన యాబాణంబులనన్నింటిని, సరకుసేయకసహించెను. అని, తాత్పర్యము.

తస్య తీక్ష్ణనఖాభ్యాంతు చరణాభ్యాం మహాబలః
చకార బహుధా గాత్రే వ్రణా న్పతగసత్తమః.

టీక॥ మహాబలః= అధికమయినబలముగల; పతగసత్తమః=పక్షిశ్రేష్ఠుఁడైన జటాయువు; తీక్ష్ణనఖాభ్యాం = కఱకులయినగోళ్లుగల; చరణాభ్యాంతు=

పాదముల చేత నై; తస్య= ఆరావణుని యొక్క; గాత్రే= దేహమునందు ; బహుధా= పెక్కువిధములుగా ; వ్రణాన్=గాయములను; చకార = చేసెను.

మహాబలుండగు నాజటాయువు, కఱకుగోళ్లుగల చరణములతో గీచి, ఆరావణుని దేహమంతయుఁ బెక్కువ్రణములుగా నించెను. అని, తాత్పర్యము.

అథ క్రోధా ద్దశగ్రీవో జగ్రాహ దశ మార్గణాన్
మృత్యుదండ నిభాన్ ఘోరాన్ శత్రుమర్దనకాంక్షయా. ౮

టీక॥ అథ=అంత; దశగ్రీవః= రావణుఁడు; క్రోధాత్=కోపమువలన; శత్రుమర్దనకాంక్షయా=శత్రుమర్దించుటయందుఁగోరిక చేత ; మృత్యుదండనిభాన్=కాలదండములతో సమానములును; ఘోరాన్=భయంకరములునగు; దశ=పదియయిన; మార్గణాన్= బాణములను; జగ్రాహ=గ్రహించెను.

అంత, రావణుఁడు కోపంబు నొంది, జటాయువును నొప్పించు తలంపున, భయంకరంబులగు కాలదండములవంటి పదిబాణముల నెత్తెను.

అని, తాత్పర్యము.

స తై ర్బాణై ర్మహావీర్యః పూర్ణముక్తై రజిహ్మగైః
బిభేద నిశితై స్తీక్ష్ణైః గృధ్రం ఘోరై శ్శిలీముఖైః. ౯

టీక॥ మహావీర్యః= అధికమగు నపరాక్రమముగల; సః = ఆరావణుఁడు; పూర్ణముక్తైః=నిండుగావిడువఁబడినవియు; అజిహ్మగైః= వంకరలేకపోవునవియు; ఘోరైః=భయంకరములును; నిశితైః=సానఁబెట్టఁబడినవియు; తీక్ష్ణైః= కఱకులయినవియు ;శిలీముఖైః=ఉక్కుశలాకముఖమునందు గలవియునగు ; తైః=బాణముల చేత; గృధ్రం= జటాయువును; బిభేద=భేదించెను.

మహాపరాక్రమశాలియగు నారావణుండు , చక్కఁగా సానబెట్టఁబడినవియుఁ దీక్ష్ణములయియుండు నాబాణంబుల , నాకర్ణాంతము నాకర్షించి, జటాయువుపై నేసెను.

అని, తాత్పర్యము.

స ౫౧

స రాక్షసరథే పశ్యన్ జానకీం బాష్పలోచనామ్
అచింతయిత్వా తాన్ బాణాన్ రాక్షసం సమభిద్రవత్. ౧౦

టీక॥సః=ఆజటాయువు; రాక్షసరథే=రావణునిరథమునందు; బాష్పలోచనాం = కన్నీళ్లుకన్నులయందుఁగల; జానకీం=సీతాదేవిని; పశ్యన్= చూచుచు; తాన్=ఆ; బాణాన్ = బాణములను; అచింతయిత్వా=తలంపక ; రాక్షసం=రాక్షసుని; సమభిద్రవత్ (సమభ్యద్రవత్)=తఱిమెను.

ఆజటాయువు, నొచ్చియు, రావణునిరథంబునఁగన్నీళ్ళు గార్చుచున్న సీతాదేవిం జూచి, యాబాణంబులసరకుసేయక, మఱల రావణునిపైకడరెను. అని, తాత్పర్యము.

తతోఽస్య సశరం చాపం ముక్తామణివిభూషణమ్
చరణాభ్యాం మహాతేజా బభంజ పతగేశ్వరః. ౧౧

టీక॥తతః=అంత; మహాతేజాః= అధికమయినబలముగల; పతగేశ్వరః=పక్షిరాజుఁడగుజటాయువు; చరణాభ్యాం=పాదములచేత; సశరం=బాణములతోఁగూడిన; ముక్తామణివిభూషణం = ముత్తెములలంకారముగాఁగల; అస్య= ఈ రావణునియొక్క; చాపం = ధనస్సును; బభంజ=విఱిచెను.

అంత, మహాబలుండగు జటాయువు, రావణుని, ముక్తామణిభూషితంబును బాణసహితంబునగుధనస్సును, గాళ్లచే విఱిచివేసెను.
అని, తాత్పర్యము.

తతోఽన్యద్ధనురాదాయ రావణః క్రోధమూర్ఛితః
వవర్ష శరవర్షాణి శతశోఽథ సహస్రశః. ౧౨

టీక॥తతః=అంత; రావణః= రావణుఁడు; క్రోధమూర్ఛితః= కోపముచే వ్యాపింపఁజేయఁబడినవాఁడై; అన్యత్ =ఇతరమయిన; ధనుః= ధనుస్సును; ఆదాయ=తీసికొని; శతశః=నూఱునూఱులుగాను; అథ=ఇంకను; సహస్రశః=

వేనవేలు గాను; శరవర్షాణి= బాణవర్షములను; వవర్ష= కురిపించెను.

అంత, రావణుండు, పరమకుపితుండై, మఱియొకధనస్సుదీసికొని, జటాయువుమీద, నూఱునూఱు వేనవేలు గాను బాణంబులు గురిపించెను.

అని, తాత్పర్యము.

శరై రావారిత స్తస్య సంయుగే పతగేశ్వరః
కులాయ ముపసంప్రాప్తః పక్షీవ ప్రబభౌ తదా. ౧౩

టీక॥ తదా=అప్పుడు; సంయుగే= యుద్ధమునందు; పతగేశ్వరః=పక్షిరాజయినజటాయువు; తస్య= ఆరావణునియొక్క; శరైః=బాణములచే; ఆవారితః=చుట్టఁబడినవాఁడై; కులాయం = గూఁడును; ఉపసంప్రాప్తః=పొందిన; పక్షీవ=పక్షివలె; ప్రబభౌ = ప్రకాశించెను,

అప్పుడు, యుద్ధంబున, జటాయువు రావణప్రయుక్తంబులగు బాణంబులచేఁ గప్పఁబడి, వానినడుమనున్నవాఁడై, గూటిలోనుండు పక్షివలెనొప్పెను.

అని, తాత్పర్యము.

స తాని శరవర్షాణి పక్షాభ్యాంచ విధూయచ
చరణాభ్యాం మహాతేజా బభంజాస్య మహద్ధనుః. ౧౪

టీక॥ మహాతేజాః=అధికమయినపరాక్రమముగల; సః=ఆజటాయువు ; తాని=ఆ; శరవర్షాణి=బాణవర్షములను; పక్షాభ్యాం=ఱెక్కలచేతను ; విధూయచ = తట్టివేసియు; చరణాభ్యాం=పాదములచేత; అస్య=ఈరావణునియొక్క; మహత్=గొప్పదగు ; ధనుః=ధనుస్సును; బభంజ=విఱిచెను.

మహాతేజుండగు జటాయువు, ఆబాణంబులనన్నియు ఱెక్కలచేఁదట్టివేసి, పాదములచే, నారావణుని మహాధనుస్సునుద్రుంచెను. అని, తాత్పర్యము.

తచ్చాగ్నిసదృశం దీప్తం రావణస్య శరావరమ్
పక్షాభ్యాం స మహావీర్యో వ్యాధునో త్పతగేశ్వరః. ౧౫

స ౫౧

టీక॥ మహావీర్యః = అధికమయినపరాక్రమముగల; సః = ఆ; పతగేశ్వరః = పక్షిరాజుజటాయువు; అగ్నిసదృశం = నిప్పుతోసమానమయినదియు; దీప్తం = ప్రకాశించుచున్నదియునగు; తత్ = ఆ, రావణస్య = రావణునియొక్క; శరావరంచ = కవచమునుగూడ; పక్షాభ్యాం = ఱెక్కలచేత; వ్యధునోత్ = ఎగురఁగొట్టెను.

మహాపరాక్రమశాలియగు నాజటాయువు, నిప్పవలె వెలుఁగుచుండిన రావణునికవచంబును, ఱెక్కలచేఁ జిన్నమయి, రాలిపోవునట్లుగావించెను. అని, తాత్పర్యము.

కాంచనోరశ్ఛదాన్ దివ్యాన్ పిశాచవదనాన్ ఖరాన్
తాంశ్చాస్య జవసంపన్నాన్ జఘాన సమరే బలీ. ౧౬

టీక॥ బలీ = అధికమయినబలముగల జటాయువు; సమరే = యుద్ధమునందు; కాంచనోరశ్ఛదాన్ = బంగారుకవచములుగలవియు; దివ్యాన్ = శ్రేష్ఠములును; పిశాచవదనాన్ = పిశాచములముఖములవంటి ముఖము గలవియునగు; తాన్ = ఆ; అస్య = ఈరావణునియొక్క; ఖరాంశ్చాపి = గాడిదలనుగూడ; జఘాన = చంపెను.

బలవంతుండగు జటాయువు, యుద్ధంబున, బంగారుకవచంబులు వేసినదియు దివ్యంబులును బిశాచముఖంబులునగు నారావణుని ఖరంబులనుఁగూడ, వధించెను. అని, తాత్పర్యము.

వరం త్రివేణుసంపన్నం కామగం పావకార్చిషమ్
మణిహేమవిచిత్రాంగం బభంజచ మహారథమ్. ౧౭

టీక॥ వరం = శ్రేష్ఠమును; త్రివేణుసంపన్నం = నొగతోఁగూడినదియు; కామగం = యథేచ్ఛముగాఁబోవునదియు; పావకార్చిషం = అగ్నియొక్కకాంతివంటికాంతిగలదియు; మణిహేమవిచిత్రాంగం = రత్నముచేతను బంగారముచేతనువిచిత్రములయినచక్రములుగలవియునగు; మహారథంచ = గొప్పరథమునుగూడ; బభంజ = విఱిచెను.

ఉత్తమంబునుదృఢమయిననొగతోఁగూడినదియుఁగామగమనంబునుఅగ్నివలెవెలుఁగుచున్నదియు బంగారుచేతను

రత్నములచేత నలంకరింపఁబడిన చక్రములు గలదియునగుసలతని మహారథంబును గూడ, జటాయువు విఱిచెను.

అని, తాత్పర్యము.

పూర్ణచంద్రప్రతీకాశం ఛత్రంచ వ్యజనైస్సహ
పాతయామాస వేగేన గ్రాహిభీ రాక్షసైస్సహ. ౧౮

టీక॥ సః (అధ్యాహృతము) = ఆజటాయువు; వేగేన = వేగముచేత; పూర్ణచంద్రప్రతీకాశం = నిండుచంద్రునితో సమానము అయిన; ఛత్రంచ = గొడుగును; వ్యజనైస్సహ = వింజామరలతోఁగూడ; గ్రాహిభిః = పట్టుకొనియున్న; రాక్షసైస్సహ = రాక్షసులతోఁగూడ; పాతయామాస = పడవేసెను.

ఆజటాయువు, నిండుచంద్రునితో సమానమైన ఛత్రంబును వింజామరలను వానిఁబట్టుకొనియుండిన రాక్షసులనుం బడవేసెను. అని, తాత్పర్యము.

సారథే శ్చాస్య వేగేన తుండేనైవ మహచ్ఛిరః
పున ర్వ్యపాహర చ్ఛ్రీమాన్ పక్షిరాజో మహాబలః. ౧౯

టీక॥ పునః = మఱల; శ్రీమాన్ = అధికమయినకాంతిగల; మహాబలః = అధికమయినబలముగల; పక్షిరాజః = పక్షులకుఱేఁడయిన జటాయువు; వేగేన = వేగముచేత; తుండేనైవ = ముక్కుచేతనే; అస్య = ఆరావణునియొక్క; సారథేః = సారథియొక్క; మహత్ = గొప్పదగు; శిరః = శిరస్సును; వ్యపాహరత్ = ఖండించెను.

శ్రీమంతుండును మహాబలశాలియు నగునాజటాయువు, అంతనూరకుండక, వేగంబున, నారావణుని సారథియొక్క నిడుపాటి భయంకరమయిన శిరస్సును, ముక్కుతోఁద్రుంచివేసెను.

అని, తాత్పర్యము.

స భగ్నధన్వా విరథో హతాశ్వో హతసారథిః
అంకేనాదాయ వైదేహీం పపాత భువి రావణః. ౨౦

టీక॥ సః = ఆ, రావణః = రావణుఁడు; భగ్నధన్వా = విఱిగినధనుస్సుగల

వాఁడై; విరథః = పోయినరథముగలవాఁడై; హతాశ్వః= చంపఁబడినగుఱ్ఱములుగలవాఁడై; హతసారథిః= చంపఁబడినసారథిగలవాఁడై; వైదేహీం= సీతాదేవిని; అంకేన=తొడచేత;ఆదాయ=తీసికొని; భువి=భూమియందు ; పపాత=పడెను.

ఆరావణుండు , భగ్నధనుష్కుండై,విరథుండై,చంపఁబడినగుఱ్ఱములను సారథియునుగలవాఁడై , సీతాదేవిని చంకనెత్తుకొని , నేలకుదుమికెను. అని, తాత్పర్యము.

దృష్ట్వా నిపతితం భూమౌ రావణం భగ్నవాహనమ్
సాధుసాధ్వితి భూతాని గృధ్రరాజ మపూజయన్. ౨౧

టీక॥ భూతాని=భూతంబులు; భగ్నవాహనం=విఱిగినరథముగలవాఁడును; భూమౌ = నేలయందు ; నిపతితం=పడినవాఁడునగు; రావణం= రావణుని ; దృష్ట్వా=చూచి; సాధుసాధ్వితి=బళేబళేయని; గృధ్రరాజం=జటాయువును;అపూజయన్= పూజించిరి.

రావణుండు విరథుండై నేలపై నుండుటను జూచి, సమస్తభూతంబులు నజటాయువుఁ బూజించిరి. అని, తాత్పర్యము.

పరిశ్రాంతంతు తం దృష్ట్వా జరయా పక్షియూథపమ్
ఉత్పపాత పునర్హృష్టో మైథిలీం గృహ్య రావణః. ౨౨

టీ॥ పక్షియూథపం=పక్షిరాజయిన; తం=ఆజటాయువును; జరయా=ముసలితనముచేత, పరిశ్రాంతం=అలసినవానిగా; దృష్ట్వాతు=చూచినంతనే; రావణః=రావణుఁడు; పునః = మఱల; హృష్టః=సంతోషించినవాఁడై; మైథిలీం=సీతాదేవిని; గృహ్య(గృహీత్వా=ఎత్తుకొని; ఉత్పపాత=ఎగిరెను.

అంత, పక్షిరాజుండగుజటాయువు ముసలితనంబుననలసి యుండుటంజూచి, సంతోషంబున, రావణుండు, మఱల సీతాదేవినెత్తుకొని, ఆకాశంబుననుద్గమించెను. అని, తాత్పర్యము.

తం ప్రహృష్టం నిధాయాంకే గచ్ఛంతం జనకాత్మజామ్ .

గృధ్రరాజ స్సముత్పత్య సమభిద్రుత్య రావణమ్. ౨౩
సమావార్య మహాతేజా జటాయు రిద మబ్రవీత్

టీక॥ మహాతేజాః = అధికమయినపరాక్రమముగలః; గృధ్రరాజః = గద్దలకుఁ బ్రభువైన; జటాయుః = జటాయువు; ప్రహృష్టం = సంతోషించినవాఁడును; జనకాత్మజాం = సీతాదేవిని; అంకే = తొడయందు; ఆధాయ = ఉంచుకొని; గచ్ఛంతం = పోవుచున్నవాఁడౌనగు; తం = ఆ; రావణం = రావణుని; సముత్పత్య = ఎగిరి; అభిద్రుత్య = ఎదిరి; సమావార్య = అడ్డగించి; ఇదం = ఈమాటను; అబ్రవీత్ = చెప్పెను.

మహాతేజుండగుజటాయువు, అట్లు, రావణుండు మతన్నుసరకుసేయక సంతోషంబున సీతను చంకనెత్తుకొనిపోవుచుండుటను జూచి, ఎగిరి, రావణుందఱుము కొనిపోయి, యతని నడ్డగించి, యతనితో నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

వజ్రసంస్పర్శ బాణస్య భార్యాం రామస్య రావణ. ౨౪
అల్పబుద్ధే హరస్యేనాం వధాయ ఖలు రక్షసామ్

టీక॥ అల్పబుద్ధే = కొంచెపుబుద్ధిగల; రావణ = రావణుఁడా! వజ్రసంస్పర్శ బాణస్య = వజ్రముయొక్క తాఁకుటవంటి తాఁకుటగలబాణములుగల; రామస్య = రామునియొక్క; ఏనాం = ఈ; భార్యాం = భార్యను; రక్షసాం = రాక్షసులయొక్క; వధాయ = చావుకొఱకు; హరసిఖలు = హరించుచున్నావుగదా!

అల్పబుద్ధివగు రావణుఁడా! నీవు రాక్షసవధార్థమయియె, వజ్రసమానములగు బాణములుగల రామునిభార్యను, అపహరించుకొనిపోవుచున్నావుగదా! అని, తాత్పర్యము.

సమిత్రబంధు స్సామాత్య స్సబల స్సపరిచ్ఛదః. ౨౫
విషపానం పిబస్యేత త్పిపాసిత ఇవోదకమ్

టీక॥ త్వం (అధ్యాహృతము) = నీవు; పిపాసితః = దప్పిగొన్నవాఁడు;

దకమివ = జలమునువలె; సమిత్రబంధుః=స్నేహితులతోను బంధువులతోను గూడినవాఁడవై; సామాత్యః=మంత్రులతోఁగూడినవాఁడవై; సబలః=సైన్యముతోఁగూడినవాఁడవై; సపరిచ్ఛదః=పరివారములతోఁగూడినవాఁడవై; ఏతత్ = ఈ; విషపానం= విషముతోఁగూడినజలమును; పిబసి=త్రాగెదవు.

నీవు, దప్పిగొన్నవాఁడుజలమును ద్రాఁగునట్లు, సీతాహరణరూపమగునీ విషముఁ ద్రాఁగుచున్నావు; ఇదినీకుమాత్రమే గాదు; నీస్నేహితులకును బంధువులకును మంత్రులకును సైన్యమునకును బరివారములకును అదివఱకును నాశమునుగలిగించును. అని, తాత్పర్యము.

అనుబంధ మజానంతః కర్మణా మవిచక్షణాః. ౨౬
శీఘ్రమేవ వినశ్యంతి యథా త్వం వినశిష్యసి

టీక॥అవిచక్షణాః=పండితులుగానివారలు; కర్మణాం = కార్యములయొక్క; అనుబంధం = ఫలమును; అజానంతః= తెలియనివారలయి; యథా = ఎట్లు; త్వం=నీవు; వినశిష్యసి= నశింపఁగలవో; తథా(అధ్యాహృతము)=అట్లు; శీఘ్రమేవ=శీఘ్రముగనే, వినశ్యంతి= నశింపఁగలరు.

మూఢులగువారలు, తాముచేయు కార్యములఫలముఁ దెలిసికొననివారలయి, నీయట్లు, శీఘ్రంబున, వినాశంబునొందుదురు. అని, తాత్పర్యము.

బద్ధ స్త్వం కాలపాశేన క్వగత స్తస్య మోక్ష్యసే. ౨౭
వధాయ బడిశం గృహ్య సామిషం జలజో యథా

టీక॥త్వం=నీవు; కాలపాశేన=మృత్యుపాశముచేత; వధాయ= చంపుటకొఱకు; బద్ధః = కట్టఁబడినావు; సామిషం=మాంసముతోఁగూడిన; బడిశం= గాలమును; గృహ్య(గృహీత్వా)= గ్రహించి; జలజో యథా = మత్స్యమువలె; క్వ=ఎచ్చటికి; గతః=పోయినవాఁడవై; తస్య(తస్మాత్)= దానివలన; మోక్ష్యసే=విడువఁబడఁగలవు.

నీవు, కాలపాశముచేవధమునకు బద్ధుఁడవయియున్నావు; మాంసముగ్రుచ్చివేసినగాలమును మ్రింగిన మత్స్యము

కైవడి, నీవెందుఁబోయినను, అవినిన్నువదలదు. అని, తాత్పర్యము.

నహి జాతు దురాధర్షౌ కాకుత్స్థౌ తవ రావణ. ౨౮
ధర్షణం చాశ్రమస్యాస్య క్షమిష్యేతే తు రాఘవౌ

టీక॥ రావణ=రావణుఁడా! దురాధర్షౌ=ఎదిరింపనలవిగాని ; కాకుత్స్థౌ = కకుత్స్థవంశమునందుఁబుట్టిన; రాఘవౌ=రామలక్ష్మణులు; తవ = నీయొక్క; అస్య=ఈ; ఆశ్రమస్య=ఆశ్రమముయొక్క ; ధర్షణం చ తు = అవమానపఱచుటనుమాత్రము; జాతు= ఒకానొకప్పుడును; నక్షమిష్యేతేహి = క్షమింపరుగదా!

రావణుఁడా! దుర్ధర్షులగురామలక్ష్మణులు, నీవిప్పుడుగావించిన మహాపరాధము నెంతమాత్రమును, క్షమింపరు; నిన్ను వధింతురు.

అని, తాత్పర్యము.

యథా త్వయా కృతం కర్మ భీరుణా లోకగర్హితమ్. ౨౯
తస్కరాచరితో మార్గో నైష వీరనిషేవితః

టీక॥ యథా=ఏట్లు; భీరుణా= పిఱికివయిన; త్వయా=నీచేత; లోకగర్హితం=లోకములచేనిందింపఁబడిన ; కర్మ=కార్యము; కృతం = చేయఁబడినదో; అయం(అధ్యాహృతము)=ఇది ; తస్కరాచరితః = దొంగలచేనాచరింపఁబడిన; మార్గః=మార్గము. వీరనిషేవితః=వీరులచే సేవింపఁబడినది. నైవ=కానేకాదు.

నీవిప్పుడు, పిఱికివై; ఎవరులేనప్పుడు లోకనిందితమగు నీకార్యముచేసినావే, ఇది దొంగలుచేయునది; వీరులెంతమాత్రము, ఇట్లు చేయరు.

అని, తాత్పర్యము.

యుధ్యస్వ యది శూరోఽసి ముహూర్తం తిష్ఠ రావణ. ౩౦
శయిష్యసే హతో భూమౌ యథా భ్రాతా ఖరస్తథా

టీక॥ రావణ=రావణుఁడా! శూరః = యుద్ధమునందుభయములేనివాఁ

డవు; అసి యది = అగుదువేని; యుధ్యస్వ = పోరుము. ముహూర్తం = కొంచెము సేపు; తిష్ఠ = నిలువుము. భ్రాతా = తమ్ముడయిన; ఖరః = ఖరుఁడు; యథా = ఎట్లో; తథా = అట్లు; హతః = చంపఁబడినవాఁడవై; భూమౌ = నేలయందు; శయిష్యసే = పరుండగలవు.

రావణుఁడా! నీవు శూరుండవగుదువేని, రామలక్ష్మణులు వచ్చువఱకుఁ గొంచెము సేపు నిలిచియుండి, యుద్ధముఁ గావింపుము; అప్పుడు, నీతమ్ముఁడు ఖరుని యట్లు, నిహతుండవై నేలమీఁద శయనింతువు. అని, తాత్పర్యము.

పరేతకాలే పురుషో యత్కర్మ ప్రతిపద్యతే. ౩౧
వినాశా యాత్మనోఽధర్మ్యం ప్రతిపన్నోఽసి కర్మ తత్

టీక॥ పురుషః = పురుషుఁడు; పరేతకాలే = మృత్యుకాలమునందు; ఆత్మనః = తనయొక్క; వినాశాయ = చావుకొఱకు; అధర్మ్యం = అధర్మముతోఁ గూడిన; యత్ = ఏ; కర్మ = కార్యమును; ప్రతిపద్యతే = పొందునో; తత్ = ఆ; కర్మ = కార్యమును; ప్రతిపన్నః = పొందినవాఁడవు; అసి = అగుచున్నావు.

మృత్యుసమయము వచ్చినప్పుడు, పురుషుఁడు, తనవినాశంబునకై, ఎట్టి యధర్మంబు గావించునో, నీవిప్పుడా యధర్మముఁ జేసినావు; నీకు మరణము సిద్ధము. అని, తాత్పర్యము.

పాపానుబంధో వై యస్య కర్మణః కర్మ కో ను తత్. ౩౨
కుర్వీత లోకాధిపతి స్స్వయంభూ ర్భగవానపి

టీక॥ యస్య = ఏ; కర్మణః = కార్యమునకు; పాపానుబంధః = పాపసంబంధమో ("వై" అనునది పాదపూరణార్థము); తత్ = ఆ; కర్మ = కార్యమును; లోకాధిపతిః = లోకములకుఁబ్రభువయిన; భగవాన్ = భగవంతుఁడయిన; స్వయంభూరపి = బ్రహ్మదేవుఁడైనను; కో ను = ఎవ్వఁడు; కుర్వీత = చేయును?

ఏకార్యము పాపము గలిగించునో, ఆ కార్యమును, సమస్తలోకాధీశ్వరుండును భగవంతుండు నగు బ్రహ్మదేవుఁడు

గూడఁజేయఁజాలఁడు. అని, జటాయువు, రావణునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవముక్త్వా శుభం వాక్యం జటాయుస్తస్య రక్షసః. ౩౩
నిపపాత భృశం పృష్ఠే దశగ్రీవస్య వీర్యవాన్

టీక॥వీర్యవాన్=అధికమయినపరాక్రమముగల; జటాయుః=జటాయువు; ఏవం=ఇట్లు; శుభం = మంగళకరమయిన; వాక్యం=మాటను; ఉక్త్వా=చెప్పి; తస్య=ఆ; రక్షసః=రాక్షసుఁడైన ; దశగ్రీవస్య=రావణునియొక్క ; పృష్ఠే=వీఁపునందు; భృశం=మిక్కిలియు; నిపపాత=వ్రాలెను.

మహా పరాక్రమశాలియగు జటాయువు , ఈప్రకారంబున ధర్మ్యంబగుమాటచెప్పి, యంత, నారావణుండు తనమాట వినకపాఱిపోవుటం జూచి , యతనివీఁపుపైకి వ్రాలెను.

అని, తాత్పర్యము.

తం గృహీత్వా నఖై స్తీక్ష్ణై ర్విదదార సమంతతః. ౩౪
అధిరూఢో గజారోహో యథా స్యా ద్దుష్టవారణమ్

టీక॥సః(అధ్యాహృతము) = ఆజటాయువు; తం=ఆరావణుని ; గృహీత్వా=తీసికొని; దుష్టవారణం=దుష్టమయిన యేనుఁగును; అధిరూఢః=ఎక్కినట్టి; గజారోహః=మావటీఁడు; యథా=ఎట్లు; స్యాత్ = అగునో; తథా(అధ్యాహృతము)=అట్లు; తీక్ష్ణైః = కఠినములయిన; నఖైః=గోళ్లచేత; సమంతతః=అంతటను; విదదార=గీఱెను.

మావటీఁడు, దుష్టగజము నారోహించి, అంకుశముచే దాని నానావిధంబులం బొడుచునట్లు, ఆజటాయువు, రావణు వీఁపుపైవ్రాలి, తీక్ష్ణములగు నఖములచే నానావిధంబులఁ గీఱెను.

అని, తాత్పర్యము.

విదదార నఖై రస్య తుండం పృష్ఠే సమర్పయన్. ౩౫
కేశాంశ్చోత్పాటయామాస నఖపక్షముఖాయుధః

వును; అపోథయత్ = కొట్టెను.

అంతట, గోపంబున రావణుండు, సీతను నేలనుంచి, పిడికిళ్ళచేతను బాదంబులచేతను జటాయువుం గుద్దెను.

అని, తాత్పర్యము.

తతో ముహూర్తం సంగ్రామో బభూవాతుల వీర్యయోః. ౪౧
రాక్షసానాంచ ముఖ్యస్య పక్షిణాం ప్రవరస్యచ

టీక॥ తతః = అంత; అతులవీర్యయోః = సరిలేని పరాక్రమముగల; రాక్షసానాం = రాక్షసులలోపల; ముఖ్యస్యచ = శ్రేష్ఠుడైన రావణునికిని; పక్షిణాం = పక్షులలో; ప్రవరస్యచ = శ్రేష్ఠుడయిన జటాయువునకును; సంగ్రామః = యుద్ధము; ముహూర్తం = కొంచెము సేపు; బభూవ = అయినది.

అంత, సరిలేని పరాక్రమంబుగల రాక్షసోత్తముండు రావణునకును పక్షివర్యుండు జటాయువునకును కొంచెము సేపు మహాయుద్ధంబు గలిగినది.

అని, తాత్పర్యము.

తస్య వ్యాయచ్ఛమానస్య రామస్యార్థే స రావణః. ౪౨
పక్షౌ పార్శ్వేచ పాదౌచ ఖడ్గముద్ధృత్య సోచ్ఛినత్

టీక॥ సః = ఆ రావణుడు; ఖడ్గం = కత్తిని; ఉద్ధృత్య = ఎత్తి; సః = ఆ; రావణః = రావణుడు; రామస్య = రామునియొక్క; అర్థే = ప్రయోజనమునిమిత్తమయి; వ్యాయచ్ఛమానస్య = యుద్ధము సేయుచున్న; తస్య = ఆ జటాయువుయొక్క; పక్షౌ = ఱెక్కలను; పార్శ్వేచ = ప్రక్కలను; పాదౌచ = పాదములను; అచ్ఛినత్ = ఛేదించెను.

ఆ రావణుండు, అట్లు, రామకార్యార్థంబై యుద్ధము సేయుచున్న జటాయువుం జూచి, ఖడ్గంబు చేతనెత్తి ఱెక్కలను బార్శ్వంబులను బాదంబులను ఛేదించి వైచెను. అని, తాత్పర్యము.

స ఛిన్నపక్షస్సహసా రక్షసా రౌద్రకర్మణా. ౪౩
నిపపాత హతో గృధ్రో ధరణ్యామల్పజీవితః

శ్రీ

౫ సర్గ ప్రారంభః

స్ఫురంతం రాక్షసాధిపః
దదర్శ భూ... ... మీపే రాఘవాశ్రమాత్. ౧

టీక॥ రాక్షసాధిపః= రాక్షసులకుఁ బ్రభువైనరావణుండు; అల్పజీవితం= కొంతప్రాణముగలవాఁడును; స్ఫురంతం=కదలుచున్నవాఁడును; రాఘవాశ్రమాత్=రాముని యాశ్రమంబునుండి; సమీపే=సమీపమునందు; భూమౌ= నేలయందు; పతితం=పడినవాఁడునగు; తం=ఆ; గృధ్రం=జటాయువును; దద=చూచెను.

రాక్షసరాజుండగు రావణుండు, అల్పజీవితుండును ఇట్టటుకదలుచున్నవాఁడును రామునియాశ్రమంబునకు సమీపంబున నేలంబడియున్నవాఁడునగు జటాయువుంజూచెను.

అని, తాత్పర్యము.

సాతు తారాధిప ముఖీ రావణేన సమీక్ష్య తమ్
గృధ్రరాజం వినిహతం విలలాప సుదుఃఖితా. ౨

టీక॥ తారాధిపముఖీ= చంద్రునివంటిముఖముగల; సాతు=ఆసీతయు; రావణేన=రావణునిచేత; వినిహతం= చంపఁబడిన; తం=ఆ; గృధ్రరాజం= జటాయువును; సమీక్ష్య=చూచి; సుదుఃఖితా=మిక్కిలియుదుఃఖమునొందినదై; విలలాప=ఏడ్చెను.

చంద్రబింబమువంటిమొగంబుగలసీతాదేవి రావణనిహతుండైనయా జటాయువుంజూచి, పరమదుఃఖితయై, విలపించెను. అని, తాత్పర్యము.

ఆలింగ్య గృధ్రం నిహతం రావణేన బలీయసా
విలలాప సుదుఃఖార్తా సీతా శశినిభాననా. ౩

టీక॥ శశిభాననా=చంద్రునితోసమానమయినమొగముగల; సీతా = సీతాదేవి; బలీయసా= అధికమయినబలముగల; రావణేన=రావణునిచేత; నిహతం=చంపబడిన; గృధ్రం=గద్దను; ఆలింగ్య = కవుగిలించుకొని; సుదుఃఖితా= మిక్కిలియదుఃఖముచేబీడింపబడినదై; విలల...

చంద్రబింబ... లసీతాదేవి, బల... ధింపబడినజటాయువుం గౌవుగిలించుకొని, పరమదుఃఖితయయి, విలపించెను. అని, తాత్పర్యము.

నిమిత్తం లక్షణజ్ఞానం శకునిస్వర దర్శనమ్
అవశ్యం సుఖదుఃఖేషు నరాణాం ప్రతిదృశ్యతే. ౪

టీక॥ లక్షణజ్ఞానం=నేత్రములు చలించుటమొదలగులక్షణముల యొక్క; శకునిస్వరదర్శనం=పక్షులస్వరముల జ్ఞానము; నరాణాం=మనుష్యులయొక్క; సుఖదుఃఖేషు=సుఖదుఃఖములయందు; అవశ్యం=తప్పక; నిమిత్తం=జ్ఞాపకముగా; ప్రతి... =చూడబడుచున్నది.

నేత్రస్పందాదిలక్షణములు పక్షిధ్వనులు, ఇవి, తప్పక, మనుష్యులసుఖదుఃఖములసూచించుచుండును.

అని, తాత్పర్యము.

నూనం రామ న జానాసి మహద్వ్యసన మాత్మనః
ధావంతి నూనం కాకుత్స్థం మదర్థం మృగపక్షిణః. ౫

టీక॥ రామ=రాముడా! ఆత్మనః=నీయొక్క; మహత్=గొప్పదగు; వ్యసనం=ఆపదను; నూనం= నిశ్చయముగా; నజానాసి= ఎఱుంగవా? మృగపక్షిణః = మృగములును పక్షులును; మదర్థం=నాకొఱకు; కాకుత్స్థం=రాముని గూర్చి; ధావతి=పరుగెత్తుచున్నవి. నూనం=నిశ్చయము.

రాముడా! నీకిప్పుడు గలిగిన మహావ్యసనమును ఇంక నెఱుంగకున్నావా యేమి? నేత్రస్పందాదినిమిత్తంబులఁ దెలిసికొనలేదా? ఈమృగపక్షులు పరుగెత్తుచున్నవే; ఇది నానిమిత్తమె రాముని యొద్దకుఁ బోవుచున్నవి కాఁబోలు; ఇది నిశ్చయము. అని, తాత్పర్యము.

టీక॥ సులలాటం=సుందరమయిన నొసలుగలదియు; సుకేశాంతం=సుందరములయిన వెండ్రుకలకొనలుగలదియు; పద్మగర్భాభం= కమలము యొక్క-మధ్యముయొక్క- కాంతివంటి కాంతిగలదియు; అవ్రణం = దోషములేనిదియు; శుక్లైః= తెల్లనివియు; సువిమలైః= మిక్కిలినిర్మలములును; ప్రభావద్భిః = అధికమయిన కాంతిగలవియునగు; దంతైః=దంతములచేత; అలంకృతం=అలంకరింపఁబడినదియు; రుచిరవ్యపవృష్టాన్తం= విచ్చిచూడఁబడిన కన్నుల్గలదియు ; చంద్రవత్ప్రియదర్శనం=చంద్రునివలెసంతోషకరమగు చూపుగలదియు; సునాసం=సుందరమయినముక్కుగలదియు ; చారుతామ్రోష్ఠం=సుందరములైన ఎఱ్ఱని పెదవులుగలదియు; ఆకాశే-ఆకాశమునందు; హాటకప్రభం = బంగారముయొక్క-కాంతివంటికాంతిగలదియు; విమలం=నిర్మలంబుగు; ఆకాశే= ఆకాశమునందు; రావణాంకగం= రావణుని అంకమును బొందినదియునగు ; తస్యాః-ఆసీతాదేవియొక్క; తత్-అవక్త్రం-ముఖము; నీలం=నల్లని; జలదం=మేఘమును; భిత్వా=భేదించి; ఉదితః=ఉదయించిన ; చంద్రఇవ=చంద్రునివలె; బభౌ=ఉండెను.

సుందరమయినలలాటంబు గలదియు సుందరములగు ముంగురులతో నొప్పుచున్నదియు వికసితంబగుకమలంబువంటిదియు దోషరహితంబును తెల్లనివియుస్వచ్ఛంబులు గాంతిమంతములునగు దంతంబులచే నలంకృతంబును విచ్చియెచ్చు చూడఁబడిన కన్నుల్గలదియు చంద్రబింబమువలెప్రియదర్శనంబును సుందరమయిననాసికగలదియుసుందరములయిన ఎఱ్ఱని పెదవులుగలదియు బంగారువంటి వన్నెగలదియునునిర్మలంబునగు రావణాంకంబుననున్న యాసీతాదేవిముఖంబు,నల్లనిమేఘమండలంబుభేదించిన మధ్యంబున నగపడు చంద్రుంబోలియొప్పినది.

అని, తాత్పర్యము.

రాక్షసేన సమాధూతం తస్యాస్తద్వదనం శుభమ్
శుశుభే న వినా రామం దివాచంద్ర ఇవోదితః. ౨౮

టీక॥ రాక్షసేన-రాక్షసునిచేత; సమాధూతం - కదలింపఁబడిన, భయకంపితమయిన యనుట; శుభం-మంగళకరమయిన; తస్యాః- ఆసీతాదేవియొ

కలి; తత్-ఆ; వదనం=మొగము; రామంవినా=రామునివిడిచి; దివా=పగలు; ఉదితః=ఉదయించిన; చంద్రఇవ=చంద్రుడువలె; నశుశుభే=ప్రకాశింపదయ్యె.

రావణునిచే భయకంపితంబయిన మంగళకరంబగునాసీతాదేవిముఖంబు, రాముండులేకుండుటంజేసి, పగలుఉదయించిన చంద్రునిభంగి, నెంతమాత్రమును బ్రకాశింపదయ్యె.

అని, తాత్పర్యము.

సా హేమవర్ణా నీలాంగం మైథిలీ రాక్షసాధిపమ్
శుశుభె కాంచనీ కాంచీ నీలం మణి మివాశ్రితా. ౨౫

టీ॥ హేమవర్ణా = బంగరువన్నెగల; సా=ఆ; మైథిలీ సీత; నీలాంగం = నల్లనిదేహముగల; రాక్షసాధిపం=రాక్షసులకుఁబ్రభువయినరావణుని; ఆశ్రితా=పొందినదై; నీలం= నల్లని; మణిం=రత్నమును; ఆశ్రితా(అధ్యాహృతము)-పొందిన; కాంచనీ= బంగారువికారమయిన; కాంచీవ=మొలనూలువలె; శుశుభే-ప్రకాశించెను.

బంగారువన్నెగలయాసీతాదేవి, నీలదేహుండైరావణునిఁ బొందియుండుటవలన, నీలరత్నముఁబొందినబంగారుమొలనూలువలెఁబ్రకాశించినది.

అని, తాత్పర్యము.

సా పద్మగౌరీ హేమాభా రావణం జనకాత్మజా
విద్యుద్ఘన మివావిశ్య శుశుభె తప్తభూషణా. ౨౬

టీక॥ తప్తభూషణా= బంగారుసొమ్ములుగలదియు; పద్మగౌరీ-కమలమువలెఁబసుపువన్నెగలదియు; హేమాభా-బంగారముయొక్క-కాంతివంటికాంతిగలదియునగు; సా=ఆ; జనకాత్మజా=జనకమహారాజుకొమార్తెయయినసీత; రావణం=రావణుని; విద్యుత్=మెఱపు; ఘనమివ=మేఘమునువలె; ఆవిశ్య=పొంది; శుశుభే=ప్రకాశించెను.

బంగారుసొమ్ములు ధరించియున్నదియుఁగమలంబువలెఁ గోమలంబగుగాత్రవర్ణంబుగలదియు బంగారువన్నెగలదియునగు నాజనకమహారాజుకొమార్తెయైనసీతాదేవి, రావణునియంకంబున, మేఘంబునందు మెఱపువలె, నెంతయుంబ్రకాశించినది. అని, తాత్పర్యము.

తస్యా భూషణ ఘోషేణ వై దేహ్యా రాక్షసాధిపః
బభౌ సచపలో నీల స్సఘోష ఇవ తోయదః. ౨౭

టీక॥ రాక్షసాధిపః=రాక్షసప్రభుండగు రావణుండు; తస్యాః= ఆ; వైదేహ్యాః=సీతయొక్క; భూషణఘోషేణ=ఆభరణముల ధ్వనిచేత; సచపలః= మెఱుపుతోఁగూడినదియు; సఘోషః = ధ్వనితోఁగూడినదియు; నీలః = నల్లనిదియునగు; తోయద ఇవ=మేఘమువలె; బభౌ=ప్రకాశించెను.

రాక్షసరాజుండగు రావణుండు, ఆ సీతాదేవి ధరించి యాబిడ యాభరణ ధ్వనులతోఁ గూడియుండుటచే, మెఱుపులతోనుగజ నలతోనుంగూడిన మేఘమువలెం బ్రకాశించినది.

అని, తాత్పర్యము.

ఉత్తమాంగా చ్చ్యుతా తస్యాః పుష్పవృష్టి స్సమంతతః
సీతాయా హ్రియమాణాయాః పపాత ధరణీతలే. ౨౮

టీక॥ హ్రియమాణాయాః = అపహరింపఁబడుచున్న; తస్యాః=ఆ; సీతాయాః=సీతాదేవియొక్క; ఉత్తమాంగాత్=తలనుండి; చ్యుతా=జాఱిన; పుష్పవృష్టిః-పూలవాన; ధరణీతలే = భూతలమునందు; సమంతతః = అంతటను; పపాత=పడెను.

అపహరింపఁబడుచున్న సీతాదేవిశిరస్సునందలి, పుష్పంబులుజాఱి, యచ్చటిభూమియం దంతటంబడినవి.

అని, తాత్పర్యము.

సాతు రావణవేగేన పుష్పవృష్టి స్సమంతతః
సమాధూతా దశగ్రీవం పునరేవాభ్య వర్తత. ౨౯

టీక॥సా=ఆ; పుష్పవృష్టిస్తు = పూలవానయు; సమంతతః=అంతటను; రావణవేగేన=రావణుని వేగముచేత; సమాధూతా=అల్లకల్లోలింపఁబడినదై; పునరేవ=మరలనే; దశగ్రీవం=రావణుని; అభ్యవర్తత=పొందినది.

తస్యా స్తనాంతరా ద్భ్రష్టో హార స్తారాధిప ద్యుతిః
వైదేహ్యా నిపతన్భాతి గంగేవ గగనా చ్చ్యుతా. ౩౫

టీక॥తస్యాః=అ; వైదేహ్యాః = సీతాదేవియొక్క; తారాధిపద్యుతిః= చంద్రునికాంతివంటికాంతిగల; హారః= హారము; స్తనాంతరాత్ = స్తనమధ్యమునుండి; భ్రష్టః=జారినదై; గగనాత్=ఆకాశమునుండి; చ్యుతా = జారిన; గంగేః=గంగానదివలె; భాతి= ప్రకాశించెను.

అప్పుడు, చంద్రధవళంబైనయా సీతాదేవిహారంబు, స్తనాంతరంబున నుండిపతితంబై, ఆకాశంబున నుండి పడుగంగానదియుం బోలెనొప్పినది. అని, తాత్పర్యము.

ఉత్పాత వాతాభిహతా నానాద్విజ గణాయుతాః
మాభైరితి విధూతాగ్రా వ్యాజహ్రురివ పాదపాః. ౩౬

టీక॥ఉత్పాతవాతాభిహతాః=పెనుగాలిచేఁగొట్టఁబడినవియు; నానాద్విజగణాయుతాః= నానావిధములయినపక్షులతోఁగూడినవియునగు; పాదపాః=వృక్షములు; విధూతాగ్రాః= కదలింపబడినవై; మాభైః ఇతి=భయపడవలదని; వ్యాజహ్రురివ = చెప్పినట్లుండెను.

పెనుగాలివీచుటయునప్పుడునానావిధపక్షులతోఁగూడినవృక్షంబులు, మధురంబులగుపక్షిధ్వనులతో, శాఖాగ్రంబులనుచేతులంగదలించుచు,సీతకు, భయపడవలదని యభయంబుఁజెప్పినట్లుచూపట్టినవి.

అని, తాత్పర్యము.

నళిన్యో ధ్వస్తకమలా స్త్రస్తమీన జలేచరాః
సఖీమివ గతోత్సాహాం మన్వశోచంత మైథిలీమ్. ౩౭

టీక॥నళిన్యః = తామరకొలనులు; ధ్వస్తకమలాః= చెడినకమలములుగలవియు; త్రస్తమీనజలేచరాః = భయపడినమత్స్యములుమొదలగు జలచరంబు

స ౫౩.

కులమునకంతయు నిందగలిగించునట్టి నీ చరిత్రము సహింపఁబడదుగాక. అని, తాత్పర్యము.

కిం కర్తుం శక్య మేవం హి యజ్జవేనైవ ధావసి
ముహూర్తమపి తిష్ఠస్వ న జీవన్ ప్రతియాస్యసి. ౧౦

టీక॥ యత్=ఎప్పుడు; జవేనైవ=వేగముచేతనే; ధావసి=పరుగెత్తుచున్నావో; ఏవంహి=ఇట్లు మిక్కిలి; కిం=ఏమి; కర్తుం=చేయుటకు; శక్యం=అలవియగును? ముహూర్తమపి=రెండు గడియలయినను; తిష్ఠస్వ=నిలువుము. జీవన్=బ్రతికినవాఁడవై; నప్రతియాస్యసి=మరలిపోవు.

ఇట్లు, బహువేగంబునం బరుగెత్తిపోవుచున్నావేని యేమి సేయవచ్చును? రెండు గడియ లయినను నిలిచియుందువేని, ముందుఁ బ్రాణంబులతో బ్రతికిపోఁ జాలవు. అని, తాత్పర్యము.

నహి చక్షుష్పథం ప్రాప్య తయోః పార్థివపుత్రయోః
ససైన్యోఽపి సమర్థ స్త్వం ముహూర్తమపి జీవితుమ్. ౧౧

టీక॥ త్వం=నీవు; ససైన్యోఽపి=సైన్యముతోఁగూడినవాఁడవైనను; పార్థివపుత్రయోః=రాచకొమరులగు; తయోః=ఆరామలక్ష్మణులయొక్క; చక్షుష్పథం=నేత్రపథమును; ప్రాప్య=పొంది; ముహూర్తమపి=కొంచెముసేపైనను; జీవితుం=బ్రతుకుటకు; నసమర్థోహి=సమర్థుండవు కావుగదా!

నీవు, నీ సైన్యములన్నింటితోఁ గూడివచ్చినను, రాజపుత్రులగు రామలక్ష్మణుల యెదుటఁ బడుదువేని, ముహూర్తకాలమయినను జీవించియుండఁజాలవు. అని, తాత్పర్యము.

న త్వం తయోః శరస్పర్శం సోఢుం శక్తః కథంచన
వనే ప్రజ్వలితస్యేవ స్పర్శ మగ్నే ర్విహంగమః. ౧౨

ఘు వాహినీం=నెత్తురుప్రవాహముతోఁగూడఁ బ్రవహించునదియునగు ; వైతరణీం=వైతరణియను ; నదీం = నది ; భీమం=భయంకరమయిన ; అసిపత్రవనం చైవ=కత్తిమొనలవంటి యాకులుగలయడవిని ; పశ్యసి=చూడఁగలవు.

రావణుఁడా! నీవింక శీఘ్రముగనే, భయంకరంబును నెత్తురుప్రవాహముతోఁ గూడినదియునగు వైతరణీనదిని అసిపత్రవనంబునుంగూడ యమలోకంబునం జూడఁగలవు. అని, తాత్పర్యము.

తప్తకాంచనపుష్పాం చ వైడూర్యప్రవరచ్ఛదామ్. ౨౦
ద్రక్ష్యసే శాల్మలిం తీక్ష్ణా మాయసైః కంటకై శ్చితామ్

టీక॥ తప్తకాంచనపుష్పాం చ=కాఁచఁబడినబంగారువంటిపూవులుగలదియు ; వైడూర్యప్రవరచ్ఛదాం= వైడూర్యమణిశ్రేష్ఠములవంటిపత్రములుగలదియు ; తీక్ష్ణాం=కటువైనదియు ; ఆయసైః=ఇనుపవైన ; కంటకైః=ముండ్లచే ; చితాం=వ్యాపింపఁబడినదియునగు ; శాల్మలిం=శాల్మలివృక్షమును ; ద్రక్ష్యసే=చూడఁగలవు.

కాంచిబంగారువన్నెలపువ్వులుగలదియు వైడూర్యములవంటి యాకులుగలదియు తీక్ష్ణము నినుపముండ్లతోనిండినదియునగు శాల్మలివృక్షముం జూడఁగలవు. అని, తాత్పర్యము.

నహి త్వ మీదృశం కృత్వా తస్యాలీకం మహాత్మనః. ౨౧
ధరితుం శక్ష్యసి చిరం విషం పీత్వేవ నిర్ఘృణః

టీక॥ నిర్ఘృణః=దయలేనట్టి ; త్వం = నీవు ; మహాత్మనః= మహానుభావుఁడగు ; తస్య=ఆ రామునకు ; ఈదృశం=ఇట్టి ; అలీకం=అపకారమును ; కృత్వా = చేసి ; విషం=విషమును ; పీత్వేవ=త్రాఁగినవలె ; చిరం=బహుకాలము ; ధరితుం=జీవించుటకు ; న శక్ష్యసి హి=చాలవుగదా!

నిర్దయుండవగు నీవు, మహాత్ముండగు నా రామునకు ఇట్టి యపకారంబు గావించినావు, కావున, విషంబుద్రావినవాఁడువలె, నింక బహుకాలము బ్రతికియుండఁజాలవు. అని, తాత్పర్యము.

బద్ధ స్త్వం కాలపాశేన దుర్నివారేణ రావణ. ౨౨

ర్గాః పోవుటం జూచి, సముద్రము, భయసంభ్రమంబులం జేసి, తరంగంబులే నిదిగాను, లోపలనడంగియున్నమత్స్యములునుమహాసర్పంబులునుగలదిగాను, ఉండినది. అని, తాత్పర్యము.

అంతరిక్షగతా వాచ స్ససృజు శ్చారణా స్తదా. ౧౦
ఏతదంతో దశగ్రీవ ఇతి సిద్ధా స్తదాబ్రువన్

టీక॥ తదా = అప్పుడు; అంతరిక్షగతాః = ఆకాశమునొందిన; చారణాః = చారణులు; "దశగ్రీవః = రావణుండు; ఏతదంతః = ఇదియే తుదగాఁగలవాఁడు" ఇతి = అని; వచః = మాటను; ససృజుః = విడిచిరి. తదా = అప్పుడు; సిద్ధాః = సిద్ధులు; అబ్రువన్ = చెప్పిరి.

అప్పుడాకాశంబుననున్నచారణులునుసిద్ధులును, "రావణుండు, ఇప్పుడు సీతనుహరించినాఁడు; ఈతండుదీనితోసరి" అని, చెప్పుకొనిరి.

అని, తాత్పర్యము.

స తు సీతాం వివేష్టంతీ మంకే నాదాయ రావణః. ౧౧
ప్రవివేశ పురీం లంకాం రూపిణీం మృత్యు మాత్మనః

టీక॥ సః = ఆ; రావణస్తు = రావణుండును; ఆత్మనః = తనకు; రూపిణీం = రూపముగల; మృత్యుం = మృత్యువైన; వివేష్టంతీం = చుట్టుకొనుచున్న; సీతాం = సీతాదేవిని; అంకేన = చంకచేత; ఆదాయ = ఎత్తుకొని; లంకాం = లంకయను; పురీం = పట్టణమును; ప్రవివేశ = ప్రవేశించెను.

ఆరావణుండు, రూపంబుదాల్చివచ్చినతనమృత్యువనందగినదియునుమేనుజుట్టుకొనుచున్నదియునగు సీతాదేవినిచంకనెత్తుకొని, లంకాపురిం బ్రవేశించెను. అని, తాత్పర్యము.

సోఽభిగమ్య పురీం లంకాం సువిభక్తమహాపథామ్. ౧౨
సంరూఢకక్ష్యా బహుళం స్వ మంతః పుర మావిశత్

టీక॥ సః=ఆ రావణుఁడు; సువిభక్తమహాపథాం=చక్కఁగా నేర్పఱుపఁబడిన రాజమార్గములుగల; లంకాం=లంకయను; పురీం=పట్టణమును; అధిగమ్య=పొంది; సంబాధకక్ష్యాబహులం=నిండినతొట్టికట్లచేనధికమయిన; స్వం=తనదైన; అంతఃపురం=అంతఃపురమును; ఆవిశత్=ప్రవేశించెను.

రావణుండు, సుందరముగా నేర్పఱుపఁబడిన రాజమార్గంబులుగల లంకాపురిం బ్రవేశించి, జనసమూహంబులుగల తొట్టికట్లతోఁగూడిన తన యంతఃపురముం బ్రవేశించెను. అని, తాత్పర్యము.

తత్ర తామసితాపాంగాం శోకమోహపరాయణామ్, ౧౩
నిదధే రావణస్సీతాం మయో మాయామివాసురీమ్

టీక॥ రావణః=రావణుఁడు; తత్ర=అచ్చట; అసితాపాంగాం= నల్లనికన్నులుగలదియు; శోకమోహపరాయణాం=దుఃఖమునుమూర్ఛయునే ముఖ్యమయిన గతిగాఁగలదియునగు; సీతాం=సీతను; మయః=మయుఁడు; ఆసురీం=అసురసంబంధినియగు; [illegible] మాయామివ=మాయనువలె; నిదధే=ఉంచెను.

[illegible]ఁడు, మయుం డాసురమాయనువలె, నల్లనికన్నులుగలదియుఁ [illegible]మును మోహ[illegible]యునగు నాసీతనచ్చటనుంచెను. అని, తాత్పర్యము.

అబ్రవీచ్చ దశగ్రీవః పిశాచీర్ఘోరదర్శనాః. ౧౪
యథా నేమాం పుమాన్ స్త్రీవా సీతాం పశ్యత్యసమ్మతః

టీక॥ దశగ్రీవః=రావణుఁడు; ఘోరదర్శనాః=భయంకరమయినచూపుగల; పిశాచీః=రాక్షసస్త్రీలనుగూర్చి; అబ్రవీచ్చ=చెప్పెను. యథా=ఎట్లు; అసమ్మతః=అనుజ్ఞనొందనట్టి; పుమాన్=పురుషుఁడుగాని; స్త్రీవా=స్త్రీగాని; ఇమాం=ఈ; సీతాం=సీతను; పశ్యతి=చూడఁడో; తథాతిష్ఠత(అధ్యాహృతము)=అట్లుండుఁడు.

అని, రావణుండు, భయంకరాకారలగు రాక్షసస్త్రీలంజూచి, యెట్లని మా యనుజ్ఞలేక, పురుషుండు

అతశ్చాస్మిన్ జనస్థానే మయా యూయం నియోజితాః. ౨౮

టీక॥ అహం=నేను; రణమూర్ధని= యుద్ధాగ్రమునందు; బహుశః=పెక్కుమారులు; యుష్మాకం=మీయొక్క; బలజ్ఞః=బలమునెఱింగినవాఁడను. అతశ్చ= ఇందువలననే; అస్మిన్=ఈ; జనస్థానే= జనస్థానమునందు; మయా = నాచే; యూయం=మీరలు; నియోజితాః = ఆజ్ఞాపింపఁబడితిరి.

నేను, యుద్ధంబునం బెక్కుమారులు, మీబలపరాక్రమంబులం జూచినవాఁడను; కావుననే, ఈజనస్థానకార్యంబునం, మిమ్ము నియోగించినాను. అని, రావణుండా రాక్షసులకుం జెప్పెను.

అని, తాత్పర్యము.

తతః ప్రియం వాక్య ముపేత్య రాక్షసా
మహార్థ మష్టా వభివాద్య రావణమ్
విహాయ లంకాం సహితాః ప్రతస్థిరే
యతో జనస్థాన మలక్ష్య దర్శనాః. ౨౯

టీక॥ తతః=అంతట; రాక్షసాః=రాక్షసులు; అష్టౌ = ఎనిమిదిమంది; మహార్థం=అధికమైనఅర్థముగల; ప్రియం= సంతోషకరమయిన; వాక్యం=మాటను; ఉపేత్య=పొంది; రావణం=రావణునిని; అభివాద్య=నమస్కరించి; సహితాః=కూడినవారై; లంకాం=లంకను; విహాయ=విడిచి; అలక్ష్యదర్శనాః=చూడరానిరూపుగలవారలయి; జనస్థానం= జనస్థానము; యతః=ఎచ్చటనో; తతః= (అధ్యాహృతము) అచ్చటికి; ప్రతస్థిరే=పోయిరి.

అంత, నారాక్షసులెనిమిదిమందియు, నధికార్థమగు రావణుండు చెప్పిన ప్రియవాక్యంబును విని, రావణునకు నమస్కరించి, యంతర్హితరూపులయి, లంకనుండి జనస్థానమను స్థలమునకుం బోయిరి. అని, తాత్పర్యము.

తతస్తు సీతా ముపలభ్య రావణ
స్ససంప్రహృష్టః పరిగృహ్య మైథిలీమ్
ప్రసజ్య రామేణ చ వైర ముత్తమం
బభూవ మోహా న్ముదిత స్స రాక్షసః. ౩౦

టీక॥ తతస్తు=అంతట; రావణః=రావణుఁడు; సీతాం=సీ...; ఉ...భ్య=చూచి; మైథిలీం=సీతను; పరిగృహ్య=గ్రహించి; సుసం ప్రహృష్టః=మిక్కిలియుసంతోషించినాఁడు. సః=ఆ; రాక్షసః=రాక్షసుఁడగు రావణుఁడు; రామేణ=రామునితో; ఉత్తమం=శ్రేష్ఠ...మును; వైరం=పగను; ...=కలిగించుకొనియు; మోహాత్=అజ్ఞానమువలన; ముదితః=సంతోషించినాఁడు.

అంతనా రావణుండు, సీతం జూచి, సీతం బొందితిఁగదా! యనిమిక్కిలియు సంతోషంబునొందినాఁడు; అతండు, మహాపరాక్రమశాలియగు రామునితో ...బుగొనియు, భయదుఃఖములు పొం...సిన కాలంబున, అజ్ఞానముచే, సంతోషంబునొందెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, అరణ్యకాండే, చతుఃపంచాశస్సర్గః.

ఇది. స్వప్తార్ధము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అరణ్యకాండచతుఃపంచాశసర్గటీక, ముగిసినది.



శ్రీ

పంచపంచాశసర్గప్రారంభః.

సందిశ్య రాక్షసాన్ ఘోరాన్ రావణో ఽష్టౌ మహాబలాన్
ఆత్మానం బుద్ధి వైక్లబ్యాత్ కృతకృత్య మమన్యత. ౧

టీక॥ రావణః=రావణుండు; ఘోరాన్=భయంకరులును; మహాబలాన్=అధికమయిన బలముగలవారలునగు; రాక్షసులను; అష్టౌ=ఎనిమిదిమందిని; సందిశ్య=పంపి; బుద్ధివైక్లబ్యాత్=బుద్ధిహీనతవలన. ఆత్మానం=తన్ను; కృతకృత్యం=కృతార్థునిఁగా; అమన్యత=తలంచెను.

రావణుండు, అట్లు, భయంకరాకారులును మహాబలవంతులునగు నెనిమిదిమంది రాక్షసుల జనస్థానమునకుం బంపి, బుద్ధిహీనుండు కావున, అంతటితోఁ దాను కృతార్థుండైనట్లు తలంచుకొనెను. అని, తాత్పర్యము.

స చింతయానో వైదేహీం కామబాణసమర్పితః
ప్రవివేశ గృహం రమ్యం సీతాం ద్రష్టు మభిత్వరన్. ౨

టీక॥ సః=ఆ రావణుండు; కామబాణసమర్పితః=మన్మథునిబాణంబులచేఁ బొందఁబడినవాఁడై; వైదేహీం=సీతాదేవిని; చింతయానః=తలంచుచు; సీతాం=సీతను; ద్రష్టుం=చూచుటకు; అభిత్వరన్=వేగిరపడుచు; రమ్యం=సుందరమయిన; గృహం=అంతఃపురగృహమును; ప్రవివేశ=ప్రవేశించెను.

ఆ రావణుండు, మన్మథబాణపీడితుండై, సీతాదేవిం దలంచి, సీతం జూడఁగోరి, యాతురతతో, రమణీయంబగు నంతఃపురంబునకుఁ బోయెను.

అని, తాత్పర్యము.

స ప్రవిశ్య తు త ద్వేశ్మ రావణో రాక్షసాధిపః
అపశ్య ద్రాక్షసీమధ్యే సీతాం శోకపరాయణామ్. ౩

టీక॥ రాక్షసాధిపః=రాక్షసులకుం బ్రభుఁడగు; సః=ఆ; రావణః=రావ

స ౫౫

పరమదుఃఖితయయి, వాయువేగంబునం గొట్టఁబడినదియు సముద్రంబున మునుంగుచున్నదియునగునోడవలెఁ బరమవ్యాకులయయి, మృగయూథంబుఁ దప్పి, కుక్కలనడుమం జిక్కిన లేడికైవడి, రామలక్ష్మణులవిడిచి రాక్షసస్త్రీలనడుమం జిక్కి పరితపించుచుఁ దల వాంచి దుఃఖాసులయయి యున్న సీతాదేవియొద్దకుంబోయి, యాబిడ, దుఃఖపరాయణయయి, దీనయయి వివశయయి, వలదని, యెంతచెప్పినను వినక, బలాత్కారంబున, నాబిడం దీసికొనిపోయి, దేవతాగృహతుల్యంబగు తన గృహమంతయుం జూపెను.

అని, తాత్పర్యము.

హర్మ్యప్రాసాదసంబాధం స్త్రీసహస్రనిషేవితమ్
నానాపక్షిగణైర్జుష్టం నానారత్నసమన్వితమ్. ౭
దాంతకై స్తాపనీయైశ్చ స్ఫాటికై రాజతై రపి
వజ్రవైడూర్యచిత్రైశ్చ స్తంభై ర్దృష్టిమనోహరైః. ౮

టీక॥ హర్మ్యప్రాసాదసంబాధం = చిన్నమేడలచేతను పెద్దమేడలచేతను నిండినదియు; స్త్రీసహస్రనిషేవితం = స్త్రీలవేలచే సేవింపఁబడినదియు; నానాపక్షిగణైః = నానావిధములయిన పక్షులసమూహములచేత; జుష్టం = సేవింపఁబడినదియు; నానారత్నసమన్వితం = నానావిధరత్నములతోఁ గూడినదియు; దాంతకైః = దంతములతోఁ జేయఁబడినవియు; తాపనీయైశ్చ = బంగారువికారములును; స్ఫాటికైః = స్ఫటికములతోఁ జేయఁబడినవియు; రాజతైరపి = వెండివికారములును; వజ్రవైడూర్యచిత్రైశ్చ = వజ్రములచేతను వైడూర్యములచేతను నానావర్ణములును; దృష్టిమనోహరైః = చూపులకు రమణీయములయిన వియునగు; స్తంభైః = స్తంభములచేతను; జుష్టం (అధ్యాహృతము) = సేవింపఁబడినదియు నగు; గృహం, రావణః, దదర్శయామాస (అధ్యాహృతము) = గృహమును రావణుఁడు చూపెను.

హర్మ్యప్రాసాదమయంబును, వెలయు వేవేలస్త్రీలతోఁ గూడినదియు, నానాపక్షిసమూహములతోను నానావిధరత్నములతోను ఒప్పుచున్నదియు, దంతవికారంబులును గాంచనమయంబులును

స ౫౫

స్ఫటికశిలలచేఁ జేయఁబడినదియు రజత వికారంబులును వజ్రవైడూర్యఖచితంబులగు స్తంభంబులతోఁ గూడినదియు నగు లోనగు గృహంబును, రావణుండు, సీతకుఁ జూపెను. అని తాత్పర్యము.

దివ్యదుందుభినిర్హ్రాదం తప్తకాంచనతోరణమ్
సోపానం కాంచనం చిత్ర మారురోహ తయాసహ. ౯

టీక. సః (అధ్యాహృతము) = ఆరావణుఁడు; దివ్యదుందుభినిర్హ్రాదం = శ్రేష్ఠమయినభేరికివలెశబ్దముగలదియు; తప్తకాంచనతోరణం = కాచఁబడిన బంగారువికారములయిన ద్వారముగలదియు; కాంచనం = బంగారువికారము ను; చిత్రం = ఆశ్చర్యకరంబునగు; సోపానం = సదెన్నును; తయాసహ = ఆసీతతోఁ గూడ; ఆరురోహ = ఎక్కెను.

ఆరావణుండు, సీతం దీసికొని, ఎక్కినప్పుడు దివ్యంబగు భేరికివలె ధ్వనించునదియు మంచిబంగారులోఁ జేయఁబడిన ద్వారముగలదియు బంగారిమతోఁ జేయఁబడినదియు నాశ్చర్యకరంబునగు సోపానపఙ్క్తి నారోహించెను.

అని, తాత్పర్యము.

దాంతకా రాజతాశ్చైవ గవాక్షాః ప్రియదర్శనాః ।
హేమజాలావృతాశ్చాసన్ తత్ర ప్రాసాదపఙ్క్తయః. ౧౦

టీక. తత్ర = అచ్చట; దాంతకాః = దంతముతోఁ జేయఁబడినవియు; రాజతాశ్చైవ = వెండితోఁ జేయఁబడినవియు; ప్రియదర్శనాః = సంతోషకరమయిన చూచుట గలవియునగు; గవాక్షాః = కిటికీలు; ఆసన్ (అధ్యాహృతము) = అయినవి. ప్రాసాదపఙ్క్తయః = మేడలసమూహములు; హేమజాలావృతాః = బంగారుకిటికీలసమూహము చేఁ జుట్టఁబడినవియు; ఆసన్ (అధ్యాహృతము) = అయినవి.

అచ్చట, సోపానపఙ్క్తియందుఁగిటికీలు దంతముతోను వెండితోనుం జేయఁబడియుండినవి; మేడలపైని, కిటికీలు బంగారుతోఁ జేయఁబడియుండినవి.

అని, తాత్పర్యము.

సుధామణి విచిత్రాణి భూమిభాగాని సర్వశః

లించి, యీమాటం జెప్పెను. అని, తాత్పర్యము.

దశ రాక్షసకోట్యశ్చ ద్వావింశతి రథాపరాః
తేషాం ప్రభు రిహాం సీతే సర్వేషాం భీమకర్మణామ్. ౧౪

టీక॥ రాక్షసకోట్యశ్చ=రాక్షసుల కోటులును; దశ=పదియు; అథ=ఇంక; అపరాః=ఇతరములు; ద్వావింశతిః= ఇరువదియు; సంతి (అనియధ్యాహారము)= ఉన్నవి. సీతే=సీతా! అహం= నేను; భీమకర్మణాం= భయంకరములైన కార్యములుగల; తేషాం=వారలకు; సర్వేషాం= అందఱకును; ప్రభుః=ఏలినవాడను.

సీతా! పదికోటుల రాక్షసులు, ఇంక నిరువదికోటుల రాక్షసులును ఉన్నారు; వారలందఱుభయంకరకర్ములు; వారలకందఱకును నేను ప్రభువుండను.

అని, తాత్పర్యము.

వర్జయిత్వా జరావృద్ధాన్ బాలాంశ్చ రజనీచరాన్
సహస్రమేకమేకస్య మమ కార్యపురస్సరమ్. ౧౫

టీక॥ జరావృద్ధాన్ = ముసలితనముచే వృద్ధులను; బాలాన్ = చిన్నవారింగలను; రజనీచరాంశ్చ= రాక్షసులను; వర్జయిత్వా=విడిచి; మమ= నాయొక్క; ఏకస్య=ముఖ్యునికి; కార్యపురస్సరం=కార్యార్థముపరిచారికజనము; సహస్రం=వేయిమంది.

వృద్ధులను బాలురను దప్ప, అంత ముఖ్యుండగు రావణునకొక్కొక్కనికి, వేయిమంది పరిచారకులున్నారు.

అని, తాత్పర్యము.

యదిదం రాజతంత్రం మే త్వయి సర్వం ప్రతిష్ఠితమ్
జీవితం చ విశాలాక్షి త్వం మే ప్రాణైర్గరీయసీ. ౧౬

టీక॥ మమ=నాయొక్క; ఇదం= ఈ; రాజతంత్రం= రాజతంత్రము; యత్ (అస్తి)=ఏదికలదో; తత్ (అధ్యాహారము)=అది; సర్వం= అంతయు; త్వ

యి=నీయందు; ప్రతిష్ఠితం= ప్రతిష్ఠింపఁబడినది. జీవితంచ= ప్రాణముగూడ; త్వయి, ప్రతిష్ఠితం(అధ్యాహృతము)= నీయందె ప్రతిష్ఠితము. విశాలాక్షి= వెడల్పులయిన కన్నులుగల సీతా! త్వం=నీవు; మే=నాకు; ప్రాణైః(ప్రాణేభ్యః)=ప్రాణములకన్నను; గరీయసీ=అధికురాలవు.

నా రాజపరికరము ఏ జేదియున్నదో, అనంతయు, నీయధీనము; నా ప్రాణము గూడ నీయధీనమె; వెడఁదకన్నులుగల సీతా! నీవు నాకుఁ బ్రాణంబులకన్న నధికురాలవు.

అని, తాత్పర్యము.

బహ్వీనా ముత్తమస్త్రీణాం మమ యోఽసౌ పరిగ్రహః
తాసాం త్వమీశ్వరా సీతే మమ భార్యా భవ ప్రియే. ౧౭

టీక॥ ప్రియే=ప్రియురాలవగు; సీతే=సీతా! బహ్వీనాం= పెక్కండ్రయిన; ఉత్తమస్త్రీణాం=ఉత్తమస్త్రీలలో; మమ=నాయొక్క; అసౌ=ఈ; పరిగ్రహః=భార్య; యః(అస్తి)= ఎవ్వతెగలదో; త్వం=నీవు; తాసాం=వారలకు; ఈశ్వరా = ప్రభువు; భవిష్యసి (అధ్యాహృతము)=కాఁగలవు. మమ=నాకు; భార్యా= భార్యవు; భవ= అగుము.

ప్రియురాలవగు సీతా! నీవు నాభార్యవగుము; అట్లగుదువేని, యీయంతఃపురంబున నుండు నుత్తమస్త్రీలపెక్కండ్రలో నాభార్యలెవ్వరెవ్వరున్నారో, వారలకును గూడ నీవీశ్వరివగుదువు.

అని, తాత్పర్యము.

సాధు కిం తే న్యయా బుద్ధ్యా రోచయస్వ వచో మమ
కామాభితప్తస్య మమ ప్రసాదం కర్తు మర్హసి. ౧౮

టీక॥ తే=నీకు; అన్యయా =ఇతరమయిన; బుద్ధ్యా=బుద్ధిచేత; కిం= ఏమిప్రయోజనము? సాధు=మంచిదగు; మమ=నాయొక్క; వచః=మాటను; రోచయస్వ=అంగీకరింపుము; కామాభితప్తస్య=మన్మథునిచేఁ దపింపఁజేయఁబడిన; మమ=నాకు; ప్రసాదం= అనుగ్రహమును; కర్తుం=చేయుటకు; అర్హసి=తగుదువు.

నీవు, వేఱెబుద్ధినివదలుము, దానివలనఁ బ్రయోజనములేదు, నేను జెప్పిన

౫౫

మాటవించితివి; దానినంగీకరింపుము; మన్మథతప్తుండనగు నామీఁదననుగ్రహంబుంచుము. అని, తాత్పర్యము.

పరిక్షిప్తా సముద్రేణ లంకేయం శతయోజనా
నేయం ధర్షయితుం శక్యా సేంద్రైరపి సురాసురైః. ౧౯

టీక॥ శతయోజనా=నూఱుయోజనములుగల; ఇయం=ఈ; లంకా=లంక; సముద్రేణ=సముద్రముచేత; పరిక్షిప్తా=చుట్టఁబడినది. ఇయం=ఈలంక; సేంద్రైః=ఇంద్రునితోఁగూడిన; సురాసురైరపి=దేవాసురులచేతనుగూడ; ధర్షయితుం=ఎదిరించుటకు; నశక్యా=అలవిగాదు.

ఈలంక, నూఱుయోజనంబుల వైశాల్యము గలసముద్రముచేఁజుట్టును బరివేష్టింపఁబడిన యున్నది; ఇంద్రసహితులగు దేవాసురులకుఁగూడ, నీపట్టణము నుధర్షింపనలవిగాదు.

అని, తాత్పర్యము.

న దేవేషు న యక్షేషు న గంధర్వేషు పక్షిషు
అహం పశ్యామి లోకేషు యో మే వీర్యసమో భవేత్. ౨౦

టీక॥ లోకేషు=లోకములయందు; యః=ఎవ్వఁడు; మే=నాకు; వీర్యసమః=పరాక్రమంబునసమానుఁడు; భవేత్=అగునో; తం(అధ్యాహృతము)=అతనిని; అహం=నేను; దేవేషు=దేవతలయందు; నపశ్యామి=చూడను. యక్షేషు=యక్షులయందు; న=చూడను. గంధర్వేషు=గంధర్వులయందు; న(పశ్యామి)=చూడను. పక్షిషు=పక్షులయందు; న=చూడను.

పరాక్రమంబున నాకుసమానుండగువాఁడు, లోకంబులదేవతలయందుఁగాని యక్షులయందుఁగాని గంధర్వులయందుఁగాని, పక్షులయందుఁగాని, యెవ్వఁడును లేఁడు. అని, తాత్పర్యము.

రాజ్యభ్రష్టేన దీనేన తాపసేన గతాయుషా
కిం కరిష్యసి రామేణ మానుషేణాల్పతేజసా. ౨౧

టీక॥ రాజ్యభ్రష్టేన= రాజ్యమునుండి భ్రష్టుడును; దీనేన= గర్వముడిగినవాడును; తాపసేన=మునియు; గతాయుషా=పోయినయాయుస్సు గలవాడును; అల్పతేజసా=కొంచెమయిన తేజస్సుగలవాడునగు; రామేణ= రామునిచేత; కిం=ఏమి; కర్తవ్యసి=చేయఁగలవు.

రాజ్యభ్రష్టుండును, దీనుండును, తాపసుండును, గతప్రాణుండును, మనుష్యుండును అల్పతేజసుండునగు, రామునితో నీకేమిపనికి అని, తాత్పర్యము.

భజస్వ సీతే మా మేవ భర్తాహం సదృశ స్తవ
యౌవనం హ్యధ్రువం భీరు రమస్వేహ మయాసహ. ౨౨

టీక॥ సీతే=సీతా; మమేవ=నన్నె; భజస్వ=పొందుము; అహం=నేను; తవ=నీకు; సదృశః=సరియయిన; భర్తా=పెనిమిటిని. భీరు=భయముగల స్త్రీవగుసీతా! యౌవనం=యౌవనము; అధ్రువం హి=అస్థిరముగదా! ఇహ=ఇక్కడ; మయాసహ = నాతోఁగూడ! రమస్వ=క్రీడింపుము.

సీతా! నీవు నన్నె పొందుము; నేను నీకుఁదగినపెనిమిటిని; యౌవనము, అస్థిరము కదా! నాతోఁగూడ నిచ్చట రమింపుము. అని, తాత్పర్యము.

దర్శనే మాకృథా బుద్ధిం రాఘవస్య వరాననే
కాస్య శక్తి రిహాగంతు మపి సీతే మనోరథైః. ౨౩

టీక॥ వరాననే= సుందరమయినముఖముగల; సీతే=సీతా; రాఘవస్య=రాముని యొక్క; దర్శనే=చూచుటయం దు; బుద్ధిం= బుద్ధిని; మాకృథాః=చేయవలదు. మనోరథైరపి=కోరికలచేతఁగానీ; ఇహ=ఇచ్చటికి; ఆగంతుం=వచ్చుటకు; అస్య=ఈరామునకు; శక్తిః=సామర్థ్యము; కా=ఏది.

సుందరముఖివగు సీతా! రామునిం జూడ వలెనని మనంబున నాశయుంచుకొనకుము; ఇచ్చటికిరాఁ దలఁచుటకుఁగూడ, నతనికి శక్తిలేదు. అని, తాత్పర్యము.

నశక్యో వాయు రాకాశే పాశైర్బద్ధుం మహాజవః

స ౫౫

దీప్యమానస్య వాప్యగ్నే ర్గృహీతుం విమలాం శిఖామ్. ౨౪

టీక॥ మహాజవః=అధికమయిన వేగముగల; వాయుః=వాయువు; ఆకాశే=ఆకాశమునందు; పాశైః=త్రాళ్లచేత; బద్ధుం=కట్టుటకు; నశక్యః=అలవిగాదు. దీప్యమానస్య=మండుచున్న; అగ్నేః=నిప్పుయొక్క; విమలాం=స్వచ్ఛమయిన; శిఖాంవాపి=జ్వాలనుగాని; గృహీతుం=పట్టుటకు; నశక్యం(అధ్యాహృతము)=అలవిగాదు.

మహావేగంబగువాయువు నుఆకాశంబునందు త్రాళ్లంబట్టికట్ట నలవి యగునా? మండుచున్నయగ్నిహోత్రుని విమలంబగుశిఖనుబట్టనలవియగునా?

అని, తాత్పర్యము.

త్రయాణా మపిలోకానాం న తం పశ్యామి శోభనే
విక్రమేణ నయే ద్యస్త్వాం మద్బాహుపరిపాలితామ్. ౨౫

టీక॥ శోభనే=మంగళకరివగుసీతా! మద్బాహుపరిపాలితాం=నాభుజములచేఁబాలింపఁబడిన; త్వాం=నిన్ను; యః=ఎవ్వఁడు; విక్రమేణ=పరాక్రమముచేత; నయేత్=తీసికొనిపోవునో; తం=అతని; త్రయాణాం=మూఁడైన; లోకానామపి=లోకములలోపలను; నపశ్యామి=చూడను.

మంగళకరివగుసీతా! నాభుజబలంబునఁబరిపాలింపఁబడుచున్నట్టి నిన్నుఁ బరాక్రమంబున నిచ్చటనుండి గొనిపోఁజాలినవాఁడు, ఈముల్లోకంబులనుం గానఁబడఁడు. అని, తాత్పర్యము.

లంకాయాం సుమహ ద్రాజ్య మిదం త్వ మనుపాలయ
త్వత్ప్రేష్యా మద్విధాశ్చైవ దేవాశ్చాపి చరాచరాః. ౨౬

టీక॥ త్వం=నీవు; లంకాయాం=లంకాపురియందు; ఇదం=ఈ; సుమహత్=మిక్కిలియుగొప్పదియగు; ఇదం=ఈ; రాజ్యం=రాజ్యమును; అనుపాలయ=అంగీకరింపుము. మద్విధాశ్చైవ=నాయట్టివారలును; దేవాశ్చాపి=దేవతలును; చరాచరాః=జంగమస్థావరంబులును; త్వత్ప్రేష్యాః=నీపరిచారకులు.

స ౫౫

నీవు, లంకయందు, ఇప్పుడు రాజ్యంబును పాలింపుచుండుము; నేను, ఇంకను నాయట్టి మహాశూరులును, దేవతలను జంగమస్థావరంబులును, నీకుం బరిచారకులుం గాంగలము. అని, తాత్పర్యము.

అభిషేకోదకక్లిన్నా తుష్టాచ రమయస్వ మాం

టీక॥ త్వం (అధ్యాహృతము =) నీవు; అభిషేకోదకక్లిన్నా = పట్టాభిషేక జలము చేత దడుపంబడినదాన వై; తుష్టాచ = సంతోషించిన దానవునై; మాం = నన్ను; రమయస్వ = రమియింపం జేయుము.

నీవు పట్టాభిషేకము నొంది, లంకారాజ్యాధిపతివై సంతోషంబున నాతోంగూడి రమియింపుచుండుము.

అని, తాత్పర్యము.

దుష్కృతం యత్పురా కర్మ వనవాసేన తద్గతం. ౨౪
యస్తే సుకృతో ధర్మ స్తస్యేహ ఫల మాప్నుహి

టీక॥ పురా = మున్ను; దుష్కృతం = పాప సహితమయిన; కర్మ = కర్మము; యత్ (అస్తి) = ఏదిగలదో; తత్ = అది; వనవాసేన = అడవియందుండుటచేత; గతం = పోయినది. తే = నీకు; సుకృతః = పుణ్యరూపమయిన; ధర్మః = ధర్మము; యః (అస్తి) ఏదిగలదో; ఇహ = ఇప్పుడు; తస్య = దానియొక్క; ఫలం = ఫలమును; ఆప్నుహి = పొందుము.

నీవు, మున్ను గావించిన పాపము, వనవాసము చేత ననుభవించితివి; ఇంక నీవు చేసికొనియున్న పుణ్యంబునకు ఫలమును, ఇప్పుడనుభవింపుము.

అని, తాత్పర్యము.

ఇహ మాల్యాని సర్వాణి దివ్యగంధాని మైథిలి. ౨౫
భూషణానిచ ముఖ్యాని సేవస్వచ మయాసహ

టీక॥ మైథిలి = సీతా! ఇహ = ఇచ్చట; దివ్యగంధాని = ఉత్తమమయినవాసన గలః సర్వాణి = సమస్తములయిన; మాల్యాని = పుష్పమాలికలను; ముఖ్యాని =

శ్రేష్ఠములయిన; భూషణాని = ఆభరణములను; మయాసహ చ = నాతోనుగూడ; సేవస్వ = పొందుము.

సీతా! నీవిచ్చట, దివ్యగంధపుష్పమాలికలను ఉత్తమంబులగు భూషణంబులను, నాతోఁగూడ, సేవింపఁ గోరిన పుము.

అని, తాత్పర్యము.

పుష్పకం నామ సుశ్రోణి భ్రాతుర్వైశ్రవణస్య మే. ౨౯
విమానం సూర్యసంకాశం తరసా నిర్జితం మయా

టీక॥ సుశ్రోణి = సుందరములయిన పిఱుఁదులుగలసీతా! మే = నాయొక్క; భ్రాతుః = అన్నయగు; వైశ్రవణస్య = కుబేరునియొక్క; సూర్యసంకాశం = సూర్యునితోసమానమయిన; పుష్పకం నామ = పుష్పకమను; విమానం = విమానము; మయా = నాచేత; తరసా = బలముచేత; నిర్జితం = జయింపఁబడినది.

సుందరములయిన పిఱుఁదులుగల సీతా! నాయన్నయగు కుబేరునిదగు సూర్యప్రభంబయినపుష్పకమనువిమానమును నేను, భుజబలంబునఁ జయించితిని.

అని, తాత్పర్యము.

విశాలం రమణీయం చ తద్విమానమనుత్తమమ్. ౩౦
తత్ర సీతే మయా సార్ధం విహరస్వ యథా సుఖమ్
॥ముః॥

టీక॥ అనుత్తమం = తనకన్ననుత్తమము లేని; తత్ = ఆ; విమానం = విమానము; విశాలం = వెడల్పయినది. రమణీయం = సుందరము. సీతే = సీతా! మయా సార్ధం = నాతోఁగూడ; తత్ర = ఆవిమానమునందు; యథాసుఖం = సుఖముగా; విహరస్వ = విహరింపుము.

సీతా! ఉత్తమంబగునావిమానము, విశాలంబును రమణీయంబునుగా నున్నది; అవ్విమానంబునందు, సుఖముగా నాతోఁగూడ విహరింపుచుండుము.

అని, తాత్పర్యము.

వదనం పద్మసంకాశం విమలం చారుదర్శనమ్. ౩౧
శోకార్తం తు వరారోహే న భ్రాజతి వరాననే

టీక॥ వరారోహే=సుందరమయిన పిఱుందులుగలదానవు; వరాననే=సుందరమగుముఖముగలదానవునగు సీతా! పద్మసంకాశం= కమలముతో సమానమయినదియు; అమలం= నిర్దోషమును; చారువిలోచనం=సుందరమయినచూపులుగలదియునగు; వదనం=ముఖము; శోకార్తం తు= దుఃఖపీడితమయినమాత్రము; న భ్రాజతే=ప్రకాశింపకున్నది.

సుందరములయిన పిఱుందులుగలదానవు సుందరమయిన ముఖముగలదానవునగు సీతా! కమలతుల్యంబును నిర్దోషంబును సుందరమునగు నీముఖము దుఃఖపీడితమయియున్నది కావునఁ బ్రకాశింపకున్నది; దుఃఖమువదలుము. అని, రావణుండు, సీతతోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవం వదతి తస్మిన్ సా వస్త్రాన్తేన వరాంగనా. ౩౨
పిధాయేన్దునిభం సీతా ముఖ మశ్రూణ్య వర్తయత్

టీక॥ తస్మిన్= ఆరావణుఁడు; ఏవం=ఇట్లు; వదతి=చెప్పుచుండఁగా; వరాంగనా=ఉత్తమ(స్త్రీ)యగు; సా= ఆ; సీతా=సీతాదేవి; ఇందునిభం = చంద్రునితో సమానమయిన; ముఖం= ముఖమును; వస్త్రాన్తేన= చీరకొంగు చేత; పిధాయ=కప్పికొని; అశ్రూణి= కన్నీళ్లను; అవర్తయత్ = కార్చెను.

ఆ రావణుండు ప్రకారముగ నిం జెప్పుచుండఁగా, నుత్తమవనితయగు నా సీత తన చీరకొంగునఁ, జంద్రసుందరమగు ముఖంబుఁ గప్పికొని, కన్నీళ్లుగాఱ, ధ్యానముఁ జేసెను. అని, తాత్పర్యము.

ధ్యాయన్తీం తా మివా స్వస్థాం దీనాం చిన్తాహతప్రభామ్. ౩౩
ఉవాచ వచనం పాపో రావణో రాక్షసేశ్వరః

టీక॥ పాపః= పాపస్వభావుఁడైన; రాక్షసేశ్వరః= రాక్షసులకుఁ బ్రభువైన; రావణః=రావణుఁడు; ధ్యాయన్తీమివ (ఇవశబ్దము వాక్యాలంకారార్థము)=ధ్యానముసేయుచున్నదియు; అస్వస్థాం=అవశయును; దీనాం= దుఃఖితయు; చిన్తాహతప్రభాం=చింతచేఁ గొట్టఁబడిన కాంతిగలదియునగు; తాం=

అ సీతాదేవినిగూర్చి; వచనం = మాటను; ఉవాచ = చెప్పెను.

పాపిష్ఠుఁడగు నరాక్షసరాజుండగు రావణుఁడు, అట్లు చింతాధ్యానపరాయణయయి పరవశయయి దీనయయి, కాంతిహీనయయియున్న సీతాదేవిం జూచి, యీమాటం జెప్పెను.

అని, తాత్పర్యము.

అలం వ్రీడేన వైదేహి ధర్మలోపకృతేన చ. ౩౪
ఆర్షోఽయం దైవనిష్యందో యస్త్వా మభిగమిష్యతి

టీక॥ వైదేహి = సీతా; ధర్మలోపకృతేన = ధర్మలోపము చేఁ జేయఁబడిన; వ్రీడేన = సిగ్గు చేతను; అలం = చాలును. యః = ఏ; దైవనిష్యందః = దైవసంబంధము; త్వాం = నిన్ను; అభిగమిష్యతి = పొందఁగలదో; అయం = ఇది; ఆర్షః = ఋషులచేఁ జెప్పఁబడినది.

సీతా! ధర్మలోపము గలుగునని నీవు సిగ్గుపడవలదు; ఇప్పుడు దైవగతిచే నీకు దటస్థించిన యీసంబంధము పునర్భ్వాదులచే ధర్మశాస్త్రములందుఁ జెప్పఁబడియుండు ధర్మమే. అని, తాత్పర్యము.

ఏతౌ పాదౌ మయా స్నిగ్ధౌ శిరోభిః పరిపీడితౌ. ౩౫
ప్రసాదం కురు మే క్షిప్రం వశ్యో దాసోహ మస్మి తే

టీక॥ ఏతౌ = ఈ; స్నిగ్ధౌ = సుందరములైన; పాదౌ = పాదములు; మయా = నాచేత; శిరోభిః = తలలచేత; పరిపీడితౌ = పీడింపఁబడినవి; మే = నాకొఱకు; క్షిప్రం = శీఘ్రముగా; ప్రసాదం = అనుగ్రహమును; కురు = చేయుము; అహం = నేను; తే = నీయొక్క; వశ్యః = అధీనతలోనుండువాఁడను; దాసః = దాసుఁడను; అస్మి = అగుచున్నాను.

సుందరములగు నీపాదముల నాతలలు సోఁకునట్లు పెక్కుమాఱులు నమస్కారము సేయుచున్నాను; నామీఁద ననుగ్రహించుము; నీకు నేను వశ్యుండను దాసుండనైతిని.

అని, తాత్పర్యము.

ఇమాః శూన్యా మయా వాచః శుష్యమాణేన భాషితాః. ౩౬

న చాపి రావణః కాంచి న్మూర్ధ్నా స్త్రీం ప్రణమేతహి

టీక॥ శుష్యమాణేన=బాధింపఁబడుచున్నవాఁడనగు; మయా = నాఁచేత; ఇమాః=ఈ; శూన్యాః= నీచములయిన; వాచః=మాటలు; భాషితాః=చెప్పఁబడినవి. రావణశ్చాపి = రావణుండును; కాంచిత్=ఒకానొక; స్త్రీం=స్త్రీని; మూర్ధ్నా = తలచేత; నప్రణమేతహి=నమస్కరింపఁడుగదా!

నేను, మన్మథబాణపీడితుండనై, నీచములయినయీమాటలం జెప్పినాను; రావణుండిదివఱకు, ఎట్టిస్త్రీకిని, తలవంచి, నమస్కరించియెఱుంగఁడు. అని, రావణుండుసీతతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా దశగ్రీవో మైథిలీం జనకాత్మజామ్. ౩౪
కృతాంతవశ మాపన్నో మమే య మితి మన్యతే

టీక॥ దశగ్రీవః = రావణుఁడు; జనకాత్మజాం = జనకమహారాజుకొమాతెయగు; మైథిలీం=సీతనుగూర్చి; ఏవం=ఇ[illegible]ఉక్త్వా=చెప్పి; కృతాంతవశం= [illegible]తను; ఆపన్నః= పొందినవాఁడై; ఇయం=ఈసీత; మమ= నాది; ఇతి=అని; మన్యతే=తలంచెను.

రావణుండు, జనకమహారాజపుత్రియగుసీతతోనీప్రకారముచెప్పి, కాలవశంగతుండై, ఈసీతనెట్లయినను వశీకరించుకొనవలెను" అని, తలంచెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అరణ్యకాండే, పంచపంచాశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు , అరణ్యకాండపంచపంచాశసర్గటీక, ముగిసినది.

౫౬

## షట్పంచాశ సర్గ ప్రారంభః.

సా తథో క్తాతు వైదేహీ నిర్భయా శోకకర్శితా
తృణ మంతరతః కృత్వా రావణం ప్రత్యభాషత. ౧

టీక॥ శోకకర్శితా = దుఃఖముచేఁ గృశింపఁబడినదగు; సా = ఆ; వైదేహీ = సీత; తథా = అట్లు; ఉక్తాతు = చెప్పఁబడినంతనే; నిర్భయా = భయములేనిదై; తృణం = తృణమును; అంతరతః = నడుమ; కృత్వా = చేసి; రావణంప్రతి = రావణుని గూర్చి; అభాషత = చెప్పెను.

దుఃఖపీడితయగునాసీత, రావణుండుచెప్పినదంతయువిని, భయంబు విడిచి, రావణునకునుం దనకును నడుమం దృణంబుంచుకొని, రావణుంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

రాజా దశరథో నామ ధర్మసేతు రివా చలః
సత్యసంధః పరిజ్ఞాతో యస్య పుత్ర స్స రాఘవః. ౨

టీక॥ దశరథోనామ = దశరథుండను పేరుగల; రాజా = రాజు; ధర్మసేతు రివ = ధర్మమునకు సేతువువంటివాఁడు. అచలః = స్థిరుఁడు. సత్యసంధః = సత్యప్రతిజ్ఞుఁడు. పరిజ్ఞాతః = ప్రసిద్ధుఁడు. సః = ఆ; రాఘవః = రాముఁడు; యస్య = ఎవ్వనియొక్క; పుత్రః = కొడుకో!

దశరథుండను మహారాజొకరుఁడుండెను; అతండుధర్మవ్యవస్థాపకుఁడు; స్థిరుఁడు; సత్యసంధుండనిప్రసిద్ధుఁడు; ఆ రాముండు, ఆయనపుత్రుండు. అని, తాత్పర్యము.

రామోనామ స ధర్మాత్మా త్రిషు లోకేషు విశ్రుతః
దీర్ఘబాహు ర్విశాలాక్షో దైవతంహి పతి ర్మమ. ౩

టీక॥ సః = ఆ; రామోనామ = రాముండను పేరుగలవాఁడు; ధర్మా

త్మా=ధర్మబుద్ధిగలవాఁడు; త్రిషు = మూఁడైన; లోకేషు=లోకములయందును; విశ్రుతః=ప్రసిద్ధుఁడు. దీర్ఘబాహుః = నిడుపులయినచేతులుగలవాఁడు. విశాలాక్షః=వెడల్పులయినకన్నులుగలవాఁడు. మమ=నాయొక్క; పతిః=పెనిమిటి. దైవతంహి = దేవత గదా!

రాముండు, ధర్మాత్ముండు, ముల్లోకంబులయందును బ్రసిద్ధివహించినవాఁడు; ఆజానుబాహుండు; వెడఁదకన్నులవాఁడు; నాపెనిమిటి; కావున, నీతండె నాకు దేవత. అని, తాత్పర్యము.

ఇక్ష్వాకూణాం కులే జాత స్సింహస్కంధో మహాద్యుతిః
లక్ష్మణేన సహ భ్రాత్రా య స్తే ప్రాణా న్హరిష్యతి. ౪

టీక॥ ఇక్ష్వాకూణాం= ఇక్ష్వాకువంశమునందుఁబుట్టినవారలయొక్క; కులే=వంశమునందు; జాతః = పుట్టినవాఁడు; సింహస్కంధః=సింహమునకువలెమూఁపులుగలవాఁడు. మహాద్యుతిః = అధికమయినకాంతిగలవాఁడు. యః= ఎవ్వఁడు; భ్రాత్రా= తమ్ముఁడైన; లక్ష్మణేనసహ = లక్ష్మణునితోఁగూడ; తే=నీయొక్క; ప్రాణాన్ = ప్రాణములను; హరిష్యతి=హరింపఁగలఁడో.

అతండు, ఇక్ష్వాకువంశమునంబుట్టినవాఁడు; సింహమునకుంబోలెనున్నతభుజశిఖరంబులు గలవాఁడు; మహాతేజుండు; అతనికిలక్ష్మణుండనుతమ్ముండు గలఁడు; ఆరాముండె, తమ్మునితోఁగూడవచ్చి, యుద్ధంబున నిన్నువధింపఁగలఁడు. అని, తాత్పర్యము.

ప్రత్యక్షం యద్యహం తస్య త్వయా స్యాం ధర్షితా బలాత్
శయితా త్వం హత స్సంఖ్యే జనస్థానే యథా ఖరః. ౫

టీక॥ అహం=నేను; త్వయా=నీచేత; తస్య= ఆరామునియొక్క; ప్రత్యక్షం= ఎదుట; బలాత్=బలాత్కారమువలన; ధర్షితా= అపహరింపఁబడిన దానను; స్యాంయది= అగుదునేని; త్వం=నీవు; ఖరోయథా=ఖరునివలె; సంఖ్యే=యుద్ధమునందు; హతః=చంపఁబడినవాఁడవై; జనస్థానే=జనస్థానమునందు; శయితా=పరుండఁగలవు.

సీత, రామునిసమక్షంబున నాత్రి

మ్యు, నన్నుబలాత్కారంబున హరించి యుండువేని, నీవింతకాలమునకు, ఖరుని యట్లు, యుద్ధంబునని హతుఁడవై జనస్థానంబునందుఁ బడియుందువు.

అని, తాత్పర్యము.

యఏతే రాక్షసాః ప్రోక్తా ఘోరరూపా మహాబలాః
రాఘవే నిర్విషాస్సర్వే సుపర్ణే పన్నగా యథా. ౭

టీక॥ ఘోరరూపాః = భయంకరమయినరూపముగలవారలును; మహాబలాః = అధికమయినబలముఁగలవారలునగు; యే = ఏ; ఏతే = ఈ; రాక్షసాః = రాక్షసులు; ప్రోక్తాః = చెప్పఁబడినారో; తే (అధ్యాహార్యము) = వారలు; సర్వే = అందఱు; సుపర్ణే = గరుత్మంతునియందు; పన్నగా యథా = సర్పములవలె; రాఘవే = రామునియందు; నిర్విషాః = విషములేనివారగుదురు.

భయంకరాకారులయిన మహాబలశాలులనగు నీరాక్షసులున్నారని చెప్పితివే; గరుత్మంతునిమీఁద సర్పములవిషము పనికిరానట్లు, రామునిమీఁద, నెంతసూరత్వము నీజనము సాగదు.

అని, తాత్పర్యము.

తస్య జ్యావిప్రముక్తాస్తే శరాః కాంచనభూషణాః
శరీరం విధమిష్యంతి గంగాకూలమివోర్మయః. ౮

టీక॥ తస్య = ఆరామునియొక్క; జ్యావిప్రముక్తాః = అల్లెత్రాటినుండివిడువఁబడిన; కాంచనభూషణాః = బంగారలంకారముకాఁగల; శరాః = బాణములు; తే = నీయొక్క; శరీరం = దేహము; ఊర్మయః = అలలు; గంగాకూలమివ = గంగానదిగట్టునువలె; విధమిష్యంతి = హింసించును.

ఆ రాముని ధనుశ్చ్యుతంబులై కాంచనాలంకృతంబులయిన బాణంబులు, తరంగంబులు నదీతీరంబు గలంచునట్లు, నీదేహమును ఛేదించును.

అని, తాత్పర్యము.

అసురైర్వా సురైర్వా త్వం యద్యవధ్యోసి రావణ

స ౫౬

ఉత్పాద్య సుమహ ద్వైరం జీవం స్తస్య నమోక్ష్యసే. ౮

టీక॥ రావణ = రావణుఁడా! త్వం = నీవు; అసురైః వా = అసురుల చేతఁగాని; సురైః వా = దేవతలచేతఁగాని; అవధ్యః = వధింపఁగూడనివాఁడవు; అసి యది = అగుదువేని; తథాపి (అధ్యాహృతము) = అట్లయినను; తస్య = ఆ రామునకు; సుమహత్ = మిక్కిలియు గొప్పదగు; వైరం = విరోధమును; ఉత్పాద్య = కలిగించి; జీవన్ = బ్రతికియున్నవాఁడవై; న మోక్ష్యసే = విడువఁబడవు.

రావణుఁడా! నీవు, అసురులచేతఁగాని సురులచేతఁగాని యవధ్యుండవయ్యును, ఆ రామునకు నీమీఁద మహావైరంబు గలుగునట్లు చేసికొన్నావు; ఇంక బ్రాణము తోఁ విడువఁబడవు. అని, తాత్పర్యము.

స తే జీవితశేషస్య రాఘవోఽన్తకరో బలీ

పశో ర్యూపగతస్యేవ జీవితం తవ దుర్లభమ్. ౯

టీక॥ బలీ = అధికమయిన బలము గల; సః = ఆ; రాఘవః = రాముఁడు; తే = నీయొక్క; జీవితశేషస్య = ప్రాణశేషముయొక్క; అన్తకరః = నాశముసేయువాఁడు. యూపగతస్య = యూపస్తంభము నొందిన; పశోః ఇవ = పశువునకువలె; తవ = నీకు; జీవితం = బ్రతుకు; దుర్లభం = పొందఁగూడనిది.

నీకింక నేమైన బ్రతుకవలసినదినము లున్నట్లయితే, వానికి, బలవంతుండగు రాముండంతకుఁడు; యూపస్తంభంబునఁ గట్టఁబడిన పశువునకింక జీవితాశ లేనట్లు, నీకింక జీవితాశ యొంతమాత్రము లేదు.

అని, తాత్పర్యము.

యది పశ్యేత్స రామస్త్వాం రోషదీప్తేన చక్షుషా

రక్ష స్త్వమద్య నిర్దగ్ధో గచ్ఛేస్సద్యః పరాభవమ్. ౧౦

టీక॥ రక్షః = రాక్షసుఁడా! సః = ఆ; రామః = రాముఁడు; త్వాం = నిన్ను; రోషదీప్తేన = రోషముచేవెలుఁగుచున్న; చక్షుషా = కంటిచేత; పశ్యేద్యది = చూచు

శరముచేతనే, లంకయు వైధవ్యమునొందఁగలదు. అని, తాత్పర్యము.

న తే పాప మిదం కర్మ సుఖోదర్కం భవిష్యతి
యాహం సీతా వినాభావం పతిపార్శ్వాత్ త్వయా వనే. ౧౩

టీక॥ యా=ఏ; అహం=నేను; త్వయా=నీచేత; వనే=అడవియందు; పతిపార్శ్వాత్=పెనిమిటిప్రక్కనుండి; వినాభావం=వియోగమును; నీతా=పొందింపఁబడినానో; తస్యాం(అధ్యాహృతము)=అట్టినావిషయమైన; తే=నీయొక్క; ఇదం=ఈ; పాపం=పాపముకలిగించునట్టి; కర్మ=కార్యము; సుఖోదర్కం=సుఖమైనరాఁగలఫలముగాఁగలది; నభవిష్యతి=కాఁజాలదు.

నీవు, వనంబునఁ బెనిమిటిపార్శ్వంబుననుండి, నన్ను, వియోగంబునొందించి యిచ్చటికిఁ దెచ్చినావు, కావున, ఈపాపకార్యము, నీకెంతమాత్రము సుఖము కలిగింపదు; దుఃఖము నేకలిగించును. అని, తాత్పర్యము.

స హి దైవతసంయుక్తో మమ భర్తా మహాద్యుతిః
నిర్భయో వీర్య మాశ్రిత్య శూన్యే వసతి దండకే. ౧౪

టీక॥ దైవతసంయుక్తః=దైవబలముతోఁగూడినవాఁడును; మహాద్యుతిః=అధికమయినకాంతిగలవాఁడునగు; మమ=నాయొక్క; భర్తా=పెనిమిటియగు; సః=ఆరాముఁడు; వీర్యం=పరాక్రమమును; ఆశ్రిత్య=ఆశ్రయించి; శూన్యే=పాడుపడిన; దండకే=దండకారణ్యమునందు; నిర్భయః=భయములేనివాఁడై; వసతిహి=ఉన్నాఁడుగదా!

దైవబలంబుగలవాఁడును మహాతేజుండునగు నాపెనిమిటి రాముండు, పరాక్రమంబునాశ్రయించి, శూన్యంబగు దండకారణ్యంబునందు, నిర్భయుండై యున్నాఁడు; నిన్నువదలఁడు. అని, తాత్పర్యము.

స తే దర్పం బలం వీర్య ముత్సేకంచ తథావిధమ్
అపనేష్యతి గాత్రేభ్య శ్శరవర్షేణ సంయుగే. ౧౫

టీక॥ సః=ఆరాముఁడు; సంయుగే=యుద్ధమునందు; శరవర్షేణ = బాణవర్షముచేత; గాత్రేభ్యః =అవయవములనుండి; తే=నీయొక్కయొక్క; దర్పం=మదమును; బలం=బలమును; వీర్యం=పరాక్రమమును ; తథావిధం=అట్టిదైనట్లు; త్వేకంచ=ఎవ్వరులక్ష్యము లేకుండుటను; అపనేష్యతి=తొలఁగింపఁగలఁడు.

ఆరాముండు, యుద్ధంబునబాణవర్షంబుపఱఁగించి,నీదేహము నుండు, మదంబునుబలంబును బరాక్రమంబును, గర్వంబును, విడిపింపఁగలఁడు.

అని, తాత్పర్యము.

యదా వినాశో భూతానాం దృశ్యతే కాలచోదితః
తదా కార్యే ప్రమాద్యంతి నరాః కాలవశంగతాః. ౧౭

టీక॥ యదా=ఎప్పుడు; కాలచోదితః=దైవముచేఁ బ్రేరింపఁబడిన; భూతానాం= భూతములయొక్కయొక్క; వినాశః=నాశము; దృశ్యతే=చూడఁబడుచున్నదో; తదా=అప్పుడు; నరాః= మనుష్యులు; కాలవశంగతాః=కాలాధీనలైనవారలయి; కార్యే= కార్యమునందు; ప్రమాద్యంతి= ఏమఱుచున్నారు.

దైవగతిచేభూతవినాశంబుకలుగఁబోవుకాలంబున,మనుష్యులు కాలవశంగతులయివిపరీతకార్యంబులం జేయుదురు. అని, తాత్పర్యము.

మాం ప్రధృష్య స తే కాలః ప్రాప్తోఽయం రాక్షసాధమ
ఆత్మనో రాక్షసానాం చ వధా యాంతఃపురస్య చ. ౧౮

టీక॥ రాక్షసాధమ=రాక్షసులలో నధముఁడవగు రావణుఁడా; మాం=నన్ను; ప్రధృష్య=అవమానించి; తే=నీకు; సః=ఆ; కాలః=కాలము; ఆత్మనః=నీయొక్కయు; రాక్షసానాంచ=రాక్షసులయొక్కయు; అంతఃపురస్యచ=అంతఃపురముయొక్కయు; వధాయ=వధముకొఱకు; ప్రాప్తః=వచ్చినది.

టీక॥ రాక్షసాధముఁడవగు రావణుఁడా! నీవు నన్నపహరించినావు కావున , నీకిప్పుడు నీవును రాక్షసులందఱును అంతఃపురజనులును వధంబునొందునట్టియాకాలంబువచ్చినది.

అని, తాత్పర్యము.

స ౫౬

న శక్యా యజ్ఞమధ్యస్థా వేదీ స్రుగ్భాండమండితా
ద్విజాతి మంత్రపూతా చ చండాలే నావమర్దితుమ్. ౧౮

టీక॥ యజ్ఞమధ్యస్థా = యాగమధ్యంబుననుండునదియు, యాగశాలామధ్యంబుననుండునదియనుట; స్రుగ్భాండమండితా = స్రుక్కులు మొదలయిన యుపకరణముల చేనలంకృతమును; ద్విజాతిమంత్రపూతాచ = బ్రాహ్మణుల మంత్రముల చేఁబరిశుద్ధమునగు; వేదీ = యాగవేది; చండాలేన = చండాలునిచేత; అవమర్దితుం = త్రొక్కుటకు; న శక్యా = అలవిగాదు.

యాగశాలామధ్యంబున నుండునదియు స్రుక్స్రువాద్యుపకరణములతోఁ గూడినదియు బ్రాహ్మణులుపఠించుమంత్రంబుల చేఁబరిశుద్ధంబునగుయాగవేదికను, చండాలుండు కాలం ద్రొక్కఁజాలఁడుగదా!

అని, తాత్పర్యము.

తథా హం ధర్మనిత్యస్య ధర్మపత్నీ పతివ్రతా
త్వయా స్ప్రష్టుం నశక్యాస్మి రాక్షసాధమ పాపినా. ౧౯

టీక॥ రాక్షసాధమ = రాక్షసులలో నధముఁడవగు రావణుఁడా! తథా = అట్లు; ధర్మనిత్యస్య = ధర్మమునందుస్థిరుండైన రాముని యొక్క; ధర్మపత్నీ = ధర్మపత్నిని; పతివ్రతా = పతివ్రతనగు; అహం = నేను; పాపినా = పాపిష్ఠుండవగు; త్వయా = నీచేత; స్ప్రష్టుం = తాఁకుటకు; శక్యా = అలవియయినదానను; నాస్మి = కాను.

రాక్షసాధముఁడవగు రావణుఁడా! ఆప్రకారంబునఁ, బరమధార్మికుండగు రామునిధర్మపత్నిని బతివ్రతను అయిననన్నుఁ, బాపిష్ఠుండవగు నీకుస్పృశింపనెంతమాత్రమలవికాదు.

అని, తాత్పర్యము.

క్రీడంతీ రాజహంసేన పద్మషండేషు నిత్యదా
హంసీ సా తృణషండస్థం కథం పశ్యేత మద్గుకమ్. ౨౦

టీక॥ నిత్యదా = ఎల్లప్పుడు; పద్మషండేషు = కమలసమూహములయందు;

రాజహంసేన(సహ)=రాజహంసముతోఁగూడ; క్రీడంతీ=క్రీడించుచున్న; సా=ఆ; హంసీ=ఆఁడుహంసపక్షి; తృణమండస్థం=తృణసమూహమునందున్న; మద్గుకం=అల్పమయినసీరు కాకిని; కథం=ఎట్లు; పశ్యేత=చూచును?

ఎల్లప్పుడు, కమలవనంబునందు రాజహంసతోఁ గ్రీడించుచుండుహంసి, తృణంబులందిరుగుసీరుకాకిని, కన్నెత్తిచూచునా? అని, తాత్పర్యము.

ఇదం శరీరం నిస్సంజ్ఞం బంధవా ఖాదయస్వవా
నే దం శరీరం రక్ష్యం మే జీవితం వాపి రాక్షస. ౨౧

టీక॥ రాక్షస= రావణుఁడా! నిస్సంజ్ఞం=తెలివిలేనట్టి; ఇదం=ఈ; శరీరం=దేహమును; బంధవా=కట్టివను కట్టుము. ఖాదయస్వవా=భక్షించినను భక్షించుము. ఇదం=ఈ; శరీరం=దేహముగాని; జీవితంవాపి= ప్రాణముగాని; మే=నాకు; నరక్ష్యం=రక్షింపఁదగినదికాదు.

రావణుఁడా! నీవు తాఁకినంతనె యీ దేహంబునిస్సంజ్ఞంబగును; దీనిబంధించినను బంధించుము; భక్షించినను భక్షించుము; నాకు, ఈ దేహమును ప్రాణమునుగాని రక్షించుకొన వలయునని యెంతమాత్రము లేదు.
అని, తాత్పర్యము.

నతు శక్ష్యా మ్యుపక్రోశం పృథివ్యాం దాతు మాత్మనః

టీక॥ ఆత్మనః=నాయొక్క; ఉపక్రోశం=అపవాదమును; పృథివ్యాం=భూమియందు; దాతుం=ఇచ్చుటకు; నశక్ష్యామితు=ఎంతమాత్రముజాలను.
నేను, బాతివ్రత్యభంగంబునొందితిననిలోకములోనపవాదమునుబొందుట నెంతమాత్రము, సహింపఁజాలను. అని, సీతాదేవి, రావణునికిఁజెప్పెను.
అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వాతు వైదేహీ క్రోధా త్సపరుషం వచః. ౨౨
రావణం మైథిలీ తత్ర పున నోఁవాచ కించన

టీక॥ వైదేహీ= సీతాదేవి; క్రోధాత్=కోపమువలన; సపరుషం=కాఠిన్యముతోఁగూడిన; వచః=మాటను ; ఏవం=ఇట్లు;ఉక్త్వాతు=చెప్పినంతనె; తతః=అప్పుడు; మైథిలీ= సీత; రావణం=రావణునిగూర్చి; పునః= మఱల; కించన= కొంచెమేనియు; నోవాచ=చెప్పలేదు.

సీతాదేవి, కోపావేశంబున, నీప్రకారముపరుషముగాఁజెప్పి,యంత రావణునితో మఱేమియుమాటాడక యూరకుండెను. అని, తాత్పర్యము.

సీతాయా వచనం శ్రుత్వా పరుషం రోమహర్షణమ్. ౨౩
ప్రత్యువాచ తత స్సీతాం భయసందర్శనం వచః

టీక॥సః(అధ్యాహృతము)= ఆరావణుఁడు;పరుషం=కఠినమును;రోమహర్షణం= వెంట్రుకలను గగుర్పాటు వొందునట్లుచేయునదియునగు; సీతాయాః=సీతయొక్క ;వచనం = మాటను;శ్రుత్వా=విని;తతః= అంత ; సీతాం=సీతనుగూర్చి; భయసందర్శనం=భయముగలిగించునట్టి ; వచః= మాటను ; ప్రత్యువాచ= బదులుచెప్పెను.

ఆరావణుండు,సీతాదేవిచెప్పిన పరుషంబునుగగుర్పాటు నొందించునదియునగుమాటనువిని, కుపితుండై , సీతాదేవింజూచి, భయంకరమగునీమాటంజెప్పెను.అని,తాత్పర్యము.

శృణు మైథిలి మద్వాక్యం మాసాన్ ద్వాదశ భామిని. ౨౪

టీక॥మైథిలి=సీతా! మద్వాక్యం= నామాటను;శృణు=విను . భామిని= సీతా! ద్వాదశ=పండ్రెండయిన; మాసాన్=మాసములను; దాస్యామి (అధ్యాహృతము)=ఇచ్చెదను.

సీతా ! నేనుజెప్పెడి మాటవినుము ; నీకుఁ బండ్రెండు మాసములు గడువొసంగెదను. అని, తాత్పర్యము.

కాలే నానేన నాభ్యేషి యది మాం చారుహాసిని
తతస్త్వాం ప్రాతరాశార్థం సూదా శ్ఛేత్స్యంతి లేశశః. ౨౫

మాంసరక్తాహారలగు రాక్షసస్త్రీలారా! మీరలు శీఘ్రింబున, వికృతంబును భయంకరంబునగు నాకారంబునొందిన, యీసీతాదేవి, గర్వంబునుండు తురుగాక. అని, రాక్షసస్త్రీలతోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

వచనాదేవ తాస్తస్య సుఘోరా రాక్షసీగణాః
కృతప్రాంజలయో భూత్వా మైథిలీం పర్యవారయన్. ౨౮

టీక॥ సుఘోరాః = మిక్కిలియు భయంకరములగు; తాః = ఆ; రాక్షసీగణాః = రాక్షసీసమూహములు; తస్య = ఆ రావణునియొక్క; వచనాదేవ = మాటవలననే; కృతప్రాంజలయః = చేయఁబడినమంచిచేమోడ్పు గలవి; భూత్వా = అయి; మైథిలీం = సీతను; పర్యవారయన్ = పరివేష్టించినవి.

భయంకరాకారలగు నా రాక్షసస్త్రీలు, రావణుని మాటమాత్రముననే, చేమోడ్పులుగీలించి, సీతాదేవిచుట్టును బరివేష్టించినిలిచిరి.

అని, తాత్పర్యము.

స తాః ప్రోవాచ రాజా తు రావణో ఘోరదర్శనః
ప్రచాల్య చరణోత్కర్షైః దారయన్నివ మేదినీమ్. ౨౯

టీక॥ ఘోరదర్శనః = భయంకరముగ చూచుటగల; రాజా = రాక్షసరాజుడగు; సః = ఆ; రావణస్తు = రావణుండును; చరణోత్కర్షైః = పాదాఘాతములచేత; మేదినీం = భూమిని; ప్రచాల్య = చలింపఁజేసి; దారయన్నివ = పగల్చువాఁడువలె; తాః = ఆ రాక్షసస్త్రీలను గూర్చి; ప్రోవాచ = చెప్పెను.

భయంకరాకారుండగు రాక్షసరాజుఁడగు రావణుండు, కోపంబున, భూమి చలించి పగులునట్లు, కాళ్లచే నేలందన్నుచు, నా రాక్షసస్త్రీలం జూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

అశోకవనికామధ్యే మైథిలీ నీయతామియమ్
తత్రేయం రక్ష్యతాం గూఢం యుష్మాభిః పరివారితా. ౩౦

టీక॥ఇయం=ఈ; మైథిలీ=సీత; అశోకవనికామధ్యే= అశోకవనమునడుమను; నీయతాం= కొనిపోఁబడుఁగాక. తత్ర=అచ్చట; గూఢం = రహస్యముగా; యుష్మాభిః = మీచేత; పరివారితా=పరివేష్టింపఁబడినదై; ఇయం= ఈ సీత ; రక్ష్యతాం = రక్షింపఁబడుఁగాక.

ఈసీతను, అశోకవనంబునడుమనుంచి, మీరలు, ఈవిడచుట్టును బరివేష్టించియుండి, రహస్యముగా నీవిడనురక్షింపుఁడు. అని, తాత్పర్యము.

తత్రైనాం తర్జనై ర్ఘోరైః పునస్సాంత్వైశ్చ మైథిలీమ్
ఆనయధ్వం వశం సర్వా వన్యాం గజవధూ మివ. ౩౧

టీక॥ తత్ర=అచ్చట; సర్వాః=అందఱును; ఘోరైః=భయంకరములయిన; తర్జనైః=బెదరింపులచేతను; పునః=మఱల; సాంత్వైశ్చ=మంచిమాటలచేతను; ఏనాం=ఈ; మైథిలీం=సీతను; వన్యాం=అడవియందుఁబుట్టిన; గజవధూమివ= ఆఁడేనుఁగునువలె; వశం=అధీనతను; ఆనయధ్వం= పొందింపుఁడు.

అయ్యశోకవనంబున, మీరలు, భయంకరముగా బెదరించియు, మఱలఁదిన్నని మాటలం దేర్చియు, అడవియాఁడేనుఁగునుంబోలె, నీసీతనువశీకరింపుఁడు. అని, రావణుండు, రాక్షసస్త్రీల కాజ్ఞాపించెను, అని, తాత్పర్యము.

ఇతి ప్రతి సమాదిష్టా రాక్షస్యో రావణేన తాః
అశోకవనికాం జగ్ము ర్మైథిలీం ప్రతిగృహ్య తు. ౩౨
సర్వకాలఫలై ర్వృక్షై ర్నానాపుష్పఫలై ర్వృతామ్
సర్వకాలమదై శ్చాపి ద్విజై స్సముపసేవితామ్. ౩౩

టీక॥ తాః=ఆ; రాక్షస్యః = రాక్షసస్త్రీలు; ఇతి=అని; రావణేన=రావణునిచేత; ప్రతిసమాదిష్టాః= ఆజ్ఞాపింపఁబడినవారలయి; మైథిలీం= సీతను; ప్రతిగృహ్యతు= తీసికొనియె; సర్వకాలఫలైః= సమస్తకాలములందును ఫలములుగలవియు ; నానాపుష్పఫలైః=నానావిధములయినపూలునుఫల

మనోజ్ఞములగునదియును; వృక్షై = చెట్ల చేత; సంవృతాం=చుట్టబడినదియు; సర్వకాలమనోజ్ఞై= సమస్తకాలములందును మనముగల; పక్షిభిశ్చాపి= పక్షుల చేతను; సముపసేవితాం=సేవింపఁబడినది యునగు; అశోకవనికాం= అశోకవనమును; జగ్ముః=పొందిరి.

ఆరాక్షసస్త్రీలు, రావణునాజ్ఞను శిరసావహించి, సీతం దీసికొని, యెల్లప్పుడును నానావిధఫలపుష్పంబులతోఁ గూడినవృక్షంబులతోను, ఎల్లకాలంబులయందును మదకలములగు పక్షులతోను ఒప్పుచున్నయశోకవనమునకుఁబోయిరి. అని, తాత్పర్యము.

సాతు శోకపరీతాంగీ మైథిలీ జనకాత్మజా
రాక్షసీవశమాపన్నా వ్యాఘ్రీణాం హరిణీ యథా. ౩౪

టీక॥ సా=ఆ; జనకాత్మజా=జనకమహారాజుకొమార్తెయగు; మైథిలీతు=సీతయును; రాక్షసీవశం= రాక్షసస్త్రీల యాధీనతను; ఆపన్నా=పొందినదై; వ్యాఘ్రీణాం = ఆఁడుపులుల యొక్క; వశం,ఆపన్నా (అధ్యాహృతము)=అధీనతనొందిన ; హరిణీయథా=లేడివలెను; శోకపరీతాంగీ=దుఃఖముచేత వ్యాపింపఁబడిన దేహముగలదై; అభూత్ (అధ్యాహృతము)-అయ్యెను.

జనకమహారాజు కొమార్తెయగు నాసీతాదేవి, యీరాక్షసస్త్రీల నడుమఁ జిక్కి, పులులనడుమఁజిక్కినలేడి వలెనే, దుఃఖభయంబులనొందుచుఁ బరితపించెను. అని, తాత్పర్యము.

శోకేన మహతా గ్రస్తా మైథిలీ జనకాత్మజా
న శర్మ లభతే భీరుః పాశబద్ధా మృగీ యథా. ౩౫

టీక॥ జనకాత్మజా = జనకమహారాజుకూఁతురగు; భీరుః= భయపడు స్వభావముగల; మైథిలీ= సీత; మహతా=గొప్పదగు; శోకేన=దుఃఖముచేత; గ్రస్తా=మ్రింగఁబడినదై; పాశబద్ధా=త్రాళ్లచేఁగట్టఁబడిన; మృగీయథా= ఆఁడుజింకవలె; శర్మ=దుఃఖమును ; న లభతే=పొందదయ్యె.

జనకమహారాజపుత్రియగు సీతాదేవి, స్వభావంబున భీరువుగానున్న, తా

శ్లో॥ కట్టఁబడినలేడికైవడిఁ, ఒరమదుఃఖితయై, ఎంతమాత్రముసుఖంబునొందదయ్యె. అని, తాత్పర్యము.

స విందతే తత్రతు శర్మ మైథిలీ
విరూపనేత్రాభి రతీవ తర్జితా
పతిం స్మరంతీ దయితంచ దైవతం
విచేతనా భూ ద్భయశోకపీడితా. ౩౮

టీ॥ తత్రతు = అచ్చటమాత్రము; మైథిలీ = సీత; విరూపనేత్రాభిః = వికృతములయిన కన్నులుగల రాక్షసస్త్రీలచే; అతీవం = మిక్కిలియు; తర్జితా = బెదరింపఁబడినదై; శర్మ = సౌఖ్యమును; న విందతే = పొందదు. దయితంచ = ప్రియుండును; దైవతం = దేవతయునగు; పతిం = పెనిమిటిని; స్మరంతీ = తలంచుచు; భయశోకపీడితా = భయముచేతను దుఃఖముచేతను పీడింపఁబడినదై; విచేతనా = తెలివిలేనిది; అభూత్ = అయ్యెను.

అప్పుడు, సీతాదేవి, వికృతనయనలగు నారాక్షసస్త్రీలు నానావిధంబులఁ బెదరింప, నెంతమాత్రము సుఖంబు నొందక, ప్రియుండు, నిష్టదైవంబును బెనిమిటియునగు రాముందలంచుకొని, భయదుఃఖంబులు మనంబునఁ బెనంగొన, మూర్ఛితయయ్యెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

అరణ్యకాండే, షట్పంచాశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర

వ్యాఖ్యానంబునందు, అరణ్యకాండషట్పంచాశసర్గటీక,

ముగిసినది.

శ్రీ

## సప్తపంచాశసర్గప్రారంభః.

రాక్షసం మృగరూపేణ చరంతం కామరూపిణమ్
నిహత్య రామో మారీచం తూర్ణం పథి న్యవర్తత. ౧

టీక॥ రామః=రాముఁడు; మృగరూపేణ=జింకరూపుచేత; చరంతం=తిరుగుచున్నవాఁడును; కామరూపిణం=ఇచ్ఛాధీనమగురూపముగలవాఁడునగు; రాక్షసం=రాక్షసుఁడైన; మారీచం=మారీచుని; నిహత్య=వధించి; తూర్ణం=శీఘ్రముగా; పథి=మార్గమునందు; న్యవర్తత(న్యవర్తత)=మఱలెను.

రాముండు; మృగరూపంబునందిరుగుచున్న కామరూపియగు మారీచుని వధించి, శీఘ్రంబునఁ దనయాశ్రమంబు దారిఁబట్టిపోయెను. అని, తాత్పర్యము.

తస్య సంత్వరమాణస్య ద్రష్టుకామస్య మైథిలీమ్
క్రూరస్వనోఽథ గోమాయుర్విననాదాస్య పృష్ఠతః. ౨

టీక॥ అథ=అంత; మైథిలీం=సీతను; ద్రష్టుకామస్య=చూడఁగోరికగలవాఁడును; సంత్వరమాణస్య=వేగిరపడుచున్నవాఁడునగు; తస్య=ఆ; అస్య=ఈ రామునియొక్క; పృష్ఠతః=వెనుకను; గోమాయుః=నక్క; క్రూరస్వనః=భయంకరమయినధ్వనిగలదై; వినవాద=అఱచెను.

అంత, నా రాముండు, సీతం జూడఁగోరి, శీఘ్రంబుఁ బోవుచుండఁగా, నతని వెనుకను, నక్క, భయంకరధ్వనితో నఱచెను. అని, తాత్పర్యము.

స తస్య స్వరమాజ్ఞాయ దారుణం రోమహర్షణమ్
చింతయామాస గోమాయోః స్వరేణ పరిశంకితః. ౩

టీక॥ సః=ఆ రాముఁడు; దారుణం=భయంకరమును; రోమహర్షణం=వెంట్రుకలగగుర్పాటునొందించునదియునగు; తస్య=ఆనక్కయొక్క; స్వరం=ధ

నీ; ఆజ్ఞాయ = తెలిసికొని; గోమాయోః = నక్కయొక్క; స్వరేణ = ధ్వనిచే త; పరిశంకితః = సంశయమునొందిన వాడై; చింతయామాస = ఆలోచించెను.

రాముండు, భయంకరమునురోమహర్షణంబునగు నాసక్కధ్వనిని విని, యట్లు తనవెనుకంజేరి నక్కకూయుటచే, సందేహమునొందియిట్లని యాలోచించెను. అని, తాత్పర్యము.

అశుభం బత మన్యేహం గోమాయు ర్వాశ్యతే యథా
స్వస్తి స్యాదపి వైదేహ్యా రాక్షసై ర్భక్షణం వినా. ౪

టీక॥ గోమాయుః = నక్క; యథా = ఎట్లు; వాశ్యతే = అఱచుచున్నదో; తథా (అర్థ్యాహార్యము) = అట్లు; అహం = నేను; అశుభం = అమంగళమును; మన్యే = తలంచెదను. బత = అయ్యో! వైదేహ్యాః = సీతాదేవికి; రాక్షసైః = రాక్షసులచేత; భక్షణంవినా = భక్షించుటలేక; స్వస్తిః = మంగళము; స్యాదపి = కలుగునా యేమి?

ఈప్రకారంబున నక్కయఱచుటవలన, ఏమోయమంగళంబుగలుగునని తలంచెదను; అయ్యో! సీతరాక్షసులచే భక్షింపఁబడక, క్షేమంబుగనుండునా యేమి? అని, తాత్పర్యము.

మారీచేన తు విజ్ఞాయ స్వర మాలంబ్య మామకమ్
విక్రుష్టం మృగరూపేణ లక్ష్మణ శ్శృణుయా ద్యది. ౫
స సౌమిత్రి స్స్వరం శ్రుత్వా తాం చ హిత్వాచ మైథిలీమ్
తయైవ హి ప్రహితః క్షిప్రం మత్సకాశ మిహైష్యతి. ౬

టీక॥ లక్ష్మణస్తు = లక్ష్మణుండుమాత్రము; మృగరూపేణ = జింకయొక్క రూపువంటిరూపముగల; మారీచేన = మారీచునిచేత; మామకం = నాదైన; స్వరం = ధ్వనిని; విజ్ఞాయ = తెలిసికొని; ఆలంబ్య = అవలంబించి; విక్రుష్టం = అఱవఁబడిన; స్వరం = ధ్వనిని; శృణుయాద్యది = వినునేని; సః = ఆ; సౌమిత్రిః = లక్ష్మణుఁడు; స్వరం = ధ్వనిని; శ్రుత్వా = విని; తయా = ఆసీతచేత; ఇహ = ఇక్కటికి; ప్రహితః = పంపఁబడినవాఁడై; తాం = ఆ; మైథిలీంచ = సీతను; హిత్వా

చ=విడిచియు; క్షిప్రం=శీఘ్రము గా; మత్సకాశం= నాసమీపమునుగూర్చి; ఇహ=ఇచ్చటికి; ఏష్యతి=రాఁగలఁడు.

లక్ష్మణుండు, మృగరూపము దాల్చిన మారీచుఁడు నాకంఠధ్వనిజకల్గఁగ గనిపెట్టి యనుసరించి యిట్టి ధ్వనిని వి నియుండు నేని, ఆర్తియైనధ్వనిని విన్న సీతచేఁ బంపఁబడినవాఁడై, యతండు సీతను విడిచి, నన్ను వెదకుకొని, యిచ్చటికి రాఁగలఁడు. అని, తాత్పర్యము.

రాక్షసైస్సహితై ర్నూనం సీతాయా ఈప్సితో వధః
కాంచన శ్చ మృగో భూత్వా వ్యపనీయా శ్రమా త్తు మామ్. ౭
దూరం నీత్వాతు మారీచో రాక్షసో భూ చ్ఛరాహతః
హా లక్ష్మణ హతో స్మీ తి య ద్వాక్యం వ్యాజహారచ. ౮

టీక॥ యత్=ఏకారణము వలన; మారీచః=మారీచుఁడు; కాంచనః= బంగారువికారమయిన; మృగః=జింక; భూత్వాచ=అయ్యు; మాం=నన్ను; ఆశ్రమాత్=ఆశ్రమంబుననుండి; వ్యపనీయతు=తొలఁగించియు; దూరం= దూరముగా; నీత్వాతు=కొనిపోయియు; శరాహతః = బాణముచేఁగొట్టఁబడినవాఁడై; రాక్షసః= రాక్షసుఁడుగా; అభూత్=అయ్యెనో; "హా=అయ్యో! లక్ష్మణ=లక్ష్మణుఁడా! హతః=చంపఁబడినవాఁడను; అస్మి=అయితిని." ఇతి= అని; వాక్యం=మాటను; వ్యాజహారచ= చెప్పెనో; తస్మాత్ (అధ్యాహృతము)=అందువలన; సహితైః=కూడిన; రాక్షసైః=రాక్షసులచేత; సీతాయాః= సీతయొక్క; వధః=చంపుట; ఈప్సితః= కోరఁబడినది. నూనం=నిశ్చయము.

మారీచుండు కాంచనమృగరూపంబున వచ్చి నన్ను ఆశ్రమంబుననుండిబహుదూరంబునకుఁగొనిపోయి, తుదకు బాణహతుండై, మరల రాక్షసుఁడయి వాఁడు; మఱియు మారకసారమున, "హా లక్ష్మణా! హతుఁడనైతిని" అని, నాకంఠధ్వని యిట్లు కూసెను; ఈకారణములవలన, రాక్షసులందఱుచేరి, సీతను జంపివేయుట లెననికోరుదు ర్వారనుటనిశ్చయము. అని, తాత్పర్యము.

అపి స్వస్తి భవే త్తాభ్యాం రహితాభ్యాం మహావనే
జనస్థాననిమిత్తం హి కృతవైరో స్మి రాక్షసైః. ౯

టీక॥ మహావనే = గొప్పయడవియం దు; రహితాభ్యాం = విడువఁబడిన; తాభ్యాం = అసీతాలక్ష్మణులకొఱకు; స్వస్తి = మంగళము; భవేదపి = కలుగునా యేమి? జనస్థాననిమిత్తం = జనస్థాననిమిత్తముగా; రాక్షసైః = రాక్షసులతో; కృతవైరః = చేయఁబడిన వైరముగల వాఁడను; అస్మిహి = అయితినిగదా!

జనస్థానయుద్ధమె నిమిత్తముగా, రాక్షసులతో వైరంబుఁ బెట్టుకొంటిని; మహారణ్యంబున నొంటి నెయున్న సీతాలక్ష్మణులు క్షేమంబుగా నుందురా యేమి? అని, తాత్పర్యము.

నిమిత్తాని చ ఘోరాణి దృశ్యంతేద్య బహూని చ

టీక॥ అద్య = ఇప్పుడు; బహూని చ = పెక్కులయిన; ఘోరాణి = భయంకరములయిన; నిమిత్తాని చ = నిమిత్తములును; దృశ్యంతే = చూడఁబడుచున్నవి.

మఱియు, ఇప్పుడు, భయంకరములయిన నిమిత్తంబులుఁగూడఁ బెక్కులు చూపట్టుచున్నవి. అని, రాముఁడు చింతించెను. అని, తాత్పర్యము.

ఇత్యేవం చింతయన్రామ శ్శ్రుత్వా గోమాయునిస్స్వనమ్. ౧౦
ఆత్మన శ్చాపనయనా న్మృగరూపేణ రక్షసా
ఆజగామ జనస్థానం రాఘవః పరిశంకితః. ౧౧

టీక॥ రాఘవః = రఘువంశమునం దుఁబుట్టిన; రామః = రాముఁడు; గోమాయునిస్స్వనం = జింకయొక్కధ్వనిని; శ్రుత్వా = విని; మృగరూపేణ = జింకరూపముగల; రక్షసా = రాక్షసునిచేత; ఆత్మనః = తనయొక్క; అపనయనాచ్చ = తొలఁగించుటవలనను; పరిశంకితః = సందేహము నొందినవాఁడై; ఇతి = అని; ఏవం = ఇట్లు; చింతయన్ = ఆలోచించుచు; జనస్థానం = జనస్థానమును; ఆజగామ = పొందెను.

రఘువంశమునఁబుట్టిన రాముండు, మృగరూపుఁడగు మారీచుని ధ్వనిని విని, యతఁడు మఱి తన్నట్లు దూరంబు గొనిపోవుటవలనను, సంశయమునొందినవాఁడై, యీప్రకారంబునఁ జింతించుచు, జనస్థానంబునందలి తనయాశ్రమంబునకు వచ్చెను. అని, తాత్పర్యము.

తం దీనమనసో దీన మాసేదు ర్మృగపక్షిణః
సవ్యం కృత్వా మహాత్మానం ఘోరాంశ్చ ససృజుస్స్వరాన్. ౧౨

టీక॥ మృగపక్షిణః=మృగములును బక్షులును; దీనమనసః= దుఃఖితమయిన మనస్సుగలవయి; దీనం = దుఃఖితుండయిన; తం=ఆ రామునిని; ఆసేదుః= సమీపించినవి. మహాత్మానం= పూజ్యమైన స్వభావముగల రామునిగూర్చి; సవ్యం= అప్రదక్షిణమును; కృత్వా= చేసి; ఘోరాన్=భయంకరములయిన; స్వరాంశ్చ=స్వనములను; ససృజుః=విడిచినవి.

మృగపక్షులుదీనములయి, దీనుండైన రామునిచెంతఁజేరి, మహాత్ముండగు నతనికి అప్రదక్షిణముగా దిరిగి, భయంకరంబుగా నఱచినవి.

అని, తాత్పర్యము.

తాని దృష్ట్వా నిమిత్తాని మహాఘోరాణి రాఘవః
న్యవర్తతాథ త్వరితో జవేనాశ్రమ మాత్మనః. ౧౩

టీ॥ రాఘవః = రాముఁడు; మహాఘోరాణి = మహాభయంకరములయిన; తాని=ఆ; నిమిత్తాని = నిమిత్తములను; దృష్ట్వా=చూచి; అథ=అంత; త్వరితః=వేగిరపడినవాఁడై; ఆత్మనః= తనయొక్క; ఆశ్రమం = ఆశ్రమమునుగూర్చి; జవేన=వేగముచేత; న్యవర్తత=మఱలెను.

రాముండు, మహాభయంకరములయినయాదుష్టనిమిత్తములంజూచి, శంకితుండై, వేగంబునఁ దనయాశ్రమంబు దారిఁబట్టి, మఱలెను.

అని, తాత్పర్యము.

సీతాం సతు వరారోహాం లక్ష్మణంచ మహాబలమ్
ఆజగామ జనస్థానం చింతయన్నేవ రాఘవః. ౧౪

టీక॥ సః=ఆ; రాఘవస్తు=రాముండును; వరారోహాం=శ్రేష్ఠములయినపిఱుఁదులుగల; సీతాం=సీతను; మహాబలం = అధికమయిన బలముగల;

లక్ష్మణంచ=లక్ష్మణునిఁ;చింతయన్నేవ=తలంచుచునే;జనస్థానం= జనస్థానమునుగూర్చి;అజగామ=వచ్చెను.

రాముండు,సుందరములయినపీఱుందులుగలసీతాదేవిని,మహాబలుండగు లక్ష్మణునిందలంచుకొనుచునే,జనస్థానంబునందలి తనయాశ్రమంబునకు వచ్చుచుండెను.అని, తాత్పర్యము.

తతో లక్ష్మణ మాయాంతం దదర్శ విగత ప్రభమ్

టీక॥తతః=అంత;సః (అధ్యాహృతము)=ఆరాముఁడు; ఆయాంతం=వచ్చుచున్న;విగతప్రభం= పోయినకాంతిగల;లక్ష్మణం=లక్ష్మణునిఁ; దదర్శ =చూచెను.

అంత, రాముండు, వెలవెలంబాఱు మోముతోఁ దనయొద్దకువచ్చుచున్న లక్ష్మణుఁజూచెను.అని, తాత్పర్యము.

తతో ఽవిదూరే రామేణ సమియాయ స లక్ష్మణః. ౧౫
విషణ్ణ స్సువిషణ్ణేన దుఃఖితో దుఃఖభాగినా

టీక॥తతః=అంత; విషణ్ణః=దిగులుపడినవాఁడును; దుఃఖితః = దుఃఖమునొందినవాఁడునగు;సః=ఆ;లక్ష్మణః=లక్ష్మణుఁడు;సువిషణ్ణేన=మిక్కిలియుదిగులొందినవాఁడును;దుఃఖభాగినా=దుఃఖమునొందినవాఁడునగు; రామేణ=రామునితో; అవిదూరే=సమీపమునందు;సమియాయ - సమాగమమునొందెను.

అంత, దిగులొంది దుఃఖితుండైయున్నయాలక్ష్మణుండు,అట్లు దిగులొందియున్నవాఁడునుదుఃఖితుండునైన రాముని సమీపంబునకుఁబోయెను.

అని, తాత్పర్యము.

స జగర్హేఽథ తం భ్రాతా జ్యేష్ఠో లక్ష్మణ మాగతమ్. ౧౬
విహాయ సీతాం విజనే వనే రాక్షససేవితే

టీక॥అథ=అంత;జ్యేష్ఠః=పెద్దవాఁడైన;భ్రాతా= తోఁబుట్టువగురాముఁడు; సీతాం=సీతను;విజనే = జనులులేని;రాక్షససేవితే=రాక్షసులచే సేవింపఁ

బడిన; వనే=అడవియందు; విహాయ=విడిచి; ఆగతం=వచ్చిన; తం=ఆ; లక్ష్మణం=లక్ష్మణుని; సంజగర్హే=నిందించెను.

అంత, అన్నయగు రాముండు, నిర్జనంబగు వనంబున రాక్షసులుండునట్టి మహారణ్యంబు. సీతాదేవి నొంటివిడిచివచ్చిన లక్ష్మణు నెంతయు నిందించెను.

అని, తాత్పర్యము.

గృహీత్వా చ కరం సవ్యం లక్ష్మణం రఘునందనః। ౧౭
ఉవాచ మధురోదర్క మిదం పరుష మార్తవత్

టీక॥ రఘునందనః=రాముఁడు; సవ్యం=ఎడమదైన; కరం=చేతిని; గృహీత్వాచ=పట్టుకొనియు; లక్ష్మణం=లక్ష్మణునిఁగూర్చి; పరుషం=కఠినముగాను; మధురోదర్కం=తియ్యనిమాటయుత్తరభాగముగాఁగలదిగాను; ఆర్తిమత్=దుఃఖముగలుగునట్లుగాను; ఇదం=ఈమాటను; ఉవాచ=చెప్పెను.

రాముండు, లక్ష్మణుని యెడమచేయిఁబట్టుకొని, మొదటఁ బరుషంబును దుదను మధురంబును దుఃఖయుక్తంబునగు నీమాటం జెప్పెను.

అని, తాత్పర్యము.

అహో లక్ష్మణ గర్హ్యం తే కృతం యత్త్వం విహాయ తాం। ౧౮
సీతా మిహాగత స్సౌమ్య కచ్చిత్స్వస్తి భవేదిహ

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! యత్=ఏ; త్వం=నీవు; తాం=ఆ; సీతాం=సీతను; విహాయ=విడిచి; ఇహ=ఇచ్చటికి; ఆగతః=వచ్చితివో; తత్(అన్యాహృతము)=అట్టి; తే(త్వయా)=నీచేత; గర్హ్యం=నిందింపఁదగిన కార్యము; కృతం=చేయఁబడినది. అహో=ఆశ్చర్యము! సౌమ్య=తిన్ననివాఁడవగు లక్ష్మణుఁడా! ఇహ=ఇప్పుడు; స్వస్తి=మంగళము; భవేత్కచ్చిత్=కలుగునా యేమి!

లక్ష్మణుఁడా! నీవు సీతనచ్చట నొంటిమెయి విడిచివచ్చితివే; తప్పుపని చేసినావు; ఆశ్చర్యముగానున్నది! సౌమ్యుఁడా! ఇప్పుడు, మనకు క్షేమము కలుగునా యేమి? అని, తాత్పర్యము.

న మే స్తి సంశయో వీర సర్వథా జనకాత్మజా. ౧౯
వినష్టా భక్షితా వాపి రాక్షసై ర్వనచారిభిః
అశుభా న్యేవ భూయిష్ఠం యథా ప్రాదుర్భవంతి మే. ౨౦

టీక॥ వీర=పరాక్రమశాలివగు లక్ష్మణుఁడా! యథా=ఎట్లు; అశుభా న్యేవ=దుర్నిమిత్తములే; భూయిష్ఠం= అధికముగా; మే=నాకు; ప్రాదుర్భవంతి=తోఁచుచున్నవో; తథా(అధ్యాహృతము)=అట్లు; సర్వథా= అన్నివిధములను; జనకాత్మజా = జనకమహారాజు కూఁతురయినసీత; వినష్టా= నశించినది. వాపి=లేక; వనచారిభిః= వనంబునందు దిరుగుచున్నట్టి; రాక్షసైః= రాక్షసులచేత; భక్షితా= భక్షింపఁబడినది. మే=నాకు; సంశయః = సందేహము; నాస్తి=లేదు.

పరాక్రమవంతుఁడవగు లక్ష్మణుఁడా! ఇప్పుడు, నాకు దుర్నిమిత్తములే యధికముగా నగపడుచుండుటం జూడఁగా, నన్నివిధంబులను, సీతను, వనచరులగు రాక్షసులు, అపహరించుకొనియయినను బోయియుందురు; లేక, భక్షించియయినను యుందురు; నాకు సందియము లేదు.

అని, తాత్పర్యము.

అపి లక్ష్మణ సీతాయా స్సామగ్ర్యం ప్రాప్నుయావహే
జీవంత్యాః పురుషవ్యాఘ్ర సుతాయా జనకస్య వై. ౨౧

టీక॥ పురుషవ్యాఘ్ర-పురుషశ్రేష్ఠుఁడవగు; లక్ష్మణ=లక్ష్మణుఁడా! జీవంత్యాః=బ్రతికియున్న; జనకస్య=జనకమహారాజుయొక్క ("వై" అనునది పాదపూరణార్థము); సుతాయాః= కొమార్తె యయిన; సీతాయాః= సీతయొక్క; సామగ్ర్యం= కుతిలేకుండుటను, క్షేమమును; అపిప్రాప్నుయావహే=పొందుదుమా యేమి?

పురుషశ్రేష్ఠుఁడవగు లక్ష్మణుఁడా! జనకమహారాజు కొమార్తెయగు సీతాదేవి, బ్రతికి క్షేమముతో నుండుటను, మనము చూడఁగలమా యేమి?

అని, తాత్పర్యము.

యథా వై మృగసంఘాశ్చ గోమాయు శ్చైవ భైరవమ్

వాశ్యంతే శకునాశ్చాపి ప్రదీప్తా మభితో దిశమ్. ౧౨

టీక॥ యథావై=ఎట్లనఁగా, మృగసంఘాశ్చ= జింకలయొక్కగుంపులును; గోమాయుశ్చైవ=నక్కయును; శకునాశ్చాపి=పక్షులును; ప్రదీప్తాం=ప్రకాశించుచున్న; దిశమభితః=దిక్కుచుట్టును; భైరవం=భయంకరముగా; వాశ్యంతే=అఱచుచున్నవి.

ఎందువలననఁగా; జింకలునక్కలునుపక్షులును, సూర్యుఁడుండుదిక్కుఁజేరి, భయంకరంబుగానఱచుచున్నవి. అని, తాత్పర్యము.

అపి స్వస్తి భవే త్తస్యా రాజపుత్ర్యా మహాబల

టీక॥మహాబల= అధికమయినబలముగలలక్ష్మణుఁడా! తస్యాః=ఆ; రాజపుత్ర్యాః= రాచకొమార్తెయగు సీతకు; స్వస్తి=మంగళము; భవేదపి= అగునాయేమి?

మహాబలశాలియగు లక్ష్మణుఁడా! రాచకొమార్తెయగు సీతకు క్షేమంబు గలుగునాయేమి? అని, తాత్పర్యము.

ఇదం హి రక్షో మృగసన్నికాశం
ప్రలోభ్య మాం దూర మనుప్రయాంతమ్. ౧౩
హతం కథంచి న్మహతా శ్రమేణ
స రాక్షసో భూ న్మ్రియమాణ ఏవ

టీక॥ మృగసన్నికాశం= జింకతో సమానుఁడైన; ఇదం=ఈ; రక్షః=రాక్షసుఁడు; అనుప్రయాంతం=వెంబడించుచున్న; మాం=నన్ను; దూరం=దూరముగా; ప్రలోభ్య= మోసపుచ్చి; మహతా=అధికమయిన; శ్రమేణ=కష్టముచేత; కథంచిత్= ఎట్లో; హతం=చంపఁబడినాఁడు. సః= అతఁడు; మ్రియమాణఏవ= మరణమునొందుచునే; రాక్షసః=రాక్షసుఁడు; అభూత్=అయ్యెను.

జింకరూపుదాల్చిన యీరాక్షసుఁడు, తన్నువెంబడించుచున్ననన్నుమోసపుచ్చిబహుదూరముకొనిపోయి, మహాశ్రమంబువనాచే హతుఁడై, మరణకాలంబుననె, రాక్షసరూపంబునొందెను. అని, తాత్పర్యము.

మనశ్చ మే దీన మిహాప్రహృష్టం
చక్షుశ్చ సవ్యం కురుతే వికారమ్. ౨౮
అసంశయం లక్ష్మణ నాస్తి సీతా
హృతా మృతా వా పథి వర్తతే వా

టీక॥ఇహ=ఇప్పుడు; మే= నాయొక్క; మనశ్చ=మనస్సును; దీనం = దుఃఖితమును; అప్రహృష్టం= సంతోషంబులేనిదియు; భవతి(అధ్యాహృతము)= అగుచున్నది. సవ్యం=ఎడమదైన; చక్షుశ్చ=కన్నును; వికారం= వికారమును; కురుతే=చేయుచున్నది. లక్ష్మణ= లక్ష్మణుండా! అసంశయం=సందేహములేనట్లుగా; సీతా=సీత; నాస్తి=లేదు. హృతా=అపహరింపఁబడినదో; మృతా వా=మరణమునొందినదో; పథి=మార్గమునందు; వర్తతే వా= ఉన్నదో.

ఇప్పుడు నామనస్సు దీనమయి సంతోషములేకున్నది; నా యెడమకన్నును అదరుచున్నది; కావున, లక్ష్మణుండా, సీత, రాక్షసులచే నపహరింపఁబడినదో, మరణంబునొందినదో, మార్గంబునం గొనిపోఁబడుచున్నదోఁగాని, యాశ్రమంబునందు లేదు; సందేహములేదు. అని, రాముండు, లక్ష్మణునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అరణ్యకాండే, సప్తపంచాశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అరణ్యకాండసప్తపంచాశసర్గటీక,
ముగిసినది.

స ౫౮

శ్రీ

## అష్టపంచాశ సర్గ ప్రారంభః.

స దృష్ట్వా లక్ష్మణం దీనం శూన్యే దశరథాత్మజః
పర్యపృచ్ఛత ధర్మాత్మా వైదేహీ మాగతం వినా. ౧

టీక॥ ధర్మాత్మా=ధర్మస్వభావుఁడగు; దశరథాత్మజః=దశరథుని కొడుకైన; సః=ఆరాముఁడు; శూన్యే=శూన్యమయినయడవియందు; వైదేహీం వినా=సీతనువిడిచి; ఆగతం= వచ్చినవాఁడును; దీనం=గర్వముడిగినవాఁడునగు; లక్ష్మణం=లక్ష్మణుని; దృష్ట్వా=చూచి; పర్యపృచ్ఛత=అడిగెను.

ధర్మాత్ముఁడగు దశరథమహారాజుపుత్రుఁడైనరాముండు, శూన్యంబగు మహారణ్యంబున, సీతాదేవిని విడిచివచ్చినవాఁడును దీనుండునగు లక్ష్మణుం జూచి, యిట్లనియడిగెను.

అని, తాత్పర్యము.

ప్రస్థితం దండకారణ్యం యా మా మనుజగామహ
క్వ సా లక్ష్మణ వైదేహీ యాం హిత్వా త్వమిహాగతః. ౨

టీ॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! యా=ఎవ్వతె; దండకారణ్యం = దండకారణ్యమునుగూర్చి; ప్రస్థితం = బయలుదేఱిన; మాం=నన్ను ; అనుజగామ= వెంబడించెనో ("హ" అనునది పాదపూరణార్థము); యాం=ఎవ్వతెను ; హిత్వా=విడిచి; త్వం=నీవు; ఇహ = ఇచ్చటికి; ఆగతః=వచ్చినావో; సా = ఆ; వైదేహీ=సీత; క్వ=ఎచ్చట?

లక్ష్మణుఁడా! ఎవ్వతె, దండకారణ్యంబునకువచ్చుచున్ననన్ను వెంబడించివచ్చెనో, అట్టిసీతను , నీవిప్పుడువిడిచి, ఇచ్చటికివచ్చినావే; ఆసీతయిప్పుడెచ్చటనున్నది? అని, తాత్పర్యము.

రాజ్యభ్రష్టస్య దీనస్య దండకాన్పరిధావతః
క్వ సా దుఃఖసహాయా మే వైదేహీ తనుమధ్యమా. ౩

టీక॥ రాజ్యభ్రష్టస్య = రాజ్యమునుండి జారినవాఁడను; దీనస్య = దుఃఖితుండను; దండకాన్ = దండకారణ్యమునుగూర్చి; పరిధావతః = సంచరించుచున్నవాఁడనగు; మే = నా యొక్క; దుఃఖసహాయా = దుఃఖమునకుఁదోడైన; తనుమధ్యమా = సన్ననడుముగల; సా = ఆ; వైదేహీ = సీత; క్వ = ఎక్కడ?

రాజ్యభ్రష్టుండనై దీనుండనై దండకారణ్యంబునందిరుగుచున్న నాతోసమానముగా దుఃఖము ననుభవించుచు నాకుఁదోడుగానున్న, సన్ననడుముగలయా సీతయెక్కడనున్నది?

అని, తాత్పర్యము.

యాం వినా నోత్సహే వీర ముహూర్తమపి జీవితుమ్
క్వసా ప్రాణసహాయా మే సీతా సురసుతోపమా. ౮

టీక॥ వీర = పరాక్రమశాలివగు లక్ష్మణుఁడా! యాంవినా = ఎవ్వతెనువిడిచి; ముహూర్తమపి = కొంచెము సేపైనను; జీవితుం = బ్రతికియుండుటకు; నోత్సహే = కోరనో; సురసుతోపమా = దేవకన్యకతోఁబోలికగల; సా = ఆ; మే = నా యొక్క; ప్రాణసహాయా = ప్రాణములకుఁదోడైన; సీతా = సీత; క్వ = ఎక్కడ?

పరాక్రమశాలివగు లక్ష్మణుఁడా! ఎవ్వతెనువిడిచి, నేను ముహూర్తకాలమైనజీవింపఁజాలనో, అట్టి, దేవకన్యతోసరివచ్చునట్టి, నాప్రాణంబులకుఁ దోడైనసీత యెక్కడనున్నది?

అని, తాత్పర్యము.

పతిత్వ మమరాణాం వా పృథివ్యాశ్చాపి లక్ష్మణ
తాం వినా తపనీయాభాం నేచ్ఛేయం జనకాత్మజామ్. ౫

టీక॥ లక్ష్మణ = లక్ష్మణుఁడా! తపనీయాభాం = బంగారము యొక్క కాంతివంటి కాంతిగల; జనకాత్మజాం = జనకమహారాజుకూఁతురయిన; తాం వినా = ఆసీతనువిడిచి; అమరాణాం = దేవతలయొక్క; పతిత్వం వా = ప్రభుత్వమును గాని; పృథివ్యాః = భూమియొక్క; పతిత్వం (అధ్యాహృతము) చాపి = ప్రభుత్వమును గాని; నేచ్ఛేయం = కోరను.

లక్ష్మణుఁడా! బంగారుఛాయవంటి దేహముగల జనకమహారాజ పుత్రియగు నాసీత లేనియెడ, దేవేంద్రత్వముగాని భూమండలాధిపత్యముగాని, నాకింతమాత్రమక్కఱలేదు.

అని, తాత్పర్యము.

కచ్చి జ్జీవతి వైదేహీ ప్రాణైః ప్రియతరా మమ
కచ్చి త్ప్రవ్రాజనం సౌమ్య నమే మిథ్యా భవిష్యతి. ౬

టీక॥ సౌమ్య= తిన్ననివాఁడవగు లక్ష్మణుఁడా! మమ = నాకు; ప్రాణైః (ప్రాణేభ్యః)= ప్రాణముల కన్నను; ప్రియతరా=అధికప్రియయయిన; వైదేహీ=సీత; జీవతికచ్చిత్ = బ్రతికియున్నదా యేమి? మే=నాయొక్క; ప్రవ్రాజనం=వనవాసము; మిథ్యా = దబ్బఱ; నభవిష్యతికచ్చిత్=కాదా యేమి?

సౌమ్యుండవగు లక్ష్మణుఁడా! నాకుఁ బ్రాణంబులకన్నను బ్రియయయిన సీత బ్రతికియున్నదా? సీతావియోగమువలన, నేనిప్పుడె ప్రాణంబులు వదలఁగాఁ బదునాలుగుసంవత్సరములు వనవాసము సేయుటయను నావ్రతము తప్పిపోదుగదా? అని, తాత్పర్యము.

సీతా నిమిత్తం సౌమిత్రే మృతే మయి గతే త్వయి
కచ్చి త్సకామా సుఖితా కైకేయీ సా భవిష్యతి. ౭

టీక॥ సౌమిత్రే=లక్ష్మణుఁడా! సీతానిమిత్తం=సీతకొఱకు; మయి=నేను; మృతే=మరణంబునొందఁగా; త్వయి=నీవు; గతే=పోఁగా; సా= ఆ; కైకేయీ=కైకేయి; సకామా= కోరఁబడినదానితోఁగూడినదై; సుఖితా= సుఖమునొందినదై; భవిష్యతికచ్చిత్= కాఁగలదా యేమి?

లక్ష్మణుఁడా! సీతనశించుట వలన నేనును మరణంబునొంది, నీవు అయోధ్యకుఁ బోఁగానే, ఆకైకేయి, నిన్నుం జూచి, తనకోరిక యీడేఱెనని సుఖంబునొందఁగలదా యేమి?

అని, తాత్పర్యము.

సపుత్రరాజ్యాం సిద్ధార్థాం మృతపుత్రా తపస్వినీ

ఉపస్థాస్యతి కౌసల్యా కచ్చిత్సౌమ్యేన కైకయీమ్. ౮

టీక॥ సపుత్రరాజ్యాం = కొడుకుతోను రాజ్యముతోనుంగూడినదియు; సిద్ధార్థాం = ఈడేఱినప్రయోజనము గలదియునగు; కైకయీం = కైకేయిని; మృతపుత్రా = చచ్చినకొడుకు గలదియు; తపస్వినీ = శోచనీయయునగు; కౌసల్యా = కౌసల్య; సౌమ్యేన = వినయముచేత; ఉపస్థాస్యతికచ్చిత్ = సేవింపఁ గలదాయేమి!

అట్లు పుత్రుఁడనైన నేనును మృతిఁ బొందిన నికరింపఁదగినస్థితిలోనుండు కౌసల్యాదేవి, కొడుకుతోను దొరతనముతోనుంగూడినదియుఁ దనకోర్కులన్నియు నీడేర్చుకొన్నదియునగు కైకేయిని, వినయంబున, సేవింపుచుండఁ గలదాయేమి? అని, తాత్పర్యము.

యది జీవతి వైదేహీ గమిష్యామ్యాశ్రమం పునః

సువృత్తా యది వృత్తా సా ప్రాణాం స్త్యక్ష్యామి లక్ష్మణ. ౯

టీక॥ లక్ష్మణ = లక్ష్మణుఁడా! వైదేహీ = సీత; జీవతియది = బ్రతికియుండునేని; పునః = మఱల; ఆశ్రమం = ఆశ్రమమునుగూర్చి; గమిష్యామి = పోయెదను. సువృత్తా = మంచియాచారముగల; సా = ఆసీత; వృత్తాయది = మృతిఁ బొందెనేని; ప్రాణాన్ = ప్రాణములను; త్యక్ష్యామి = విడిచెదను.

లక్ష్మణుఁడా! సీతబ్రతికియుండునేని మఱలనాశ్రమంబునకువచ్చెదను; సదాచారసంపన్నయగునాసీత, మృతిఁ బొందియుండిన యెడఁ, బ్రాణంబులు విడిచెదను. అని, తాత్పర్యము.

యది మా మాశ్రమగతం వైదేహీ నాభిభాషతే

పునః ప్రహసితా సీతా వినశిష్యామి లక్ష్మణ. ౧౦

టీక॥ లక్ష్మణ = లక్ష్మణుఁడా! ప్రహసితా = మంచినవ్వుగల; వైదేహీ = విదేహదేశమునందుఁబుట్టిన; సీతా = సీత; ఆశ్రమగతం = ఆశ్రమమునొందిన; మాం = [illegible]చ్చి; నాభిభాషతేయది = మాటలాడకుండునేని; పునః = ఇం

క; వినశిష్యామి=మృతిఁబొందెదను. లక్ష్మణుఁడా! నే నాశ్రమముఁబునకుఁజేరఁగానే, సీత, మొగంబునందిఱు నగవొప్పు, మధురాలాపంబు లాడుచు నాచెంతకు రాకుండునేని, నేనుతత్క్షణంబ మరణంబునొందుదును.

అని, తాత్పర్యము.

బ్రూహి లక్ష్మణ వైదేహీ యది జీవతి వా నవా
త్వయి ప్రమత్తే రక్షోభి ర్భక్షితా వా తపస్వినీ. ౧౭

టీక॥ లక్ష్మణ- లక్ష్మణుఁడా! వైదేహీ=సీత; జీవతి యదివా=బ్రతికియున్నదా? నవా=లేదా? బ్రూహి=చెప్పుము. త్వయి=నీవు; ప్రమత్తే=ఏమఱినవాఁడవై యుండఁగా; తపస్వినీ=కృశించినసీత; రక్షోభిః=రాక్షసులచేత; భక్షితావా=భక్షింపఁబడినదా? ఏమి?

లక్ష్మణుఁడా! సీత బ్రతికియున్నదా లేదా? చెప్పు. లేక, నీవు, ఏమఱియుండఁగా, రాక్షసులుచూచి దిక్కు-లేనిసీతను భక్షించివేసినారా?

అని, తాత్పర్యము.

సుకుమారీ చ బాలా చ నిత్యం చా దుఃఖదర్శినీ
మద్వియోగేన వైదేహీ వ్యక్తం శోచతి దుర్మనాః. ౧౮

టీక॥ సుకుమారీచ=మృదువయిన దేహముగలదియు; బాలాచ=చిన్నదియు; నిత్యం=ఎల్లప్పుడును; అదుఃఖదర్శినీచ=సుఖముఁ జూడనదియు నగు; వైదేహీ=సీత; మద్వియోగేన=నా విరహముచేత; దుర్మనాః=దుఃఖము నొందినమనస్సుగలదై; శోచతి=దుఃఖించుచున్నది. వ్యక్తం-స్పష్టము.

సుకుమారశరీరయును చిన్నవయస్సుదియు నెప్పుడును దుఃఖమునెఱుంగనిదియునగుసీత, నావియోగంబుగలుగుటచే, దుఃఖంబునొందఁగలదు; ఇది స్పష్టము. అని, తాత్పర్యము.

సర్వథా రక్షసా తేన జిహ్మేన సుదురాత్మనా

వదతా లక్ష్మణేత్యుచ్చై స్తవాపి జనితం భయమ్. ౧౩

టీక॥ జిహ్మేన=కపటియు; సుదురాత్మనా=మిక్కిలియు దుష్టబుద్ధి గలవాఁడును; లక్ష్మణేతి = లక్ష్మణుఁడా యని; ఉచ్చైః=గట్టిగా; వదతా=చెప్పుచున్నవాఁడునగు; తేన=ఆ;రక్షసా=రాక్షసునిచేత; సర్వథా= అన్నివిధంబులను; తవాపి=నీకును; భయం=భయము; జనితం=కలిగింపఁబడినది.

కపటియు దురాత్ముండునగు నా రాక్షసుండు, "లక్ష్మణుఁడా" యని గట్టిగా నఱచుటచేత, శూరుండవగు నీకును భయంబుగలిగినది.

అని, తాత్పర్యము.

శ్రుతస్తు శంకే వైదేహ్యా స స్వర స్సదృశో మమ
త్రి స్తయా ప్రేషిత స్త్వంచ ద్రష్టుం మాం శీఘ్రమాగతః. ౧౪

టీక॥ వైదేహ్యా=సీతచేత; మమ=నాయొక్క; స్వరేణ (అధ్యాహృతము)=ధ్వనితో; సదృశః = సమానమయిన; స్వరః=ధ్వని; శ్రుతస్తు=వినఁబడినదియు. త్వంచ=నీవును;త్రి స్తయా=భయమునొందినసీతచేత; ప్రేషితః=పంపఁబడినవాఁడవై; శీఘ్రం=శీఘ్రముగా; మాం=నన్ను; ద్రష్టుం=చూచుటకు; ఆగతః=వచ్చినావు. ఇతి(అధ్యాహృతము)=అని; శంకే= ఊహించుచున్నాను.

నాకంఠధ్వనియట్లు,ఆరాక్షసుండు కూసినమాటను, సీతవినియుండును. అంత, భయపడినన్నుఁబంపఁగా, నీవు నన్నుఁజూచుటకై, శీఘ్రంబునవచ్చినావనితలంచెదను. అని, తాత్పర్యము.

సర్వథాతు కృతం కష్టం సీతా ముత్సృజతా వనే
ప్రతికర్తుం నృశంసానాం రక్షసాం ద త్త మంతరమ్. ౧౫

టీక॥ వనే=అడవియందు;సీతాం=సీతను; ఉత్సృజతా=విడుచుచున్ననీచేత; సర్వథాతు=అన్నివిధంబులనేః కష్టం=కష్టము; కృతం= చేయఁబడినది. నృశంసానాం = క్రూరులగు ; రక్షసాం=రాక్షసులకు; ప్రతికర్తుం =

బదులు సేయుటకు; అంతరం=అవకాశము; దత్తం=ఇవ్వఁబడినది.

అడవియందు సీతనొంటి విడిచి వచ్చుటచేత, నీవు చాలఁ గష్టము గావించినావు; క్రూరులగు రాక్షసులకు, మనపై వైరంబు దీర్చుకొనుట కవకాశము లేకుండినది; ఇప్పుడు నీవు, అవకాశంబు గలిగించితివి. అని, తాత్పర్యము.

దుఃఖితాః ఖరఘాతేన రాక్షసాః పిశితాశనాః
తైస్సీతా నిహతా ఘోరై ర్భవిష్యతి నసంశయః. ౧౬

టీక॥ పిశితాశనాః=మాంసమె యాహారముగాఁ గల; రాక్షసాః= రాక్షసులు; ఖరఘాతేన= ఖరుని వధించుటచేత; దుఃఖితాః=దుఃఖము నొందినారు. ఘోరైః=భయంకరులగు; తైః = ఆ రాక్షసులచేత; సీతా=సీత; నిహతా= వధింపఁబడినది; భవిష్యతి=కాఁగలదు. సంశయః=సందేహము; న=లేదు.

మాంసాహారులగు రాక్షసులు, నేను ఖరుని వధించుటచేఁ, జాల దుఃఖంబు నొందియున్నారు; భయంకరాకారులగు నా రాక్షసులు, సీతను వధించియుందురు; సందియము లేదు.

అని, తాత్పర్యము.

అహోస్మి వ్యసనే మగ్న స్సర్వథా శత్రుసూదన
కిన్న్విదానీం కరిష్యామి శంకే ప్రాప్తవ్య మీదృశమ్. ౧౭

టీక॥ శత్రుసూదన=శత్రువుల చంపునట్టి లక్ష్మణుఁడా; అహో = అయ్యో! సర్వథా=అన్నివిధములను; అస్మిన్=ఈ; వ్యసనే=దుఃఖమునందు; మగ్నః=మునిఁగినవాఁడనై; ఇదానీం=ఇప్పుడు; కిన్ను=దేనిని; కరిష్యామి=చేసెదను? ఈదృశం=ఇట్టిది; ప్రాప్తవ్యం=పొందఁబడవలసినది. శంకే=తలంచెదను.

శత్రువులం జంపునట్టి లక్ష్మణుఁడా! అయ్యో! నేనిప్పుడీ వ్యసనసముద్రమునందు మునింగి, యేమి చేయఁగలను? ఇట్టి యాపదను బొందవలసినట్లు విధి యున్నదని తలంచెదను. అని, రాముండు లక్ష్మణునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇతి సీతాం వరారోహాం చింతయ న్నేవ రాఘవః

స ౫౮

అజగామ జనస్థానం త్వరయా సహలక్ష్మణః. ౧౮

టీక॥ రాఘవః=రాముఁడు; ఇతి=ఇట్లు; వరారోహాం=శ్రేష్ఠములయిన పిఱుందులుగల; సీతాం=సీతను; చింతయన్నేవ=తలంచుచునే; సహలక్ష్మణః = లక్ష్మణునితోఁ గూడిన వాఁడై; త్వరయా=వేగముచేత ; జనస్థానం=జనస్థానమును; అజగామ=పొందెను.

రాముండీప్రకారంబున, సుందరంబులగుపిఱుందులుగలసీతనే తలంచుచు, లక్ష్మణునితోఁగూడ, వేగంబున , జనస్థానంబునకుఁబోయెను.

అని, తాత్పర్యము.

విగర్హమాణో ఽనుజ మార్తరూపం
క్షుధా శ్రమాచ్చైవ పిపాసయాచ
వినిశ్శ్వసన్ శుష్కముఖో వివర్ణః
ప్రతిశ్రయం ప్రాప్య సమీక్ష్య శూన్యమ్. ౧౯
స్వ మాశ్రమం సంప్రవిగాహ్య వీరో
విహార దేశా ననుసృత్య కాంశ్చిత్
ఏత త్తదిత్యేవ నివాస భూమౌ
ప్రహృష్ట రోమా వ్యథితో బభూవ. ౨౦

టీక॥ వీరః = పరాక్రమశాలియగు రాముఁడు; ఆర్తరూపం = దుఃఖము నొందినయాకారముగల ; అనుజం=తమ్మునిని; విగర్హమాణః=నిందించుచు; క్షుధా=ఆఁకలిచేతను ; శ్రమాచ్చైవ=అలసటవలనను; పిపాసయాచ= దప్పిచేతను; వినిశ్శ్వసన్= నిట్టూర్పులు పుచ్చుచు; శుష్కముఖః = ఎండిననోరుగలవాఁడై; వివర్ణః = తెల్లఁబాఱిన వాఁడై; ప్రతిశ్రయం= ఆశ్రమ ప్రదేశమును; ప్రాప్య=పొంది; శూన్యం=పాడుపడినదానిఁగా; సమీక్ష్య = చూచి; స్వం=తనదైన; ఆశ్రమం = ఆశ్రమమును; సంప్రవిగాహ్య=ప్రవేశించి; విహారదేశాన్=విహరించు ప్రదేశములను; కాంశ్చిత్=కొన్నిటిని ; అనుసృత్య= వెంబడించి; నివాసభూమౌ = నివాసస్థానమునందు; ఏతత్=ఇది; తత్=అది; ఇత్యేవ=అనియే; ప్రహృష్టరోమా= గగుర్పాటునొందిన వెండ్రుకలు గల

వాఁడై; వ్యథితః=దుఃఖితుఁడు; బభూవ=అయెను.

పరాక్రమవంతుండగు రాముండు, దుఃఖితుండైయున్నతమ్ముని లక్ష్మణుని నీప్రకారంబున నిందించుచు, ఆఁకలిదప్పులవలనను శ్రమంబువలనను నిట్టూర్పులుపుచ్చుచు, ఎండిననోరుగలవాఁడై, వివర్ణుండై, తనయాశ్రమ సమీపప్రదేశమునకుఁబోయి యచ్చట సీతం గానక, యంతనాశ్రమంబుఁజొచ్చి, యచ్చటనుబ్రియురాలిం గానక, విహారప్రదేశంబులంజూచి, యాక్రీడావాసస్థానంబునందు, "ఈప్రదేశంబిట్టిది, ఇదియట్టి" దనిచెప్పుచు, మేనంగగుపాటుగదురఁ, బరమదుఃఖితుండయ్యె.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అరణ్యకాండే, అష్టపంచాశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అరణ్యకాండాష్టపంచాశసర్గటీక,
ముగిసినది.

---

ఏ కో న ష ష్టి త మ స ర్గ ప్రా రం భః.

అథాశ్రమా దుపావృత్త మంతరా రఘునందనః
పరిపప్రచ్ఛ సౌమిత్రిం రామో దుఃఖార్దితం పునః. ౧

టీక॥ అథ=అంత; రఘునందనః=రఘువంశమునందుఁ బుట్టినవారల సంతోషింపఁజేయునట్టి; రామః=రాముఁడు; అంతరా = దారినడుమ; ఆశ్రమాత్ = ఆశ్రమముననుండి; ఉపావృత్తం=వచ్చినట్టి; దుఃఖార్దితం=దుఃఖముచేఁబీడింపఁబడిన; సౌమిత్రిం=లక్ష్మణుని; పునః=మఱల; పరిపప్రచ్ఛ=అడిగెను.

అంత, రఘువంశమునకుసంతోషంబుగలిగించునట్టిరాముండు, ఆశ్రమమువనుండి వచ్చిన పరమ దుఃఖితుండగు లక్ష్మణుని, దారినడుమంజూచి, మఱల నిట్లని యడిగెను. అని, తాత్పర్యము.

తమువాచ కిమర్థంత్వ మాగతోఽపాస్య మైథిలీమ్
యదా సా తవ విశ్వాసా ద్వనే విరహితా మయా. ౨

టీక॥ రామః (అధ్యాహృతము)- రాముడు; తం= ఆలక్ష్మణుని గూర్చి; ఉవాచ=చెప్పెను. యదా= ఎప్పుడు; తవ=నీయొక్క, నీయందలియగుట; విశ్వాసాత్=నమ్మకమువలన; మయా=నాచేత; వనే= అడవియందు; సా=ఆసీత; విరహితా= విడువఁబడినదో; తదా (అధ్యాహృతము) - అప్పుడు; త్వం= నీవు; మైథిలీం=సీతను; అపాస్య=విడిచి; కిమర్థం= ఎందుకొఱకు; ఆగతః=వచ్చినావు?

రాముండు, లక్ష్మణుఁజూచి యిట్లనియె; నేను, నీయందలి నమ్మకంబున, సీతనువనంబునందు విడిచిపోయియుండఁగా, నీవు ఆవిడనువిడచి యెందుకువచ్చితివి? అని, తాత్పర్యము.

దృష్ట్వైవాభ్యాగతం త్వాం మే మైథిలీం త్యజ్య లక్ష్మణ
శంకమానం మహత్పాపం యత్సత్యం వ్యథితం మనః. ౩

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! మైథిలీం=సీతను; త్యజ్య(త్యక్త్వా)= విడిచి; అభ్యాగతం=వచ్చిన; త్వాం= నిన్ను; దృష్ట్వైవ=చూచినంతనె; మే= నాయొక్క; మనః=మనస్సు; మహత్= గొప్పదగు; పాపం= పాపమును; శంకమానం= ఊహించుచు; వ్యథితం(ఇతి)యత్ =దుఃఖమునొందినదనునదియే దిగలదో; తత్ (అధ్యాహృతము)=అది; సత్యం=యథార్థము.

లక్ష్మణుఁడా! సీతనడవిలోవిడిచివచ్చిననిన్నుఁజూచినంతనె, సీతకేమో మహాభయంబుగలిగియుండునని భయంబునొంది, నామనస్సు, వాస్తవముగా మిక్కిలియు దుఃఖమునొందినది. అని, తాత్పర్యము.

స్ఫురతే నయనం సవ్యం బాహుశ్చ హృదయంచ మే
దృష్ట్వా లక్ష్మణ దూరే త్వాం సీతావిరహితం పథి. ౪

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! పథి= మార్గమునందు; దూరే= దూరము

నంము; సీతావిరహితం=సీతచేవిడువఁబడిన; త్వాం=నిన్ను; దృష్ట్వా= చూచి; మే=నాయొక్క; సవ్యం= ఎడమదైన; నయనం=కన్నును; బాహుశ్చ=భుజమును; హృదయంచ=రొమ్మును; స్ఫురతే=అదరుచున్నది.

లక్ష్మణుఁడా! సీతనువిడిచివచ్చుచున్ననిన్ను, దూరంబుననుండి దారిలోఁజూచినంతనే, నాయెడమకన్నును ఎడమభుజంబునువక్షంబును, అదరుచున్నవి. అని, రాముండు, లక్ష్మణునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు సౌమిత్రి ర్లక్ష్మణ శ్శుభలక్షణః
భూయో దుఃఖసమావిష్టో దుఃఖితం రామ మబ్రవీత్. ౫

టీక॥శుభలక్షణః= మంగళకరంబులయినలక్షణములుగల; సౌమిత్రిః= సుమిత్రకొమరుఁడయిన; లక్ష్మణః= లక్ష్మణుఁడు; ఏవం=ఇట్లు; ఉక్తస్తు= చెప్పఁబడినవాఁడైనంతనే; దుఃఖితం = దుఃఖము నొందిన; రామం = రామునిఁగూర్చి; భూయః=మిక్కిలియు; దుఃఖసమావిష్టః=దుఃఖము నొందినవాఁడై; అబ్రవీత్= చెప్పెను.

మంగళకరంబులగులక్షణంబులుగలసుమిత్రాపుత్రుఁడగులక్ష్మణుండు, ఇట్లు రామునకుచెప్పిన మాటలనువిని, దుఃఖితుండై, యిట్లని, చెప్పెను.
అని, తాత్పర్యము.

న స్వయం కామకారేణ తాం త్యక్త్వా౾హ మిహా౾గతః
ప్రచోదిత స్తయైవో గ్రై స్త్వత్సకాశ మిహా౾గతః. ౬

టీక॥అహం=నేను; స్వయం=నేనైయె; కామకారేణ = స్వేచ్ఛచేత; తాం=ఆసీతను; త్యక్త్వా= విడిచి; ఇహ=ఇచ్చటికి; నాగతః= వచ్చినవాఁడనుగాను. తయైవ= ఆసీతచేతనే; ఉగ్రైః=క్రూరములయినమాటలచేత; ప్రచోదితః= ప్రేరేపింపఁబడినవాఁడనై; త్వత్సకాశం= నీసమీపమును గూర్చి; ఇహ=ఇచ్చటికి; ఆగతః = వచ్చినాను.

నేనై స్వేచ్ఛగా సీతవద్దట విడిచి, యిచ్చటికివచ్చినవాఁడనుగాను; ఆసీతచే, అతితీక్ష్ణములగుమాటలచే, బాణప్రాయనిపలుమాటు ప్రేరింపఁగా,

పిలుచుటచేవతిసీచంబునకు, "సీతా! రక్షింపుము" అను నీమాట నెట్లు చెప్పుదు? అని, తాత్పర్యము.

కిన్నిమిత్తంతు కేనాపి భ్రాతు రాలంబ్య మే స్వరమ్
రాక్షసే నేరితం వాక్యం త్రాహిత్రాహీతి శోభనే. ౧౨

టీక॥ శోభనే=మంగళరూపిణివగుసీతా! కిన్నిమిత్తంతు=ఏదోయొకయుద్దేశమునుగూర్చి; కేనాపిరాక్షసేన = ఎవ్వఁడోయొకరాక్షసునిచేత; మే = నాయొక్క; భ్రాతుః=అన్నయొక్క; స్వరం=కంఠధ్వనిని; ఆలంబ్య= అవలంబించి; త్రాహిత్రాహీతి = రక్షించురక్షించుమనెడు; వాక్యం=మాట; ఈరితం= చెప్పఁబడినది.

మంగళరూపిణివగుసీతా! ఎవ్వఁడోయొకరాక్షసుండు, ఏదోయొకప్రయోజనమునుద్దేశించి, నాయన్నయగు రామునికంఠధ్వనికిసరిగానుండునట్లు, "రక్షించురక్షించు"మనియఱచినాఁడేగాని వేఱుగాదు. అని, తాత్పర్యము.

విస్వరం వ్యాహృతం వాక్యం లక్ష్మణ త్రాహిమా మితి
న భవత్యా వ్యథా కార్యా కునారీజనసేవితా. ౧౩

టీ॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! మాం= నన్ను; త్రాహి=రక్షింపుము, ఇతి=అనెడు; వాక్యం=మాట; విస్వరం=వికృతమయినధ్వని గలుగునట్లుగా; వ్యాహృతం=చెప్పఁబడినది. భవత్యా=నీచేత; కునారీజనసేవితా= కుత్సితస్త్రీలచే సేవింపఁబడినట్టి; వ్యథ=దుఃఖము; న కార్యా=చేయఁదగినదికాదు.

"లక్ష్మణుఁడా! నన్నురక్షింపుము" అని చెప్పినమాట ధ్వనివికృతముగా వినంబడినది; కాఁబట్టి నకేలగా నాలోచించినచో, నది రామధ్వనియని యెతోఁచదు; కావున, కుత్సితస్త్రీలవలె, నుత్తమస్త్రీవగు నీవిట్లు దుఃఖించుట యుక్తముగాదు. అని, తాత్పర్యము.

అలం వైక్లబ్య మాలంబ్య స్వస్థా భవ నిరుత్సుకా

టీక॥ వైక్లబ్యం=దుఃఖమును; అలంబ్య=అవలంబించి; అలం=చాలును. స్వస్థా= నెమ్మదిగలదానవును; నిరుత్సుకా=తొందరలేనిదానవునుగా; భవ=ఉండుము.

దుఃఖమువదలి నెమ్మదిగా నుండుము; నన్నుఁబంపవలెననుతలంపునువిడువుము, అని, తాత్పర్యము.

న సోస్తి త్రిషు లోకేషు పుమాన్వై రాఘవం రణే. ౧౪
జాతోవా జాయమానోవా సంయుగే యః పరాజయేత్

టీక॥ యః=ఎవ్వఁడు; రణే= యుద్ధమునందు; రాఘవం=రామునిని; సంయుగే=యుద్ధమునందు; పరాజయేత్=గెలుచునో; సః=అట్టి; పుమాన్= పురుషుఁడు; "వై" అనునది పాదపూరణార్థము) జాతోవా= పుట్టినవాఁడుగాని; జాయమానోవా= పుట్టఁబోవువాఁడుగాని; త్రిషు=మూఁడైన; లోకేషు=లోకములయందును; నాస్తి=లేఁడు.

యుద్ధంబున రామునిగెలువఁగల యట్టి, పురుషుఁడు, ముల్లోకంబులం దెవ్వటను, ఇదివఱకుఁబుట్టియుండఁడు; ఇంకంబుట్టనుంబోఁడు.

అని, తాత్పర్యము.

నజయ్యో రాఘవో యుద్ధే దేవైశ్శక్ర పురోగమైః. ౧౫

టీక॥ రాఘవః=రాముఁడు; శక్రపురోగమైః= దేవేంద్రుఁడుముందునడచువాఁడుగాఁగల; దేవైః=దేవతలచేతను; యుద్ధే=యుద్ధమునందు; జయ్యః = జయింపనలవియయిన వాఁడు; న=కాఁడు.

దేవేంద్రునిముందిడుకొని దేవతలందఱు వచ్చినను, యుద్ధంబున రాముని జయింపఁజాలరు అని, సీతతోఁజెప్పితిని.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తాతు వైదేహీ పరిమోహిత చేతనా
ఉవాచ శ్రాణి మందంతి దారుణం తమిదం వచః. ౧౬

టీక॥ వైదేహీ=సీత; ఏవం=ఇట్లు; ఉక్తాతు = చెప్పఁబడినదైనంతనె; పరి

మోహితచేతనా=మోహమునొందిన బుద్ధిగలదై; అశ్రూణి=కన్నీళ్లను; ముంచతి=విడుచుచు; మాం = నన్నుఁగూర్చి; దారుణం= భయంకరమయిన; ఇదం=ఈ; వచః=మాటను; ఉవాచ=చెప్పెను.

ఈప్రకారము నేను జెప్పినంత, సీత, యుక్తాయుక్తబుద్ధిలేక, కన్నీళ్లు విడుచుచు, నన్నుఁజూచి, భయంకరంబులగు మాటల, నిట్లని చెప్పెను.

అని, తాత్పర్యము.

భావో మయి తవాత్యర్థం పాపఏవ నివేశితః
వినష్టే భ్రాతరి ప్రాప్తుం నచత్వం మా మవాప్స్యసి. ౧౭

టీక॥ భ్రాతరి=అన్న; వినష్టే = నాశమునొందఁగా; ప్రాప్తుం= పొందుటకు; మయి=నాయందు; తవ(త్వయా)=నీచేత; అత్యర్థం = మిక్కిలి యు; పాపః=దుష్టమయిన; భావః= అభిప్రాయము; నివేశితః= ఉంచఁబడియున్నది. త్వంచ=నీవో; మాం=నన్ను; నావాప్స్యసి=పొందఁజాలవు.

అన్న యెట్లయినను నాశంబునొందినంత నన్నుఁబొందవలెనని, నీవు, నాయందు, మిక్కిలియుఁబాపిష్ఠంబగునభిప్రాయమునే యుంచియున్నావు, అయితేనే నేను నన్నుఁబొందఁజాలవు.

అని, తాత్పర్యము.

సంకేతాద్భరతేన త్వం రామం సమనుగచ్ఛసి
క్రోశంతం హి యథాత్యర్థం నైన మభ్యవపద్యసే. ౧౮

టీక॥ యథా=ఎందువలన; అత్యర్థం=మిక్కిలియు; క్రోశంతం=అఱచుచున్న; ఏనం=ఈరాముని గూర్చి; నాభ్యవపద్యసే=పోవున్నావో; తతః(అధ్యాహృతము)=అందువలన; త్వం=నీవు; భరతేన=భరతునితోడి; సంకేతాత్=సంకేతమువలన; రామం=రాముని; సమనుగచ్ఛసి= వెంబడించుచున్నావు.

ఇంత అఱచినను, రామునియొద్దకుఁబోవుటకు నీకిష్టము రాలేదే; కావున, నీవు, భరతునితో సంకేతము చేసికొని, రాముని వెంబడికపటంబున నట్లువచ్చుచున్నావుకాని వేఱుగాదు.

అని, తాత్పర్యము

రిపుః ప్రచ్ఛన్నచారీ త్వం మదర్థ మనుగచ్ఛసి
రాఘవస్యాంతరప్రేప్సు స్తథైనం నాభిపద్యసే. ౧౯

టీక॥ త్వం=నీవు; రిపుః=శత్రుండవు; ప్రచ్ఛన్నచారీ=కపటము గాఁదిరుగువాఁడవు. రాఘవస్య=రామునియొక్క; అంతరప్రేప్సుః=ఛిద్రమునుగోరినవాఁడవై; మదర్థం=నాకొఱకు; అనుగచ్ఛసి=వెంబడించుచున్నావు. తథా=అందువలన; ఏనం=ఈరామునిఁగూర్చి; నాభిపద్యసే=పోవకున్నావు.

నీవు, శత్రుండవు, కపటవేషంబుతోనున్నావు; రామునికెప్పుడు వినాశంబుగలుగునోయని, నాకొఱకై వెంబడివచ్చుచున్నావు; అందువలననే, నీవు, ఆపత్కాలంబున, రామునియొద్దకుంబోయిసాహాయ్యముసేయనొల్లకున్నావు అని, సీతనాతోఁజెప్పినది.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తోహి వైదేహ్యా సంరబ్ధో రక్తలోచనః
క్రోధాత్ప్రస్ఫురమాణోష్ఠ ఆశ్రమా దభినిర్గతః. ౨౦

టీక॥ అహం (అధ్యాహార్యము)=నేను; వైదేహ్యా=సీతచేత; ఏవం=ఇట్లు; ఉక్తోహి=చెప్పఁబడినవాఁడనై; క్రోధాత్=కోపమువలన; సంరబ్ధః=వేగిరపడినవాఁడనై; రక్తలోచనః=ఎఱ్ఱనికన్నులుగలవాఁడనై; ప్రస్ఫురమాణోష్ఠః=అదరుచున్న పెదవులుగలవాఁడనై; ఆశ్రమాత్=ఆశ్రమమునుండి; అభినిర్గతః=ఎదురుగావచ్చినాను.

ఇట్లుసీతచెప్పఁగానే, నేను, కోపంబునొంది, సంరబ్ధుండనై, కన్నులనెఱ్ఱఁదనంబుఁగదురఁ, బెదవులదర, నాశ్రమంబువెడలి నీకెదురుగావచ్చితిని. అని, లక్ష్మణుండు, రామునితోఁజెప్పెను. అని, తా.

ఏవం బ్రువాణం సౌమిత్రిం రామ స్సంతాప మోహితః
అబ్రవీ ద్దుష్కృతం సౌమ్య తాం వినా య త్త్వ మాగతః. ౨౧

టీక॥ రామః=రాముఁడు; సంతాపమోహితః=సంతాపముచే మోహంబునొందినవాఁడై; ఏవం=ఇట్లు; బ్రువాణం=చెప్పుచున్న; సౌమిత్రిం=లక్ష్మణు

స ౫౯

నిఁగూర్చి; అబ్రవీత్ = చెప్పెను. సౌమ్య = తిన్ననివాఁడవగులక్ష్మణుఁడా! త్వం=నీవు; తాంవినా=ఆసీతనువిడిచి; ఆగతః(ఇతి)యత్ = వచ్చినావనునది యేదిగలదో; తత్(అధ్యాహృతము)= అది; మవర్హితం=చెడ్డపని.

రాముండు, పరమదుఃఖితుండై దేహంబుదెలియక, యిట్లుచెప్పుచున్నలక్ష్మణుంజూచి, యిట్లనిచెప్పెను; సౌమ్యుఁడా! సీతనువిడిచినీవువచ్చుటమిక్కిలితప్పయినపని. అని, తాత్పర్యము.

జానన్నపి సమర్థం మాం రక్షసాం వినివారణే
అనేన క్రోధవాక్యేన మైథిల్యా నిస్సృతో భవాన్. ౨౨

టీక॥ భవాన్=నీవు; మాం = నన్ను; రక్షసాం=రాక్షసులయొక్క ; వినివారణే=అడ్డగించుటయందు, జయించుటయందనుట; సమర్థం= సమర్థునిఁగా; జానన్నపి = ఎఱింగినవాఁడవయ్యు; మైథిల్యాః=సీతయొక్క; అనేన= ఈ; క్రోధవాక్యేన = కోపపుమాటచేత; నిస్సృతః=వెడలినావు.

నీవు, నేనురాక్షసులఁజయింప సమర్థుండనని యెఱింగియు , సీతచెప్పిన యాకోపవచనముచే,నిట్లు, సీతనొంటి విడిచివచ్చినావుగదా!

అని, తాత్పర్యము.

నహి తే పరితుష్యామి త్యక్త్వా యద్యాసి మైథిలీమ్
క్రుద్ధాయాః పరుషం శ్రుత్వా తాం విహాయ త్వమాగతః. ౨౩

టీక॥ యత్=ఏకారణమువలన; మైథిలీం=సీతను; త్యక్త్వా=విడిచి; యాసి=వచ్చుచున్నావో; తత్ (అధ్యాహృతము)=ఆకారణమువలన; తే= నీకొఱకు; నపరితుష్యామిహి= సంతోషింపను గదా! త్వం=నీవు; క్రుద్ధాయాః= కోపమునొందినసీతయొక్క; పరుషం= కఠినపుమాటను; శ్రుత్వా = విని; తాం= ఆసీతను; విహాయ=విడిచి ; ఆగతః=వచ్చినావు.

నీవు,సీతనువిడిచివచ్చినావుకావున, నిన్నుఁజూడనాకుసంతోషము కలుగలేదు; స్త్రీకోపంబునొంది యేమోపరుషముగాఁజెప్పితే,నీవు, అంతటిలోనాబిడనువిడిచివచ్చినావు;ఇదియెంతమాత్రము యుక్తముకాదు. అని, తాత్పర్యము.

సర్వథా త్వ వినీతం తే సీతయా యత్ప్రచోదితః
క్రోధస్య వశ మాపన్నో నాకరో శ్శాసనం మమ. ౨౪

టీక॥త్వం(అధ్యాహృతము)=నీవు; సీతయా=సీతచేత;ప్రచోదితః = ప్రేరేపింపఁబడినవాఁడవై;క్రోధస్య= కోపముయొక్క;వశం= అధీనతను; ఆపన్నః=పొందినవాఁడవై;మమ=నాయొక్క;శాసనం=ఆజ్ఞను;నాకరోః (ఇతి) యత్=చేయనివైతివనునదియేదిగలదో; తత్(అధ్యాహృతము)=అది;సర్వథా తు=అన్నివిధములను; తే= నీయొక్క; అవినీతం=తప్పు.

నీవు,సీతచెప్పినమాటలువిని, క్రోధపరవశుండవై,నాయాజ్ఞనుమీఱితివావు; అన్నివిధంబులఁ జూచినను, ఇది నీదిగొప్పతప్పు. అని, తాత్పర్యము.

అసౌహి రాక్షస శ్శేతే శరేణాభి హతో మయా
మృగరూపేణ యేనాహ మాశ్రమా దపవాహితః. ౨౫

టీక॥మృగరూపేణ= జింకయొక్కరూపువంటిరూపుగల;యేన= ఏరాక్షసునిచేత;అహం=నేను;ఆశ్రమాత్=ఆశ్రమంబుననుండి;అపవాహితః=తోలఁగఁదీసికొనిపోఁబడినానో; అసౌ=ఈ; రాక్షసః=రాక్షసుఁడు;మయా=నాచేత;శరేణ=బాణముచేత; అభిహతః= కొట్టఁబడినవాఁడై;శేతేహి= పరుండియున్నాఁడుగదా?

ఎవ్వండు, మృగరూపంబు ధరించి, మోసంబున,నన్నాశ్రమంబుననుండిదూరంబుతోలఁగఁదీసికొనిపోయెనో,ఆరాక్షసుండిదిగో,నాబాణముచేహతుండై, నేలంబడియున్నాఁడు.

అని, తాత్పర్యము.

వికృష్య చాపం పరిధాయ సాయకం
సలీల బాణేనచ తాడితో మయా
మార్గీం తనుం త్యజ్య సవిక్లబస్వరో
బభూవ కేయూర ధర స్స రాక్షసః. ౨౬

టీక॥సః=అతఁడు; మయా=నాచేత;చాప=ధనుస్సును; వికృష్య = ఆక

టీ. చి; సాయకం = బాణమును; పరిధాయ=సంధించి; సలీలబాణేనచ= విలాసములోఁ గూడిన బాణముచేతనే; తాడితః = కొట్టఁబడినవాఁడై; సశల్యబస్వాః= దుఃఖితమయినధ్వనిలోఁగూడిన వాఁడై; మాగీణం=జింక సంబంధియయిన; తనుం = దేహమును; త్యజ్య (త్యక్త్వా)=విడిచి; కేయూరధరః=బాహుపురులుధరించిన; రాక్షసః=రాక్షసుఁడు; బభూవ=అయెను.

నేను వింట విలాసార్థముగా నుండు బాణంబుఁగూర్చి, యాకర్షించి విడువంగా, నతండా బాణంబుచేహతుండై, దుస్సహము, మృగదేహము విడిచి, బాహుపురులతో నొప్పునట్టి రాక్షసరూపంబు నొందెను. అని, తాత్పర్యము.

శరాహతేనైవ తదార్తయా గిరా
స్వరం మమాలంబ్య సుదూర సుశ్రవమ్
ఉదాహృతం తద్వచనం సుదారుణం
త్వమాగతో యేన విహాయ మైథిలీమ్. ౨౭

టీకా॥ తదా = అప్పుడు; శరాహతేనైవ= బాణముచేతఁగొట్టఁబడినవాఁడైనంతనే; తేన (అధ్యాహృతము)= ఆ రాక్షసునిచేత; ఆర్తయా= దుఃఖితమయిన; గిరా=ధ్వనిచేత; మమ=నాయొక్క; స్వరం=కంఠధ్వనిని; ఆలంబ్య=అవలంబించి; యేన=దేనిచేత; త్వం=నీవు; మైథిలీం=సీతను; విహాయ=విడిచి; ఆగతః=వచ్చినావో; తత్ = ఆ; సుదారుణం=మిక్కిలియుభయంకరమయిన; వచనం=మాట; సుదూరసుశ్రవం = మిక్కిలియుదూరము చక్కఁగా వినఁదగినదగునట్లు; ఉదాహృతం = చెప్పఁబడినది.

అప్పుడు, బాణహతుండైనంతనే యారాక్షసుండు, ఆర్తస్వరంబున, నా కంఠధ్వనిననుసరించి, బహుదూరముచక్కఁగావినునట్లు, భయంకరమయిన యామాటఁబలికినాఁడు; దానివిని నీవు సీతనువిడిచివచ్చినావు. అని, రాముండు, లక్ష్మణునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అరణ్యకాండే, ఏకోనషష్టితమస్సర్గః.
ఇది, సప్తాధికము.

స ౬౦

ఇతి, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అరణ్యకాండకోనషష్టితమసర్గటీక, ముగిసినది.

---

శ్రీ

షష్టితమసర్గప్రారంభః.

భృశమావ్రజమానస్య తస్యాథో వామలోచనమ్
ప్రాస్ఫురచ్చాస్ఖలద్రామో వేపథుశ్చాస్య జాయత. ౧

టీక॥ ఆవ్రజమానస్య = వచ్చుచున్న; తస్య = ఆరామునియొక్క; వామలోచనం = ఎడమకన్ను; అథః = క్రిందిపట్టు; భృశం = మిక్కిలియు; ప్రాస్ఫురత్ = అదరెను. రామశ్చ = రాముండును; అస్ఖలత్ = తొట్రుపడెను. వేపథుశ్చాపి = వణఁకును; అజాయత = కలిగెను.

అట్లు, రాముండు ఆశ్రమంబునకువచ్చుచుండఁగా, అతనియెడమకంటిక్రిందిభాగముమిక్కిలియునదరినది; రాముండునడచునప్పుడు, తొట్రుపడెను; అతనిదేహమునవడఁకుపుట్టినది.

అని, తాత్పర్యము.

ఉపాలక్ష్య నిమిత్తాని సోఽశుభాని ముహుర్ముహుః
అపి క్షేమంను సీతాయా ఇతి వై వ్యాజహార చ. ౨

టీక॥ సః = ఆరాముండు; ముహుర్ముహుః = మాటిమాటికి; అశుభాని = అమంగళకరములయిన; నిమిత్తాని = దుర్నిమిత్తములను; ఉపాలక్ష్య = చూచి; సీతాయాః = సీతకు; క్షేమమపిను = క్షేమముకలదా? ఇతి = అని ("వై" అనునది పాదపూరణార్థము); వ్యాజహారచ = చెప్పెను.

ఆరాముండు, మాటిమాటికిదుర్నిమిత్తంబులెచ్చుగాఁబొడసూపుటంజూచి, "సీతకుక్షేమంబుగలుగునా స్వామీ!" అని, చెప్పెను. అని, తాత్పర్యము.

త్వరమాణో జగామాథ సీతా దర్శన లాలసః
శూన్య మావసథం దృష్ట్వా బభూవో ద్విగ్నమానసః. ౩

టీక॥ అథ=అంత; సః(అధ్యాహృతము)=ఆ రాముండు; సీతాదర్శనలాలసః= సీతనుజూచుటయందధికేచ్ఛగలవాఁడై; త్వరమాణః= వేగిరపడుచు; జగామ=పోయెను. శూన్యం= పాడైన; ఆవసథం=ఇంటిని; దృష్ట్వా=చూచి; ఉద్విగ్నమానసః= దుఃఖితమయినమనస్సుగలవాఁడు; బభూవ = ఆయెను.

అంత, రాముండు, సీతంజూడవలెనను తొందరచే, నతివేగంబున, నాశ్రమంబునకుంబోయి, యందుసీతలేకుండుటంజూచి, పరమదుఃఖితుండయ్యె.

అని, తాత్పర్యము.

ఉద్భ్రమ న్నివ వేగేన విక్షిప న్రఘునందనః
తత్రతత్రో టజస్థాన మభివీక్ష్య సమంతతః. ౪
దదర్శ పర్ణశాలాంచ రహితాం సీతయా తదా
శ్రియా విరహితాం ధ్వస్తాం హేమంతే పద్మినీమివ. ౫

టీక॥ రఘునందనః=రాముండు; వేగేన=వేగముచేత; ఉద్భ్రమన్నివ = ఎగురుచున్నవాఁడువలె; విక్షిపన్= విదిర్చుచు; తత్రతత్ర=అచ్చటచ్చట; ఉటజస్థానం=నివాసస్థానమును; సమంతతః= అంతటను; అభివీక్ష్య=చూచి; తదా= అప్పుడు; సీతయా = సీతచేత; రహితాం=విడువఁబడినదియు; శ్రియా= కాంతిచేత; రహితాం= విడువఁబడినదియు; హేమంతే= హేమంతఋతువునందు; ధ్వస్తాం =నాశమునొందిన ; పద్మినీమివ(స్థితాం)=తామరకొలనువలెనున్నదియునగు; పర్ణశాలాంచ= పర్ణశాలనుగూడ; దదర్శ=చూచెను.

రాముండు, ఎగిరినట్లు అతివేగంబున, దుఃఖపారవశ్యంబుచేఁ జేతులుఁగాళ్ళు విదిలించుచు, నచ్చటచ్చట సీతయుండు ప్రదేశములన్నింటినింజూచి, సీతలేకుండుటచేఁ గాంతిహీనమయి హేమంతఋతువునందుఁ జెడిపోయియుండు తామరకొలంకుంబోలియున్న పర్ణశాలంజూచెను.

అని, తాత్పర్యము.

స ౬౦

రుదంత మివ వృక్షైశ్చ మ్లానపుష్ప మృగద్విజమ్
శ్రియావిహీనం విధ్వస్తం సంత్యక్త వన దేవతమ్. ౬
విప్రకీర్ణాజినకుశం విప్రవిద్ధ బృసీకటమ్
దృష్ట్వా శూన్యం నిజస్థానం విలలాప పునఃపునః. ౭

టీక॥సః (అధ్యాహృతము)= ఆరాముఁడు; వృక్షైశ్చ=చెట్లచేతను; రుదంతమివ (స్థితం)= ఏడ్చుచున్నట్లున్నదియు; మ్లానపుష్పమృగద్విజం= వాడిన పూలును జింకలును బక్షులును గలదియు; శ్రియా=కాంతిచేత; విహీనం= విడువఁబడినదియు; విధ్వస్తం= చెడినదియు; సంత్యక్తవన దేవతం= విడిచినవన దేవతలుగలదియు; విప్రకీర్ణాజినకుశం= వెదచల్లఁబడినకృష్ణాజినములును దర్భలునుగలదియు; విప్రవిద్ధబృసీకటం=వెదచల్లఁబడినఆసనములును చాఁపలునుగలదియు; శూన్యం= పాడుపడినదియునగు; నిజస్థానం= తనయాశ్రమమును; దృష్ట్వా=చూచి; పునఃపునః = మాటిమాటికి; విలలాప=ఏడ్చెను.

రాముఁడు, వికృతస్వరంబులగు తుమ్మెదలతోఁగూడినవగుటచే రోదనంబు సేయుచున్నట్లున్న వృక్షంబులతోఁ గూడినదియు, వాడినపూలును దీనములగు మృగపక్షులును గలదియుఁ గాంతిహీనంబును ధ్వంసంబునొందినదియు వనదేవతలచేఁ బరిత్యక్తంబును అచ్చటచ్చట వెదచల్లంబడియుండు కృష్ణాజినంబులును దర్భలును ఆసనంబులును చాఁపలును గలదియు శూన్యంబునగు తనయాశ్రమంబుఁ జూచి, మాటిమాటికి విలపించెను.

అని, తాత్పర్యము.

హృతా మృతా వా నష్టా వా భక్షితా వా భవిష్యతి
నిలీనా ప్యథవా భీరు రథవా వన మాశ్రితా. ౮

టీక॥భీరుః=భయముగలసీత; హృతా= అపహరింపఁబడినదిగానో; మృతా వా=చచ్చినదిగానో; నష్టా వా= నశించినదిగానో; భక్షితా వా=భక్షింపఁబడినదిగానో; భవిష్యతి=ఉండఁగలదు. అథవా=లేనియెడ; నిలీనాపి= డాఁగినదో. అథవా=లేక; వనం=అడవిని; ఆశ్రితా=పొందినదో.

భీరువగుసీత, రాక్షసులచేనపహరింపఁబడినదో, మరణంబునొందినదో, నష్ట

యాయినదో, భక్షింపఁబడినదో, లేక మెంతేనిదాఁగియున్నదో; లేకవనంబునకేపోయియున్నదో!

అని, తాత్పర్యము.

గతా విచేతుం పుష్పాణి ఫలాన్యపిచ వాపునః
అథవా పద్మినీం యాతా జలార్థంవా నదీం గతా.౯

టీక॥సీతా(అధ్యాహృతము)=సీత; పుష్పాణి=పూలనుగాని; పునః=మఱియు; ఫలాన్యపిచవా=పండ్లనుగాని; విచేతుం=కోయుటకు; గతా=పోయినదో. అథవా=లేక; పద్మినీం = తామరకొలంకును; యాతా=పొందినదో. వా=లేక; జలార్థం=నీళ్లకొఱకు; నదీం=ఏటిని; గతా=పొందినదో.

సీత, పూలనుగానిఫలంబులనుగాని కోయుటకేపోయినదో; లేక, విహారార్థము తామరకొలనునకేపోయినదో; లేక, జలంబుగొనివచ్చుటకై నదికేపోయెనో. అని, రాముండు, విలపించెను.

అని, తాత్పర్యము.

యత్నా న్మృగయమాణస్తు నాససాద వనే ప్రియామ్

టీక॥ సః(అధ్యాహృతము)=ఆరాముఁడు; వనే = అడవియందు; యత్నాత్=ప్రయత్నమువలన; మృగయమాణస్తు=వెదకుచున్నను; ప్రియాం=ప్రియురాలిని; నాససాద = పొందఁడయ్యె.

రాముండట్లు, మహాప్రయాసముతో నెంతవెదకినను, వనంబునఁ బ్రియురాలింగానఁడయ్యె. అని, తాత్పర్యము.

శోకర క్తేక్షణ శ్శోకా దున్మత్త ఇవ లక్ష్యతే. ౧౦
వృక్షా ద్వృక్షం ప్రధావ న్స గిరేరద్రిం నదా న్నదీమ్

టీక॥సః=ఆరాముఁడు; శోకర క్తేక్షణః=దుఃఖముచేనెఱ్ఱనైన కన్నులుగలవాఁడై; శోకాత్ = దుఃఖమువలన; వృక్షాత్=వృక్షమునుండి; వృక్షం=చెట్టునుగూర్చియు; గిరేః=పర్వతమునునుండి; అద్రిం=పర్వతమునుగూర్చియు; నదాత్=ఏటినుండి; నదీం=ఏటినిగూర్చియు; ప్రధావన్=పరుగెత్తుచు; ఉన్మత్త




ఇవ=పిచ్చిపట్టినవాఁడువలె; లక్ష్యతే=చూడఁబడుచున్నాఁడు.

రాముఁడు, దుఃఖాతిశయంబునఁగన్నులనెఱ్ఱఁదనంబుగదుర, దుఃఖపరవశుండై,పిచ్చిపట్టినట్లు, ఒకవృక్షంబుననుండి,మఱియొకవృక్షంబునొద్దకును,ఒకపర్వతంబునుండి మఱియొక పర్వతమునొద్దకును ఒకనదియొద్దనుండి మఱియొకనదియొద్దకునుబరుగెత్తుచుండెను. అని, తాత్పర్యము.

బభూవ విలపన్రామ శ్శోకార్ణవ పరిప్లుతః. ౧౧

టీక॥ రామః=రాముఁడు; శోకార్ణవపరిప్లుతః=దుఃఖసముద్రమునందుమునింగినవాఁడై; విలపన్=విలపించుచు; బభూవ=ఉండెను.

అప్పు రాముండు, దుఃఖసముద్రంబునమునింగి, యీప్రకారంబునవిలపించుచుండెను.అని, తాత్పర్యము.

అపి కాచి త్త్వయా దృష్టా సా కదంబప్రియా ప్రియా
కదంబ యది జానీషే శంస సీతాం శుభాననామ్. ౧౨

టీక॥ కదంబ=కదంబవృక్షమా! కదంబప్రియా=కదంబపుష్పములుప్రియములుగాఁగల; సా=ఆ; ప్రియా=ప్రియురాలు; కాచిత్= ఒకానొకస్త్రీ; త్వయా=నీచేత; అపిదృష్టా=జూడఁబడినదా యేమి? జానీషేయది=ఎఱుంగుదువేని;శుభాననాం = సుందరమయినముఖముగల;సీతాం=సీతను; శంస=చెప్పుము.

కదంబవృక్షమా! కదంబపుష్పములయందుఁబ్రీతిగల నాప్రియురాలయినసీతయనునొకానొకస్త్రీని నీవుచూచినావా? ఆవిడమొగముసుందరముగానుండును; తెలిసియుండునేని, ఆవిడయెకడనున్నదో నాకుఁదెలుపుము.

అని, తాత్పర్యము.

స్నిగ్ధపల్లవ సంకాశా పీతకౌశేయవాసినీ
శంసస్వ యదివా దృష్టా బిల్వ బిల్వోపమ స్తనీ. ౧౩

టీక॥బిల్వ=బిల్వవృక్షమా! స్నిగ్ధపల్లవసంకాశా= సుందరమయినచిగురు




స ౬౦

టాకుతోఁ సమానమయినదియు; పీతకౌశేయవాసినీ = పసపుపట్టువస్త్రము కట్టుకొనియుండునదియు; బిల్వోపమస్తనీ = బిల్వఫలములతోఁ బోలికగల స్తనములుగలదియునగు స్త్రీ; దృష్టాయది వా = చూడఁబడినదగునేని; శంసస్వ = చెప్పుము.

బిల్వవృక్షమా! సుందరమయినచిగురుటాకువంటి దేహముగలదియుఁ బసపుపట్టువస్త్రముకట్టుకొనియుండనదియు బిల్వఫలంబులవంటి స్తనములు గలదియునగుసీతను జూచియుందువేని, యాబిడ యెచటనున్నదికి చెప్పుము.

అని, తాత్పర్యము.

అథవా ऽర్జున శంస త్వం ప్రియాం తా మర్జున ప్రియామ్
జనకస్య సుతా భీరు ర్యది జీవతి వా న వా. ౧౪

టీక॥ అథవా = అటుగాదేని; అర్జున = అర్జునవృక్షమా! త్వం = నీవు; అర్జునప్రియాం = అర్జున (ఏఱుమద్ది) వృక్షము ప్రియముగాఁగల; తాం = ఆ; ప్రియాం = ప్రియురాలయినసీతను; శంస = చెప్పుము. భీరుః = భయపడుస్వభావముగల; జనకస్య = జనకమహారాజుయొక్క; సుతా = కొమార్తె; జీవతియది వా = బ్రతికియున్నదా? నవా = లేదా?

అటుగాదేని, అర్జునవృక్షమా! నీయందధికప్రీతిగల నాప్రియురాలి సంగతిని, నీవైనం జెప్పుము; భీరువగుజనకమహారాజపుత్రి బ్రతికియున్నదా? లేదా?

అని, తాత్పర్యము.

కకుభః కకుభోరూం తాం వ్యక్తం జానాతి మైథిలీమ్
యథా పల్లవపుష్పాఢ్యో భాతి హ్యేష వనస్పతిః. ౧౫

టీక॥ కకుభః = ఒకవిధమయినయర్జునవృక్షము; కకుభోరూం = కకుభవృక్షమువంటితొడలుగల; తాం = ఆ; మైథిలీం = సీతను; వ్యక్తం = స్పష్టముగా; జానాతి = ఎఱుంగును. యథా = ఎట్లనఁగా; ఏషః = ఈ; వనస్పతిః = వృక్షము; పల్లవపుష్పాఢ్యః = చిగురుటాకులను బూవులునుగలదై; భాతి = ప్రకాశించుచున్నది.

ఈకకుభవృక్షము, పల్లవంబులతోను బుష్పంబులతోనుం బ్రకాశించుచున్నది; కాఁబట్టి, యీకకుభవృక్షమునకుఁ, దనవంటితొడలుగలసీతసంగతిస్పష్టముగాఁ దెలిసియుండును. అని, తాత్పర్యము

భ్రమరైరుపగీతశ్చ యథా ద్రుమవరో హ్యయమ్
ఏష వ్యక్తం విజానాతి తిలక స్తిలకప్రియామ్. ౧౬

టీ॥యథా=ఎట్లు; అయం=ఈ; ద్రుమవరః=వృక్షశ్రేష్ఠము; భ్రమరైః=తుమ్మెదలచేత; ఉప= సమీపమునందు; గీతశ్చ=పాడఁబడినదియునై; వర్తతే (అధ్యాహృతము) హి = ఉన్నదో; తథా (అధ్యాహృతము)= అట్లు; ఏషః=ఈ; తిలకః=బొట్టుగుచెట్టు; తిలకప్రియాం=బొట్టుగుచెట్టుప్రియముగాఁగలసీతను; వ్యక్తం=స్పష్టముగా; విజానాతి=ఎఱుంగును.

ఈతిలకవృక్షము, భ్రమరగానముతో నొప్పుచున్నది కాఁబట్టి, దీనికిఁదనయందధికప్రీతిగలసీత సంగతి చక్కఁగాఁదెలిసియుండును.

అని, తాత్పర్యము.

అశోక శోకాపనుద శోకోపహతచేతసమ్
త్వన్నామానం కురు క్షిప్రం ప్రియాసందర్శనేన మామ్. ౧౭

టీక॥శోకాపనుద= దుఃఖముఁబోఁగొట్టువట్టి; అశోక = అశోకవృక్షమా! శోకోపహతచేతసం= దుఃఖముచేఁగొట్టఁబడినమనస్సుగల; మాం=నన్ను; ప్రియాసందర్శనేన=ప్రియురాలిచూచుట చేత; క్షిప్రం=శీఘ్రముగా; త్వన్నామానం=నీపేరుగలవానిఁగా, అశోకునిఁగా (దుఃఖములేనివానిఁగా)ననుట; కురు=చేయుము.

అశోకవృక్షమా! నీవెప్పుడునుదుఃఖముఁబోఁగొట్టుదువు; దుఃఖితుండనగు నాకు, నాప్రియురాలింజూపి, శీఘ్రముగ, నన్నుదుఃఖములేనివానిఁగాఁజేయుము. అని, తాత్పర్యము.

యది తాల త్వయా దృష్టా పక్వతాలఫలస్తనీ
కథయస్వ వరారోహాం కారుణ్యం యది తే మయి. ౧౮

టీక॥తాల=తాటిచెట్టా! పక్వతాలఫలస్తనీ= పండినతాటిపండ్లవంటిస్తనములుగలసీత; త్వయా = నీచేత; దృష్టా యది= చూడఁబడినదగునేని; మయి= నాయందు; తే=నీకు; కారుణ్యంయది= దయగలదేని; వరారోహాం=శ్రేష్ఠములయిన పిఱుందులుగలజానకిని; కథయస్వ=చెప్పుము.

తాలవృక్షమా! పక్వములయిన తాలఫలములవంటి స్తనములుగలసీతను నీవుచూచియుందువేని, నాయందునీకుదయగలపక్షమునకు, సుందరములయిన పిఱుందులుగలయాసీత యెచ్చటనున్నదో నాకుఁజెప్పుము. అని, తాత్పర్యము.

యది దృష్టా త్వయా సీతా జంబు జంబూఫలోపమామ్
ప్రియాం యది విజానీషే నిశ్శంకం కథయస్వ మే. ౧౯

టీక॥ జంబు= నేరెడుచెట్టా! త్వయా=నీచేత; సీతా=సీత; దృష్టాయది=చూడఁబడినదగునేని; జంబూఫలోపమాం = నేరెడుపండ్లతోఁబోలిక గల; ప్రియాం=ప్రియురాలిని; విజానీషే యది=చక్కఁగా నెఱుంగుదువేని; నిశ్శంకం=సందేహములేనట్లు; మే=నాకొఱకు; కథయస్వ = చెప్పుము.

జంబూవృక్షమా! సీతంజూచియుందువేని, జంబూఫలంబులంబోలె స్నిగ్ధమయిన మేనుగల నాప్రియురాలుండుస్థలము నీకుఁదెలిసినపక్షమునకు, నాకుఁ జక్కఁగాఁజెప్పుము. అని, తాత్పర్యము.

అహో త్వం కర్ణికారాద్య సుపుష్పైః శోభసే భృశం
కర్ణికార ప్రియా సాధ్వీ శంస దృష్టా ప్రియా యది. ౨౦

టీక॥ అహో=ఆశ్చర్యము! కర్ణికార=కొండగోఁగుచెట్టా! త్వం=నీవు; అద్య=ఇప్పుడు; సుపుష్పైః = మంచిపూలచేత; భృశం=మిక్కిలియు; శోభసే=ప్రకాశించుచున్నావు. కర్ణికారప్రియా= కొండగోఁగుపూలు ప్రియములుగాఁగల; సాధ్వీ=పతివ్రతయగు; ప్రియా= ప్రియురాలు; దృష్టాయది=చూడఁబడినదగునేని; శంస=చెప్పుము.

కర్ణికార వృక్షమా! నీవిప్పుడు, సుందరంబులగుపుష్పంబులతో నొప్పుచు నెంతయు నాశ్చర్యంబు గలిగించుచున్నావు; నీపుష్పంబులపై నధిక ప్రీతిగలదియుం బతివ్రతయు నగు నాప్రియురాలిం జూచి యుందువేని, నెచ్చటనున్నదో నాకుఁజెప్పుము. అని, తాత్పర్యము.

చూతనీపమహాసాలాన్ పనసాన్ కురవాన్ ధవాన్
దాడిమానసనాన్ గత్వా దృష్ట్వా రామో మహాయశాః. ౨౧

స ౬౦

మల్లికా మాధవీశ్చైవ చంపకాన్ కేతకీ స్తథా
పృచ్ఛ న్రామో వనే భ్రాంత ఉన్మత్తఇవ లక్ష్యతే. ౨౨

టీక॥ మహాయశాః=అధికమయిన కీర్తిగల; రామః=రాముఁడు; చూతనీపమహాసాలాన్ = మామిడిచెట్లను కదంబవృక్షములను పెద్దమద్దిచెట్లను; పనసాన్=పనసచెట్లను; కురవాన్= గోరంటచెట్లను; ధవాన్= చంద్రచెట్లను; దాడిమాన్ = దాడిమచెట్లను; అసనాన్=వేగిసచెట్లను; మల్లికాః= మల్లెలను; మాధవీశ్చైవ= పుష్పులగురివెందచెట్లను; చంపకాన్=సంపెఁగచెట్లను; తథా=అట్లు; కేతకీః=మొగిలిపొదలను; గత్వా=పొంది; దృష్ట్వా=చూచి; రామః=రాముఁడు; పృచ్ఛన్=అడుగుచు; వనే=అడవియందు; భ్రాంతః=తిరుగుడుపడినవాఁడై; ఉన్మత్తఇవ=పిచ్చిపట్టినవాఁడువలె; లక్ష్యతే=చూడఁబడుచున్నాఁడు.

మహాకీర్తిశాలియగు రాముండు, అట్లువనంబునఁదిరిగితిరిగి, చూతవృక్షంబులను గదంబవృక్షంబులను సాలవృక్షంబులను బనసవృక్షంబులను గురవకంబులను జంద్రచెట్లను దాడిమవృక్షంబులను అసనవృక్షంబులను మల్లె కురువెంద సంపెఁగ మొగిలి మొదలగువానినింజూచి "సీత యెచ్చటనున్నది" అని యడుగుచుఁ, బిచ్చిపట్టినవానిపగిదిఁ జూపట్టుచుండెను. అని, తాత్పర్యము.

అథవా మృగశాబాక్షీం మృగ జానాసి మైథిలీమ్
మృగవిప్రేక్షణీ కాంతా మృగీభి స్సహితా భవేత్. ౨౩

టీక॥ మృగ=జింకా! అథవా=అటుగాకను; మృగశాబాక్షీ=జింకపిల్లయొక్కకన్నులవంటి కన్నులుగల; మైథిలీం=సీతను; జానాసి=ఎఱుంగుదువు. మృగవిప్రేక్షణీ= జింకవలెనానావిధముగాఁజూచునట్టి; కాంతా= ప్రియురాలు; మృగీభిః= ఆఁడుజింకలతో; సహితా=కూడినది; భవేత్= అగును.

మృగమా! ఈవృక్షంబులెఱుంగకున్నను జింకపిల్లకన్నులవంటి కన్నులుగలసీతను నీవెఱింగియుందువు; జింకలువలెఁజపలముగాఁ జూచుచున్నదికావున, నాప్రియురాలు, లేళ్లతోఁగూడియుండును. అని, తాత్పర్యము.

గజ సా గజనాసోరూ ర్యది దృష్టా త్వయా భవేత్
తాం మన్యే విదితాం తుభ్య మాఖ్యాహి వరవారణ. ౨౪

టీక॥ గజ= ఏనుఁగా! గజనాసోరూః = ఏనుంగుతొండమువంటితొడగల; సా=ఆసీత; త్వయా=నీచేత; దృష్టా=చూడఁబడినది; భవేద్యది= అగునేని; ఆఖ్యాహి=చెప్పుము. తాం=ఆసీతను; తుభ్యం=నీకు; విదితాం=తెలియఁబడినదానిఁగా ; మన్యే= తలంచెదను.

గజమా! నీతొండమువంటితొడగల సీతను నీవుచూచియుందువేని, నాకుఁజెప్పుము; ఉత్తమగజమా! ఆసీతసంగతి నీకుఁదెలిసియుండుననితలంచెదను.

అని, తాత్పర్యము.

శార్దూల యది సా దృష్టా ప్రియా చంద్రనిభాననా
మైథిలీ మమ విస్రబ్ధం కథయస్వ న తే భయమ్. ౨౫

టీక॥ శార్దూల = వ్యాఘ్రమా! చంద్రనిభాననా=చంద్రునితో సమానమయినముఖముగల; సా=ఆ; ప్రియా=ప్రియురాలయిన; మైథిలీ=సీత; దృష్టా యది=చూడఁబడినదగునేని; మమ = నాకు; విస్రబ్ధం=నిర్భయముగా; కథయస్వ=చెప్పుము. తే=నీకు; భయం=భయము; న=లేదు.

వ్యాఘ్రమా! చంద్రబింబమువంటి మొగముగలనాప్రియురాలయిన సీతం జూచితివేని, నిర్భయంబుగా నాకుఁజెప్పుము; నిన్నేమిచేయను; భయపడవలదు. అని, తాత్పర్యము.

కిం ధావసి ప్రియే దూరే దృష్టాసి కమలేక్షణే
వృక్షై రాచ్ఛాద్య చాత్మానం కిం మాం న ప్రతిభాషసే. ౨౬

టీక॥ ప్రియే=ప్రియురాలా! కిం=ఎందుకు; ధావసి = పరుగెత్తుచున్నావు? కమలేక్షణే=తామరపూరేకులవంటికన్నులుగలసీతా! దూరే = దూరంబునందు; దృష్టా= చూడఁబడినదానవు; అసి=అగుచున్నావు. వృక్షైః = చెట్లచేత; ఆత్మానం=దేహమును ; ఆచ్ఛాద్య చ= మూసికొనియు; మాం= న

స ౬౦

న్నుఁగూర్చి; కిం=ఎందుకు; నప్రతిభాషసే=బదులాడవు?

ప్రియురాలా! ఏల పరుగెత్తెదవు? కమలంబులంబోలు కన్నులుగలదానా! నిన్ను దూరంబునంజూచితిని; ఇంకనిలువుము; వృక్షంబులందాఁగి నాతో మాటాడకున్నావేల? అని, తాత్పర్యము.

తిష్ఠ తిష్ఠ వరారోహే న తే ऽస్తి కరుణా మయి
నాత్యర్థం హాస్యశీలాసి కిమర్థం మాముపేక్షసే. ౨౭

టీక॥ వరారోహే= శ్రేష్ఠములయిన పిఱుఁదులుగలదానా! తిష్ఠ తిష్ఠ= నిలు నిలు; తే=నీకు; మయి=నాయందు; కరుణా=దయ; నాస్తి=లేదు. అత్యర్థం= మిక్కిలియు; హాస్యశీలా = నవ్వులాట స్వభావముగలదానవు; నాసి= కావు. మాం=నన్ను; కిం=ఎందుకు ; ఉపేక్షసే=ఉపేక్షించుచున్నావు?

సుందరములయిన పిఱుందులుగలదానా! నిలునిలు; పరుగెత్తకుము ; నీకు నాయందుఁగొంచెమేని దయలేదు; నీవు అంతనవ్వులాటదానవు కావు; ఇప్పుడేల నన్నిట్లుపేక్షించియాడించెదవు? అని, తాత్పర్యము.

పీతకౌశేయకేనాసి సూచితా వరవర్ణిని
ధావంత్యపి మయా దృష్టా తిష్ఠ యద్యస్తి సౌహృదమ్. ౨౮

టీక॥ వరవర్ణిని= శీతకాలంబునసుఖోష్ణంబును ఉష్ణకాలంబున సుఖశీతంబునగు దేహముగలిగి భర్తయందనురాగముగలదానా! త్వం (అధ్యాహృతము)=నీవు; ధావంత్యపి = పరుగెత్తుచున్నను; పీతకౌశేయకేన= పసవుపట్టుచీరచేత; సూచితా=సూచింపఁబడినదానవై; మయా=నాచేత; దృష్టా=చూడఁబడినావు. సౌహృదం = స్నేహము; అస్తియది=కలదేని; తిష్ఠ=నిలువుము.

చలికాలంబున వేఁడిగాను వేసంగికాలంబున చల్లగాను సుఖంబుగానుండు దేహముగలిగి భర్తయందనురాగముగలదానా! నీవు పరుగెత్తుచున్నను, నీపసవుపట్టుచీరచే నిన్నుఁజూచినాను; నాయందు నీకు స్నేహము కలదేని, పరుగెత్తక, నిలువుము. అని, తాత్పర్యము.

నైవ సా నూన మథవా హింసితా చారుహాసినీ
కృచ్ఛ్రప్రాప్తం న మాం నూనం యథో పేక్షితు మర్హతి. ౨౮

టీక॥ అథవా=అటుకాకేని; సా=ఆ; ఛారుహాసినీ = సుందరమయిననగవుగలప్రియురాలు; నైవ(విద్యతే) = లేనేలేదు. హింసితా=చంపఁబడినది. నూనం=నిశ్చయము. యథా= ఎట్లగా; కృచ్ఛ్రప్రాప్తం= కష్టమునొందిన; మాం=నన్ను; ఉపేక్షితు = ఉపేక్షించుటకు; నార్హతి=తగదు.

సుందరమయిననగవుగలసీతలేనేలేదనితోఁచుచున్నది; రాక్షసులచేఁజంపఁబడియుండును. ఇదినిశ్చయము; అటుగానిచో, ఇట్లుదుఃఖితుండనైన నన్నింతమాత్రముపేక్షించియుండదు.

అని, తాత్పర్యము.

వ్యక్తం సా భక్షితా బాలారాక్షసైః పిశితాశనైః
విభజ్యాం గాని సర్వాణి మయా విరహితా ప్రియా. ౩౦

టీక॥ మయా= నాచేత; విరహితా=విడువఁబడిన; ప్రియా=ప్రియురాలగు; బాలా=చిన్నదయిన; సా=ఆసీత; పిశితాశనైః= మాంసమె యాహారముగాఁగల; రాక్షసైః =రాక్షసులచేత; సర్వాణి=సమస్తములయిన; అంగాని=అవయవములను; విభజ్య= విభజించి; భక్షితా = తినఁబడినది. వ్యక్తం=స్పష్టము.

నేనులేనప్పుడు, మాంసమునే దినునట్టిరాక్షసులు, బాలయగుప్రియురాలను, అన్నియవయవంబులను వేఱుకోఁదీసిభక్షించియుందురు ; ఇ. స్పష్టము.

అని, తాత్పర్యము.

నూనం తచ్ఛుభదంతోష్ఠం సునాసం చారుకుండలమ్
పూర్ణచంద్రనిభం గ్రస్తం ముఖం నిష్ప్రభతాం గతమ్. ౩౧

టీక॥ శుభదంతోష్ఠం=సుందరములయిన దంతములును పెదవులును గలదియు; సునాసం = సుందరములయినముక్కుగలదియు; చారుకుండలం=సుందరములయినకుండలములుగలదియు; పూర్ణచంద్రనిభం = నిండుచంద్రునితోసమానమయినదియునగు; తత్=ఆ; ముఖం=మొగము; గ్రస్తం= మ్రింగఁబడిన



ద్రైఃనిష్ప్రభతాం = కాంతిలేకుండుట నుఃగతం=పొందినది. నూనం = నిశ్చయము.

మంగళకరంబులయిన దంతములును జెదవులునుగలదియుసుందరమయినముక్కు-గలదియుసుందరములయినకుండలములతో నొప్పుచున్నదియు నిందుచందరునంబోలినదియునగు నాప్రియురాలిముఖంబు, రాక్షసులచేమ్రింగఁబడినదై, కాంతిహీనయయియుండును. నిశ్చయము. అని, తాత్పర్యము.

సాహి చంపక వర్ణాభా గ్రీవా గ్రైవేయశోభితా
కోమలా విలపంత్యాస్తు కాంతాయా భక్షితా శుభా. ౩౨

టీక॥ కాంతాయాః=ప్రియురాలు; విలపంత్యాస్తు=ఏడ్చుచుండఁగానే;చంపకవర్ణాభా = సంపెంగపూవుయొక్క-వన్నెవంటికాంతిగలదియు ; గ్రైవేయశోభితా=కంఠాభరణముచేఁ బ్రకాశించుచున్నదియు; కోమలా=సుకుమారంబును;శుభా=మంగళలక్షణంబులుగలదియునగు; సా= ఆ; గ్రీవా= కంఠము;భక్షితాహి=భక్షింపఁబడినది కదా!

సంపెంగ పూవువంటి వన్నెగలదియుఁ గంఠాభరణముతో నొప్పుచున్నదియు సుకుమారంబును మంగళలక్షణలక్షితంబునగు, సీతయొక్క- కంఠమును, ఆబిడవిలపించుచుండఁగా, రాక్షసులుభక్షించియుండురు.

అని, తాత్పర్యము.

నూనం విక్షిప్యమాణౌ తౌ బాహూ పల్లవ కోమళౌ
భక్షితౌ వేపమానాగ్రౌ సహస్తాభరణాంగదౌ. ౩౩

టీక॥ విక్షిప్యమాణౌ=విదిర్చఁబడుచున్నవియు; వేపమానాగ్రౌ= వడఁకుచున్నకొనలుగలవియు ; సహస్తాభరణాంగదౌ=కడియములతోను బాహుపురులతోను గూడినవియు; పల్లవకోమలౌ=చిగురుటాకువలెమెత్తనివియునగుః;తౌ=ఆ;బాహూ=చేతులు; భక్షితౌ=భక్షింపఁబడినవి. నూనఁ= నిశ్చయము.

భక్షింతురను భయంబున నిట్టటు




పీడబడుచుండునవియు విదిలింపఁబడు కొనలుగలవియునగు, కడియములతో నుబాహువురులతోనుబప్పుచున్న పల్లవ సుకుమారంబులయిన యాప్రియురాలి చేతులంగూడ, రాక్షసులు భక్షించి యుందురు. అని, తాత్పర్యము.

మయా విరహితా బాలా రక్షసాం భక్షణాయ వై
సార్థేనేవ పరిత్యక్తా భక్షితా బహుబాంధవా. ౩౪

టీక॥ బాలా=చిన్నదగుసీత; రక్షసాం=రాక్షసులకు; భక్షణాయవై=భక్షించుటకై యే; మయా=నాచేత; విరహితా=విడువఁబడినది. బహుబాంధవా= పెక్కండ్రుబంధువులుగలసీత; సార్థేన=బాటసారుల సమూహము చేత; పరిత్యక్తేవ = విడువఁబడినదివలె; భక్షితా=భక్షింపఁబడినది.

బాలయగుసీతను, రాక్షసులుభక్షించుటకై యే, నేనువిడిచిపోయి నట్లయినది; తోడిబాటసారులచే, విడువఁబడిన స్త్రీ, మృగాదులచే భక్షింపఁ బడిన ట్లు, సీత, యిప్పుడు, రాక్షసులచే భక్షింపఁబడినది. అని, తాత్పర్యము.

హా లక్ష్మణ మహాబాహో పశ్యసి త్వం ప్రియాం క్వచిత్
హా ప్రియే క్వ గతా భద్రే హా సీతే తి పునః పునః. ౩౫

టీక॥ హా = అయ్యో! మహాబాహో = పెద్దచేతులుగల; లక్ష్మణ= లక్ష్మణుఁడా! త్వం=నీవు; ప్రియాం=ప్రియురాలను; క్వచిత్=ఎక్కడనేని; పశ్యసి(కిం)=చూచుచున్నావేమి? హా= అయ్యో! ప్రియే=ప్రియురాలా! భద్రే=మంగళరూపిణివగు; సీతే (సంధి యార్షము)=సీతా! క్వ=ఎచ్చటికి; గతా=పోయినావు? హా=అయ్యో! ఇతి= అని; పునఃపునః=మాటిమాటికి; విలలాప (అధ్యాహృతము)=విలపించెను.

అయ్యో! మహాబాహుండవగు లక్ష్మణుఁడా! నీవెందేని ప్రియురాలిఁజూచినావా? మంగళరూపిణివగు ప్రియురాలా! అయ్యో సీతా! నీవెచ్చటికిఁబోయినావు? అని, మాటిమాటికిరాముండు పిలపించెను. అని, తాత్పర్యము.

ఇత్యేవం విలపన్రామః పరిధావన్వనా ద్వనమ్

స ౬౦

క్వచి దుద్భ్రమతే వేగాత్ క్వచి ద్విభ్రమతే బలాత్. ౩౬

టీక॥ రామః = రాముఁడు; ఇతి = అని; ఏవం = ఇట్లు; విలపన్ = విలపించుచు; వనాత్ = అడవినుండి; వనం = అడవినిగూర్చి; పరిధావన్ = పరుగెత్తుచు; క్వచిత్ = ఒకానొకచోట; వేగాత్ = వేగమువలన దుఃఖవేగమువలననుట; ఉద్భ్రమతే = భ్రాంతిఁబొందుచుండెను. క్వచిత్ = ఒకానొకచోట; బలాత్ = బలమువలన, సీతపోలిక బలము వలననుట; విభ్రమతే = భ్రాంతిఁబొందుచుండెను.

రాముండీ ప్రకారంబున విలపించుచు, వనంబుననుండి వనంబునకుఁదిరుగుచు, ఒకచో దుఃఖాతిశయంబునజడపదార్థంబులనుంగూడ సీతాదేవివృత్తాంతంబునడుగుచు, నొకచో, సీతపోలికగలలతాదులంజూచి, సీతంజూచినట్లె భ్రమించిపరితపించుచు, నుండెను. అని, తాత్పర్యము.

క్వచి న్మత్తఇవా భాతి కాంతాన్వేషణతత్పరః

టీక॥ క్వచిత్ = ఒకానొకచోట; కాంతాన్వేషణతత్పరః = ప్రియురాలివెదకుట యందు అత్యాసక్తి గలవాఁడై; మత్తఇవ = కైపునొందిన వాఁడువలె; ఆభాతి = ప్రకాశించెను.

అట్లుమఱియొకచో, ప్రియురాలివెదకుచుఁగైపునొందినవాఁడువలెమాగామార్గవివేకంబులేక దిరుగుచుండెను. అని, తాత్పర్యము.

స వనాని నదీ శ్శైలాన్ గిరిప్రస్రవణానిచ. ౩౭
కాననానిచ వేగేన భ్రమ త్యపరిసంస్థితః

టీక॥ సః = ఆరాముఁడు; అపరిసంస్థితః = నిలుకడలేనివాఁడై; వనాని = సాధారణములయిన యడవులను; నదీః = నదులను; శైలాన్ = పర్వతములను; గిరిప్రస్రవణానిచ = పర్వతములయొక్క సెలయేళ్లను; కాననానిచ = ఘోరారాణ్యములను; వేగేన = వేగముచేత; భ్రమతి = తిరుగుచుండెను.

రాముండట్లు, మనస్సునిలుకడలేక, చిన్నయడవులను బెద్దయడవులను నదులను బర్వతంబులను సెలయేళ్లను, అతివేగంబున, ఒకచోనుండి మఱియొక

చోటికిఁ దిరుగుచుండెను. అని, తాత్పర్యము.

తథా స గత్వా విపులం మహా ద్వనం
పరీత్య సర్వం త్వథ మైథిలీం ప్రతి. ౩౮
అనిష్ఠితాశ స్స చకార మార్గణే
పునః ప్రియాయాః పరమం పరిశ్రమమ్

టీక॥సః=ఆరామఁడు;తథా= అట్లు=విపులం=విశాలమయినదియు; మహత్=గొప్పదియునగు; వనం= అడవిని; గత్వా=పొంది; సర్వం=అంతయు; పరీత్య=తిరిగి;సః=ఆరాముఁడు; అథతు=అంతెను;మైథిలీంప్రతి= సీతను గూర్చి;అనిష్ఠి తాశః= ఈడేఱనియాశగలవాఁడై; పునః=మఱల ; ప్రియాయాః=ప్రియురాలియొక్క ; మార్గణే=వెదకుటయందు; పరమం=మిక్కిలియునధికమైన;పరిశ్రమం= ఆయాసమును;చకార=చేసెను.

రాముండట్లు,అనంతంబగు నాగొప్పయరణ్యంబునొంది, యవ్వనంబంతయుఁదిరిగి,సీతంగానక,మఱలఁ బ్రియురాలిని వెదకుటకై మఱియు నధికము గాశ్రమంబుఁబుచ్చుకొనెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అరణ్యకాండే, షష్టితమస్సర్గః.
ఇది , స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు,అరణ్యకాండ షష్టితమసర్గ టీక,
ముగిసినది.

---

శ్రీ

ఏకషష్టితమసర్గప్రారంభః.

దృష్ట్వా శ్రమపదం శూన్యం రామో దశరథాత్మజః
రహితాం పర్ణశాలాంచ విధ్వస్తా న్యాసనానిచ. ౧
అదృష్ట్వా తత్ర వైదేహీం సన్నిరీక్ష్యచ సర్వశః
ఉవాచ రామః ప్రాక్రుశ్య ప్రగృహ్య రుచిరౌ భుజౌ. ౨

టీక॥ దశరథాత్మజః = దశరథమహారాజుకుమారుఁడయిన; రామః = రాముండు; శూన్యం= పాడయిన; ఆశ్రమపదం=ఆశ్రమస్థానమును ; రహితా = శూన్యమయిన; పర్ణశాలాంచ=పర్ణశాలను; విధ్వస్తాని=చెడిన; ఆసనానిచ= ఆసనములను;దృష్ట్వా = చూచి; తత్ర=అచ్చట; వైదేహీం= సీతను; అదృష్ట్వా=చూడక;సర్వశః= అంతటను ; సన్నిరీక్ష్యచ=చూచియు; రామః=రాముఁడు; ప్రాక్రుశ్య=అఱచి; రుచిరౌ = సుందరములయిన; భుజౌ=చేతులను; ప్రగృహ్య=పట్టుకొని; ఉవాచ = చెప్పెను.

దశరథమహారాజపుత్రుఁడగు రాముఁడు, సీతలేకుండుటచేఁ బాధపడియుండునాశ్రమంబును శూన్యమయిన పర్ణశాలను చెడిపోయియున్న యాసనంబులనుంజూచి, యంతటను వెదకి, యచ్చటసీతం గానక, సీతం బేర్కొనిగట్టిగానఱచి, చేతులుపట్టుకొని, యిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

క్వను లక్ష్మణ వైదేహీ కంవా దేశ మితో గతా
కేనా హృతా వా సౌమిత్రే భక్షితా కేనవా ప్రియా. ౩

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! వైదేహీ=సీత ; క్వను= ఎచ్చట? ఇతః=ఇచ్చటనుండి; కంవా=ఏ; దేశం=ప్రదేశమును;గతా=పొందినది? సౌమిత్రే= లక్ష్మణుఁడా! కేనవా=ఎవ్వనిచేత; ఆహృతా = అపహరింపఁబడినది? ప్రియా=ప్రియురాలు; కేనవా=ఎవ్వనిచేత ; భక్షితా=భక్షింపఁబడినది?

లక్ష్మణుఁడా! సీతయెచ్చట? ఇచ్చటనుండి యెకడికిఁబోయినది? లక్ష్మ

ణుఁడా! ఎవ్వఁడపహరించినాఁడు? ప్రియురాలను, ఎవ్వఁడు భక్షించివేసినాఁడు? అని, తాత్పర్యము.

వృక్షేణా వార్య యది మాం సీతే హసితు మిచ్ఛసి
అలం తే హసితేనా ద్య మాం భజస్వ సుదుఃఖితమ్. ౪

టీక॥ సీతే=సీతా! వృక్షేణ=చెట్టుచేత; ఆవార్య=డాఁగి; మాం=నన్నుఁగూర్చి; హసితుం=నవ్వుటకు; ఇచ్ఛసియది=కోరుదువేని; తే=నీయొక్క; హసితేన=నవ్వుచేత; అలం = చాలును. అద్య=ఇప్పుడు; సుదుఃఖితం = మిక్కిలియు దుఃఖమునొందిన; మాం=నన్ను; భజస్వ=పొందుము.

సీతా! నీవు చెట్టుమఱుఁగున డాఁగియుండి నన్ను నవ్వు పట్టింపఁగోరుదువేని, యింక నీనవ్వు చాలును; నేను బరమదుఃఖితుండనై యున్నాను; నాయొద్దకు రమ్ము. అని, తాత్పర్యము.

యైః సహ క్రీడసే సీతే విశ్వస్తైః మృగపోతకైః
ఏతే హీనా స్త్వయా సౌమ్యే ధ్యాయన్త్యా స్రావిలేక్షణాః. ౫

టీక॥ సౌమ్యే=తిన్ననిదానవగు ; సీతే=సీతా! విశ్వస్తైః = నిర్భయములయిన; యైః=ఏ; మృగపోతకైః సహ=చిన్నజింకపిల్లలతోఁగూడ; క్రీడసే=ఆటలాడుదువో; ఏతే= ఈజింకపిల్లలు; త్వయా=నీచేత; హీనాః= విడువఁబడినవై; అస్రావిలేక్షణాః=కన్నీళ్ళచేవ్యాకులములయినకన్నులుగలవై; ధ్యాయంతి=చింతించుచున్నవి.

సౌమ్యవగు సీతా! బహుకాలముగా లాలనము సేయుటచేత నీపట్ల భయము వదలియుండు నీ జింకపిల్లలతోఁ గ్రీడింపుచుందువుగదా! ఆయీ జింకపిల్లలిప్పుడు, నీవు లేకుండుటచేఁ గన్నులనీళ్ళు గాఱఁ, జింతాక్రాంతములయి యున్నవి. అని, తాత్పర్యము.

సీతయా రహితో హం వై నహి జీవామి లక్ష్మణ

టీక॥ లక్ష్మణ= లక్ష్మణుఁడా ! అహం=నేను ("వై" అనునది పాదపూర




ణార్థము); సీతయా=సీతచేత; రహితః=విడువఁబడినవాఁడనై; నజీవామిహి=బ్రతుకనుగదా!

లక్ష్మణుఁడా! నేను సీతనువిడిచి బ్రతుకఁజాలనుగదా! అని, తాత్పర్యము.

మృతం శోకేన మహతా సీతాపహరణజేన మామ్. ౬
పరలోకే మహారాజో నూనం ద్రక్ష్యతి మే పితా

టీక॥ సీతాపహరణజేన = సీతనపహరించుట వలనఁగలిగిన; మహతా=గొప్పదగు; శోకేన=దుఃఖముచేత; మృతం=చచ్చిన; మాం=నన్ను; మే = నాయొక్క; పితా=తండ్రియయిన; మహారాజః=దశరథమహారాజు; పరలోకే=పరలోకమునందు; ద్రక్ష్యతి= చూడఁగలఁడు. నూనం=నిశ్చయము.

ఇట్లు సీతాపహరణంబునఁగలిగినమహాదుఃఖమువలన, నేను మృతిఁబొందఁగా, నన్నుస్వర్గంబున, నాతండ్రిదశరథమహారాజుచూడఁగలఁడు; నిశ్చయము.

అని, తాత్పర్యము.

కథం ప్రతిజ్ఞాం సంశ్రుత్య మయా త్వ మభియోజితః. ౭
అపూరయిత్వా తం కాలం మత్సకాశ మిహాగతః
కామవృత్త మనార్యం మాం మృషావాదిన మేవచ. ౮
ధిక్త్వా మితి పరే లోకే వ్యక్తం వక్ష్యతి మే పితా

టీక॥ మాం=నన్నుఁగూర్చి; "త్వం=నీవు; మయా=నాచేత; అభియోజితః=ఆజ్ఞాపింపఁబడినవాఁడవై; ప్రతిజ్ఞాం=ప్రతినను; సంశ్రుత్య = అంగీకరించి; తం=ఆ; కాలం=కాలమును; అపూరయిత్వా=సమాప్తినొందింపక యే; కథం=ఎట్లు; ఇహ=ఇచ్చటికి; మత్సకాశం=నాసమీపమును; ఆగతః=పొందినావు; కామవృత్తం= యథేచ్ఛమయినయాచారముగలవాఁడవును; అనార్యం=దుష్టుండవును; మృషావాదినమేవచ=అబద్ధముచెప్పువాఁడవునగు; త్వాం = నిన్నుఁగూర్చి; ధిక్ = దహింపఁబడుటయగుఁగాక. ఇతి=అని; పరే=ఇతరమయిన; లోకే=లోకమునందు; మే = నాయొక్క; పితా=తండ్రి; వక్ష్యతి = చెప్పును. వ్య




క్త=స్పష్టము.

పరలోకంబున, నాతండ్రి, నన్నుఁ జూచి, "నీవు నాచే నాజ్ఞాపితుండవై, యాజ్ఞాప్రకారము పదునాలుగు సంవత్సరములు వనవాసంబుగా వించెదనని ప్రతిజ్ఞ చేసి, ఆపదునాలుగేండ్లునిండుటకు మున్నె, యిచ్చటికి నాయొద్ద కెట్లువచ్చి నావు? నీవు, యథేచ్ఛముగా నాచరించువాఁడవు; దుష్టుండవు; అబద్ధముచెప్పు వాఁడవు; నీవు దహింపఁబడుదువుగాక." అని నిందించును; సందేహము లేదు. అని తాత్పర్యము.

వివశం శోకసంతప్తం దీనం భగ్నమనోరథమ్. ౯
మామిహోత్సృజ్య కరుణం కీర్తిర్నరమివానృజుమ్
క్వ గచ్ఛసి వరారోహే మాముత్సృజ్య సుమధ్యమే. ౧౦

టీక॥ వరారోహే=శ్రేష్ఠములయిన పిఱుందులుగల; సుమధ్యమే= సుందరమయిననడుముగలసీతా! వివశం= పరవశుండను; శోకసంతప్తం= దుఃఖముచే తపింపఁజేయఁబడినవాఁడను; దీనం= గర్వముడిగిన వాఁడను; భగ్న మనోరథం = చెడిపోయిన కోరికగల వాఁడనగు; మాం=నన్ను; కీర్తిః=కీర్తి; అనృజుం= కపటియయిన; నరమివ=పురుషునివలె; ఇహ=ఇచ్చట; ఉత్సృజ్య = విడిచి; మాం=నన్ను; ఉత్సృజ్య=విడిచి; క్వ=ఎచ్చటికి; గచ్ఛసి=పోవుచున్నావు?

సుందరములయిన పిఱుదులుగలదానా! సుందరమయిన సన్ననినడుముగలదానా! పరవశుండను బరమదుఃఖితుండను దీనుండను భగ్నమయిన మనోరథముగలవాఁడనగు నన్ను, ఇచ్చట, కపటియగు పురుషుని గీర్తి విడుచునట్లు, విడిచిపెట్టి, నీ వెచ్చటికిఁ బోయెదవు? నన్ను విడిచి నీ వెచ్చటికిఁ బోయెదవు? అని, తాత్పర్యము.

త్వయా విరహితశ్చాహం మోక్ష్యే జీవితమాత్మనః

టీక॥ అహం=నేను; త్వయా= నీచేత; విరహితః= విడువఁబడినవాఁడనై; ఆత్మనః=నాయొక్క ; జీవితం= ప్రాణమును; మోక్ష్యే=విడిచెదను.

నేను, నిన్ను విడిచి నిమిషంబేని జీవించి యుండఁజాలను; ప్రాణంబులు విడిచెదను. అని, రాముండు విలపించెను. అని, తాత్పర్యము.

ఇతీవ విలప న్రామ స్సీతా దర్శన లాలసః. ౧౧
న దదర్శ సుదుఃఖార్తో రాఘవో జనకాత్మజామ్

టీక॥ రాఘవః = రఘువంశమునం బుట్టిన; రామః = రాముఁడు; సీతాదర్శనలాలసః = సీతాదేవిని జూచుటయందధికేచ్ఛ గలవాఁడై; ఇతీవ = ఇట్లు; విలపన్ = విలపించుచు; సుదుఃఖార్తః = మిక్కిలియు దుఃఖముచేఁ బీడింపఁబడినవాఁడై; జనకాత్మజాం = జనకమహారాజకూఁతురయిన సీతను; న దదర్శ = చూచెను.

రాముండు, సీతాదేవిఁ గానంగోరి, పరమదుఃఖితుండై, యిట్లాంతవిలపించినను, సీతాదేవి గానరాదయ్యె. అని, తాత్పర్యము.

అనాసాదయమానం తం సీతాం దశరథాత్మజమ్. ౧౨
పంక మాసాద్య విపులం సీదంతమివ కుంజరమ్
లక్ష్మణో రామ మత్యర్థ మువాచ హితకామ్యయా. ౧౩

టీక॥ లక్ష్మణః = లక్ష్మణుఁడు; సీతాం = సీతను; అనాసాదయమానం = పొందకున్నవాఁడును; విపులం = విశాలంబయిన; పంకం = బురదను; ఆసాద్య = పొంది; సీదంతం = నశించుచున్న; కుంజరమివ (స్థితం) = ఏనుంగువలెనున్నవాఁడనగు; దశరథాత్మజం = దశరథునికొడుకైన; రామం = రామునిగూర్చి; అత్యర్థం = మిక్కిలియు; హితకామ్యయా = మేలుఁ నందలికోరికచేత; ఉవాచ = చెప్పెను.

లక్ష్మణుండు, అట్లు పెద్దబురదలోఁ బడినశించుగజంబువలె, సీతంగానక దుఃఖసముద్రంబున మునుంగుచున్న దశరథమహారాజపుత్రుండగు రామునిఁజూచి, మిక్కిలియునతనిహితంబుఁగోరి, యిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

మా విషాదం మహాబాహో కురు యత్నం మయా సహ
ఇదం చ హి వనం శూర బహుకందర శోభితమ్. ౧౪

టీక॥ మహాబాహో = పెద్దచేతులు గలట్టి; శూర = యుద్ధమునందుభయము లేనట్టి రాముఁడా! విషాద = దుఃఖమును; మా (కురు) = చేయకుము. మయా సహ = నాతోఁగూడ; యత్నం = ప్రయత్నమును; కురు = చేయుము. ఇదం = ఈ; వనంచ = అడవియు; బహుకందరశోభితం హి = పెక్కుగుహలచే, గుహలవంటి లతాగృహములచే, ప్రకాశించుచున్నదిగదా!

మహాబాహుండవు శూరుండవు నగు రాముఁడా! దుఃఖింపకుము; నాతోఁ గూడ, సీతాదేవిని వెదకుట యందుఁ బ్రయత్నముగావింపుము; ఈయడవి, గుహలవంటి లతాగృహములు పెక్కులు గలది; కావున, సీతాదేవి యిచ్చోటనే యుండవచ్చును. అని, తాత్పర్యము.

ప్రియకాననసంచారా వనోన్మత్తా చ మైథిలీ
సా వనం వా ప్రవిష్టా స్యా న్నళినీం వా సుపుష్పితామ్. ౧౫

టీక॥ మైథిలీ = సీత; ప్రియకాననసంచారా = ఇష్టమయిన యడవియందుఁదిరుగుటగలది. వనోన్మత్తా చ = పిచ్చిగలదియు. సా = ఆసీత; వనం వా = అడవినిగాని; సుపుష్పితాం = చక్కఁగాఁ బుష్పించిన; నళినీం వా = తామరకొలనునుగాని; ప్రవిష్టా = ప్రవేశించినదిగ; స్యాత్ = అగును.

సీత, అడవిందిరుగుట యందు విక్కిలియుఁ బ్రీతిముగలది; తటాకాదులయందును జాలఁబ్రియముగలది; కావున, వనంబులోనికిఁగాని, చక్కఁగాఁ బుష్పించియుండు తామరకొలంకునకుఁగాని, బోయియుండును.

అని, తాత్పర్యము.

సరితం చాపి సంప్రాప్తా మీనవంజుళసేవితామ్
స్నాతుకామా నిలీనా స్యా ద్ధాసకామా వనే క్వచిత్. ౧౬

టీక॥ సా (అధ్యాహృతము) = ఆసీత; స్నాతుకామా = స్నానముచేయఁగోరినదై; మీనవంజుళసేవితాం = మత్స్యములచేతను ప్రబ్బలిపొదలచేతను సేవింపఁబడిన; సరితం = నదిని; సంప్రాప్తా వాపి = పొందినదైగాని; హాసకామా = నవ్వులాటయందుఁ గోర్కెగలదై; వనే = అడవియందు; క్వచిత్ = ఒకా

నొకచోట; నిలీనా= డాఁగినదైగాని; స్యాత్=ఉండును.

సీత, స్నానముచేయవలెనని, మీనంబులతోను బ్రబ్బలితీఁగెలతోనునొప్పచున్న నదికిఁబోయెనో, నవ్వులాటకుఁగా, వనంబుననొకచో డాఁగెనో, యుండును. అని, తాత్పర్యము.

విత్రాసయితుకామా వా లీనా స్యా త్కానసే క్వచిత్
జిజ్ఞాసమానా వైదేహీ త్వాం మాంచ పురుషర్షభ. ౧౬

టీక॥ పురుషర్షభ=పురుషశ్రేష్ఠుఁడవగు రామునఁడా! వైదేహీ = సీత; త్వాం=నిన్నును; మాంచ=నన్నును; విత్రాసయితుకామా=భయపఱుపఁగోరినదిగాని; జిజ్ఞాసమానా=తెలియఁగోరినదైగాని; కానసే = అడవియందు; క్వచిత్=ఒకానొకచోట; లీనా=డాఁగినది; స్యాత్=అగును.

పురుషశ్రేష్ఠుఁడవగు రామునఁడా! సీత, మనలభయపఱుపఁగోరెనో, లేక మనసామర్థ్యమును నెఱుంగఁగోరెనో, యరణ్యంబున నొకచో నెంతేని డాఁగియుండును. అని, తాత్పర్యము.

తస్యా హ్యన్వేషణే శ్రీమన్ క్షిప్రమేవ యతావహై

టీక॥ శ్రీమన్= కాంతిమంతుండవగు రామునఁడా! తస్యాః=ఆసీతయొక్క; ("హి" అనునది పాదపూరణార్థము); అన్వేషణే=వెదకుట యందు; క్షిప్రమేవ=శీఘ్రముగనే; యతావహై = ప్రయత్నింతము.

కాంతిమంతుఁడవగు రామునఁడా! సీతను వెదకుటకు శీఘ్రముగాఁ బ్రయత్నింతము. అని, తాత్పర్యము.

వనం సర్వం విచినువో యత్ర సా జనకాత్మజా. ౧౭
మన్యసే యది కాకుత్థ్స మా స్మ శోకే మనః కృథాః

టీక॥ కాకుత్థ్స= రామునఁడా! మన్యసే యది = కోరుదువేని; యత్ర=ఎందు;

సౌ=అ;జనకాత్మజా= జనకమహారాజాకూతురగు నసీత;అస్తి(అధ్యాహృతము) = ఉన్నదో; తత్(అధ్యాహృతము)=ఆ;వనం=అడవిని; సర్వం=అంతను; విచినువః=వెదకుదము. శోకే=దుఃఖమునందు;మనః=మనస్సును; మ కృథాః= చేయకుము , ఉంచకుమనుట ("స్మ" అనునది పాదపూరణార్థము,.

రాముఁడా! నీకిష్టముండునేని, సీతయుండు స్థలంబు దెలియుటకై, యీవనంబునంతయు వెదకుదము; మనంబున దుఃఖంబుంచుకొనకుము. అనిలక్ష్మణుండు రామునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు సౌహార్దా ల్లక్ష్మణేన సమాహితః. ౧౯
సహ సౌమిత్రిణా రామో విచేతు ముపచక్రమే

టీక॥ రామః=రాముఁడు; లక్ష్మణేన=లక్ష్మణునిచేత ; సౌహార్దాత్=స్నేహమువలన;ఏవం=ఇట్లు;ఉక్తస్తు=చెప్పఁబడినవాఁడైనంతనె ; సమాహితః=సమాధానము నొందినవాఁడై;సౌమిత్రిణా సహ=లక్ష్మణునితోఁగూడ; విచేతుం=వెదకుటకు;ఉపచక్రమే = అరంభించెను.

రాముండు , స్నేహంబున లక్ష్మణుండు చెప్పినమాటలనువిని, సమాధానమునొంది, లక్ష్మణునితోఁగూడ , సీతను వెదక నారంభించెను.

అని, తాత్పర్యము.

తౌ వనాని గిరీంశ్చైవ సరితశ్చ సరాంసిచ. ౨౦
నిఖిలేన విచిన్వానౌ సీతాం దశరథాత్మజౌ

టీక॥ దశరథాత్మజౌ= దశరథమహారాజుకొడుకులైన; తౌ=ఆ రామలక్ష్మణులు; వనాని= అడవులను; గిరీంశ్చైవ=పర్వతములను; సరితశ్చ=నదులను; సరాంసిచ=కొలంకులను ; నిఖిలేన=సాకల్యముచేత; సీతాం=సీతను; విచిన్వానౌ= వెదకుచు; బభూవతుః(అధ్యాహృతము)=ఉండిరి.

దశరథమహారాజపుత్రులగు నారామలక్ష్మణులు, అడవులనుబర్వతంబుల నునదులనుగొలంకులను అంతటను, సీతాదేవిని వెదకిరి.అని, తాత్పర్యము.

తస్య శైలస్య సానూని గుహాశ్చ శిఖరాణిచ. ౨౧
నిఖిలేన విచిన్వానౌ నైవ తా మభిజగ్మతుః

టీక॥ తౌ(అధ్యాహృతము)=ఆరామలక్ష్మణులు; తస్య=ఆ; శైలస్య=పర్వతముయొక్క; సానూని=చరియలను; గుహాశ్చ = గుహలను; శిఖరాణిచ=శిఖరములను; నిఖిలేన=సాకల్యముచేత; విచిన్వానౌ=వెదకుచు; తాం=ఆసీతను; నైవాభిజగ్మతుః=పొందనే లేదు.

ఆరామలక్ష్మణులు, ఆప్రస్రవణపర్వతమునందలిసానువులనుగుహలను శిఖరంబులనుఅంతటనువెంత వెదకినను, సీతయగపడనేలేదు. అని, తాత్పర్యము.

విచిత్య సర్వత శ్శైలం రామో లక్ష్మణ మబ్రవీత్. ౨౨

టీక॥ శైలం=(ప్రసవణమనుపేరుగల) పర్వతమునందు; సర్వతః=అంతటను; విచిత్య=వెదకి; రామః=రాముండు; లక్ష్మణం=లక్ష్మణునిగూర్చి; అబ్రవీత్=చెప్పెను.

అట్లాప్రస్రవణపర్వతమంతయు వెదకి, రాముండు లక్ష్మణుంజూచి యిట్లనియె. అని, తాత్పర్యము.

నేహ పశ్యామి సౌమిత్రే వైదేహీం పర్వతే శుభామ్

టీక॥ సౌమిత్రే=లక్ష్మణుండా! ఇహ=ఈ; పర్వతే = కొండయందు; శుభాం = మంగళరూపిణియగు; వైదేహీం=సీతను; నపశ్యామి= చూడను.

లక్ష్మణుండా! ఈప్రస్రవణపర్వతంబునందు, మంగళరూపిణియగుసీతయగపడలేదు. అని, రాముండులక్ష్మణునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

తతో దుఃఖాభిసంతప్తో లక్ష్మణో వాక్య మబ్రవీత్. ౨౩
విచరన్ దండకారణ్యం భ్రాతరం దీప్తతేజసమ్

టీక॥ తతః=అంత; దండకారణ్యం=దండకారణ్యమునుగూర్చి; విచరన్=వి

రుగుచున్న; లక్ష్మణః=లక్ష్మణుఁడు; దుఃఖాభిసంతప్తః= దుఃఖముచేఁదపింపఁజేయఁబడినవాఁడై; దీప్తతేజసం=ప్రకాశించుచున్న కాంతిగల; భ్రాతరం=అన్నను గూర్చి; వాక్యం = మాటను; అబ్రవీత్=చెప్పెను.

అంత, దండకారణ్యంబున సీతను వెదకుచున్న లక్ష్మణుండు, పరమ దుఃఖితుండై, మహాతేజుండగు రాముఁజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ప్రాప్స్యసి త్వం మహాప్రాజ్ఞం మైథిలీ జనకాత్మజామ్. ౨౮
యథా విష్ణు ర్మహాబాహు ర్బలిం బద్ధ్వా మహీ మిమామ్

టీక॥ మహాప్రాజ్ఞ=మహాపండితుఁడవగు రాముఁడా! త్వం=నీవు; జనకాత్మజాం = జనకమహారాజుకూఁతురయిన; మైథిలీం=సీతను; మహాబాహుః=పెద్దచేతులుగల; విష్ణుః=విష్ణువు; బలిం=బలిచక్రవర్తిని; బద్ధ్వా=కట్టివేసి; ఇమాం=ఈ; మహీం యథా= భూమిని వలె; ప్రాప్స్యసి=పొందఁగలవు.

మహాపండితుండవగు రాముఁడా! మహాబాహుండవగు విష్ణువు బలిచక్రవర్తిని బంధించి యీభూమిం బొందినట్లు, నీవు, నిస్సందేహముగా, సీతనపహరించినవాని శిక్షించి, జనకమహారాజపుత్రియగు సీతం బొందఁగలవు. అని, లక్ష్మణుండు రామునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు సౌహార్దా ల్లక్ష్మణేన స రాఘవః. ౨౯
ఉవాచ దీనయా వాచా దుఃఖాభిహతచేతనః

టీక॥ సః=ఆ; రాఘవః=రాముఁడు; లక్ష్మణేన=లక్ష్మణునిచేత; సౌహార్దాత్=స్నేహముచలన; ఏవం=ఇట్లు; ఉక్తస్తు=చెప్పఁబడినవాఁడైనంతనె; దుఃఖాభిహతచేతనః=దుఃఖముచేఁ గొట్టఁబడినబుద్ధిగలవాఁడై; దీనయా= దుఃఖితమగు; వాచా=మాటచేత; ఉవాచ=చెప్పెను.

రాముండు, లక్ష్మణుండు స్నేహంబునం జెప్పినమాటను విని, పరమదుఃఖితుండై, లక్ష్మణుంజూచి, దీనవాక్యంబున, నిట్లనియె. అని, తాత్పర్యము.

స ౬౧

వనం సర్వం సువిచితం పద్మిన్యః ఫుల్లపంకజాః. ౨౬
గిరిశ్చాయం మహాప్రాజ్ఞ బహుకందరనిర్ఝరః

టీక॥ మహాప్రాజ్ఞ = మహాపండితుండవగులక్ష్మణుఁడా! వనం=అడవి; సర్వం=అంతయు;సువిచితం=చక్కఁగా వెదకఁబడినది. ఫుల్లపంకజాః= వికసించినకమలములుగల; పద్మిన్యః = తామరకొలంకులు;సువిచితాః(అధ్యాహృతము)= చక్కఁగా వెదకఁబడినవి. అయం=ఈ;బహుకందరనిర్ఝరః=పెకుఁగుహలును సెలయేళ్లునుగల ; గిరిశ్చ= ప్రస్రవణపర్వతమును; సువిచితః (అధ్యాహృతము)= చక్కఁగా వెదకఁబడినది.

మహాపండితుఁడవగులక్ష్మణుఁడా! ఈయడవియంతయు, వికసితకమలంబులగు తామరకొలంకులను, పెకుఁగుహలును సెలయేళ్లునుగల యీప్రస్రవణపర్వతంబును జక్కఁగా వెదకినాము.

అని, తాత్పర్యము.

నహి పశ్యామి వైదేహీం ప్రాణేభ్యోపి గరీయసీమ్. ౨౭

టీక॥ ప్రాణేభ్యోపి= ప్రాణములకన్నను; గరీయసీం=అధికమయిన;వైదేహీం=సీతను;నపశ్యామిహి=చూడకున్నానుగదా!

ఇంకను, నాకుఁబ్రాణంబులకన్న నధికమయిన సీతయగపడకున్నదిగదా! అని, రాముండులక్ష్మణునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవం స విలపన్రామ స్సీతాహరణకర్శితః
దీన శ్శోకసమావిష్టో ముహూర్తం విహ్వలో భవత్. ౨౮

టీక॥ సః=ఆ; రామః = రాముఁడు; సీతాహరణకర్శితః= సీతనపహరించుటచేఁ గృశింపఁజేయఁబడినవాఁడై; దీనః=గర్వముడిగినవాఁడై; శోకసమావిష్టః= దుఃఖముఁబొందినవాఁడై; ఏవం=ఇట్లు; విలపన్=విలపించుచు; ముహూర్తం= కొంచెముసేపు; విహ్వలః=మూర్ఛితుఁడు; అభవత్= ఆయెను.

రాముండు , స్త్రీతాపహరణంబుచే

నలఁగినవాఁడై, దీనుండై దుఃఖితుండై, యీప్రకారంబున, విలపించుచు, దుఃఖాతిశయంబున, మూర్ఛనొందెను.

అని, తాత్పర్యము.

సంతప్తో హ్యవసన్నాంగో గతబుద్ధి ర్విచేతనః
నిషసా దాతురో దీనో నిశ్శ్వస్యా శీత మాయతం. ౨౯

టీ॥ సః(అధ్యాహృతము)=ఆరాముఁడు; సంతప్తః=సంతాపమునొందినవాఁడై(“హి” అనునది పాదపూరణార్థము); అవసన్నాంగః=కృశించిన దేహముగలవాఁడై; గతబుద్ధిః=తెలివిలేనివాఁడై; విచేతనః=చేష్టలుదక్కినవాఁడై; ఆతురః=పీడితుఁడై; దీనః=దుఃఖితుఁడై; అశీతం=ఉష్ణముగాను; ఆయతం=దీర్ఘముగను; నిశ్శ్వస్య=నిట్టూర్పులువుచ్చి; నిషసాద=కూర్చుండెను.

రాముండు, సంతాపమునొంది, దేహముకృశించి, నిస్సంజ్ఞుండై, నిశ్చేష్టుండై, యాతురుండై, దుఃఖితుండై, వేఁడినిట్టూర్పులువుచ్చుచు, ఏమియుఁజేయంజాలక కూర్చుండెను.

అని, తాత్పర్యము.

బహుళం సతు నిశ్శ్వస్య రామో రాజీవలోచనః
హా ప్రియేతి విచుక్రోశ బహుశో బాష్పగద్గదః. ౩౦

టీక॥ రాజీవలోచనః=కమలంబులవంటికన్నులుగల; సః=ఆ; రామః=రాముఁడు; బహుళం=అధికముగా; నిశ్శ్వస్యతు=నిట్టూర్పులువుచ్చియు; బహుశః=అధికముగా; బాష్పగద్గదః=కన్నీళ్లచే డగ్గుత్తికనొందినవాఁడై; హాప్రియే=అయ్యోప్రియురాలా! ఇతి(సంధియార్షము)=అని; విచుక్రోశ=గట్టిగానేడ్చెను.

కమలంబులంబోలు కన్నులుగల రాముండు, అట్లధికంబుగా నిట్టూర్పులనిగుడించుచు, కంఠంబునమిక్కిలియుడగ్గుత్తికగదుర, “అయ్యోప్రియురాలా” యనిగట్టిగానేడ్చెను. అని, తాత్పర్యము.

తం తత స్సాంత్వయామాస లక్ష్మణః ప్రియబాంధవః
బహుప్రకారం ధర్మజ్ఞః ప్రశ్రితం ప్రశ్రితాంజలిః. ౩౧

టీక॥ తతః=అంత ; ప్రియబాంధవః=ప్రియమయిన బంధుజనముగలవాఁడును; ధర్మజ్ఞః= ధర్మము దెలిసిన వాఁడునగు; లక్ష్మణః=లక్ష్మణుఁడు; ప్రశ్రితాంజలిః=కట్టఁబడిన చేమోడ్పుగల వాఁడై; బహుప్రకారం=పెక్కువిధములుగాను; ప్రశ్రితం= వినయముగలుగునట్లుగాను; తం=ఆ రామునిన్; సాంత్వయామాస=ఊరడించెను.

అంత, బంధుప్రియుండును ధర్మజ్ఞుండు దెలిసినవాఁడునగు లక్ష్మణుండు, చేమోడ్పుగీలించి, నానావిధంబుల, సవినయంబుగా, నారాముని, మంచి మాటలనాశ్వాసించెను.

అని, తాత్పర్యము.

అనాదృత్య తు తద్వాక్యం లక్ష్మణోష్ఠ పుటాచ్చ్యుతమ్
అపశ్యం స్తాం ప్రియాం సీతాం ప్రాక్రోశ త్స పునఃపునః. ౩౨

టీక॥ సః=ఆ రాముఁడు; లక్ష్మణోష్ఠపుటాత్= లక్ష్మణునిదొప్పవంటి పెదవులనుండి; చ్యుతం=జాఱిన; తత్=ఆ; వాక్యం=మాటను; అనాదృత్యతు= సరకుసేయకయె; ప్రియాం= ప్రియురాలయిన; తాం=ఆ; సీతాం=సీతను; అపశ్యన్= చూడనివాఁడై; పునఃపునః= మాటిమాటికి; ప్రాక్రోశత్=ఏడ్చెను.

ఆ రాముఁడు, లక్ష్మణుండు చెప్పెడు నాశ్వాసనవచనముల నెంతమాత్రము సరకుసేయక, ప్రియురాలగు సీతం జూడకున్నందున, మాటిమాటికి, రోదనము సేయుచు నుండెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, అరణ్యకాండే, ఏకషష్టితమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అరణ్యకాండైకషష్టితమసర్గటీక, ముగిసినది.



శ్రీః

ద్విషష్టితమసర్గప్రారంభః

సీతా మపశ్యన్ ధర్మాత్మా కామోపహతచేతనః
విలలాప మహాబాహూ రామః కమలలోచనః. ౧

టీక॥ ధర్మాత్మా= ధర్మస్వభావుండును; మహాబాహుః= పెద్దచేతులుగలవాఁడును; కమలలోచనః= తామరపూలవంటికన్నులుగల వాఁడునగు; రామః= రాముఁడు; సీతాం= సీతను; అపశ్యన్= చూడనివాఁడై; కామోపహతచేతనః= మోహముచేఁగొట్టఁబడిన బుద్ధిగలవాఁడై; విలలాప = విలపించెను.

ధర్మాత్ముండును ఆజానుబాహుండును కమలంబులంబోలుకన్నులుగలవాఁడునగురాముండు, సీతాదేవి యగపడనందునఁ, బ్రియావిరహముచేఁ బరవశుండై, యిట్లని, విలపించెను.

అని, తాత్పర్యము.

పశ్యన్నివ చ తాం సీతా మపశ్యన్మదనార్దితః
ఉవాచ రాఘవో వాక్యం విలాపాశ్రయదుర్వచమ్. ౨

టీక॥ రాఘవః= రాముఁడు; తాం= ఆ; సీతాం= సీతను; అపశ్యన్= చూడనివాఁడైయు; మదనార్దితః= మన్మథునిచేఁ బీడింపఁబడినవాఁడై; పశ్యన్నివ= చూచుచున్నవాఁడువలె; విలాపాశ్రయదుర్వచం = ఏడ్పునకాశ్రయమగుటచేఁజెప్పనలవిగాని; వాక్యం= మాటను; ఉవాచ= చెప్పెను.

రాముండు, సీత యెదుట లేకుండుటచే నామెం జూడకున్నను, మన్మథపరవశుండై, సీతాదేవిం గన్నెదుటఁజూచుచున్నవాఁడువలె, రోదనంబుచే డగ్గుత్తికవలన శబ్దము నుచ్చరింప నశక్యము గా, నీమాటం జెప్పెను.

అని, తాత్పర్యము.

త్వ మశోకస్య శాఖాభిః పుష్పప్రియతయా ప్రియే

అవృణోషి శరీరం తే మమ శోక వివర్ధనీ. ౩

టీక॥ ప్రియే=ప్రియురాలా! త్వం=నీవు; పుష్పప్రియతయా = పుష్పములయందుఁ బ్రీతిగలదానవగుటచేత; తే=నీయొక్క; శరీరం=దేహమును; అశోకస్య=అశోకవృక్షముయొక్క ; శాఖాభిః=కొమ్మలచేత; మమ=నాకు; శోకవివర్ధనీ=దుఃఖమును వృద్ధిఁబొందించుదానవై; ఆవృణోషి = కప్పుకొనుచున్నావు.

ప్రియురాలా! నీవు, పుష్పములయందుఁ బ్రీతిగలదానవగుటచేత , నాదుఃఖము వృద్ధిఁబొందునట్లు, నీ దేహమును అశోకశాఖలచేఁ గప్పుకొనుచున్నావు. అని, తాత్పర్యము.

కదళీస్కంధసదృశౌ కదళ్యా సంవృతావుభౌ
ఊరూ పశ్యామి తే దేవి నాసి శక్తా విగూహితుమ్. ౪

టీక॥ దేవి= ప్రియురాలా! కదళీస్కంధసదృశౌ= అరటిబోదెలతోసమానములును; కదళ్యా=అరటిచెట్టుచేత; సంవృతౌ=కప్పఁబడినవియునగు; తే=నీయొక్క; ఊరూ=తొడలను; ఉభౌ=రెంటిని; పశ్యామి= చూచుచున్నాను. విగూహితుం=దాఁచుకొనుటకు ; శక్తా=సమర్థురాలవు; నాసి=కావు.

అరఁటిస్తంభములతో సమానములును అరఁటిచెట్టు మఱుంగున నున్నవియునగు నీతొడలరెంటినిం జూచితిని; నీకుఁ జక్కఁగా మఱుఁగుచేసికొనఁ దెలియదు. అని, తాత్పర్యము.

కర్ణికారవనం భద్రే హసంతీ దేవి సేవసే
అలం తే పరిహాసేన మమ బాధావహేన వై. ౫

టీక॥ భద్రే=మంగళరూపిణివగు; దేవి=ప్రియురాలా! హసంతీ=నవ్వుచు; కర్ణికారవనం= కొండగోఁగులవనమును; సేవసే=సేవించుచున్నావు. మమ=నాకు; బాధావహేన= బాధగలిగించునట్టి ("వై" అనునది పాదపూరణార్థము) తే=నీయొక్క; పరిహాసేన= ఎగతాళిచేత; అలం=చాలును.

మంగళరూపిణివగు ప్రియురాలా! నీవు, నవ్వుచు గొంజగోఁగు చెట్లలోఁ దిరుగుచున్నావు; నీనవ్వులాట చాలును; దానివలన నాకుఁ జాలబాధగలుగుచున్నది. అని, తాత్పర్యము.

పరిహాసేన కిం సీతే పరిశ్రాంతస్య మే ప్రియే
అయం న పరిహాసోపి సాధు దేవి నరోచతే. ౬

టీక॥ ప్రియే=ప్రియురాలవగు; సీతే=సీతా! పరిహాసేన=ఎగతాళిచేత; కిం=ఏమిప్రయోజనము? దేవి=ప్రియురాలా! పరిశ్రాంతస్య=డస్సినవి; మే=నాకు; అయం=ఈ; న=అట్టి; పరిహాసోపి=పరిహాసముగూడ; సాధు=లెస్సగా; నరోచతే=రుచింపలేదు.

ప్రియురాలవగు సీతా! నన్నెగతాళి సేయుటచే నీకేమి ప్రయోజనము? ము న్ను నాకీ పరిహాసము సంతోషకరముగ నేయున్నను, ఇప్పుడు చాలడస్సియున్నాను గావున, మిక్కిలియు బాధకరముగనున్నది. అని, తాత్పర్యము.

విశేషేణా శ్రమస్థానే హాసోయం న ప్రశస్యతే
అవగచ్ఛామి తే శీలం పరిహాస ప్రియం ప్రియే. ౭

టీక॥ విశేషేణ = విశేషించి; అయం=ఈ; హాసః = పరిహాసము; ఆశ్రమస్థానే= ఆశ్రమపదమునందు; న ప్రశస్యతే=ప్రశస్తము కాదు. ప్రియే=ప్రియురాలా! పరిహాసప్రియం= పరిహాసముచేత సంతోషించునట్టి; తే=నీయొక్క; శీలం=స్వభావమును; అవగచ్ఛామి=ఎఱుంగుదును.

ప్రియురాలా? విశేషించి పరిహాసము, ఆశ్రమములయందు, మంచిదికాదు; నీవు పరిహాసప్రియవని నీస్వభావము నాకుఁ జక్కఁగాఁ దెలియును.

అని, తాత్పర్యము.

ఆగచ్ఛ త్వం విశాలాక్షి శూన్యోయ ముటజ స్తవ

టీక॥ విశాలాక్షి=వెడల్పులయినకన్నులుగలదానా! త్వం=నీవు; ఆగచ్ఛ=రమ్ము. తవ=నీయొక్క; అయం=ఈ; ఉటజః=పర్ణశాల; శూన్యః=పాడుపడియున్నది.

విశాలంబులగు కన్నులుగలసీతా! నీవు, ఇంకరమ్ము; నీవు లేకుండుటచే, నీ పర్ణశాల పాడుపడియున్నది.

అని, తాత్పర్యము.

సువ్యక్తం రాక్షసై స్సీతా భక్షితావా హృతాపివా. ౧౯
నహి సా విలపంతం మా ముపసంప్రైతి లక్ష్మణ

టీక॥ లక్ష్మణ = లక్ష్మణుఁడా! సీతా=సీత; రాక్షసైః=రాక్షసులచేత; భక్షితావా=భక్షింపఁబడినదో. హృతాపివా=అపహరింపఁబడినదో; సువ్యక్తం=ఇకిది నిస్పష్టము. హి= ఏలయనఁగా; సా=ఆసీత; విలపంతం= విలపించుచున్న; మాం=నన్ను; నోపసంప్రైతి=సమీపించకున్నది.

లక్ష్మణుఁడా! రాక్షసులు సీతను భక్షించివేసియయినను ఉందురు; లేక యపహరించుకొనిపోయియయినను ఉందురు; స్పష్టము; ఎందువలన ననఁగా, నేనుఎంతవిలపించినను, సీత, నాయొద్దకురాకయే యున్నదే. అని, తాత్పర్యము.

ఏతాని మృగయూథాని సాశ్రునేత్రాణి లక్ష్మణ. ౨౦
శంసంతీ వహి వైదేహీం భక్షితాం రజనీచరైః

టీక॥ లక్ష్మణ= లక్ష్మణుఁడా! సాశ్రునేత్రాణి= కన్నీళ్లతోఁగూడినకన్నులుగల; ఏతాని= ఈ; మృగయూథాని=జింకలగుంపులు; వైదేహీం= సీతను; రజనీచరైః=రాక్షసులచేత; భక్షితాం=భక్షింపఁబడినదానిగా; శంసంతీవహి=చెప్పుచున్నట్లున్నవిగదా!

లక్ష్మణుఁడా! ఈమృగసమూహములు, కన్నీళ్లు గారుచు, సీతరాక్షసులచేభక్షింపఁబడినదని, చెప్పునట్లు, చూపట్టుచున్నవి. అని, తాత్పర్యము.

హా మమార్యే క్వయాతాసి హా సాధ్వి వరవర్ణిని. ౨౧

హా సకామా త్వయా దేవీ కైకేయీ సా భవిష్యతి

టీక॥ హా=అయ్యో! మమ(ప్రియే)= నాప్రియురాలా! ఆర్యే= పూజ్యురాలా! హా=అయ్యో! సాధ్వి= పతివ్రతయినదానా! వరవర్ణిని=ఉష్ణకాలమునసుఖశీతలమును శీతకాలమున సుఖోష్ణమునగుదేహముగలిగి భర్తయందనురాగముగలదానా! క్వ= ఎచ్చటికి; యాతా=పోవుచున్నావు; అసి=అగుచున్నావు? హా=అయ్యో! త్వయా = నాచేత; దేవీ=రాణియగు; సా=ఆ; కైకేయీ=కైకేయి; సకామా= కోరంబడినదానితోఁగూడినది; భవిష్యతి= కాఁగలదు.

అయ్యో! నాప్రియురాలా, పూజ్యురాలా, పతివ్రతాశిరోమణీ, ఉష్ణకాలమున సుఖశీతంబును శీతకాలము నసుఖోష్ణమున్నగునంగముగలిగి భర్తయందుబద్ధానురాగముగల యుత్తమనారీమణీ, ఎచ్చటికిఁబోతివి? అయ్యో! నీవు,ఇట్లునశించుటచే, రాణియగునా కైకేయికోరికెఁజూడ్లీడేఱఁగలదు.

అని, తాత్పర్యము.

సీతయా సహ నిర్యాతో వినా సీతా ముపాగతః. ౧౧
కథం నామ ప్రవేక్ష్యామి శూన్య మంతఃపురం పునః

టీక॥ అహం(అధ్యాహృతము) = నేను; సీతయాసహ=సీతతోఁగూడ;నిర్యాతః= వెడలినవాఁడనై; సీతాంవినా=సీతనువిడిచి; ఉపాగతః=వచ్చినవాఁడనై; శూన్యం=పాడైన; అంతఃపురం=అంతిపురమును; కథంనామ = ఎట్లు; ప్రవేక్ష్యామి=ప్రవేశింతును?

నేను, సీతతోఁగూడ వెడలివచ్చి, సీత లేక మఱియూరికిఁబోయి, శూన్యంబైయుండునంతఃపురమును, మఱల, నెట్లు ప్రవేశింపఁగలను? అని, తాత్పర్యము.

నిర్వీర్య ఇతి లోకో మాం నిర్దయ శ్చేతి వక్ష్యతి. ౧౨
కాతరత్వం ప్రకాశం హి సీతాపనయనేన మే

టీ॥లోకః=జనము;మాం=నన్ను;నిర్వీర్యఇతి= పరాక్రమములేని వాఁడని

యుఃనిర్దయశ్చేతి= దయలేనివాఁడని యుః వక్ష్యతి=చెప్పఁగలదు. సీతాపనయనేన=సీతనపహరించుటచేత; మే= నాయొక్క; కాతరత్వం=పిఱికితనము; ప్రకాశంపి= వెల్లడియయినదిగదా!

జనులు, ఇంక, నన్ను, వీర్యహీనుం డనియు దయలేనివాఁడనియుం జెప్పుదురు; సీతను రాక్షసులపహరించుకొనిపోవుటచేత, నాపిఱికితనము, స్పష్టముగా నందఱికి వెల్లడియయినదిగదా!

అని, తాత్పర్యము.

నివృత్తవనవాసశ్చ జనకం మిథిలాధిపమ్. ౧౩
కుశలం పరిపృచ్ఛంతం కథం శక్ష్యే నిరీక్షితుమ్

టీక॥అహం(అధ్యాహృతము)= నేనుః నివృత్తవనవాసశ్చ= కడచినవనవాసముగలవాఁడనునై; కుశలం=క్షేమమునుఃపరిపృచ్ఛంతం=అడుగుచున్న; మిథిలాధిపం=మిథిలారాజుండగు; జనకం= జనకమహారాజును; నిరీక్షితుం= చూచుటకుః కథం=ఎట్లుః శక్ష్యే=చాలుదును?

నేను, వనవాసము సమాప్తినొందించి యూరఁజేరఁగానే, క్షేమంబడుగుటకై వచ్చునట్టిమిథిలారాజుండగుజనకమహారాజుమొగంబెట్లుచూతును?

అని, తాత్పర్యము.

విదేహరాజో నూనం మాం దృష్ట్వా విరహితం తయా. ౧౪
సుతాస్నేహేన సంతప్తో మోహస్య వశమేష్యతి

టీక॥విదేహరాజః=జనకమహారాజుః తయా=ఆసీతచేత; విరహితః=విడువఁబడినః మాం=నన్నుః దృష్ట్వా= చూచిః సుతాస్నేహేన= కొమార్తెయందలిస్నేహముచేతఃసంతప్తః= తపింపఁజేయఁబడినవాఁడై; మోహస్య= మూర్ఛయొక్క; వశం=అధీనతను; ఏష్యతి= పొందఁగలఁడు. నూనం=నిశ్చయము.

జనకమహారాజు, సీతలేకనేనుమాత్రమువచ్చియుండుటనుజూచి, కొమార్తెయందలిప్రేమచే, బరితపించుచు, మూర్ఛనొందును; నిశ్చయము.

అని, తాత్పర్యము.

స ౬౩

అథవా నగమిష్యామి పురీం భరతపాలితామ్. ౧౫
స్వర్గోఽపి సీతయా హీన శ్శూన్యఏవ మతో మమ

టీక॥ అథవా = లేక; భరతపాలితాం = భరతునిచేఁబాలింపఁబడిన; పురీం = పట్టణమునుగూర్చి; నగమిష్యామి = పోను; సీతయా = సీతచేత; హీనః = విడువఁబడిన; స్వర్గోఽపి = స్వర్గముగూడ; మమ = నాకు; శూన్యఏవ = పాడుపడినదిగానే; మతః = ఎన్నఁబడినది.

లేక, భరతునిచేఁబాలింపఁబడుచున సమృద్ధార్థంబై యుండునట్టి యాయయోధ్యాపట్టణమునకు నేనుబోవుట లేదు; స్వర్గమయినను సీతలేనియెడ, నాకుఁబాడుపడియున్నట్లేతోఁచును. అని, తాత్పర్యము.

మామిహోత్సృజ్య హివనే గచ్ఛాయోధ్యాం పురీం శుభాం. ౧౬
నత్వహం తాం వినాసీతాం జీవేయంహి కథంచన

టీక॥ మాం = నన్ను; ఇహ = ఇచ్చట; వనేహి = వనంబునందే; ఉత్సృజ్య = విడిచి; శుభాం = సుందరమయిన; అయోధ్యాం = అయోధ్యయను; పురీం = పట్టణమునుగూర్చి; గచ్ఛ = పొమ్ము. అహం = నేను; తాం = ఆ; సీతాంవినా = సీతనువిడిచి; కథంచన = ఎట్లయినను; నతుజీవేయంహి = బ్రతకనేబ్రతుకను గదా!

లక్ష్మణుఁడా! నీవు నన్నిచ్చటవనంబుననేవిడిచిపెట్టి, యయోధ్యాపట్టణంబునకుఁబొమ్ము; నేను, సీతనువిడిచి, యెట్లయినను ఎంతమాత్రము జీవింపఁజాలను. అని, తాత్పర్యము.

గాఢమాశ్లిష్య భరతో వాచ్యో మద్వచనా త్త్వయా. ౧౭
అనుజ్ఞాతోఽసి రామేణ పాలయే తి వసుంధరామ్

టీక॥ త్వయా = నీచేత; మద్వచనాత్ = నామాటవలన; భరతః = భరతుఁడు; గాఢం = గట్టిగా; ఆశ్లిష్య = కవుఁగిలించుకొని; "రామేణ = రామునిచేత; అనుజ్ఞాతః = అనుమతింపఁబడినవాఁడవు; అసి = అగుచున్నావు. వసుంధరాం =

భూమిని; పాలయ=పాలించుము." ఇతి=అని; వాచ్యః=చెప్పఁదగినవాఁడు.

నీవు, భరతునిగాఢంబుగాఁ గవుఁగిలించుకొని, "రామఁడునీకనుమతియొసంగెను; యథేష్టంబుభూమింబాలింపుచుండుము" అని, నేను జెప్పినట్లు, అతనికిఁ జెప్పవలయును. అని, తాత్పర్యము.

అంబా చ మమ కైకేయీ సుమిత్రా చ త్వయా విభో। ౧౮
కౌసల్యా చ యథాన్యాయ మభివాద్యా మమాజ్ఞయా

టీక॥ విభో=ప్రభుండవగులక్ష్మణుఁడా! మమ=నాయొక్క; అంబా=తల్లియగు; కైకేయీచ=కైకేయియు; సుమిత్రాచ=సుమిత్రయు; కౌసల్యాచ=కౌసల్యయు; మమ=నాయొక్క; ఆజ్ఞయా=ఆజ్ఞచేత; త్వయా=నీచేత; యథాన్యాయం=యథాక్రమముగా; అభివాద్యాః=నమస్కరింపఁదగినవారలు.

లక్ష్మణుఁడా! నీవు, నాయాజ్ఞచే, నాతల్లులు, కైకేయీసుమిత్రకును గౌసల్యకును, యథాన్యాయముగా, నమస్కారములుచేయవలయును.

అనీ, తాత్పర్యము.

రక్షణీయా ప్రయత్నేన భవతా సోక్తకారిణా. ౧౯

టీక॥ సా = ఆకౌసల్య; ఉక్తకారిణా=చెప్పఁబడినదానిఁజేయునట్టి; భవతా=నీచేత; ప్రయత్నేన=ప్రయత్నముచేత; రక్షణీయా=రక్షింపఁదగినది.

నీవు, చెప్పినట్లుచేయువాఁడవు; కావున, నాతల్లికౌసల్యనుప్రయత్నంబునరక్షింపుచుండవలయును.

అని, తాత్పర్యము.

సీతాయాశ్చ వినాశో యం మమ చా మిత్రకర్శన
విస్తరేణ జనన్యా మే వినివేద్య స్త్వయా భవేత్. ౨౦

టీక॥ అమిత్రకర్శన=శత్రువులఁగృశింపఁజేయునట్టిలక్ష్మణుఁడా; అయం=ఈ; సీతాయాశ్చ=సీతయొక్కయు; మమచ=నాయొక్కయు; వినాశః= నాశము;

మే=నాయొక్క; జనన్యాః=తల్లికి; విస్తరేణ=విస్తరముచేత; త్వయా=నీచేత; వినివేద్యః= తెలుపందగినది; భవేత్=అగును.

శత్రువులంజయించునట్టి లక్ష్మణుఁడా! ఇట్లు సీతయు నేనును నాశంబు నొందుటను, నీవు విస్తరముగ నా తల్లియగుకౌసల్యకు జెప్పవలయును, అని, రాముండువిలపించెను.

అని, తాత్పర్యము.

ఇతి విలపతి రాఘవే సుదీనే
వన ముపగమ్య తయావినా సుకేశ్యా
భయవికలముఖస్తు లక్ష్మణోపి
వ్యధితమనా భృశ మాతురో బభూవ. ౨౧

టీక॥సుదీనే=మిక్కిలియుదుఃఖితుండగు; రాఘవే=రాముండు; సుకేశ్యా=సుందరమయినవెండ్రుకలుగల; తయా వినా=ఆసీతనువిడిచి; వనం=అరణ్యాను; ఉపగమ్య=పొంది; ఇతి= ఇట్లు; విలపతి=విలపించుచుండఁగా; లక్ష్మణోపి=లక్ష్మణుఁడును; భయవికలముఖస్తు= భయముచే వివర్ణమయిన మొగముగలవాఁడునై; వ్యధితమనాః= దుఃఖితమయినమనస్సుగలవాఁడై; భృశం=మిక్కిలియు; ఆతురః=పీడితుఁడు; బభూవ= ఆయెను.

అట్లు, సీతాదేవియగపడకపోవుటకై, వనంబున రాముండు పరమదుఃఖితుండై విలపింపఁగా, లక్ష్మణుండు భయంబున మొగంబు వివర్ణతనొంద, దుఃఖంబుచే, మిక్కిలియుఁ బీడితుఁడయ్యెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అరణ్యకాండే, ద్విషష్టితమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అరణ్యకాండ ద్విషష్టితమసర్గటీక,
ముగిసినది.

శ్రీ

త్రిషష్టితమసర్గప్రారంభః.

స రాజపుత్త్రః ప్రియయా విహీనః
శోకేన మోహేనచ పీడ్యమానః
విషాదయన్ భ్రాతర మార్తరూపో
భూయో విషాదం ప్రవివేశ తీవ్రమ్. ౧

టీక॥ రాజపుత్త్రః=రాచకొమరుఁడగు; సః=ఆరాముఁడు; ప్రియయా=ప్రియురాలిచేత; విహీనః= విడువఁబడినవాఁడై; శోకేన=దుఃఖముచేతను; మోహేనచ=మోహముచేతను; పీడ్యమానః=పీడింపఁబడుచు; ఆర్తరూపః=పీడింపఁబడిన దేహముగలవాఁడై; భ్రాతరం=తమ్మునిని; విషాదయన్ = దుఃఖింపఁజేయుచు; భూయః=మఱల; తీవ్రం=అధికమయిన; విషాదం= దుఃఖమును; ప్రవివేశ=పొందెను.

రాచకొమరుండగు నారాముండు, ప్రియురాలిసీతనెడఁబాసి, దుఃఖమోహంబులతిశయిల్లఁ, బరమపీడితుండై, తమ్ముండును దన్నుఁజూచి మిక్కిలియు దుఃఖింప, మఱలఁ, దీవ్రంబగుదుఃఖంబు నొందెను. అని, తాత్పర్యము.

స లక్ష్మణం శోకవశాభిపన్నం
శోకే నిమగ్నో విపులే తు రామః
ఉవాచ వాక్యం వ్యసనానురూప
ముష్ణం వినిశ్శ్వస్య రుదన్ సశోకమ్. ౨

టీక॥ సః=ఆ; రామః = రాముఁడు; విపులే=అధికమయిన("తు" అనునది పాదపూరణార్థము); శోకే= దుఃఖమునందు; నిమగ్నః=మునింగినవాఁడై; శోకవశాభిపన్నం= దుఃఖాధీనతనొందిన; లక్ష్మణం=లక్ష్మణునిగూర్చి; వ్యసనానురూపం=దుఃఖమునకుఁదగునట్లుగా; ష్ణం=వేఁడిగా; వినిశ్శ్వస్య = నిట్టూర్పులువుచ్చి; రుదన్=ఏడ్చుచు; సశోకం = దుఃఖముతోఁగూడిన; వా

క్యం=మాటను; ఉవాచ = చెప్పెను.

ఆ రాముఁడు, అపారంబగు దుఃఖసముద్రంబున మునింగి, యట్లు పరమదుఃఖపీడితుండగు లక్ష్మణుంజూచి, వ్యసనంబున కుఁదగినట్లు వేఁడినిట్టూర్పులు నిగుడించుచు రోదనంబు సేయుచు, దుఃఖయుక్తంబగు నీమాటం జెప్పెను.

అని, తాత్పర్యము.

న మద్విధో దుష్కృతకర్మకారీ
మన్యే ద్వితీయో స్తి వసుంధరాయామ్
శోకేన శోకో హి పరంపరాయా
మా మేతి భిందన్ హృదయం మనశ్చ. ౩

టీక॥ మద్విధః = నావంటివాఁడైన; దుష్కృతకర్మకారీ= పాపకార్యము చేసినవాఁడు; ద్వితీయః = రెండవవాఁడు; వసుంధరాయాం=భూమియందు; నాస్తి=లేఁడు. ఇతి(అధ్యాహృతము)=అని; మన్యే= తలంచెదను. శోకేన=దుఃఖముతో; శోకః= దుఃఖము; పరంపరాయాః=(తృతీయార్థమందుషష్ఠి) పరంపరచేత; హృదయం=గుండెను; మనశ్చ=మనస్సును; భిందన్= భేదించుచు; మాం=నన్ను; ఏతి=పొందుచున్నది.

నావలెఁ బాపంబులు చేసినవాఁడు, నాకన్న వేఱె రెండవవాఁడు భూలోకములో లేఁడని తలంచెదను; దుఃఖముపై దుఃఖము, పరంపరగా, ఒకొకటియు గుండెకాయను మనస్సును భేదించునవి, నాకు సంభవించుచున్నవి.

అని, తాత్పర్యము.

పూర్వం మయా నూన మభీప్సితాని
పాపాని కర్మాణ్య సకృత్కృతాని
తత్రా య మద్యా పతితో విపాకో
దుఃఖేన దుఃఖం య దహం విశామి. ౪

టీక॥ మయా=నాచేత; పూర్వం=మున్ను; అభీప్సితాని=కోరఁబడిన; పా

పాని=పాపము గలిగించునట్టి; కర్మాణి = కార్యములు; అసకృత్ = పలుమారు; కృతాని=చేయఁబడినవి. నూనం=నిశ్చయము. అహం= నేను; దుఃఖేన=దుఃఖముచేత; దుఃఖం=దుఃఖమును; విశామి(ఇతి యత్)=పొందుచున్నానునది యేదిగలదో; అయం=ఈ; విపాకః=పరిపాకము; తత్ర=అందు; అద్య=ఇప్పుడు; ఆపతితః=సంభవించినది.

నేను, పూర్వజన్మంబునఁ, గావలెనని పెక్కుపాపంబులఁబలుమారుచేసియున్నాను; నిశ్చయము; నాకిప్పుడు దుఃఖముపై దుఃఖము వచ్చుటంతయు, వానిఫలము; ఇప్పుడనుభవమునకు వచ్చినది. అని, తాత్పర్యము.

రాజ్యప్రణాశ స్స్వజనై ర్వియోగః
పితు ర్వినాశో జననీవియోగః
సర్వాణి మే లక్ష్మణ శోకవేగ
మాపూరయంతి ప్రవిచింతితాని. ౫

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! రాజ్యప్రణాశః= రాజ్యమునశించుట; స్వజనైః=బంధువులతో; వియోగః= ఎడబాయుట; పితుః= తండ్రియొక్క; వినాశః=నశించుట; జననీవియోగః=తల్లితో నెడఁబాయుట; సర్వాణి=అన్నియు; ప్రవిచింతితాని=తలంపఁబడినవై; మే=నాయొక్క; శోకవేగం = దుఃఖవేగమును; ఆపూరయంతి= నిండించుచున్నవి.

లక్ష్మణుఁడా! రాజ్యభ్రంశము, బంధువుల నెడఁబాయుట, తండ్రిమృతిఁబొందుట, తల్లిని విడిచివచ్చుట, ఇవన్నియు, ఒకొకటియుఁ దలంచుకొనిన, విపరీతముగా దుఃఖము గలిగించుచున్నవి.

అని, తాత్పర్యము.

సర్వంతు దుఃఖం మమ లక్ష్మణేదం
శాంతం శరీరే వన మేత్య శూన్యమ్
సీతా వియోగా త్పున రప్యుదీర్ణం
కాష్ఠై రివాగ్ని స్సహసా ప్రదీప్తః. ౬

టీక॥లక్ష్మణ=లక్ష్మణుఁడా! ఇదం=ఈ; దుఃఖం=దుఃఖము; సవర్ధంతం=అంతయు; శూన్యం=జనులులేని; వనం=అడవిని; ఏత్య=పొంది; మమ=నాయొక్క; శరీరే=దేహమునందు; శాంతం= అడఁగినది. ప్రదీప్తః=మండుచున్న; అగ్నిః=నిప్పు; సహసా=వేగమున; కాష్ఠైరివ=కట్టెలచేతవలె; సీతావియోగాత్=సీతతోడఁబాయుటవలన; పునరపి=మఱలను; ఉదీర్ణం=అతిశయించినది.

లక్ష్మణుఁడా! నేనీ జనశూన్యంబగు వనంబుఁ జేరినపిదప, ఈ దుఃఖంబునంతయు గడువులోనణఁచుకొని యుంటిని; కట్టెలచే నిప్పు ప్రజ్వరిల్లునట్లు, ఇప్పుడు సీతావిరహమువలన, నాదుఃఖమంతయు మఱలబయలు పడినది.

అని, తాత్పర్యము.

సా నూన మార్యా మమ రాక్షసేన
బలా ద్ధృతా ఖం సముపేత్య భీరుః
అపస్వరం సస్వరవిప్రలాపా
భయేన విక్రందితవ త్యభీక్ష్ణమ్. ౭

టీక॥మమ=నాప్రియురాలైన; ఆర్యా=పూజ్యురాలగు; భీరుః= భయస్వభావయగు; సా=ఆసీత; రాక్షసేన=రాక్షసునిచేఁ; బలాత్ = బలాత్కారమువలన; హృతా=అపహరింపఁబడినదై; ఖం=ఆకాశమును; సముపేత్య=పొంది; భయేన=భయముచేత; సస్వరవిప్రలాపా= ధ్వనితోఁగూడిన యేడ్పుగలదై; అపస్వరం=వికృతమయిన ధ్వనిగలుగునట్లుగా; అభీక్ష్ణం=మిక్కిలియు; విక్రందితవతీ=ఏడ్చినది. నూనం=నిశ్చయము.

భయస్వభావయగు నాప్రియురాలు, రాక్షసుండు బలాత్కారంబునఁ నపహరించుకొని యాకాశంబునకుఁ గొనిపోవ, భయంబున, మహాధ్వనిగదుర, తనమధురస్వరంబు విడిచి, వికృతస్వరంబున, నధికముగా రోదనంబుచేసియుండును; నిశ్చయము. అని, తాత్పర్యము,

తా లోహితస్య ప్రియదర్శనస్య
సదోచితా వుత్తమచందనస్య

వృత్తౌ స్తనౌ శోణితపంకదిగ్ధౌ
నూనం ప్రియాయా మమ నాభిభాతః. ౮

టీక॥ ప్రియదర్శనస్య=సంతోషకరమయిన చూచుటగల; లోహితస్య=ఎఱ్ఱనైన; ఉత్తమచందనస్య=శ్రేష్ఠమయిన చందనమునకు; సదా=ఎల్లప్పుడును; ఉచితౌ=తగినవియు; వృత్తౌ=గుండ్రములునగు; తౌ=ఆ; మమ=నాయొక్క; ప్రియాయాః=ప్రియురాలియొక్క; స్తనౌ=స్తనములు; శోణితపంకదిగ్ధౌ=నెత్తురుబురదచేఁ బూయఁబడినవై; నాభిభాతః=ప్రకాశింపకుండును. నూనం=నిశ్చయము.

చూపరులకుసంతోషంబుగలిగించునట్టి యుత్తమమయిన రక్తచందనంబునకుఁదగినవియు వర్తులంబులునగు నాప్రియురాలి స్తనంబులు, ఇప్పుడు, రాక్షసునిచే భక్షణార్థము ఛేదింపఁబడి, నెత్తురుతోఁ గప్పఁబడి ప్రకాశింపకుండును;నిశ్చయము. అని, తాత్పర్యము.

తచ్ఛ్లక్ష్ణసువ్యక్తమృదుప్రలాపం
తస్యా ముఖం కుంచితకేశభారమ్
రక్షోవశం నూనముపాగతాయా
న భ్రాజతే రాహుముఖే యథేందుః. ౯

టీక॥తస్యాః=ఆసీతయొక్క; శ్లక్ష్ణసువ్యక్తమృదుప్రలాపం=మధురములును స్పష్టములును మృదువులునగు మాటలుగలదియు; కుంచితకేశభారం=వంకరలయిన వెండ్రుకలభారముగలదియునగు; తత్=ఆ; ముఖం=ముఖము; రక్షోవశం=రాక్షసునియధీనతను; ఉపాగతాయాః=పొందినదగుచుండఁగా; రాహుముఖే=రాహువునోట; ఇందుర్యథా=చంద్రుఁడువలెఁ;నభ్రాజతే=ప్రకాశింపదు.నూనం=నిశ్చయము.

మధురంబులును స్వచ్ఛంబులును బరుషంబులు గానివియునగు మాటలుగలదియు వక్రంబులయిన వెండ్రుకలతో నొప్పుచుండునదియునగు నాసీతమోము, ఇప్పుడు రాక్షసునిచేఁజిక్కినదగుటచే, రాహువుచేఁ గబళింపఁబడిన చంద్రునిపగిది, నెంతమాత్రము ప్రకాశింపకుండును; నిశ్చయము.

అని, తాత్పర్యము.

తాం హారపాశస్య సదోచితాయాః
గ్రీవాం ప్రియాయా మమ సువ్రతాయాః
రక్షాంసి నూనం పరిపీతవంతి
విభిద్య శూన్యే రుధిరాశనాని. ౧౦

టీక॥ సువ్రతాః= మంచివ్రతముగలదియు; హారపాశస్య= హారమాలికకు; సదా=ఎల్లప్పుడును; ఉచితాయాః= తగినదియునగు; మమ= నాయొక్క; ప్రియాయాః = ప్రియురాలియొక్క; తాం=ఆ ; గ్రీవాం=కంఠమును; రుధిరాశనాః= నెత్తురే యాహారముగాఁగల; రక్షాంసి=రాక్షసులు; శూన్యే= నిర్జనస్థానమునందు; విభిద్య=విఱిచి; పరిపీతవంతి=త్రాఁగినారు. నూనం= నిశ్చయము.

పాతివ్రత్యవ్రతముగల నాప్రియురాలికంఠము, ఎప్పుడును హారముచే నలంకృతంబై యుండఁదగినది ; అట్టికంఠమును, రాక్షసులు, నిర్జనారణ్యంబున, విఱిచి, నెత్తురు త్రావియుందురు; నిశ్చయము. అని, తాత్పర్యము.

మయా విహీనా విజనే వనే యా
రక్షోభి రాహృత్య వికృష్యమాణా
నూనం నినాదం కురరీవ దీనా
సా ముక్తవత్యా యతకాంతనేత్రా. ౧౧

టీక॥ యా=ఏసీత; విజనే=జనులులేని; వనే= అడవియందు; మయా= నాచేత; విహీనా = విడువఁబడినదో; ఆయతకాంతనేత్రా= నిడుపులయినవియు సుందరములునగు కన్నులుగల ; సా=ఆసీత; రక్షోభిః= రాక్షసులచేత; ఆహృత్య= అపహరింపఁబడి; వికృష్యమాణా = ఆకర్షింపఁబడుచున్నదై; దీనా=దుఃఖితయయి; కురరీవ= లేడివలె; నినాదం=ధ్వనిని; ముక్తవతీ= విడిచినది; నూనం=నిశ్చయము.

ప్రియురాలు, నిర్జనంబగునరణ్యంబునన న్నెడఁబాసి, రాక్షసులుతన్నపహరించి యాకర్షించుచుఁ గొనిపోవ, దుఃఖితయయి, లేడివలె, సుందరంబులయిన విశాలనేత్రంబుల దిక్కులంట అఱచుచుఁ

స ౬౩

వేరెలుంగున నేడ్చినది; నిశ్చయము. అని, తాత్పర్యము.

అస్మిన్మయా సార్ధ ముదారశీలా
శిలాతలే పూర్వ ముపోపవిష్టా
కాంతస్మితా లక్ష్మణ జాతహాసా
త్వా మాహ సీతా బహువాక్యజాతమ్. ౧౨

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! ఉదారశీలా=ఉత్తమమయిన స్వభావముగలదియు; కాంతస్మితా=సుందరమయిన చిఱునగవు గలదియునగు; సీతా=సీత; పూర్వం=మున్ను; అస్మిన్=ఈ; శిలాతలే=ఱాతియందు; మయాసార్ధం=నాతోఁగూడ; ఉపోపవిష్టా=సమీపంబునఁగూర్చుండినదై; జాతహాసా=కలిగిననవ్వుగలదై; త్వాం=నిన్నుఁగూర్చి; బహు=అధికమైన; వాక్యజాతం=మాటలసమూహమును; ఆహ=చెప్పెను.

లక్ష్మణుఁడా! ఉత్తమస్వభావురాలును మధురమయిన చిఱునగవుగలదియు నగుసీత, మున్ను, ఈఱాతిమీఁద, నాతోఁగూడ, నాసమీపంబునఁ గూర్చుండి, యావైన్య పరిహాసవచనంబులకు నవ్వుచు, నిన్నుఁజూచి, పెక్కుమాటలం జెప్పుచుండెను. అని, తాత్పర్యము.

గోదావరీ యం సరితాం వరిష్ఠా
ప్రియా ప్రియాయా మమ నిత్యకాలమ్
అప్యత్ర గచ్ఛే దితి చింతయామి
నైకాకినీ యాతిహి సా కదాచిత్. ౧౩

టీక॥ ఇయం=ఈ; సరితాం=నదులలో; వరిష్ఠా=శ్రేష్ఠమయిన; గోదావరీ=గోదావరి; మమ=నాయొక్క; ప్రియాయాః=ప్రియురాలికి; నిత్యకాలం=ఎల్లప్పుడును; ప్రియా=సంతోషముగలిగించునది. అత్ర=ఇచ్చటికి; గచ్ఛేదపి=పోవునామేమియని; చింతయామి=తలంచుచున్నాను. సా=ఆసీత; కదాచిత్=ఒకప్పుడును; ఏకాకినీ=ఒక్కతెయై; నయాతిహి=పోదుగదా!

నదులలో నుత్తమనదియయిన యీగోదావరిమీఁద, నాప్రియురాలి కెల్ల

ప్పుడును, ప్రీతియతిశయించి యుండు నుఃఒకవేళనిచ్చటికింబోయియుండునాః యనితలంచెదనుఃపోయియుండదు ; న న్నువిడిచి యాబిడ యొంటిగా నెప్పుడు నుబోయినదిలేదు. అని, తాత్పర్యము.

పద్మాననా పద్మవిశాలనేత్రా
పద్మానివా నేతు మభిప్రయాతా
తద ప్యయుక్తం నహి సా కదాచి
న్మయావినా గచ్ఛతి పంకజాని. ౧౪

టీక॥ పద్మాననా = కమలమువంటి ముఖముగలదియుః పద్మవిశాలనేత్రా = కమలదళంబులువలె విశాలములయినక న్నులుగలదియునగుజానకిః పద్మాని = తామరపూలనుః ఆనేతుం = తెచ్చుటకుః అభిప్రయాతావా = పోయినదోయే మో! తదపి = అదియుః అయుక్తం = సరి కాదు. సా = ఆబిడః మయావినా = నన్నువి డిచిః కదాచిత్ = ఒకప్పుడునుః పంకజా ని = కమలంబులనుగూర్చిః నగచ్ఛతిహి = పోదుగదా!

కమలమువంటి మోముగలదియుంగ మలంబులుంబోలె విశాలంబులయినక న్నులుగలదియునగునాప్రియురాలు, ఒ కవేళంగమలంబులంగోసితెచ్చుటకైపో యినదోయేమో; ఆ! అదసరికాదు; ఆబి డ, యెప్పుడును, నన్నువిడిచి, కమలంబు లు గోయుటకుంబోయినదే లేదు.

అని, తాత్పర్యము.

కామంత్విదం పుష్పితవృక్షషండం
నానావిధైః పక్షిగణై రుపేతమ్
వనం ప్రయాతా ను తదప్యయుక్త
మేకాకినీ సాఽభిబిభేతి భీరుః ౧౫

టీక॥ కామంతు = సరే - లియుః పుష్పి తవృక్షషండం = పూచినచెట్లసమూహ ముగలదియుః నానావిధైః = నానావిధ ములయినః పక్షిగణైః = పక్షిసమూహ ములతోః ఉపేతం = కూడినదియునగుః ఇదం = ఈః వనం = ఆడవినిగూర్చిః ప్ర

యాతాన=పోయినదో; తదపి= అది యు; అయుక్తం= సరికాదు. భీరుః= భయస్వభావయగు; సా=ఆసీత; ఏకాకినీ=ఒంటిదై; అతిబిభేతి=మిక్కిలియు భయపడును.

ఈవనమునందలివృక్షములు మిక్కిలియుఁబుష్పించియున్నవి; నానావిధములయిన మధురస్వనంబులగు పక్షులతోఁగూడియున్నవి; ఈవనంబునకేమైనఁబోయెనో; కాదు; ఆబిడపిఱికి; ఒంటిగానుండినప్పుడు, మిక్కిలియు భయపడును. అని, తాత్పర్యము.

> ఆదిత్య భో లోకకృతాకృతజ్ఞ
> లోకస్య సత్యానృతకర్మసాక్షిన్
> మమ ప్రియా సా క్వ గతా హృతా వా
> శంసస్వ మే శోకవశస్య నిత్యమ్. ౧౬

టీక॥ లోకకృతాకృతజ్ఞ=లోకముయొక్క చేయఁబడినదానిని జేయఁబడనిదానిని దెలిసినవాఁడవు; లోకస్య=లోకముయొక్క; సత్యానృతకర్మసాక్షిన్=పుణ్యపాపములనుకర్మములకుసాక్షివగు; భో ఆదిత్య=ఓసూర్యుఁడా! సా=ఆ; మమ=నాయొక్క; ప్రియా=ప్రియురాలు; క్వ=ఎచ్చటికి; గతా=పోయినదికి హృతా వా=అపహరింపఁబడినదా? నిత్యం= ఎల్లప్పుడును; శోకవశస్య=దుఃఖాధీనుండనగు; మే=నాకు; శంసస్వ=చెప్పుము.

ఓసూర్యుఁడా! నీవు, లోకంబుననేదిజరుగుచున్నదో యేదిజరగదో ఆవ్యాపారంబులన్నింటిని దెలిసినవాఁడవు; జనులుచేయుపుణ్యపాపకర్మంబులకుసాక్షివి; నాప్రియురాలు, ఎక్కడికిఁబోయినది? రాక్షసులా బిడనపహరించుకొనిపోయినారా? నేనెప్పుడునుదుఃఖమునే యనుభవించుటకుఁబుట్టినాను; నాకింతమాత్రము చెప్పుము. అని, తాత్పర్యము.

> లోకేషు సర్వేషు చ నాస్తి కించి
> ద్యత్తే న నిత్యం విదితం భవేత్తత్
> శంసస్వ వాయో కులశాలినీం తాం

హృతా మృతా వా పథి వర్తతే వా. ౧౭

టీక॥ వాయో= వాయుదేవుఁడా! తే=నీకు; నిత్యం=ఎల్లప్పుడును; యత్ = ఏది; విదితం= తెలియఁబడినది; నభవేత్ - కాదో; తత్=అది; కించిత్ =కొంచెమైనను; సర్వేషు=సమస్తములయిన; లోకేషుచ=లోకములయందును; నాస్తి= లేదు. హృతా = అపహరింపఁబడినదా? మృతావా=చచ్చినదా? పథి = మార్గమునందు; వర్తతేవా= ఉన్నదా? కులశాలినిం=కులముచేఁ బ్రకాశించునట్టి; తాం=ఆసీతను; శంసస్వ = చెప్పుము.

వాయుదేవుఁడా! సమస్తలోకంబులయందును, నీకుఁ దెలియనిదికొంచెమైనయెప్పుడును లేదు; కాఁబట్టి, నాప్రియురాలు, రాక్షసులచే నపహరింపఁబడినదా? మృతి బొందినదా? మార్గంబున నున్నదా? సత్కులప్రసూతయగు నాభార్యసంగతిఁ జెప్పుము. అని, రాముండు విలపించెను.

అని, తాత్పర్యము.

ఇతీవ తం శోకవిధేయదేహం
రామం విసంజ్ఞం విలపంత మేవమ్
ఉవాచ సౌమిత్రి రదీనసత్త్వో
న్యాయే స్థితః కాలయుతంచ వాక్యమ్. ౧౮

టీక॥ఇతీవ=ఇట్లు; విలపంతం= విలపించుచున్నవాఁడును; శోకవిధేయదేహం= దుఃఖపరవశమయిన దేహముగలవాఁడును; విసంజ్ఞం= తెలివిదప్పినవాఁడునగు; రామం= రామునిగూర్చి; అదీనసత్త్వః=కొంచెముగాని ధైర్యముగలవాఁడును; న్యాయే= న్యాయమునందు; స్థితః=ఉన్నవాఁడునగు; సౌమిత్రిః=లక్ష్మణుఁడు; ఏవం=ఇట్లు; కాలయుతంచ=కాలోచితమునైన; వాక్యం=మాటను; ఉవాచ=చెప్పెను.

ఇట్లు విలపించుచు, దుఃఖపరవశుండై, విసంజ్ఞుండైయున్న రాముంజూచి, న్యాయంబునవలంబించి యున్నవాఁడును మహాధైర్యుండునగు లక్ష్మణుండు, కాలోచితంబుగా, నీప్రకారంబున, నాశ్వాసించెను. అని, తాత్పర్యము.

శోకం విముంచార్య ధృతిం భజస్వ
సోత్సాహతాచాస్తు విమార్గణే౽స్యాః
ఉత్సాహవన్తో హి నరా న లోకే
సీదంతి కర్మస్వతిదుష్కరేషు. ౧౯

టీక॥ ఆర్య=పూజ్యుఁడవగు రామా! శోకం=దుఃఖమును; విముంచ=విడువుము. ధృతిం=ధైర్యమును; భజస్వ=పొందుము. అస్యాః= ఈసీతయొక్క; విమార్గణే=వెదకుటయందు; సోత్సాహతా చ = ఉత్సాహముతోఁ గూడియుండుటయు; అస్తు=అగుఁగాక. లోకే=లోకమునందు; ఉత్సాహవంతః= ఉత్సాహముగల; నరాః=మనుష్యులు; అతిదుష్కరేషు=మిక్కిలియుఁ జేయనలవిగానివైన; కర్మసు= కార్యములయందును; నసీదంతిహి =చెడరుగదా!

పూజ్యుఁడవగురాముఁడా! దుఃఖంబువిడిచి ధైర్యమునవలంబింపుము; జానకిని వెదకుటయం దుత్సాహమునొందుము; లోకంబున, నుత్సాహముగల పురుషులు, ఎంతదుష్కరకార్యములయందైనను, బరాజయంబునొందరు. అని, లక్ష్మణుండు, రామునకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇతీవ సౌమిత్రి ముదగ్రపౌరుషమ్
బ్రువంత మార్తో రఘువంశవర్ధనః
న చింతయామాస ధృతిం విముక్తవాన్
పునశ్చ దుఃఖం మహ దభ్యుపాగమత్. ౨౦

టీక॥ ఇతీవ=ఇట్లు; బ్రువంతం=చెప్పుచున్న; ఉదగ్రపౌరుషం= అధికమయినపౌరుషముగల; సౌమిత్రిం=లక్ష్మణుని; ఆర్తః=దుఃఖితుఁడును; రఘువంశవర్ధనః= రఘువంశమును వృద్ధిబొందించువట్టి రాముఁడు; నచింతయామాస=సరకుసేయలేదు. ధృతిం=ధైర్యమును; విముక్తవాన్ = విడిచినాఁడు. పునశ్చ=మఱలను; మహత్= అధికమయిన; దుఃఖం=దుఃఖమును; అభ్యుపాగమత్ =పొందెను.

మహాపౌరుషుండగు లక్ష్మణుండు,

ఈప్రకారమున నెంతచెప్పినను, రఘువంశంబువృద్ధినొందింపంబుట్టినరాముండు, దుఃఖాతిశయంబున, లక్ష్మణుని మాటల సరకుసేయక మే యున్నవాడై ర్యంబునుంగూడ విడిచి,మఱియును, మహాదుఃఖంబునొందెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

అరణ్యకాండే, త్రిషష్టితమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర

వ్యాఖ్యానంబునందు, అరణ్యకాండత్రిషష్టితమసర్గటీక,

ముగిసినది.

శ్రీ

చతుష్షష్టితమసర్గప్రారంభః.

స దీనో దీనయా వాచా లక్ష్మణం వాక్య మబ్రవీత్

టీక॥సః=ఆరాముండు; దీనః=దుఃఖితుండై; లక్ష్మణం=లక్ష్మణునిగూర్చి; దీనయా= దుఃఖితమయిన; వాచా= మాటచేత; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

ఆరాముండు, దుఃఖితుండై, లక్ష్మణుంజూచి, దీనవాక్యంబున, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

శీఘ్రం లక్ష్మణ జానీహి గత్వా గోదావరీం నదీమ్. ౧

అపి గోదావరీం సీతా పద్మాన్యానయితుం గతా

స ౬౪

టీక॥ లక్ష్మణ = లక్ష్మణుఁడా! సీతా = జానకి; పద్మాని = కమలములను; ఆనయితుం(ఆనేతుం) = తెచ్చుటకు; గోదావరీం = గోదావరీనదిని గూర్చి; అపిగతా = పోయినదో; గోదావరీం = గోదావరియను; నదీం = నదినిగూర్చి; శీఘ్రం = శీఘ్రముగా; గత్వా = పోయి; జానీహి = ఎఱుఁగుము.

లక్ష్మణుఁడా! జానకి, కమలంబులఁ గోయుటకై గోదావరీనదికేమైనంబో యినదో, నీవు, శీఘ్రంబునగోదావరీనది కిఁబోయి, తెలిసికొనిరమ్ము. అని, రాముండు, లక్ష్మణునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు రామేణ లక్ష్మణః పరవీరహా. ౨
నదీం గోదావరీం రమ్యాం జగామ లఘువిక్రమః

టీక॥ పరవీరహా = శత్రువీరులవధించునట్టి; లక్ష్మణః = లక్ష్మణుఁడు; రామేణ = రామునిచేత; ఏవం = ఇట్లు; ఉక్తస్తు = చెప్పఁబడినవాఁడైనంతనె; లఘువిక్రమః = శీఘ్రమయిన నడకకలవాఁడై; రమ్యాం = సుందరములయిన; గోదావరీం = గోదావరియను; నదీం = నదినిగూర్చి; జగామ = పోయెను.

శత్రువీరులవధించునట్టి లక్ష్మణుండు, రామునిమాటను విన్నంతనె, శీఘ్రగమనంబున, రమణీయంబగు గోదావరీనదికిఁ బోయెను.

అని, తాత్పర్యము.

తాం లక్ష్మణ స్తీర్థవతీం విచిత్వా రామ మబ్రవీత్. ౩

టీక॥ లక్ష్మణః = లక్ష్మణుఁడు; తీర్థవతీం = రేవులుగల; తాం = ఆగోదావరీనదిని; విచిత్వా = వెదకి; రామం = రామునిగూర్చి; అబ్రవీత్ = చెప్పెను.

లక్ష్మణుండు, ఆగోదావరీనదిలో రేవులనంతటను సీతను వెదకి, రామునొద్దకువచ్చి, యిట్లని చెప్పెను.

అని, తాత్పర్యము.

నైనాం పశ్యామి తీర్థేషు క్రోశతో నశృణోతి మే

టీక॥ అహం(అధ్యాహృతము) = నేను; ఏనాం = ఈజానకిని; తీర్థేషు =

రేవులందు; న పశ్యామి=చూడను. మే=నేను; క్రోశతః=అఱచఁగా; న శృణోతి=వినదు.

గోదావరి రేవులందెచ్చటను నాకు జానకియగపడలేదు; నేనెంత పిలిచినను, బలుకలేదు. అని, తాత్పర్యము.

క్వను నా దేశ మాపన్నా వైదేహీ క్లేశనాశినీ. ౪
న హ్యహం వేద తం దేశం యత్ర సా జనకాత్మజా

టీ॥ క్లేశనాశినీ=దుఃఖమును నశింపఁజేయునట్టి; సా=ఆ; వైదేహీ=సీత; క్వనువా=ఏ; దేశం=ప్రదేశమును; ఆపన్నా=పొందినదికి? యత్ర=ఎచ్చట; సా=ఆ; జనకాత్మజా= జనకమహారాజుకూఁతురు; అస్తి(అధ్యాహృతము)=ఉన్నదో; తం=ఆ; దేశం=ప్రదేశమును; అహం= నేను; న వేదహి=ఎఱుఁగను గదా!

దుఃఖమునుబోఁగొట్టునట్టిసీత, యెచ్చటికిఁ బోయినదో; జనకమహారాజుపుత్రియగు నా సీత, యెచ్చటికిఁ బోయియుండునో, ఆస్థలము నాకుఁ దెలియలేదు. అని, లక్ష్మణుండు, రామునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

లక్ష్మణస్య వచ శ్శ్రుత్వా దీన స్సంతాపమోహితః. ౫
రామ స్సమభిచక్రామ స్స్వయం గోదావరీం నదీమ్

టీక॥ రామః=రాముఁడు; లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క; వచః=మాటను; శ్రుత్వా=విని; దీనః=దుఃఖితుఁడై; సంతాపమోహితః = సంతాపముచే మోహము నొందినవాఁడై; స్వయం=తానై; గోదావరీం=గోదావరియను; నదీం= నదినిగూర్చి; సమభిచక్రామ=పోయెను.

రాముఁడు, లక్ష్మణుండు పలికిన మాటను విని, దీనుండై, సంతాపంబునం జేసియు కార్యాకార్యంబు దెలియనివాఁడై, తానే గోదావరినదియొద్దకుఁ బోయెను. అని, తాత్పర్యము.

స తా ముపస్థితో రామః క్వ సీతే త్యేవ మబ్రవీత్. ౬




టీక॥ సః=ఆ; రామః=రాముఁడు; తాం=గోదావరిని; ఉపస్థితః= సమీపించినవాఁడై; సీతా=సీత; క్వ= ఎచ్చటః" ఇత్యేవం= అనియిట్లు; అబ్రవీత్=చెప్పెను.

అట్లు రాముఁడు, గోదావరీనదిసమీపంబునకుఁ బోయి, "సీతయెచ్చట!" అని, యడిగెను. అని, తాత్పర్యము.

భూతాని రాక్షసేంద్రేణ వధార్హేణ హృతామితి
న తాం శశంసూ రామాయ తథా గోదావరీ నదీ. ౭

టీక॥ వధార్హేణ=వధించుటకుఁదగిన; రాక్షసేంద్రేణ= రాక్షసేశ్వరుండగు రావణునిచేత; హృతాం=అపహరింపఁబడిన; తాం=ఆసీతను; ఇతి=ఇట్లు; రామాయ=రామునికొఱకు; భూతాని=భూతంబులు; నశశంసుః=చెప్పలేదు. తథా=అట్లు; గోదావరీ=గోదావరియును; నదీ=నది; నశశంస(అధ్యాహృతము)=చెప్పలేదు.

వధ్యుఁడగు రాక్షసేశ్వరుండు రావణుండు, సీతనపహరించినాఁడని, రామునకు, భూతంబులును జెప్పలేదు; అట్లె, గోదావరీనదియుఁ జెప్పదయ్యె.

అని, తాత్పర్యము.

తతః ప్రచోదితా భూతైశ్శం సాస్మత్తాం ప్రియామితి
న తు సా భ్యవదత్సీతాం పృష్టా రామేణ శోచతా. ౮

టీక॥ తతః=అంతట; సా=ఆగోదావరి; అస్మత్=మావలన, మాకుఁగానను; తాం=ఆ; ప్రియాం=ప్రియురాలను; శంస=చెప్పుము." ఇతి=అని; భూతైః=భూతములచేత; ప్రచోదితా = ప్రేరింపఁబడినదయ్యు; శోచతా=దుఃఖించుచున్న; రామేణ = రాముఁచేత; పృష్టా=అడుగఁబడినదయ్యు; సీతాం=సీతను; నాభ్యవదత్తు=చెప్పనేలేదు.

అంత, సమస్త భూతంబులును, "మాకుఁగానీవు, రామునకుఁబ్రియురాలివార్తంజెప్పుమని వేఁడినను, రాముండుదుఃఖితుండై మెంతయడిగినను, గోదావరీనది, సీతావృత్తాంతంబు నెంతమాత్రము చెప్పనేలేదు.

అని తాత్పర్యము.

రావణస్య చ తద్రూపం కర్మాణి చ దురాత్మనః




స ౬౪

ధ్యాత్వా భయాత్తు వైదేహీం సా నదీ నశశంస తామ్. ౯

టీక॥ సా=ఆ; నదీ= గోదావరీనది; దురాత్మనః=దుష్టబుద్ధియగు; రావణస్య=రావణునియొక్క; తత్=ఆ; రూపంచ = ఆకారమును; కర్మాణి చ=కార్యములను; ధ్యాత్వా=తలంచి; భయాత్తు=భయమువలననె ; తాం=జానకిని; నశశంస=చెప్పదయ్యె.

గోదావరీనది, దురాత్ముండగునా రావణుని భయంకరాకారంబునుం దలంచి, భయపడియుండుటవలననె, రామునకుం బ్రియురాలివృత్తాంతంబుఁజెప్పలేదు. అని, తాత్పర్యము.

నిరాశస్తు తయా నద్యా సీతాయా దర్శనే కృశః
ఉవాచ రామ స్సౌమిత్రిం సీతాఽదర్శనకర్శితః ౧౦

టీక॥ సీతాఽదర్శనకర్శితః= సీతం జూడకుండుటచేఁ గృశింపఁజేయఁబడిన; రామః=రాముఁడు; సీతాయాః= సీతయొక్క; దర్శనే = చూచుటవిషయమునందు; తయా=ఆ; నద్యా=గోదావరీనదిచేత; నిరాశస్తు=ఆశలేనివాఁడుగానె; కృశః=చేయ బడినవాఁడై ; సౌమిత్రిం= లక్ష్మణునిగూర్చి; ఉవాచ=చెప్పెను.

సీతంజూడకుండుటచే మిక్కిలియు దుఃఖితుండై కృశించియుండు రాముండు , ఇంకనుసీతదొరకినను దొరకవచ్చునను విషయమునందు , గోదావరీనదియేమియుఁ బ్రత్యుత్తరమివ్వకుండుటవలన, నిరాశుండై, లక్ష్మణుంజూచి యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఏషా గోదావరీ సౌమ్య కించి న్న ప్రతిభాషతే
కిన్ను లక్ష్మణ వక్ష్యామి సమేత్య జనకం వచః. ౧౧
మాతరం చైవ వైదేహ్యా వినా తా మహ మప్రియం

టీక॥సౌమ్య=తిన్ననివాఁడవగు; లక్ష్మణ=లక్ష్మణుఁడా! ఏషా=ఈ; గోదావరీ=గోదావరి;కించిత్=కొంచెము యైనను; నప్రతిభాషతే=మాఱుపలుకకున్నది. అహం=నేను; వైదేహ్యావినా=సీతనువిడిచి; జనకం=జనకమహా

రాజును; తాం=ఆ; మాతరంచైవ=తల్లి యగుకౌసల్యను; సమేత్య=చేరి; అప్రియం=దుఃఖకరమయిన; కిన్ను=ఏ; వచః=మాటను; వక్ష్యామి = చెప్పుదును?

సౌమ్యుండవగులక్ష్మణుఁడా! ఈ గోదావరిఎంతమాత్రము బదులుచెప్పకున్నది; నేను, సీతలేక, జనకమహారాజునొద్దకు మనతల్లి కౌసల్యయొద్దకును బోయి, వారికప్రియంబుగా నెట్లుచెప్పుదును? అని, తాత్పర్యము.

యా మే రాజ్యవిహీనస్య వనే వన్యేన జీవతః. ౧౨
సర్వం వ్యపనయే చ్ఛోకం వైదేహీ క్వను సా గతా

టీక॥ యా= ఎవ్వతె; రాజ్యవిహీనస్య=రాజ్యముచేఁ విడువఁబడిన వాఁడను; వనే=అడవియందు; వన్యేన=అడవియందుఁబుట్టినకందమూలాది పదార్థముచేత; జీవతః=బ్రతుకుచున్నవాఁడనగు; మే=నాయొక్క; సర్వం= సమస్తమయిన; శోకం=దుఃఖమును; వ్యపనయేత్=పోఁగొట్టునో; సా=ఆ; వైదేహీ=సీత; క్వను=ఎచ్చటికి; గతా= పోయినది?

రాజ్యభ్రష్టుండనై యడవియందుఁ గందమూలాదులందినిజీవించుచున్నానా దుఃఖమునంతయు నెవ్వతె పోఁగొట్టునో, ఆసీత యెక్కడికిఁ బోయినది? అని, తాత్పర్యము.

జ్ఞాతి పక్ష విహీనస్య రాజపుత్రీ మపశ్యతః. ౧౩
మన్యే దీర్ఘా భవిష్యంతి రాత్రయో మమ జాగ్రతః

టీక॥ జ్ఞాతిపక్షవిహీనస్య= బంధువర్గముచే విడువఁబడినవాఁడను; రాజపుత్రీం=రాచకొమార్తెయగు ప్రియురాలిని; అపశ్యతః=చూచుచున్నవాఁడను; జాగ్రతః= మేలుకొనియుండువాఁడనగు; మమ=నాకు; రాత్రయః=రాత్రులు; దీర్ఘాః=దీర్ఘములు; భవిష్యంతి=కాఁగలవు. మన్యే=తలంచెదను.

బంధువర్గమునుబాసి, రాచకొమార్తెయగుప్రియురాలి నెడఁబాసి, కంటికి నిదురపట్టకున్ననాకు, ఒక్కొక రాత్రియొకయుగముగానుండునని తలం

చేదను. అని, తాత్పర్యము.

మందాకినీం జనస్థాన మిమం ప్రస్రవణం గిరిమ్. ౧౪
సర్వా ణ్యనుచరిష్యామి యది సీతా హి దృశ్యతే

టీక॥ సీతా=సీత; దృశ్యతేయది= చూడఁబడునేని; మందాకినీం= గోదావరీనదిని(ఇప్పుడు కావేరీతీరవాసులు ప్రతినదిని గావేరీనదియని పిలుచునట్లు, గంగానదియుండు దేశంబునఁ బ్రతినదిని గంగానదియని పిలుతురు); జనస్థానం=జనస్థానమును; ఇమం=ఈ; ప్రస్రవణం=ప్రస్రవణమును; గిరిం=పర్వతమును; సర్వాణి= అన్నిటినింగూర్చి; అనుచరిష్యామిహి=తిరుగుదునుగదా!

ఇప్పుడు సీతయగపడునేని, నేనాబిడంగూడి, గోదావరీనదీతీరంబునను జనస్థానంబునను ఈప్రస్రవణపర్వతంబునను సమస్తరమణీయ ప్రదేశంబులను విహరింతునుగదా! అని, తాత్పర్యము.

ఏతే మృగా మహావీర్య మామీక్షంతే ముహుర్ముహుః. ౧౫
వక్తుకామా ఇవహి మే ఇంగితా న్యుపలక్షయే

టీక॥ మహావీర్య=గొప్పపరాక్రమముగల లక్ష్మణుఁడా! ఏతే=ఈ; మృగాః=మృగములు; ముహుర్ముహుః= మాటిమాటికి; మాం=నన్ను; ఈక్షంతే=చూచుచున్నవి. మే=నాకు; వక్తుకామాఇవహి = చెప్పఁగోరినవివలెనున్నవి. ఇంగితాని=అభిప్రాయములను; ఉపలక్షయే=తెలిసికొనుచున్నాను.

మహాపరాక్రమశాలివగు లక్ష్మణుఁడా! ఈమృగములు, నన్ను మాటిమాటికిఁ జూచుచున్నవి; ఇవి, నాకు సీతసంగతి చెప్పవలయునని యున్నట్లు, వాని యింగితంబులవలనఁ, దెలియవచ్చుచున్నది. అని, తాత్పర్యము.

తాం స్తు దృష్ట్వా నరవ్యాఘ్రో రాఘవః ప్రత్యువాచహ. ౧౬
క్వ సీతేతి నిరీక్షన్వై బాష్పసంరుద్ధయా దృశా

టీక॥ నరవ్యాఘ్రః= పురుషశ్రేష్ఠుఁడగు; రాఘవః=రాముఁడు; తాన్ =

ఆమృగములను; దృష్ట్వాతు=చూచినంతనే; బాష్పసంరుద్ధయా= కన్నీళ్లచే బాధింపఁబడిన; దృశా=చూపుచేత; నిరీక్షన్= చూచుచు("వై" అనునది పాదపూరణార్థము); సీతా=సీత; క్వ= ఎచ్చట? ఇతి=అని; ప్రత్యువాచ= చెప్పెను. "హ" అనునది పాదపూరణార్థము.

పురుషశ్రేష్ఠుండగు రాముండు, ఆ మృగంబులం జూచినంతనే, కన్నులునిండఁగనీళ్లు గాఱ, "సీతయెచ్చట?" అని,యడిగెను. అని, తాత్పర్యము.

ఏవముక్తా నరేంద్రేణ తే మృగా స్సహ సోత్థితాః. ౧౭
దక్షిణాభిముఖా స్సర్వే దర్శయంతో నభ స్తలం
మైథిలీ హ్రియమాణా సా దిశం యా మన్వపద్యత. ౧౮
తేన మార్గేణ ధావంతో నిరీక్షం తే నరాధిపమ్

టీక॥ తే=ఆ; మృగాః=మృగములు; సర్వే=అన్నియు; నరేంద్రేణ = రామునిచేత; ఏవం=ఇట్లు; ఉక్తాః= చెప్పఁబడినవై; సహసా=శీఘ్రమున; ఉత్థితాః = లేచినవై; దక్షిణాభిముఖాః=దక్షిణపుదిక్కు మొగమయినవై; నభ స్తలం= ఆకాశమును; దర్శయంతః=చూపుచు; సా=ఆ; మైథిలీ=జానకి; హ్రియమాణా=అపహరింపఁబడుచు; యాం=ఏ; దిశం=దిక్కును; అన్వపద్యత = పొందెనో. తేన=ఆ; మార్గేణ=మార్గముచేత; ధావంతః=పరుగెత్తుచు; నరాధిపం=రాముని; నిరీక్షంతే=చూచినవి.

ఆమృగంబులు, రాముండు చెప్పినదివిని, వేగఁబున, అన్నియులేచి, దక్షిణాభిముఖంబులయియాకాశంబుఁ జూపుచు, సీతాదేవిని రావణుం డపహరించుకొని యేమార్గంబునఁ బోయినాఁడో, యామార్గంబుఁబట్టి పరుగెత్తుచు, రాముం జూచుచుండినవి. అని, తాత్పర్యము.

యేన మార్గం చ భూమించ నిరీక్షంతే స్మ తే మృగాః. ౧౯
పునశ్చ మార్గ మిచ్ఛంతి లక్ష్మణే నోపలక్షితాః

టీక॥ యేన=ఏకారణముచేత; తే=ఆ; మృగాః=మృగములు; మార్గం=

మార్గమును; భూమించ=భూమిని; నిరీక్షంతేస్మ=చూచినవో; పునశ్చ=మ ఱల; మార్గం=మార్గమును; గంతు (అధ్యాహృతము)= పొందుటకు; ఇచ్ఛంతి=కోరుచున్నవో; తేన(అధ్యాహృతము) = ఆకారణముచేత; తే, మృగాః(అధ్యాహృతము)=ఆమృగములు; లక్ష్మణేన=లక్ష్మణునిచేత; ఉపలక్షితాః=చూడఁబడినవి.

ఆమృగంబులు, దక్షిణదిక్కు మార్గంబుఁ బట్టిపోయి దక్షిణదిగ్భూమిం జూచుచు మఱల నామార్గంబుననే పోవుటకుఁ గోరుచుండుటంజూచి, వానియభిప్రాయంబును, లక్ష్మణుండు దెలిసికొనెను. అని, తాత్పర్యము.

తేషాం వచనసర్వస్వం లక్షయామాస చేంగితమ్. ౨౦
ఉవాచ లక్ష్మణో జ్యేష్ఠం ధీమాన్ భ్రాతర మార్తవత్

టీక॥ధీమాన్=బుద్ధిమంతుఁడగు; లక్ష్మణః=లక్ష్మణుఁడు; తేషాం=ఆమృగములయొక్క; వచనసర్వస్వం=మాటలనంతయు;ఇంగితంచ=అభిప్రాయమును; లక్షయామాస=ఊహించెను. ఆర్తవత్=దీనముగా; జ్యేష్ఠం=పెద్దవాఁడైన; భ్రాతరం= తోఁబుట్టువునుగూర్చి; ఉవాచ=చెప్పెను.

బుద్ధిమంతుండగులక్ష్మణుండు,ఆమృగంబులచేష్టలవలన, మాటలవలనంబోలె, నభిప్రాయంబునూహించి, దీనస్వరంబున, అన్నంజూచి,యిట్లనిచెప్పెను. అని,తాత్పర్యము.

క్వ గతేతి త్వయా పృష్టా యథే మే సహసోత్థితాః. ౨౧
దర్శయంతి క్షితించైవ దక్షిణాంచ దిశం మృగాః
సాధు గచ్ఛావహే దేవ దిశ మేతాం హి నైరృతిమ్. ౨౨
యదిస్యా దాగమః కశ్చి దార్యా వా సాథ లక్ష్యతే

టీక॥దేవ=రాజా! ఇమే=ఈ; మృగాః=మృగములు; క్వ=ఎచ్చటికి; గతా=పోయినది? ఇతి=అని; త్వయా=నీచేత; పృష్టాః=అడుగఁబడినవై ; యథా=ఎ

ట్లు; సహసా=శీఘ్రమున; ఉత్థితాః= లేచినవై; క్షితించైవ=భూమిని; దక్షిణాం=దక్షిణపు; దిశంచైవ=దిక్కును; దర్శయంతి= చూపుచున్నవో; తథా (అధ్యాహృతము)=అట్లు; సాధు=లెస్సగా; ఏతాం=ఈ; నైరృతిం=నిరృతిసంబంధియయిన; దిశంహి= దక్షిణదిక్కునుగూర్చియె; గచ్ఛావహే=పోవుదము. కశ్చిత్=ఒకానొక;ఆగమః= ఉపాయము; స్యాద్యది=కలుగునో యేమో. అథ=మఱియు;సా=ఆ;ఆర్యా=పూజ్యురాలగుసీత; లక్ష్యేతవా=చూడఁబడునో.

దేవరా! నీవు సీతయెక్కడ? అనియడిగినంతనె, యామృగంబులు, వేగంబున లేచి,దక్షిణదిక్కునుభూమినిం జూపుచున్నవికావున, మనము, దక్షిణపుదిక్కునుబట్టియె పోవుదము; ఒకవేళ,యేమైనను పాయమేనితెలియును; పూజ్యురాలగు,నాసీతయె, దొరకినను దొరకును. అని,లక్ష్మణుండు, రామునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

బాఢమిత్యేవ కాకుత్థ్సః ప్రస్థితో దక్షిణాం దిశమ్. ౨౩
లక్ష్మణానుగత శ్శ్రీమా న్వీక్షమాణో వసుంధరామ్

టీక॥శ్రీమాన్=అందఱికన్ననధికుండగు; కాకుత్థ్సః=రాముఁడు; బాఢమిత్యేవ= మంచిదేయని; లక్ష్మణానుగతః=లక్ష్మణునిచేఁ వెంబడింపఁ బడినవాఁడై;వసుంధరాం= భూమిని; వీక్షమాణః=చూచుచు; దక్షిణాం=దక్షిణపు;దిశం=దిక్కునుగూర్చి; ప్రస్థితః= వెడలెను.

శ్రీమంతుండగురాముఁడు,మంచిదేయని, లక్ష్మణుండుతోడవెంబడింపఁ, దలవంచి నేలంజూచుచు, దక్షిణపుదిక్కునుబట్టిపోయెను. అని, తాత్పర్యము.

ఏవం సంభాషమాణౌ తా వన్యోన్యం భ్రాతరా వుభౌ. ౨౪
వసుంధరాయాం పతితం పుష్పమార్గ మపశ్యతామ్

టీక॥తౌ=ఆ;భ్రాతరా = అన్నదమ్ములు;ఉభౌ=ఇద్దఱు; ఏవం=ఇట్లు; అన్యోన్యం=ఒండొరులనుగూర్చి; సంభాషమాణౌ=మాటలాడుచు;వసుంధరా

యాం=భూమియందు; పతితం=పడిన; పుష్పమార్గం=పూలతోఁగూడినమార్గమును; అపశ్యతాం=చూచిరి.

అన్నదమ్ములగు నా రామలక్ష్మణులు, ఈప్రకారంబుననొందురులతో మాటలాడుకొనుచుంబోయి, మార్గంబున, నేలపైఁ బూలురాలియుండుటంజూచిరి. అని, తాత్పర్యము

తాం పుష్పవృష్టిం పతితాం దృష్ట్వా రామో మహీతలే. ౨౫
ఉవాచ లక్ష్మణం వీరో దుఃఖితో దుఃఖితం వచః

టీక॥వీరః= పరాక్రమశాలియగు; రామః=రాముఁడు; మహీతలే=భూతలమునందు; పతితాం=పడిన; తాం=ఆ; పుష్పవృష్టిం=పూలవానను; దృష్ట్వా=చూచి; దుఃఖితః=దుఃఖమునొందినవాఁడై; దుఃఖితం=దుఃఖమునొందిన; లక్ష్మణం=లక్ష్మణునిగూర్చి; వచః=మాటను; ఉవాచ=చెప్పెను.

పరాక్రమవంతుండగు రాముండు, నేలంబడియున్న యాపుష్పంబులంజూచి, దుఃఖితుండై, తనయట్లుదుఃఖితుండైనలక్ష్మణుంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

అభిజానామి పుష్పాణి తానీ మానీ హ లక్ష్మణ. ౨౬
పినద్ధానీ హ వైదేహ్యా మయా దత్తాని కాననే

టీక॥లక్ష్మణ=లక్ష్మణుఁడా! ఇహ=ఇప్పుడు; తాని=ఆ; ఇమాని=ఈ; పుష్పాణి=పూలను; అభిజానామి=ఎఱుంగుదును. ఇహ=ఈ; కాననే= అడవియందు; మయా=నాచే; దత్తాని=ఇయ్యఁబడినవై; వైదేహ్యా=సీతచేత; పినద్ధాని=కట్టఁబడినవి.

లక్ష్మణుఁడా! నేనీపుష్పంబుల నెఱుంగుదును; నే నేయీపుష్పంబులసీతకివ్వఁగా, నాబిడ,వీని, గొప్పునంబెట్టుకొనెను. అని, తాత్పర్యము.

మన్యే సూర్యశ్చ వాయుశ్చ మేదినీచ యశస్వినీ. ౨౭
అభిరక్షంతి పుష్పాణి ప్రకుర్వంతో మమ ప్రియమ్




టీక॥ సూర్యశ్చ = సూర్యుఁడును; వాయుశ్చ = వాయువును; యశస్వినీ=అధికమయినకీర్తిఁగల; మేదినీచ = భూమియు; మమ=నాకు; ప్రియం = సంతోషమును; ప్రకుర్వంతః=చేయుచున్నవారై; పుష్పాణి=పూలను; అభిరక్షంతి=కాపాడుచున్నారు. మన్యే = తలంచెదను.

సూర్యుండును వాయుదేవుండును యశస్వినియగు భూదేవియు, నాకు సంతోషంబుసేయవలెనని, యీపుష్పంబురక్షింపుచుందురనితలంచెదను. అని, రాముండు లక్ష్మణునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా మహాబాహుం లక్ష్మణం పురుషర్షభః. ౨౮
ఉవాచ రామో ధర్మాత్మా గిరిం ప్రస్రవణాకులమ్

టీక॥ పురుషర్షభః = పురుషశ్రేష్ఠుఁడగు; ధర్మాత్మా = ధర్మబుద్ధిగల; రామః = రాముఁడు; మహాబాహుం=పెద్దచేతులుగల; లక్ష్మణం=లక్ష్మణునిఁగూర్చి; ఏవం = ఇట్లు ; ఉక్త్వా=చెప్పి; ప్రస్రవణాకులం= సెలయేళ్లచేనిండిన; గిరిం = పర్వతమును గూర్చి; ఉవాచ=చెప్పెను.

పురుషశ్రేష్ఠుండును ధర్మాత్ముండునగు రాముండు, మహాబాహుఁడగు లక్ష్మణునితోనీప్రకారముచెప్పి, ప్రస్రవణగిరింజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

కచ్చి త్క్షితిభృతాం నాథ దృష్టా సర్వాంగసుందరీ. ౨౯
రామా రమ్యే వనోద్దేశే మయా విరహితా త్వయా

టీక॥ క్షితిభృతాం = పర్వతంబులకు; నాథ=ప్రభువగుప్రస్రవణపర్వతమా! మయా=నాచేత; విరహితా= విడువఁబడిన; సర్వాంగసుందరీ=సమస్తావయవంబులను సౌందర్యముగల ; రామా=స్త్రీ; రమ్యే= సుందరమయిన; వనోద్దేశే=అడవిప్రదేశమునందు; త్వయా=నీచేత; దృష్టాకచ్చిత్= చూడఁబడినదా యేమి?

పర్వతశ్రేష్ఠమవగుప్రస్రవణపర్వతమా! నేనులేకపరితపించుచుండు సర్వాంగసుందరియగు నాకాంతాస్త్రీ నేమైన, రమణీయంబగువన ప్రదేశమునంజూచితివా యేమి? అని, రాముండు,




పర్వతంబుతోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

క్రుద్ధో ప్రబ్రవీ ద్గిరిం తత్ర సింహః క్షుద్రమృగం యథా. ౩౦

టీక॥ సః(అధ్యాహృతము) = ఆ రాముఁడు; తత్ర=అప్పుడు; క్రుద్ధః = కోపమునొందినవాఁడై; సింహః= సింహము; క్షుద్రమృగంయథా = అల్పమృగమునుగూర్చి వలె; గిరిం = పర్వతమునుగూర్చి; అబ్రవీత్=చెప్పెను.

అంతఁ బర్వతంబు మాఱుపలుక కుండుటం జూచి రాముండు, సింహంబు అల్పమృగంబునుంబోలె నప్పర్వతంబు బెదరింపుచు నిట్లనియె.

అని, తాత్పర్యము.

తాం హేమవర్ణాం హేమాభాం సీతాం దర్శయ పర్వత
యావ త్సానూని సర్వాణి న తే విధ్వంసయా మ్యహమ్. ౩౧

టీక॥పర్వత = పర్వతమా! అహం=నేను; యావత్ = ఎంతవఱకు; తే=నీయొక్క; సానూని=చఱియలను; సర్వాణి=అన్నిటిని; విధ్వంసయామి=నాశమునొందింపనో; తావత్ (అధ్యాహృతము)= అంతలోపల; హేమవర్ణాం=బంగారువన్నెవంటి వన్నెగలదియు; హేమాభాం=బంగారుప్రతిమయొక్క కాంతివంటికాంతిగలదియు నగు; తాం=ఆ; సీతాం=సీతను; దర్శయ=చూపుము.

ప్రసన్నవణపర్వతమా! నేనుగోపించి, నీసానువులన్నింటిని నశింపఁజేయుటకుమున్నె, నీవు, బంగారువన్నెగలదియు బంగారు ప్రతిమవంటిదియునగు, నాసీతంజూపుము. అని, రాముండు, పర్వతముతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు రామేణ పర్వతో మైథిలీం ప్రతి
శంసన్నివ తత స్సీతాం నాదర్శయత రాఘవే. ౩౨

టీక॥తతః=అంత; పర్వతః=కొండ; రామేణ=రామునిచేత; ఏవం=ఇట్లు; ఉక్తస్తు=చెప్పఁబడినంతనె; మైథిలీం ప్రతి=సీతనుగూర్చి; శంసన్నివ(శ్రీ

తః)=చెప్పుమన్నట్లున్నవాఁడై; రాఘవే=రాముని విషయమయి; సీతాం= సీతను; నావశ...యత=చూపలేదు.

అంతట, బవ...తంబు, రాముఁడుచె ప్పినదివిని, ప్రతిధ్వనిచే, సీతనుగూర్చి యేమో చెప్పునట్లు చూపట్టెను గాని, రామునకాబిడను జూపలేదు.

అని, తాత్పర్యము.

తతో దాశరథీ రామ ఉవాచచ శిలోచ్చయమ్

టీక॥ తతః=అంత; దాశరథిః=దశరథునికుమారుఁడైన; రామః=రాముఁడు; శిలోచ్చయం= కొండనుగూర్చి; ఉవాచచ=చెప్పెను.

అంత, దశరథునకుమారుండగు రాముండు, మఱలఁ గొండంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

మమ బాణాగ్నినిదగ్ధో భస్మీభూతో భవిష్యసి. ౩౩
అసేవ్య స్సతతంచైవ నిస్తృణద్రుమపల్లవః

టీక॥ త్వం(అధ్యాహృతము) = నీవు; మమ = నాయొక్క; బాణాగ్నినిర్దగ్ధః = బాణాగ్నిచేదహింపఁబడినవాఁడవై; భస్మీభూతః= భస్మమయినవాఁడవును; సతతంచైవ=ఎల్లప్పుడును; నిస్తృణద్రుమపల్లవః = పచ్చికయునువృక్షములును జిగుళ్లునులేనివాఁడవును; అసేవ్యః= సేవింపఁదగనివాఁడవును; భవిష్యసి=కాఁగలవు.

బాణాగ్నిచే నిన్నుదహించి భస్మంబుగావించెదను; అంత, నీయందుఁ, బచ్చికగానివృక్షములుగానజిగుళ్లుగానిలేకుండుటవలన, నిన్నెవ్వరును సేవింపరు అని, రాముండు, పర్వతముతోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇమాం వా సరితంచాద్య శోషయిష్యామి లక్ష్మణ. ౩౪
యది నాఖ్యాతి మే సీతా మార్యాం చంద్రనిభాననామ్

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! మే= నాకు; ఆర్యాం=పూజ్యురాలునుః చంద్రనిభాననాం=చంద్రునితోసమానముగు మొగముగలదియునగు ; సీతాం=సీ

తను; నాఖ్యాతియది= చెప్పదేని; ఇమాం=ఈ; సరితంచనా= నదినిగాని; అద్య=ఇప్పుడు; శోషయిష్యామి= ఎండించెదను.

లక్ష్మణుఁడా! ఈనదిగాని, పూజ్యురాలును చంద్రబింబమువంటి సుందరమయిన ముఖముగలదియునగు సీతసంగతినినాకుఁజెప్పదేని, దీనినిప్పుడెశోషింపఁజేసెదను. అని, రాముండుచెప్పెను. అని, తాత్పర్యము.

ఏవం స రుషితో రామో దిధక్షన్నివ చక్షుషా. ౩౫
దదర్శ భూమౌ నిష్క్రాంతం రాక్షసస్య పదం మహత్
త్రస్తాయా రామకాంక్షిణ్యాః ప్రధావంత్యా ఇత స్తతః. ౩౬
రాక్షసేనా నువృత్తాయా మైథిల్యా శ్చ పదా న్యథ

టీక॥ సః=ఆ; రామః = రాముఁడు; ఏవం=ఇట్లు; రుషితః= కోపము నొందినవాఁడై; చక్షుషా= కంటిచేత; దిధక్షన్నివ (స్థితః)= దహింపఁగోరువాఁడువలె నున్నవాఁడై; అథ= అంత; భూమౌ = నేలయందు ; నిష్క్రాంతం=వెడలిన; రాక్షసస్య = రాక్షసునియొక్క; మహత్=గొప్పదగు; పదం=అడుగును; త్రస్తాయాః = భయపడినదియు; రామకాంక్షిణ్యాః= రామునిఁగోరుచున్నదియు; ఇత స్తతః= ఇటునటు; ప్రధావంత్యాః=పరుగెత్తుచున్నదియు; రాక్షసేన-రాక్షసునిచేత; అనువృత్తాయాః = వెంబడింప బడినదియునగు; మైథిల్యాః-సీతయొక్క; పదాని చ=అడుగులను; దదర్శ= చూచెను.

ఆరాముండు, ఇట్లుకోపంబునఁగన్నులనిప్పులురాల, లోకంబులఁదహింపఁదలఁచినట్లుండఁగా, భూమియందు పెద్దవగురాక్షసుని యడుగులను, భయపడిరామునియొద్దకుఁ బోఁగోరి రాక్షసుండువెంటనంటి తఱుముటచేనిటునటుపరుగెత్తుచున్న సీతయడుగులును, అతనికగపడినవి. అని, తాత్పర్యము.

స సమీక్ష్య పరిక్రాంతం సీతాయా రాక్షసస్యచ. ౩౭
భగ్నం ధనుశ్చ తూణీచ వికీర్ణం బహుధా రథమ్
సంభ్రాంతహృదయో రామ శ్శశంస భ్రాతరం ప్రియమ్. ౩౮

టీక॥సః=ఆ; రామః=రాముఁడు; సీతాయాః=సీతయొక్కయు; రాక్షస

స్య చ=రాక్షసునియొక్కయు; పరిక్రాంతం=అడుగును; భగ్నం=విఱిగిన; ధనుశ్చ=వింటిని; తూణీచ=అమ్ములపొదులను; బహుధా=పెక్కువిధములు; వికీర్ణం=చెదచల్లఁబడిన; రథం=రథమును; సమీక్ష్య=చూచి; సంభ్రాంతహృదయః=భ్రాంతిపొందినమనస్సుగలవాఁడై; ప్రియం=ఇష్టుండగు; భ్రాతరం=తమ్మునిగూర్చి; శశంస=చెప్పెను.

రాముండు, సీతాదేవి యడుగులును రాక్షసునియడుగులునుంజూచి, మఱియునచ్చటచ్చట భగ్నంబులయి పడియున్నధనుస్సును అమ్ములపొదులనునానావిధముగా భిన్నమైయున్న రథంబునుంగని, తమ్మునింజూచియిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

పశ్య లక్ష్మణ వైదేహ్యాః శీర్ణాః కనకబిందవః
భూషణానాం హి సౌమిత్రే మాల్యాని వివిధాని చ. ౩౯

టీక॥ సౌమిత్రే=సుమిత్రకుమారుఁడవయిన; లక్ష్మణ=లక్ష్మణుఁడా! పశ్య=చూడుము. వైదేహ్యాః=సీతయొక్క; భూషణానాం=సొమ్ములయొక్క; కనకబిందవః=బంగారుతునకలు; శీర్ణాః హి=పడినవిగదా! వివిధాని=నానావిధములయిన; మాల్యానిచ=పుష్పమాలికలును; శీర్ణాని(అధ్యాహృతము)=పడినవి.

లక్ష్మణుఁడా! ఇటుచూడుము; జానకిభూషణంబులనుండి బంగారుశకలంబులు రాలియున్నవి; మఱియునానావిధంబులయిన పుష్పమాలికలును రాలియున్నవి. అని, తాత్పర్యము.

తప్తబిందునికాశైశ్చ చిత్రైః క్షతజబిందుభిః
ఆవృతం పశ్య సౌమిత్రే సర్వతో ధరణీతలమ్. ౪౦

టీక॥ సౌమిత్రే=లక్ష్మణుఁడా! ధరణీతలం=భూమి; సర్వతః=అంతయు; తప్తబిందునికాశైః=బంగారుబిందువులతో సమానములును; చిత్రైః చ=ఆశ్చర్యకరములునగు; క్షతజబిందుభిః=నెత్తురుబిందువులచేత; ఆవృతం=కప్పఁబడియున్నది. పశ్య=చూడుము.

లక్ష్మణుఁడా! ఆశ్చర్యకరంబుగాబం

గారుబిందువులువలెనుండు రక్తబిందువులచేత, భూమియంతయుఁగప్పఁబడి యున్నది,చూడుము.

అని, తాత్పర్యము.

మన్యే లక్ష్మణ వైదేహీ రాక్షసైః కామరూపిభిః
భిత్వా భిత్వా విభక్తా వా భక్షితా వా భవిష్యతి. ౪౧

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! వైదేహీ=సీత; కామరూపిభిః= ఇచ్ఛాధీనమగురూపముగల;రాక్షసైః = రాక్షసులచేత;భిత్వాభిత్వా=భేదించిభేదించి; విభక్తావా=పంచుకొనఁబడినదిగాని; భక్షితావా=భక్షింపఁబడినదిగాని; భవిష్యతి=కాఁగలదు;మన్యే=తలంచెదను.

లక్ష్మణుఁడా!కామరూపులగురాక్షసులు,సీతను, ఛేదించి, తలాకొంచెముపంచుకొనియైనను, లేక,భక్షించియైననుందురు. అని, తాత్పర్యము.

తస్యా నిమిత్తం వైదేహ్యా ద్వయో ర్వివదమానయోః
బభూవ యుద్ధం సౌమిత్రే ఘోరం రాక్షసయో రిహ. ౪౨

టీ॥ సౌమిత్రే= లక్ష్మణుఁడా! తస్యాః=ఆ; వైదేహ్యానిమిత్తం=సీతనిమిత్తముచు;వివదమానయోః=జగడమాడుచున్న;ద్వయోః=ఇద్దఱయిన; రాక్షసయోః=రాక్షసులకు; ఇహ=ఇచ్చట; ఘోరం=భయంకరమయిన; యుద్ధం=పోరు;బభూవ=కలిగినది.

లక్ష్మణుఁడా!ఆజానకినిమిత్తమయి, ఇద్దఱురాక్షసులువివాదమాడి, యిచ్చట,భయంకరమయినయుద్ధముగావించిరి.అని,తాత్పర్యము.

ముక్తామణిమయం చేదం తపనీయవిభూషితమ్
ధరణ్యాం పతితం సౌమ్య కస్య భగ్నం మహద్ధనుః. ౪౩

టీ॥ సౌమ్య= తిన్ననివాఁడవగులక్ష్మణుఁడా! భగ్నం=విఱిగినదియు; ధరణ్యాం=భూమియందు; పతితం=పడినదయునగు; ముక్తామణిమయం=ము

త్తైములమణుల వికారమయిన; తపనీయవిభూషితం= బంగారముచేనలంకరింపఁబడిన; మహత్=గొప్పదైన; ఇదం=ఈ; ధనుశ్చ=విల్లును; కస్య= ఎవ్వనిది?

సౌమ్యుఁడా? ముత్తైములును మణులునుబొదిగి కాంచనభూషితమయి, విఱిగినేలంబడియున్నయీధనుస్సు, ఎవ్వనిది? అని, తాత్పర్యము.

తరుణాదిత్య సంకాశం వైడూర్యగుణికాచితమ్
విశీర్ణం పతితం భూమౌ కవచం కస్యకాంచనమ్. ౫౪

టీక॥ తరుణాదిత్యసంకాశం= లేతసూర్యునితో సమానమయినదియు; వైడూర్యగుణికాచితం= వైడూర్యమణులతోఁబొందుగఁబడినదియునగు; విశీర్ణం=విఱిగిన; భూమౌ= నేలయందు; పతితం=పడిన; కాంచనం= బంగారువికారమయిన; కవచం = కవచకవచము; కస్య=ఎవ్వనిది?

బాలసూర్యునితో సమానంబును వైడూర్యమణులుపొదిగినదియునగు విఱిగినేలంబడియున్న యీబంగారుకవచం బెవ్వనిది?అని, తాత్పర్యము.

ఛత్రం శతశలాకంచ దివ్యమాల్యోపశోభితం
భగ్నదండ మిదం కస్య భూమౌ సమ్యఙ్నిపాతితమ్. ౮౫

టీక॥ శతశలాకం= నూఱుకమ్ములుగలదియు; దివ్యమాల్యోపశోభితం= శ్రేష్ఠమయినపుష్పమాలికచేఁ బ్రకాశించుచున్నదియు; భగ్నదండం= విఱిగినదండముగలదియు; భూమౌ= నేలయందు; సమ్యక్=చక్కఁగా; నిపాతితం= పడవేయఁబడినదియునగు; ఛత్రంచ= గొడుగును; కస్య=ఎవ్వనిది?

నూఱుకమ్ములుగలిగి దివ్యమాలికతోనొప్పుచున్నచక్కఁగా దండమువిఱిచినేలంబడవేయఁబడియున్నయీ ఛత్రంబెవ్వనిది?అని, తాత్పర్యము.

కాంచనోరశ్చదాశ్చేమే పిశాచ వదనాః ఖరాః

భీమరూపా మహాకాయాః కస్యవా నిహతా రణే. ౪౭

టీక॥ కాంచనోరశ్ఛదాః= బంగారుకవచములుగలవియు; భీమరూపాః= భయంకరమయినరూపముగలవియు; మహాకాయాః = గొప్పశరీరముగలవియునగు; పిశాచవదనాః= పిశాచముబోలెముఖములుగల; రణే= యుద్ధమునందు; నిహతాః= వధింపఁబడిన; ఇమే=ఈ; ఖరాః=కంచరగాడిదలు; కస్యవా=ఎవ్వనివి?

బంగారుకవచంబులుగలవియు భయంకరాకారంబులును బిశాచముఖంబులునగు, యుద్ధంబునవధింపఁబడి నేలంబడియున్న యీకంచరగాడిదలు, ఎవ్వనివి?అని, తాత్పర్యము.

దీప్తపావకసంకాశో ద్యుతిమా& సమర ధ్వజః
అపవిద్ధశ్చ భగ్నశ్చ కస్య సాంగ్రామికో రథః. ౪౮

టీక॥ దీప్తపావకసంకాశః= మండుచున్నయగ్నితోసమానమును ; ద్యుతిమా&=అధికమయిన కాంతిగలదియునగు; అపవిద్ధః= విఱిగిన; సమరధ్వజశ్చ= యుద్ధార్థమయిన టెక్కెమును; సాంగ్రామికః=యుద్ధార్థమయినట్టి భగ్నః=విఱిగిన; రథశ్చ=రథమును; కస్య=ఎవ్వనిది?

మండుచున్న యగ్నివలెఁ బ్రకాశించుచున్నవియుఁ గాంతిమంతంబులునగు, విఱిగిపడియున్న ధ్వజంబును యుద్ధార్థమయినరథంబును, ఎవ్వనివి?

అని, తాత్పర్యము.

రథాక్షమాత్రా విశిఖా స్తపనీయవిభూషణాః
కస్యేమేఽభిహతా బాణాః ప్రకీర్ణా ఘోర కర్మణః. ౪౯

టీక॥ రథాక్షమాత్రాః = నాలుగువందల యంగుళముల నిడుపు గలవియు; తపనీయవిభూషణాః=బంగారమలంకారముగాఁగలవియు; విశిఖాః= శిఖలేవియునగు; అభిహతాః=వీఁకవఁబడిన; ప్రకీర్ణాః= వెదచల్లఁబడిన; ఇమే=ఈ; బాణాః=బాణములు; ఘోరకర్మణః=భయంకరమయిన కార్యము

గల; కస్య=ఎవ్వనివి?

నాలుగువందలయంగుళములనిడుపు గల కాంచనాలంకృతంబులును మొండి తాగ్రంబులునగుబాణంబులు, ఇచ్చట, విఱిగి, యిచ్చటచ్చటఁ బడియున్నవే? ఇవి యేభయంకరకర్ముని వి?

అని, తాత్పర్యము.

శరావరౌ శరైః పూర్ణౌ విధ్వస్తౌ పశ్య లక్ష్మణ
ప్రతోదాభీశుహస్తోవై కస్యాయం సారథి హతః. ౪౯

టీక॥లక్ష్మణ= లక్ష్మణుఁడా ! శరైః=బాణములచే; పూర్ణౌ= నిండిన; శరావరౌ=అమ్ములపొదులు ; విధ్వస్తౌ=నశించినవి. పశ్య=చూడుము. ప్రతోదాభీశుహస్తః=మునికోలయుఁ బగ్గములును జేతులంగల; హతః= చంపఁబడిన; అయం=ఈతఁడు; కస్య=ఎవ్వని యొకఁడు; సారథిః=సారథి?

లక్ష్మణుఁడా! బాణపూర్ణంబులగు తూణీరంబులు రెండును విఱిగియున్నవి చూడుము; మునికోలయును బగ్గములు జేతులంబట్టుకొని చచ్చిపడియున్నయీతఁడు, ఎవ్వనిసారథి? అని, తాత్పర్యము.

కస్యేమౌ పురుషవ్యాఘ్ర శయాతే నిహతౌ యుధి
చామరగ్రాహిణౌ సౌమ్య సోష్ణీష మణికుండలౌ. ౫౦

టీక॥పురుషవ్యాఘ్ర = పురుషశ్రేష్ఠుఁడవు; సౌమ్య= తిన్ననివాఁడవగులక్ష్మణుఁడా! సోష్ణీషమణికుండలౌ=తలగుడ్డలతోను రత్నకుండలములతోనుగూడిన; ఇమౌ=వీరలిద్దఱు; యుధి=యుద్ధమునందు; నిహతౌ= చంపఁబడినవారలై; శయాతే=పరుండియున్నారు. కస్య= ఎవ్వనియొకఁడు ; చామరగ్రాహిణౌ=చామరము లెత్తువారలు?

పురుషశ్రేష్ఠుఁడవుసౌమ్యుఁడవునగు లక్ష్మణుఁడా! తలగుడ్డలతో రత్నకుండలంబులతోను నొప్పుచు, యుద్ధంబుననిహతులైపడియున్నారే; వీరలిద్దఱు, ఎవ్వనిచామరగ్రాహులు?

అని, తాత్పర్యము.

పదవీ పురుషస్యైషా వ్యక్తం కస్యాపి రక్షసః
వైరం శతగుణం పశ్య మమేదం జీవితాంతకమ్. ౫౧

టీక॥ ఏషా=ఈ; పదవీ= మార్గము; పురుషస్య= పురుషుఁడయిన; కస్యాపి=ఎవ్వఁడోఒక; రక్షసః=రాక్షసునిది. వ్యక్తం=స్పష్టము. మమ=నాయొక్క; శతగుణం=నూఱింతలైన; జీవితాంతకం=ప్రాణనాశము కలిగించునట్టి; వైరం=విరోధమును; పశ్య=చూడుము.

ఈమార్గము, ఎవ్వఁడోయొక రాక్షసునిది; సందేహములేదు; ఇదివఱకు రాక్షసులమీఁద నాకంతగా వైరంబుగలుగలేదు; కాబట్టి వారియపరాధంబులకోర్చియుంటిని ; ఇప్పుడునూఱింతలువైరంబుగలిగినది; ఇంక, రాక్షసులయందఱి ప్రాణంబులను హరించెదంజూడుము. అని, తాత్పర్యము.

సుఘోరహృదయైః సౌమ్య రాక్షసైః కామరూపిభిః
హృతా మృతా వా సీతా సా భక్షితా వా తపస్వినీ. ౫౨

టీక॥ సౌమ్య=తిన్ననివాఁడవగు లక్ష్మణుఁడా! తపస్వినీ= శోచనీయమగు; సా=ఆ; సీతా=జానకి; కామరూపిభిః = ఇచ్ఛాధీనమగురూపముగల; సుఘోరహృదయైః= మిక్కిలియుభయంకరమయినమనస్సుగల; రాక్షసైః=రాక్షసులచేత; హృతా=అపహరింపఁబడినదిగాని; భక్షితా=భక్షింపఁబడినదిగాని; మృతా వా=మరణంబునొందినదిగాని; భవిష్యతి=కాఁగలదు.

సౌమ్యుండవగులక్ష్మణుఁడా! శోచనీయయగు జానకిని, కామరూపులును భయంకరమయిన కఠినమనస్సుగలవారలునగురాక్షసులు , అపహరించిగాని భక్షించిగానియుందురు; లేక, జానకి మరణంబునేని బొందియుండును.

అని, తాత్పర్యము.

న ధర్మస్త్రాయతే సీతాం హ్రియమాణాం మహావనే

టీక॥ మహావనే=మహారణ్యమునందు; హ్రియమాణాం=అపహరింపఁబ

దుచున్న; సీతాం=సీతను; ధర్మః= ధర్మము; నత్రాయతే = రక్షింపకున్నదే!

మహారణ్యంబునందు, రాక్షసులు సీతనపహరింపఁగా, ధర్మాంబైననుఆబి డనురక్షింపకున్నదే!

అని, తాత్పర్యము.

భక్షితాయాం హి వైదేహ్యాం హృతాయామపి లక్ష్మణ. ౫౩
కేహి లోకే ప్రియం కర్తుం శక్తాస్సౌమ్య మమేశ్వరాః

టీక॥ సౌమ్య= సౌమ్యుఁడవగు; లక్ష్మణ=లక్ష్మణుఁడా! వైదేహ్యాం= జానకి; భక్షితాయాం= భక్షింపఁబడినది గాని("హి" అనునది పాదపూరణార్థము); హృతాయామపి= అపహరింపఁబడినదిగాని యగుచుండఁగా; లోకే= లోకమునందు; కేహి=ఏ; ఈశ్వరాః= ప్రభువులు; మమ=నాకు; ప్రియం=సంతోషమును; కర్తుం=చేయుటకు; శక్తాః=సమర్థులు.

సౌమ్యుఁడవగులక్ష్మణుఁడా! రాక్షసులుజానకిని భక్షించిగానియపహరించిగాని యాయినపిదప, నాకింకనెట్టివారునుసంతోషంబుసేయంజాలరు.

అని, తాత్పర్యము.

కర్తారమపి లోకానాం శూరం కరుణవేదినమ్. ౫౪
అజ్ఞానాదవమన్యేరన్ సర్వభూతాని లక్ష్మణ

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! లోకానాం=లోకంబులయొక్క; కర్తారమపి=చేయువాఁడైనను; శూరం= యుద్ధమునందుభయములేనివాఁడును; కరుణవేదినం=దయాపరుఁడునగుపురుషుః; సర్వభూతాని=సమస్తభూతములును; అజ్ఞానాత్=తెలియమివలన;అవమన్యేరన్=అవమానించును.

లక్ష్మణుఁడా! లోకంబులసృజింపఁజాలినవాఁడైనను శూరుండైనను, దయాపరుండైనచో, నతనిసామర్థ్యాంబుదెలియమింజేసి, సమస్తభూతంబులునతనినవమానించును.

అని, తాత్పర్యము.

మృదుం లోకహితే యుక్తం దాంతం కరుణవేదినమ్. ౫౫

స ౬౪

నిర్వీర్య ఇతి మన్యంతే నూనం మాం త్రిదశేశ్వరాః

టీక॥ త్రిదశేశ్వరాః = దేవశ్రేష్ఠులు; మృదుం = మెత్తనివాఁడను; లోకహితే = లోకముల యొక్క మేలునందు; యుక్తం = ఆసక్తుండును; దాంతం = ఇంద్రియనిగ్రహముగలవాఁడును; కరుణవేదినం = దయాపరుండునగు; మాం = నన్ను; నిర్వీర్య ఇతి = పరాక్రమము లేనివాఁడని; మన్యంతే = తలంచుచున్నారు. నూనం = నిశ్చయము.

నేను, లోకహితార్థినై మృదువుగా జితేంద్రియుండనై దయాపరుండనై యుండుటవలన, దేవతలందఱును నన్ను నిర్వీర్యుండని తలంచుచున్నారు; నిశ్చయము. అని, తాత్పర్యము.

మాం ప్రాప్య హి గుణో దోష స్సంవృత్తః పశ్య లక్ష్మణ. ౫౬

టీక॥ లక్ష్మణ = లక్ష్మణుఁడా! మాం = నన్ను; ప్రాప్య = పొంది; గుణః = గుణము; దోషః = దోషముగా; సంవృత్తః = అయినది. పశ్య = చూడుము.

లక్ష్మణుఁడా! నన్నుఁబొంది, సద్గుణము కూడ దోషమయినది చూడుము. అని, తాత్పర్యము.

అద్యైవ సర్వభూతానాం రక్షసా మభవాయ చ
సంహృత్యైవ శశిజ్యోత్స్నాం మహాన్ సూర్య ఇవోదితః. ౫౭
సంహృత్యైవ గుణాన్ సర్వాన్ మమ తేజః ప్రకాశతే

టీక॥ అద్యైవ = ఇప్పుడే; సర్వభూతానాం = సమస్తభూతంబుల యొక్కయు; రక్షసాం చ = రాక్షసుల యొక్కయు; అభవాయ = నాశము కొఱకు; శశిజ్యోత్స్నాం = చంద్రుని వెన్నెలను; సంహృత్యైవ = సంహరించియే; ఉదితః = ఉదయించిన; మహాన్ = గొప్పవాఁడగు; సూర్య ఇవ = సూర్యుఁడువలె; మమ = నా యొక్క; గుణాన్ = గుణంబులను; సర్వాన్ = అన్నిటిని; సంహృత్యైవ = సంహరించియే; తేజః = తేజస్సు; ప్రకాశతే = ప్రకాశించుచున్నది.

ఇప్పుడె, సమస్తభూతంబులును రాక్షసులందఱును నాశంబు నొందునట్లు,

సూర్యుండు వెన్నెలనంతయు సంహరించి, లోకసంతాపకరుండై, యుదయించునట్లు, కారుణ్యాదిగుణంబులన్నియు సంహరించి, లోకనాశార్థము నాతేజస్సుప్రకాశించుచున్నది చూడుము.

అని, తాత్పర్యము.

నైవ యక్షా న గంధర్వా న పిశాచా న రాక్షసాః ౫౮
కిన్నరా వా మనుష్యా వా సుఖం ప్రాప్స్యంతి లక్ష్మణ

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! సుఖం=సుఖమును; యక్షాః= యక్షులు; నైవ ప్రాప్స్యంతి = పొందనేలేరు. గంధర్వాః=గంధర్వులు; న (ప్రాప్స్యంతి)= పొందరు. పిశాచాః=పిశాచములు; న= పొందరు. రాక్షసాః=రాక్షసులు; న= పొందరు. కిన్నరా వా=కిన్నరులు గాని; మనుష్యా వా=మనుష్యులు గాని; న (అధ్యాహృతము)=పొందరు.

లక్ష్మణుఁడా! ఇంక, యక్షులు గాని గంధర్వులు గాని పిశాచములు గాని రాక్షసులు గాని కిన్నరులు గాని మనుష్యులు గాని, సుఖంబునొందకుండునట్లు గా చేయుదను. అని, తాత్పర్యము.

మమాస్త్రబాణసంపూర్ణ మాకాశం పశ్య లక్ష్మణ. ౫౯
నిస్సంపాతం కరిష్యామి హ్యద్య త్రైలోక్యచారిణామ్

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! మమ= నాయొక్క; అస్త్రబాణసంపూర్ణం= అస్త్రముల చేతను బాణముల చేతను నిండిన; ఆకాశం=ఆకాశమును; పశ్య= చూడుము. అద్యహి=ఇప్పుడే; త్రైలోక్యచారిణాం= ముల్లోకంబులయందుం దిరుగువారలకు; నిస్సంపాతం=సంచారము లేనట్లుగా; కరిష్యామి=చేసెదను.

లక్ష్మణుఁడా! బ్రహ్మాస్త్రాది దివ్యాస్త్రంబుల చేతను బాణంబుల చేతను ఆకాశంబు నిండించెదను; చూడుము; ఇప్పుడు ముల్లోకంబులయందును, ఎంతమాత్రము సంచారము లేనట్లు గావించెదను.

అని, తాత్పర్యము.

సన్నిరుద్ధగ్రహగణ మావారితనిశాకరమ్. ౬౦
విప్రణష్టానలజల మరుద్భాస్కరసంవృతమ్

వినిమఙథితశైలాగ్రం శుష్యమాణజలాశయమ్. ౬౧
ధ్వస్తద్రుమలతాగుల్మం విప్రణాశితసాగరం
త్రైలోక్యం తు కరిష్యామి సంయుక్తం కాలకర్మణా. ౬౨

టీక॥ త్రైలోక్యంతు=మూల్లోకములను; సన్నిరుద్ధగ్రహగణం= అడ్డగింపఁబడినగ్రహముల సమూహముగలదిగాను; ఆవారితనిశాకరం=అడ్డగింపఁబడిన చంద్రుఁడు గలదిగాను; విప్రణష్టానలజలమరుద్భాస్కరసంవృతం=నశించిన యగ్నిచేతను జలముచేతను వాయువుచేతను సూర్యునిచేతను గప్పఁబడినది గాను; వినిమఙథితశైలాగ్రం=నలుగఁగొట్టఁబడిన పర్వతశిఖరములుగలదిగాను; శుష్యమాణజలాశయం= ఎండుచున్నకొలనులు గలదిగాను; ధ్వస్తద్రుమలతాగుల్మం=నశించినవృక్షములును తీఁగెలునుబొదలునుగలదిగాను; విప్రణాశితసాగరం=నశింపఁజేయఁబడిన సముద్రములు గలదిగాను; కాలకర్మణా=నాశముతో; సంయుక్తంతు=కూడినదిగాను; కరిష్యామి=చేసెదను.

ఇప్పుడు, గ్రహములకుసంచారములేనట్లును, చంద్రునకుఁజలనములేనట్లును, చేసెదను; అగ్నినిజలమునువాయువును సూర్యుని నశింపఁజేసెదను; పర్వతశిఖరంబులఁజూర్ణంబుగావించెదను; కొలంకులనెల్ల నెండించెదను; వృక్షలతాగుల్మంబులధ్వంసంబు గావించెదను; సముద్రము శోషింపఁజేసెదను; ఇట్లు మూల్లోకంబులను నాశంబు నొందించెదం జూడుము. అని, తాత్పర్యము.

న తాం కుశలినీం సీతాం ప్రదాస్యంతి యదీశ్వరాః
అస్మిన్ ముహూర్తే సౌమిత్రే మమ ద్రక్ష్యంతి విక్రమం. ౬౩

టీక॥ సౌమిత్రే=లక్ష్మణుఁడా! ఈశ్వరాః=దేవతలు; కుశలినీం=క్షేమముగల; సీతాం=సీతను; మమ=నాకు; నప్రదాస్యంతి=ఇవ్వరు. అస్మిన్=ఈ; ముహూర్తే=క్షణమునందు; మమ=నాయొక్క; విక్రమం= పరాక్రమమును; ద్రక్ష్యంతి=చూడఁగలరు.

ఇప్పుడు, దేవతలు, నాకు, క్షేమంబుతోఁగూడిన సీతనొసంగకున్నారుగదా! ఈక్షణమునందే నాపరాక్రమమును

జూడఁగలరు. అని, తాత్పర్యము.

నాకాశ ముత్పతిష్యంతి సర్వభూతాని లక్ష్మణ
మమచాప గుణోన్ముక్తై ర్బాణజాలై ర్నిరంతరమ్. ౬౪

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! నిరంతరం=అవకాశములేనట్లుగా; మమ=నాయొక్క; చాపగణోన్ముక్తైః=ధనుస్సుయొక్క అల్లెత్రాటినుండి విడువఁబడిన; బాణజాలైః=బాణసమూహములచేత; సర్వభూతాని=సమస్తభూతంబులును; ఆకాశం=ఆకాశమును గూర్చి; నోత్పతిష్యంతి=ఎగరఁజాలవు.

లక్ష్మణుఁడా! సమస్తభూతంబులకును ఆకాశమున సంచరించుట కెంతమాత్రమును నవకాశము లేకుండునట్లు, నా ధనుర్ముక్తంబులగు బాణంబులు ఆకాశమంతయు నిరవకాశంబుగఁ జేయంగఁగలవు. అని, తాత్పర్యము.

అర్దితం మమ నారాచై ర్ధ్వస్తభ్రాంత మృగద్విజమ్
సమాకుల మమర్యాదం జగత్పశ్యాద్య లక్ష్మణ. ౬౫

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! మమ=నాయొక్క; నారాచైః=బాణములచేత; అర్దితం=పీడింపఁబడినదియు; ధ్వస్తభ్రాంతమృగద్విజం=నశించినవియు భ్రాంతినొందినవియునగు మృగంబులును బక్షులునుగలదియు; సమాకులం=వ్యాకులమయినదియు; అమర్యాదం=మర్యాదలేనిదియునగు; జగత్=ప్రపంచమును; పశ్య=చూడుము.

లక్ష్మణుఁడా! నాబాణంబులచే బీడితంబై, మృగంబులును బక్షులును నశించి, జగమంతయు వ్యాకులంబై మర్యాదాహీనంబుకాఁగలదు; చూడుము.

అని, తాత్పర్యము.

ఆకర్ణ పూర్ణై రిషుభి ర్జీవలోకం దురావరైః
కరిష్యే మైథిలీహేతో రపిశాచ మరాక్షసమ్. ౬౬

టీక॥ మైథిలీహేతోః=సీతానిమిత్తము; ఆకర్ణపూర్ణైః=చెవిపఱకుఁ

పూరింపఁబడినవియు; దురావరైః= అడ్డగింపనలవిగానివియునగు; ఇషుభిః= బాణములచేత; జీవలోకం= ప్రాణిలోకమును; అపిశాచం= పిశాచములు లేనిదిగాను; అరాక్షసం= రాక్షసులు లేనిదిగాను; కరిష్యే= చేసెదను.

ఇప్పుడు, సీతానిమిత్తంబుగా, దుష్ప్రధర్షణంబులగు బాణంబులఁ జెవివఱకునాకర్షించి ప్రయోగించి, ప్రాణిలోకంబునఁ, బిశాచంబులుగాని రాక్షసులుగానీ, లేకుండునట్లు గావించెదను. అని, తాత్పర్యము.

మమ రోషప్రయుక్తానాం సాయకానాం బలం సురాః
ద్రక్ష్యం త్యద్య విముక్తానా మతిదూరాతిగామినామ్. ౬౭

టీక॥ సురాః= దేవతలు; అద్య= ఇప్పుడు; విముక్తానాం= విడువఁబడినవియు; రోషప్రయుక్తానాం= కోపముతోఁ బ్రయోగింపఁబడినవియు; అతిదూరాతిగామినాం= బహుదూరము పోవునవియునగు; మమ = నాయొక్క; సాయకానాం= బాణములయొక్క; బలం= బలమును; ద్రక్ష్యంతి= చూడఁగలరు.

ఇప్పుడు, రోషంబునం బ్రయోగింపఁబడినవియు బహుదూరము పోయినవియునగు నాబాణంబులబలంబును దేవతలుచూతురుగాక. అని, తాత్పర్యము.

నైవ దేవా నదైతేయా నపిశాచా నరాక్షసాః
భవిష్యంతి మమక్రోధా త్త్రైలోక్యే విప్రణాశితే. ౬౮

టీక॥ మమ = నాయొక్క; క్రోధాత్= కోపమువలన; త్రైలోక్యే= ముల్లోకంబులు; విప్రణాశితే= నశింపఁజేయఁబడినవికాఁగా; దేవాః= దేవతలు; నైవభవిష్యంతి= ఉండనేయుండరు. దైతేయాః= దైత్యులు; న= ఉండరు. పిశాచాః= పిశాచములు; న= ఉండరు. రాక్షసాః= రాక్షసులు; న= ఉండరు.

నాకోపమువలన ముల్లోకంబులును నాశంబునొందఁగా, దేవతలును దైత్యులును బిశాచంబులును రాక్షసులును తోడనె నశింతురు. అని, తాత్పర్యము.

దేవదానవయక్షాణాం లోకా యే రక్షసా మపి

బహుధా న భవిష్యంతి బాణౌఘై శ్శకలీ కృతాః. ౬౯

టీక॥ దేవదానవయక్షాణాం=దేవతలయొక్కయు దానవులయొక్కయు యక్షులయొక్కయు; రక్షసామపి=రాక్షసులయొక్కయు; యే=ఏ; లోకాః=లోకంబులు; సంతి(అధ్యాహృతము)=కలవో; తే(అధ్యాహృతము)=అవి; బాణౌఘైః=బాణసమూహములచేత; బహుధా=పెక్కుప్రకారులుగా; శకలీకృతాః=తునకలుచేయఁబడినవై; నభవిష్యంతి=ఉండవు.

దేవలోకంబులును దానవలోకంబులును యక్షలోకంబులును రాక్షసలోకంబులును ఏవిగలవో, అవన్నియు నిప్పుడు నాబాణంబులచేఁ బెక్కువయ్యలై, నాశంబునొందును. అని, తాత్పర్యము.

నిమర్యాదా నిమాఁ ల్లోకాన్ కరిష్యామ్య ద్య సాయకైః
హృతాం మృతాం వా సౌమిత్రే నదాస్యంతి మమేశ్వరాః. ౭౦

టీక॥ సౌమిత్రే=లక్ష్మణుఁడా! అద్య=ఇప్పుడు; ఈశ్వరాః=దేవతలు; హృతాం=అపహరింపఁబడినదిగాని; మృతాంవా=మరణంబునొందినదిగాని యయిన; సీతాం(అధ్యాహృతము)=సీతను; నదాస్యంతి=ఇవ్వరు. సాయకైః=బాణములచేత; ఇమాన్=ఈ; లోకాన్=లోకములను; నిమర్యాదాన్=మర్యాదలేనివానిఁగా; కరిష్యామి=చేసెదను.

లక్ష్మణుఁడా! దేవతలు అపహృతయయినగాని మరణంబునొందిగానియుండు సీతను నాకొసంగరు; నేనిప్పుడు, బాణంబులచేఁ బ్రపంచంబునంతయు నిర్మర్యాదంబుగావించెదను. అని, తాత్పర్యము.

తథారూపాం హి వైదేహీం నదాస్యంతి యది ప్రియాం
నాశయామి జగ త్సర్వం త్రైలోక్యం సచరాచరమ్. ౭౧

టీక॥ తథారూపాం=అట్టిదైన; ప్రియాం=ప్రియురాలగు; వైదేహీం=సీతను; నదాస్యంతిహియది=ఇవ్వకనే యుందురేని; సచరాచరం=జంగమస్థా

వరములతోఁగూడిన; త్రైలోక్యం=ముల్లోకంబులను;జగత్= ప్రపంచమును; సర్వం=అంతయు; నాశయామి=నశింపఁజేసెదను.

అపహరింపఁబడిగాని మరణంబు నొందిగానియుండు ప్రియురాలిని దేవతలునాకొసంగరేని, యిప్పుడు, జంగమస్థావరంబులతోఁగూడిన ప్రపంచము నంతయునశింపఁజేసెదను.అని, రాముండు చెప్పెను.అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వా రోషతామ్రాక్షో రామో నిష్పీడ్యకార్ముకం
శరమాదాయ సందీప్తం ఘోరమాశీవిషోపమమ్. ౭౨
సంధాయ ధనుషి శ్రీమాన్ రామః పరపురంజయః
యుగాంతాగ్ని రివక్రుద్ధ ఇదంవచన మబ్రవీత్. ౭౩

టీక॥రామః=రాముఁడు; ఇతి=అని;ఉక్త్వా=చెప్పి; రోషతామ్రాక్షః=కోపముచే నెఱ్ఱనైనకన్నులుగలవాఁడై; కార్ముకం=ధనుస్సును;నిష్పీడ్య=పట్టుకొని; సందీప్తం=ప్రకాశించుచున్నదియు;ఘోరం=భయంకరమును; ఆశీవిషోపమం=సర్పముతోఁ బోలికగలదియునగు; శరం=బాణమును ; ఆదాయ=తీసి;ధనుషి=వింటియందు;సంధాయ=సంధించి; శ్రీమాన్=అందఱికన్న నధికుఁడగు; పరపురంజయః= శత్రుపట్టణంబులజయించునట్టి; రామః= రాముఁడు; యుగాంతాగ్నిరివ= ప్రళయకాలాగ్నివలె; క్రుద్ధః=కోపమునొందినవాఁడై;ఇదం=ఈ; వచనం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

ఇట్లుబీరంబుబువలికి, కోపంబునఁగన్నులనెఱ్ఱదనంబుగదుర, ధనుస్సు చేతంబట్టి, దేదీప్యమానంబును భయంకరాకారంబును గూరసర్పముం బోలినదియునగుబాణంబుఁదీసి, వింటంగూర్చి , శ్రీమంతుండును శత్రుపట్టణంబులజయించువాఁడునగురాముండు, ప్రళయకాలానలంబుకైవడిఁ బరమక్రుద్ధుండై,యిట్లని,చెప్పెను.

అని, తాత్పర్యము.

యథా జరా యథామృత్యు ర్యథాకాలో యథావిధిః
నిత్యం న ప్రతిహన్యంతే సర్వభూతేషు లక్ష్మణ. ౭౪
తథాహం క్రోధసంయుక్తో న నివార్యో స్మి సర్వథా

స ౬౪

టీక॥లక్ష్మణ= లక్ష్మణుఁడా! యథా=ఎట్లు; రాజా=రాజును; యథా=ఎట్లు; కాలః=కాలమును; యథా=ఎట్లు; మృత్యుః=మృత్యువును; యథా=ఎట్లు;విధిః=అదృష్టమును; సర్వభూతేషు= సమస్తభూతములయందును; నిత్యం=ఎల్లప్పుడును; నప్రతిహన్యంతే=ప్రతిహతము గాకుండునో; తథా=అట్లు; క్రోధసంయుక్తం=కోపమునొందిన;అహం=నేను;సర్వథా=అన్నివిధంబులను;ననివార్యః=అడ్డగింపఁదగనివాఁడను;అస్మి=అగుచున్నాను.

లక్ష్మణుఁడా!లోకంబున, సమస్తభూతంబులును, ఎట్లురాజును గాని మృత్యువును గాని కాలమును గాని విధిని గాని యెప్పుడునునివారింపఁజాలవో, అట్లు క్రుద్ధుండనగునన్నునునివారింప నేరికినలవిగాదు. అని, తాత్పర్యము.

పురేవ మే చారుదతీ మనిందితాం
దిశంతి సీతాంయది నా ద్య మైథిలీమ్. ౭౫
సదేవగంధర్వమనుష్యపన్నగం
జగ త్సశైలం పరివర్తయామ్య హమ్

టీక॥ పురేవ=మునుపువలె; చారుదతీం=సుందరములగునదంతములుగలదియు; అనిందితాం=నిందింపఁబడనిదియు; మైథిలీం=మిథిలయందుఁబుట్టినదియునగు; సీతాం= సీతను; అద్య=ఇప్పుడు; మే= నాకొఱకు; నదిశంతియది=ఇయ్యరేని; అహం=నేను ; సదేవగంధర్వమనుష్యపన్నగం=దేవతలతోనుగంధర్వులతోనుమనుష్యులతోను సర్పములతోనుగూడినదియు; సశైలం=పర్వతములతోఁగూడినదియునగు; జగత్=ప్రపంచమును;పరివర్తయామి=త్రిప్పెదను.

మునుపుండినట్లు, సుందరములగు దంతములుగలదియుఁ బతివ్రతయునగు సీతనునాకు దేవతలొసంగరేని, దేవగంధర్వమనుష్యపన్నగంబులతోను బర్వతంబులతోనుంగూడఁ, బ్రపంచమునంతయు, నాశంబునొందించెదను. అని, రాముఁడుచెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అరణ్యకాండే, చతుష్షష్టితమస్సర్గః.

ఇతి. స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండ చతుష్షష్టితమసర్గటీక, ముగిసినది.

---

శ్రీ

పంచషష్టితమసర్గప్రారంభః.

తప్యమానం తథా రామం సీతాహరణకర్శితమ్
లోకానా మభవే యుక్తం సాంవర్తక మివానలమ్. ౧
వీక్షమాణం ధను స్సజ్యం నిశ్శ్వసంతం పునఃపునః
దగ్ధుకామం జగ త్సర్వం యుగాంతే తు యథాహరమ్. ౨
అదృష్టపూర్వం సంక్రుద్ధం దృష్ట్వా రామం తు లక్ష్మణః
అబ్రవీ త్ప్రాంజలి ర్వాక్యం ముఖేన పరిశుష్యతా. ౩

టీక॥ తథా=అట్లు; తప్యమానం=పరితపించుచున్నవాఁడును; సీతాహరణకర్శితం= సీతనపహరించుటచేఁగృశింపఁజేయఁబడినవాఁడును; లోకానాం= లోకములయొక్క; అభవే=నాశమునందు; యుక్తం=ఆసక్తుండును; సాంవర్తకం = ప్రలయకాలమునందుండునట్టి; అనలమివ(స్థితం)=అగ్నిపోలెనున్నవాఁడును; సజ్యం= అల్లెత్రాటితోఁగూడిన; ధనుః=వింటిని; వీక్షమాణం= చూచుచున్నవాఁడును; పునఃపునః = మాటిమాటికి; నిశ్శ్వసంతం=నిట్టూర్పులువుచ్చుచున్నవాఁడును; జగత్=ప్రపంచమును; సర్వం= అంతను; దగ్ధుకామం=దహింపఁగోరినవాఁడును; యుగాంతే=ప్రలయకాలమునందు; హరం యథా తు(స్థితం)=రుద్రునివలెనేయున్నవాఁడునగు; రామం= రామునిని; అదృష్టపూర్వం=మున్నుచూడఁబడనివాఁడును; సంక్రుద్ధం=మిక్కిలియు కోపమునొందినవాఁడునగు; రామం= రామునిని; దృష్ట్వా తు=చూచినంతనే; లక్ష్మణః=లక్ష్మణుఁడు; పరిశుష్యతా=ఎండుచున్న; ముఖేన=నోరుతోఁ; ప్రాంజ

స ౬౫

లిః=మంచిచేమోడ్పుగలవాఁడై; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

అట్లు, సీతాహరణంబునం జేసి పరితపించుచున్నవాఁడును బ్రలయకాలాగ్నిహోత్రునిమాడ్కి లోకనాశంబు సేయఁ బ్రవృత్తుండై యున్నవాఁడును, ఎక్కు వెట్టఁబడిన ధనుస్సుం జూచుచుఁ గ్రోధపారవశ్యంబున మాటిమాటికి నిట్టూర్పులు విగుడుచుచున్నవాఁడును బ్రలయకాలరుద్రునికైవడి భయంకరాకారుఁడై జగంబంతయు దహింపం జూచుచున్నవాఁడును, అదివఱకెన్నఁడుం జూడని యాకారవిశేషంబు నొందినవాఁడును బరమక్రుద్ధుండునగు రాముం జూచి, లక్ష్మణుండు, దుఃఖభయంబులనొందెండఁ, జేమోడ్పుగలించి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

పురా భూత్వా మృదుర్దాంత స్సర్వభూతహితే రతః
న క్రోధవశమాపన్నః ప్రకృతిం హాతుమర్హసి. ౪

టీక॥ త్వం(అధ్యాహృతము)=నీవు; పురా=మున్ను; మృదుః=మెత్తనివాఁడవుగాను; దాంతః=ఇంద్రియనిగ్రహము నొందినవాఁడవుగాను; సర్వభూతహితే=సమస్తభూతంబులమేలునందు; రతః=ఆసక్తుఁడవుగాను; భూత్వా=ఉండి; క్రోధవశం=కోపముయొక్కయధీనతను; ఆపన్నః=పొందినవాఁడై; ప్రకృతిం=స్వభావమును; హాతుం=విడుచుటకు; నార్హసి=తగవు.

నీవు, ఇంతవఱకు, మృదుస్వభావుండవుగాను జితేంద్రియుండవుగాను సమస్తభూతంబులకును హితంబు సేయువాఁడవుగాను, ఉండి, యిప్పుడు, క్రోధపారవశ్యంబునొంది, నీస్వభావంబును వదలుటయుచితము గాదు. అని, తాత్పర్యము.

చంద్రే లక్ష్మీః ప్రభా సూర్యే గతిర్వాయౌ భువి క్షమా
ఏతత్తు నియతం సర్వం త్వయి చానుత్తమం యశః. ౫

టీక॥ చంద్రే=చంద్రునియందు; లక్ష్మీః=కాంతి; సూర్యే=సూర్యునియందు; ప్రభా=వెలుఁగును; వాయౌ=వాయువునందు; గతిః=గమనము; భువి=భూమియందు; క్షమా=ఓర్పు; ఏతత్తు=ఇదిమాత్రము; నియతం=తప్పక

యున్నది. త్వయి=నీయందు; సర్వం= అన్నియు; అనుత్తమం=తనకన్నఁనధిక ములేని; యశశ్చ=కీర్తియు; నియతం(అధ్యాహృతము)=తప్పకయున్నది.

చంద్రునియందుఁగాంతియు, సూర్యునియందు వెలుఁగును వాయువునందు గమనమును భూమియందు క్షమయును, ఇట్లొక్కొకరియందు ఒక్కొకటి నియతముగానుండును; నీయందు, కాంత్యాదులన్నియు, అసదృశంబగు కీర్తియు నియతముగానుండును.

అని, తాత్పర్యము.

ఏకస్య నాపరాధేన లోకాన్ హంతు మర్హసి

టీక॥ త్వం=నీవు; ఏకస్య=ఒకనియొక్క; అపరాధేన=తప్పుచేత; లోకాన్=లోకంబులను; హంతుం= వధించుటకు; నార్హసి=తగవు.

ఒకఁడు తప్పుచేయుటచేత, నీవు, నిరపరాధంబులగు లోకంబులనన్నింటిని వధించుట యుక్తముకాదు.

అని, తాత్పర్యము.

నతుజానామి కస్యాయం భగ్నస్సాంగ్రామికో రథః. ౬
కేనవాకస్య వాహేతో స్సాయుధ స్సపరిచ్ఛదః

టీక॥ అయం=ఈ; భగ్నః=విఱువఁబడిన; సాయుధః=ఆయుధములతోఁగూడినదియు; సపరిచ్ఛదః=పరికరముతోఁగూడినదియునగు; సాంగ్రామికః=యుద్ధార్థమయిన; రథః=రథము; కస్య=ఎవ్వనిది? కేనవా=ఎవ్వనిచే; భగ్నః(అధ్యాహృతము)= విఱువఁబడినది? కస్యహేతోర్వా = ఎందుకుఁగా (విఱువఁబడినది). నతుజానామి=ఎఱుఁగనే యెఱుఁగను.

ఆయుధములతోను ఇతరములయిన యుద్ధోపకరణములతోనుంగూడి విఱిగిపడియున్నయీయుద్ధరథము, ఎవ్వనిది? ఎవ్వనిచేవిఱువఁబడినది? ఎందుకుఁగావిఱువఁబడినది? ఈసంగతి నాకేమియుఁదెలియలేదు. అని, తాత్పర్యము.

ఖురనేమిక్షతశ్చాయం సిక్తో రుధిర బిందుభిః. ౭
దేశోనివృత్త సంగ్రామ స్సుఘోరః పార్థివాత్మజ

టీక ॥ పార్థివాత్మజ=రాచకొమరుఁడవగు రాముఁడా! ఖురనేమిక్షత

శ్చ=గుఱ్ఱముల గిట్టలచేతను జక్రముల యంచులచేతను త్రొక్కఁబడినదియు; రుధిరబిందుభిః= నెత్తురుబిందువులచేతను; సిక్తః= తడుపఁబడినదియు; సుఘోరః=మిక్కిలియు భయంకరమునగు; అయం=ఈ; దేశః=ప్రదేశము; నిర్వృత్తసంగ్రామః=కడచినయుద్ధముగలది.

రాచకొమరుండ వగు రాముఁడా! ఈప్రదేశము, గుఱ్ఱములచేతను రథచక్రములచేత త్రుణ్ణంబై నెత్తురుచేఁ దడుపఁబడి భయంకరముగానుండుట వలన, ఇందు,ఇంతకుమునుపు మహాయుద్ధముజరగినట్లు తోఁచుచున్నది.

అని, తాత్పర్యము.

ఏకస్య తు విమర్దోఽయం నద్వయో ర్వదతాంవర. ౮
నహివృత్తంహి పశ్యామి బలస్య మహతః పదం

టీక॥ వదతాం=మాటలాడువారలలోపల; వర=శ్రేష్ఠుఁడవగురాముఁడా! అయం= ఈ; విమర్దః=యుద్ధము; ఏకస్యతు = ఒకనిదే; ద్వయోః=ఇద్దఱిది; న=కాదు. హి=ఎందువలనననఁగా; మహతః= గొప్పదగు; బలస్య=సైన్యముయొక్క; పదం= అడుగును; వృత్తం=అంటినదానిఁగా; నపశ్యామిహి=చూడనుగదా!

మాటలాడువారలలో నుత్తముఁడవగు రాముఁడా ! యుద్ధమొకనిదిగా నేతోఁచుచున్నది; ఇద్దఱిదిగాని బహుమందిదిగానికాదు; ఏలయనఁగా, గొప్పసేనయుండినట్లు, అడుగులజాడయు గపడలేదు. అని, తాత్పర్యము.

నైకస్యతు కృతే లోకాన్ వినాశయితు మర్హసి. ౯
యుక్తదండాహి మృదవః ప్రశాంతా వసుధాధిపాః

టీక॥ ఏకస్యకృతేతు=ఒకనికిఁగానే; లోకాన్=లోకములను; వినాశయితుం=నశింపఁజేయుటకు; నార్హసి = తగవు. వసుధాధిపాః=రాజులు; యుక్తదండాః= సరియయినశిక్షగలవారలును; మృదవః=మృదువులును ; ప్రశాంతాః హి = శాంతిగలవారలునుగదా!

ఒకరినికిఁగా, లోకంబులనన్నింటిని నశింపఁజేయుట యుచితముకాదు; రాజులు,ఎవ్వనికెంతదగునోయంతశిక్షయేచేయువారలుగాను మృదువులుగాను శాంతులుగానునుందురుగదా!

అని, తాత్పర్యము.

సదాత్వం సర్వభూతానాం శరణ్యః పరమాగతిః. ౧౦

టీక॥త్వం=నీవు; సదా=ఎల్లప్పుడును; సర్వభూతానాం= సమస్తభూతంబులకును; శరణ్యః=శరణముపొందఁదగినవాఁడవు. పరమా=ఉత్తమమయిన; గతిః=గతివి.

నీవు, ఆరాజులవంటివాఁడవు మాత్రమె కావు; ఎల్లప్పుడును, సమస్తభూతంబులకును, శరణ్యుండవు; పరమగతివి. అని,తాత్పర్యము.

కోనుదార ప్రణాశంతే సాధు మన్యేత రాఘవ

టీక॥రాఘవ=రాముఁడా! తే=నీయొక్క; దారప్రణాశం=భార్యావియోగమును;సాధు=మంచిదానిఁగా ; కోను=ఎవ్వఁడు; మన్యేత=తలంచును?

రాముఁడా!నీకిప్పుడుకలిగినభార్యావియోగము మంచిదని యెవ్వఁడుతలంచును? అని,తాత్పర్యము.

సరిత స్సాగరా శ్శైలా దేవగంధర్వదానవాః. ౧౧
నాలంతే విప్రియం కర్తుం దీక్షితస్యేవ సాధవః

టీక॥సరితః=నదులును;సాగరాః=సముద్రంబులును;శైలాః= పర్వతములును; దేవగంధర్వదానవాః=దేవతలునుగంధర్వులునుదానవులును; తే=నీకు;దీక్షితస్య=యజ్ఞదీక్షితునకు; సాధవఇవ= ఋత్విజులువలె; విప్రియం=విరోధమును; కర్తుం= చేయుటకు; నాలం=శక్తులుకారు.

యాగదీక్షితునకు, ఋత్విజులు, అప్రియంబుచేసినచో, అదియాగవిఘాతమూలంబునఁ దమకును సంభవించునని భయంబున, అతనికప్రియంబు సేయవెఱచునట్లు, లోకరక్షకుండవగునీకు,నదులుగాని సముద్రంబులుగాని పర్వతంబు

లుగాని దేవగంధర్వ దానవులుగాని, తామె చెదురనుభయంబున, అప్రియంబెంతమాత్రము చేయఁజాలరు. అని, తాత్పర్యము.

యేన రాజన్హృతా సీతా తమన్వేషితు మర్హసి. ౧౨
మద్ద్వితీయో ధనుష్పాణిస్సహాయైః పరమర్షిభిః

టీక॥ రాజన్ = రాజవగురాముఁడా! యేన = ఎవ్వనిచేత; సీతా = సీత; హృతా = అపహరింపఁబడినదో; మద్ద్వితీయః = నేను రెండవవాఁడుగాఁగలవాఁడవై; ధనుష్పాణిః = ధనుస్సు చేతంగలవాఁడవై; సహాయైః = తోడైన; పరమర్షిభిః = ఉత్తములయిన ఋషులతోఁ; తం = అతని; అన్వేషితుం = వెదకుటకు; అర్హసి = తగుదువు.

రాముఁడా! సీతను ఎవ్వఁడపహరించెనో, నాతోడంగూడి ధనుర్ధరుండవై పరమర్షులతోడ్పడ, నాపాపాత్మునివెదకుము. అని, తాత్పర్యము.

సముద్రంచ విచేష్యామః పర్వతాంశ్చ వనానిచ. ౧౩
గుహాశ్చ వివిధా ఘోరా నదీః పద్మవనానిచ

టీక॥ సముద్రంచ = సముద్రమును; పర్వతాంశ్చ = పర్వతములను; వనానిచ = అడవులను; వివిధాః = నానావిధములును; ఘోరాః = భయంకరములునగు; గుహాశ్చ = గుహలను; నదీః = నదులను; పద్మవనానిచ = తామరపూలవనంబులను; విచేష్యామః = వెదకుదము.

సముద్రంబునను బర్వతంబులను వనంబులను నానావిధంబులును భయంకరాకారంబులునగు గుహలను నదులను దామరకొలంకులను సీతాదేవిని వెదకుదము. అని, తాత్పర్యము.

దేవగంధర్వలోకాంశ్చ విచేష్యామ స్సమాహితాః. ౧౪
యావ న్నాధిగమిష్యామ స్తవ భార్యాపహారిణమ్

టీక॥ యావత్ = ఎంతవఱకు; తవ = నీయొక్క; భార్యాపహారిణం = భార్యనపహరించినవానిని; నాధిగమిష్యామః = పొందమో; తావత్ (అధ్యాహృ

తము)=అంతవఱకు; సమాహితాః=జాగ్రత్తగలవారమై; దేవగంధర్వలోకాంశ్చ=దేవలోకంబులనుగంధర్వలోకంబులను; విచేష్యామః=వెదకుదము.

అట్లు, సమాహితులమయి, దేవలోకంబులను గంధర్వ లోకంబులనుం గూడ, వెదకుదము; అట్లు, నీభార్య నపహరించినవాఁడు దొరకువఱకు వెదకుచుందము. అని, తాత్పర్యము.

నచే త్సామ్నా ప్రదాస్యంతి పత్నీం తే త్రిదశేశ్వరాః. ౧౫
కోసలేంద్ర తతఃపశ్చా త్ప్రాప్తకాలం కరిష్యసి

టీక॥కోసలేంద్ర=రామఁడా! సామ్నా= తిన్ననిమాటచేత; త్రిదశేశ్వరాః=దేవశ్రేష్ఠులు; తే=నీయొక్క; పత్నీం=భార్యను; నప్రదాస్యంతిచేత్=ఇవ్వరేని; తతఃపశ్చాత్=అటుపిమ్మట; ప్రాప్తకాలం= పొందఁబడినకార్యముగలకార్యమును; కరిష్యసి= చేయఁగలవు.

కోసలదేశ రాజుండవగు రామఁడా! దేవతలు, సామోపాయంబునకు, నీభార్యనొసంగరేని, యటుపిమ్మట, యుక్తకాలము వచ్చినందువలన, యుద్ధము గావింపఁగలవు. అని, తాత్పర్యము.

శీలేన సామ్నా వినయేన సీతాం
నయేన నప్రాప్స్యసి చే న్నరేంద్ర. ౧౬
తత స్సముత్సాదయ హేమపుంఖై
ర్మహేంద్రవజ్రప్రతిమై శ్శరౌఘైః

టీక॥నరేంద్ర=రామఁడా! శీలేన=సదాచారముచేతను; సామ్నా=సామోపాయముచేతను; వినయేన=వ్రమతచేతను; నయేన=నీతిచేతను; సీతాం=సీతను; నప్రాప్స్యసిచేత్=పొందరేని; తతః=అంత; హేమపుంఖైః=బంగారు పింజలుగలవియు; మహేంద్రవజ్రప్రతిమైః=దేవేంద్రునివజ్రముతోఁ బోలికగలవి; శరౌఘైః= బాణసమూహములచేత; సముత్సాదయ=నశింపఁజేయుము.

రామఁడా! సదాచారంబునను సామోపాయంబునను వినయంబునను నయంబునను, సీతదొరకకపోవునేని, యాంతమీఁదఁ, గాంచనపుంఖంబులును మ

హేంద్రుని వజ్రమువంటివియునగు బాణంబులచే, నాశంబు గావింపుము. అని, లక్ష్మణుండు, రామునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
ఆరణ్యకాండే, పంచషష్టితమస్సర్గః.
ఇది, స్వప్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండ పంచషష్టితమసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

షట్షష్టితమసర్గప్రారంభః.

తం తథా శోకసంతప్తం విలపంత మనాథవత్
మోహేన మహతా విష్టం పరిద్యూన మచేతనమ్. ౧
తత స్సౌమిత్రి రాశ్వాస్య ముహూర్తాదివ లక్ష్మణః
రామం సంబోధయామాస చరణౌ చాభిపీడయన్. ౨

టీక॥ తతః=అంత; సౌమిత్రిః=సుమిత్రాపుత్రుండగు; లక్ష్మణః= లక్ష్మణుఁడు; తథా=అట్లు; శోకసంతప్తం= దుఃఖముచేత మిక్కిలియుఁ దపింపఁజేయఁబడినవాఁడును; అనాథవత్= నాథుఁడు లేనివాఁడువలెఁ; విలపంతం=విలపించుచున్నవాఁడును; మహతా= అధికమయిన; మోహేన=వ్యామోహముచేత; ఆవిష్టం=పొందఁబడినవాఁడును; పరిద్యూనం=ఏడ్చుచున్నవాఁడును; అచేతనం= తెలివిలేనివాఁడునగు; తం= ఆ; రామం=రాముని; ముహూర్తాదివ=స్వల్పకాలమువలననె; ఆశ్వాస్య=ఊఱడించి; చరణౌ చ= పాదములను; అభిపీడయన్=పీడింపుచు; సంబోధయామాస=బోధపఱిచెను.

అంత, నట్లు పరమదుఃఖితుండైయ నాథునిపగిది విలపించుచుఁ బరమమో

హితుండై రోదనంబు సేయుచు నస్వస్థహృదయుండైయున్న రామని, ముహూర్తమాత్రంబున నాశ్వాసించి, పాదంబులంబట్టుకొని మఱలనిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

మహతా తపసా రామ మహతా చాపికర్మణా
రాజ్ఞా దశరథేనాసి లబ్ధో మృతమివామరైః. 3

టీక॥ రామ = రాముఁడా! రాజ్ఞా=రాజయిన; దశరథేన= దశరథునిచేత; మహతా = గొప్పదైన; తపసా=తపస్సుచేతను; మహతా = గొప్పదగు; కర్మణాచాపి= కర్మముచేతను; అమరైః=దేవతలచేత; అమృతమివ=అమృతమువలె; లబ్ధః= పొందఁబడినవాఁడవు; అసి = అగుచున్నావు.

రాముఁడా! దేవతలమృతంబును సంపాదించినట్లు, దశరథమహారాజు, మహాతపస్సుచేసి, గొప్పగొప్ప యాగంబులగావించి, నిన్నుఁబొందెను.

అని, తాత్పర్యము.

తవ చైవ గుణైర్బద్ధ స్త్వద్వియోగాన్మహీపతిః
రాజా దేవత్వమాపన్నో భరతస్య యథా శ్రుతమ్. 4

టీక॥ యథా=ఎట్లు; భరతస్య(భరతాత్)=భరతునివలన; శ్రుతం= వినఁబడినదో; తథా(అధ్యాహృతము)= అట్లు; మహీపతిః= భూమికిఁబ్రభువైన; రాజా=దశరథమహారాజు; తవ= నీయొక్క; గుణైః=గుణములచేత; బద్ధశ్చైవ=కట్టఁబడినవాఁడైయే; త్వద్వియోగాత్ = నీవిరహమువలన; దేవత్వం=దేవుఁడగుటను; ఆపన్నః= పొందినాఁడు.

దశరథమహారాజు, నీదుసద్గుణంబులచేబద్ధుండై, నీవియోగంబుసహింపంజాలక మె, దేవత్వంబునొందెననెని, భరతునివలనవింటిమి. అని, తాత్పర్యము.

యది దుఃఖ మిదం ప్రాప్తం కాకుత్స్థ న సహిష్యసే
ప్రాకృతశ్చాల్పసత్త్వశ్చ ఇతరః క స్సహిష్యతి. 5

టీక॥ కాకుత్స్థ=రాముఁడా! ప్రాప్తం=పొందఁబడిన; ఇదం=ఈ; దుః

ఖం=దుఃఖమును; నసహిష్యసేయది=స హింపఁజాలవేని; ప్రాకృతశ్చ = అ ల్పుఁడును; అల్పసత్త్వశ్చ=కొంచెమ గు బలముగలవాఁడునగు; ఇతరః=మ తియొకఁడు; కః=ఎవ్వఁడు; సహిష్య తి=సహింపఁగలఁడు?

రాముఁడా! నీవు, యిప్పుడు సంభవిం చిన దుఃఖమును సహింపఁజాలవేని, యిం క, క్షుద్రుండును అల్పబలుండునగువాఁ డెవ్వఁడు సహింపఁగలఁడు?

అని, తాత్పర్యము.

దుఃఖితోహి భవాన్ లోకాం స్తేజసా యది ధక్ష్యతే
ఆర్తాః ప్రజా నరవ్యాఘ్ర క్వను యాస్యంతి నిర్వృతిమ్. ౬

టీక ॥ నరవ్యాఘ్ర=పురుషశ్రేష్ఠుఁ డవగు రాముఁడా! భవాన్=నీవు; దుః ఖితోహి= దుఃఖమునొందినవాఁడవై నీవు; తేజసా = తేజస్సుచేత; లో కాన్ = లోకములను; ధక్ష్యతే యది= దహింతువేని; ఆర్తాః = పీడితులగు; ప్రజాః=జనులు; క్వను = ఎచ్చట; ని ర్వృతిం= సుఖమును; యాస్యంతి = పొందఁగలరు?

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! నీవు, ఇట్లు దుఃఖితుండవై తేజస్సుచే లోకంబుల నెల్ల దహింతువేని, నీ తేజ స్సుచే పీడితులగు ప్రజలు సుఖం బెట్లు పొందఁగలరు? అని, తాత్పర్యము.

లోకస్వభావ ఏవైష యయాతి ర్నహుషాత్మజః
గతశ్శక్రేణ సాలోక్య మనయ స్తం సమస్పృశత్. ౭

టీక॥ ఏషః=ఇది; లోకస్వభావ ఏవ=లోకములయొక్క స్వభావమె. న హుషాత్మజః= నహుషునికొడుకైన; యయాతిః= యయాతి; శక్రేణ=ఇంద్రు నితో; సాలోక్యం=సమానమయినలో కము కలుగుటయందు; గతః= పొంది నాఁడు. తం=అతని; అనయః=దుఃఖ ము; సమస్పృశత్=తాఁకెను.

ఇట్లు, ఆపదలంబొందుట లోకంబు లందలి స్వభావమె; నహుషపుత్రుండగు యయాతి, ఇంద్రలోకముంబొందియు, అచ్చట, అసూయచే నింద్రునిచే "మీరా జ్యంబున నెవ్వఁడు శ్రేష్ఠుండు" అనియడు గంబడినవాఁడై, యథార్థవాదియగు టచే, నేనె శ్రేష్ఠుండనని చెప్పి, యంత, మ హేంద్రునిచే నీవాత్మశ్లాఘివి, స్వర్గంబు

నసుండంగ వని తో్రియంబడి, యాపదంబొందెను. అని, తాత్పర్యము.

మహర్షిర్యో వసిష్ఠస్తు యః పితు ర్నః పురోహితః
అహ్నా పుత్త్రశతం జజ్ఞే తథైవా స్య పునర్హతమ్. ౮

టీక॥ యస్తు=ఎవ్వఁడు; మహర్షిః=పూజ్యుఁడైనఋషియగు; వసిష్ఠః=వసిష్ఠుఁడో; యః=ఎవ్వఁడు; నః=మాయొక్క; పురోహితః= పురోహితుఁడో; అస్య=ఇతనికి; పుత్త్రశతం= కొడుకులయొక్కనూఱు; జజ్ఞే=కలిగెను. తథైవ=అట్లె; పునః=మఱల; హతం = చంపఁబడినది.

ఎవ్వఁడు వసిష్ఠమహర్షియని లోకంబులం బ్రఖ్యాతిగాంచెనో, యెవ్వండుమనతండ్రికిఁ బురోహితుండో, అట్టి వసిష్ఠమహర్షికి, ఒకదినంబున నెనూఱుకొడుకులుపుట్టియుండి, అట్లొకదినంబుననె విశ్వామిత్త్రునిచేహతులైరి. అని, తాత్పర్యము.

యా చేయం జగతాం మాతా దేవీ లోకనమస్కృతా
అస్యాశ్చ చలనం భూమే ర్దృశ్యతే సత్యసంశ్రవ. ౯

టీక॥ సత్యసంశ్రవ= సత్యప్రతిజ్ఞుఁడవగురాముఁడా! యా=ఏ; దేవి= దేవియు; జగతాం=లోకములకు; మాతా= తల్లియు; లోకనమస్కృతా=లోకములచే నమస్కరింపఁబడినదియునో; అస్యాః=ఈ; భూమేశ్చ=భూమికిని; చలనం=చలనము; దృశ్యతే=చూడఁబడుచున్నది.

సత్యప్రతిజ్ఞుండవగు రాముఁడా ! ఏ దేవి, జగంబులకుఁదల్లియు లోకనమస్కృతయునై యొప్పుచుండునో, ఆ భూమికింగూడఁ, జలనంబు కలుగుచున్నది. అని, తాత్పర్యము.

యౌ ధర్మౌ జగతాం నేత్రౌ యత్ర సర్వం ప్రతిష్ఠితం
ఆదిత్యచంద్రౌ గ్రహణ మభ్యుపేతౌ మహాబలౌ. ౧౦

టీక ॥ యౌ=ఎవ్వరు ; ధర్మౌ=ధర్మస్వరూపులును; జగతాం= ప్ర

పంచములకు; నేత్రౌ=నాయకులునో; యత్ర=ఎవ్వరియందు; సర్వం=అంతయు; ప్రతిష్ఠితం= ప్రతిష్ఠింపఁబడినదో; మహాబలౌ= అధికమయినబలము గల; తౌ(అధ్యాహృతము)= ఆ; ఆదిత్యచంద్రౌ= సూర్యుఁడునుజంద్రుఁడును; గ్రహణం=గ్రహణమును ; అభ్యుపేతౌ(భవంతః)= పొందినవారలగుచున్నారు.

ఎవ్వరుధర్మస్వరూపులో, ఎవ్వరు లోకనాయకులో, ఎవ్వరియందు సమస్తమును బ్రతిష్ఠితమయియుండునో, అట్టిమహాబలశాలులకు చంద్రసూర్యులకుఁగూడ, గ్రహణముకలుగుచున్నది. అని, తాత్పర్యము.

సుమహాంత్యపి భూతాని దేవాశ్చ పురుషర్షభ
న దైవస్య ప్రముంచంతి సర్వభూతాదిదేహినః. ౧౧

టీక॥ పురుషర్షభ=పురుషశ్రేష్ఠుఁడా! సుమహాంతి=పెద్దవగు; భూతాని=భూతంబులును; దేవాశ్చ = దేవతలును; సర్వభూతాదిదేహినః = సమస్తభూతంబులును ఆదిదేహముగాఁగల; దైవస్య=దైవముయొక్క;వశం(అధ్యాహృతము)=అధీనతను ; నప్రముంచంతి=అతిక్రమింపరు.

పురుషశ్రేష్ఠుఁడా! మహాభూతంబులును దేవతలునుగూడ సమస్తభూతాంతర్యామియగుదైవమునతిక్రమింపంజాలరు.అని, తాత్పర్యము.

శక్రాదిష్వపి దేవేషు వర్తమానౌ నయానయౌ
శ్రూయేతే నరశార్దూల న త్వం శోచితు మర్హసి. ౧౨

టీక ॥ నరశార్దూల=పురుషశ్రేష్ఠుఁడవగురాముఁడా! నయానయౌ= సుఖదుఃఖములు; శక్రాదిషు=ఇంద్రుఁడుమొదలుగాఁగల; దేవేషు= దేవతలయందు; వర్తమానౌ=ఉన్నవిగా; శ్రూయేతే=వినఁబడుచున్నవి. త్వం= నీవు; శోచితుం= దుఃఖించుటకు; నార్హసి=తగవు.

పురుషశ్రేష్ఠుఁడవగురాముఁడా! దేవేంద్రుఁడుమొదలుగాఁగలదేవతలయందుఁగూడ, సుఖదుఃఖములుండునట్లు తెలియవచ్చుచున్నది; కాఁబట్టి నీవు దుఃఖింపవలదు. అని, తాత్పర్యము.

సష్టాయామపి వైదేహ్యాం హృతాయామపిచా నఘ
శోచితుం నార్హసే వీర యథా న్యః ప్రాకృత స్తథా. ౧౩

టీక ॥ అనఘ=పాపరహితుండవు; వీర=పరాక్రమశాలివగు రాముఁడా! అన్యః=ఇతరుఁడైన; ప్రాకృతః=క్షుద్రుఁడు; యథా=ఎట్లో; తథా=అట్లు; వైదేహ్యాం=సీత; నష్టాయామపి=నశించినను; హృతామపిచ=అపహరింపఁబడినను; శోచితుం=దుఃఖించుటకు; నార్హసే=తగవు.

పాపరహితుండవు వీరుండవగు రాముఁడా! సీత, నశించిపోయినను, అపహరింపఁబడినను, నీవు, మఱియొకక్షుద్రుఁడెట్లు, దుఃఖించుట యుచితము గాదు. అని, తాత్పర్యము.

త్వద్విధా నహి శోచంతి సతతం సత్యదర్శినః
సుమహాత్స్వపి కృచ్ఛ్రేషు రామా నిర్విణ్ణదర్శనాః. ౧౪

టీక॥ రామ=రాముఁడా! సతతం=ఎల్లప్పుడును; సత్యదర్శినః=యథార్థముఁజూచిన వారలును; అనిర్విణ్ణదర్శనాః=క్లేశములేని వివేకముగలవారలునగు; త్వద్విధాః=నీయట్టివారలు; సుమహాత్సు=మిక్కిలియుగొప్పవగు; కృచ్ఛ్రేషు=కష్టములయందును; నశోచంతిహి=దుఃఖింపరుగదా!

రాముఁడా! ఎల్లప్పుడునుసత్యంబునిదువనివారలునుసాశములేని వివేకముగలవారలునగునీయట్టివారలు, ఎట్టికష్టంబులయందేని,దుఃఖింపరు.

అని, తాత్పర్యము.

తత్త్వతోహి నరశ్రేష్ఠ బుద్ధ్యా సమనుచింతయ
బుద్ధ్యా యుక్తా మహాప్రాజ్ఞా విజానంతి శుభాశుభే. ౧౫

టీక॥ నరశ్రేష్ఠ=పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! తత్త్వతోహి=యథార్థముగా; బుద్ధ్యా=బుద్ధిచేత; సమనుచింతయ=ఆలోచింపుము. బుద్ధ్యా=బుద్ధితో; యుక్తాః=కూడిన; మహాప్రాజ్ఞాః=మహాపండితులు; శుభాశుభే=మంచిచెడుగులను; విజానంతి=తెలిసికొందురు.

స ౬౭

పురుషశ్రేష్ఠుఁడా! చక్కఁగా నీబుద్ధితో నేయాలోచించుకొనుము; ఈకష్టమే లసంభవించెనో నీకే తెలియవచ్చును; అబాధితంబగుబుద్ధితోఁ గూడినమహాపండితులు, బుద్ధిబలంబువలనఁ, దమకు రాఁబోవు మంచిచెడుగులను దెలిసికొందురు. అని, తాత్పర్యము.

అదృష్టగుణదోషాణా మధ్రువాణాం తు కర్మణామ్
నాంతరేణ క్రియాం తేషాం ఫల మిష్టం ప్రవర్తతే. ౧౬

టీక॥ అదృష్టగుణదోషాణాం = చూడఁబడినగుణదోషములుగలవియు; అధ్రువాణాం = నిశ్చయింప రానివియునగు; తేషాం = ఆ, పూర్వజన్మమునందుఁ జేయఁబడిన; కర్మణాం = కర్మముల యొక్క; ఇష్టం = తగిన; ఫలం = ఫలము; క్రియామంతరేణ = అనుష్ఠానములేక; నప్రవర్తతే = కలుగదు.

పూర్వజన్మమునందు, అన్యోన్యఫలములఁగల్గించునట్టి కర్మంబులం జేసియున్నంగాని, యిప్పుడు, ఆయాఫలములు అనుభవమునకు రావు; ఆకర్మముల గుణదోషములు మనకు సాక్షాత్తుగాఁ దెలియవు; ఇట్టివనినిశ్చయింపనశక్యములు; ఫలానుభవముచేతమాత్రమె యూహింపఁదగినవి. అని, తాత్పర్యము.

త్వమేవ హి పురా రామ మా మేవం బహుశో వ్యశాః
అనుశిష్యాద్ధి కోను త్వా మపి సాక్షాద్బృహస్పతిః. ౧౭

టీక॥ రామ = రాముఁడా! త్వమేవ = నీవె; పురా = మున్ను; మాం = నన్నుఁ గూర్చి; ఏవం = ఇట్లు; బహుశః = అనేకవిధములుగా; అన్వశాః = బోధించితివి. సాక్షాద్బృహస్పతిరపి = సాక్షాద్బృహస్పతియయినను; కోను = ఎవ్వఁడు; త్వాం = నిన్ను; అనుశిష్యాద్ధి = బోధింపఁగలఁడు?

రాముఁడా! నీవేమున్ను నాకీసంగతులన్నియు బహువిధముగా బోధించియున్నావు; సాక్షాద్బృహస్పతి యయినను, నీకెవ్వఁడు చెప్పఁగలఁడు. అని, తాత్పర్యము.

బుద్ధిశ్చ తే మహాప్రాజ్ఞ దేవైరపి దురన్వయా
శోకేనాభిప్రసుప్తం తే జ్ఞానం సంబోధయా మ్యహమ్. ౧౮

టీక॥మహాప్రాజ్ఞ = మహాపండితుఁడా! తే=నీయొక్క; బుద్ధిశ్చ=బుద్ధియు; దేవైరపి=దేవతలచేతనుఁగూడ; దురన్వయా= తెలిసికొనఁగూడనిది. అహం= నేను; శోకేన=దుఃఖముచేత; అభిప్రసుప్తం=నిదురనొందిన,మఱుఁగుపడిన; తే= నీయొక్క; జ్ఞానం=జ్ఞానమును; సంబోధయామి=మేలుకొలుపుకొనుచున్నాను.

మహాపండితుఁడవగు రాముఁడా! నీ బుద్ధిని దేవతలుగూడఁదెలిసికొనఁజాలరు; అయితే , నీజ్ఞానమిప్పుడు దుఃఖము చేమఱుఁగుపడియున్నదికావున, నేను దానిజ్ఞాపకపఱచుచున్నానుగాని వేఱుగాదు. అని, తాత్పర్యము.

దివ్యంచ మానుషం చ త్వ మాత్మనశ్చ పరాక్రమమ్
ఇక్ష్వాకువృషభా వేక్ష్య యతస్వ ద్విషతాం వధే. ౧౯

టీక॥ఇక్ష్వాకువృషభ=ఇక్ష్వాకుశ్రేష్ఠుఁడవగు రాముఁడా! త్వం=నీవు; దివ్యంచ=స్వర్గమునందలి ప్రాణివర్గమును; మానుషంచ= మనుష్యలోకమునందలి ప్రాణివర్గమును; ఆత్మనః=నీయొక్క; పరాక్రమంచ=పరాక్రమమును; అవేక్ష్య=చూచి; ద్విషతాం=శత్రువులయొక్క; వధే=చంపుటనిమిత్తము; యతస్వ=ప్రయత్నింపుము.

ఇక్ష్వాకువంశమునందుఁబుట్టినవారలలో శ్రేష్ఠుఁడవగు రాముఁడా! నీవు, స్వర్గమునందలి దేవగంధర్వాదిప్రాణివర్గమును మనుష్యలోకంబునందలి బ్రాహ్మణక్షత్రియాదిప్రాణివర్గంబును, అవధ్యముగుటను, సమస్తలోకసంహారసమర్థంబగునీపరాక్రమంబునుంజూచి, శత్రువులవధించుటకుఁబ్రయత్నింపుము. అని, తాత్పర్యము.

కిం తేన సర్వనాశేన కృతేన పురుషర్షభ
తమేవ త్వం రిపుం పాపం విజ్ఞాయో ద్ధతుమర్హసి. ౨౦

టీక॥ పురుషర్షభ=పురుషశ్రేష్ఠుఁడా! తేన= ఆశత్రువుచేత; కృతేన=




చేయఁబడిన; సర్వనాశేన=సమస్తనాశముచేత; కిం = ఏమిప్రయోజనము? త్వం=నీవు; పాపం = పాపిష్ఠుండగు; తం=ఆ; రిపుమేవ= శత్రువునే; విజ్ఞాయ=తెలిసికొని; ఉద్ధర్తుం=నశింపఁజేయుటకు; అర్హసి= తగుదువు.

పురుషశ్రేష్ఠుడా! ఆరాక్షసుండు, సీతను మాత్రమెగాదు; ఇంకనేమిచేసినను ఏమికాఁగలదు? నీవు, పాపిష్ఠుండగు ఆశత్రువుని తెలిసికొని వధింపుము. అని, లక్ష్మణుండు, రామునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
షట్షష్టితమస్సర్గః.
స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, షట్షష్టితమసర్గ టీక,
ముగిసినది.

---

శ్రీ.
సప్తషష్టితమసర్గప్రారంభః.

పూర్వజోఽప్యుక్తమాత్రస్తు లక్ష్మణేన సుభాషితం
సారగ్రాహీ మహాసారం ప్రతిజగ్రాహ రాఘవః. ౧

టీక॥ సారగ్రాహీ=సారమును గ్రహించునట్టి; రాఘవః=రాముఁడు; పూర్వజోఽపి=ముందుపుట్టినవాఁడైనను; లక్ష్మణేన=లక్ష్మణునిచేత; సుభాషితం=చక్కఁగాఁజెప్పఁబడినదియు; మహాసారం=అధికమయిన సారముగలదియైన మాటను; ఉక్తమాత్రస్తు=చెప్పఁబడినవాఁడైనంతనె; ప్రతిజగ్రాహ=అంగీకరించెను.

రాముండు జ్యేష్ఠుండైనను సారగ్రాహియగుటవలనఁ, దమ్ముఁడగు లక్ష్మణుండు, సారయుక్తంబును యుక్తియుక్తంబునగు నీమాటను జెప్పఁగానే, యంగీకరించెను. అని, తాత్పర్యము.




స ౬౪

సన్నిగృహ్య మహాబాహుః ప్రవృత్తం కోపమాత్మనః
అవష్టభ్య ధనుశ్చిత్రం రామో లక్ష్మణ మబ్రవీత్. ౨

టీక॥ మహాబాహుః= పెద్దచేతులు గల; రామః=రాముఁడు; ప్రవృత్తం=పుట్టిన; ఆత్మనః=తనయొక్క; కోపం=కోపమును; సన్నిగృహ్య=నిగ్రహించుకొని; చిత్రం=చిత్రవర్ణమయిన; ధనుః=ధనుస్సును; అవష్టభ్య=పట్టుకొని; లక్ష్మణం=లక్ష్మణునిఁగూర్చి; అబ్రవీత్=చెప్పెను.

మహాబాహుండగు రాముఁడు, మనకుఁబుట్టిన కోపమును నిగ్రహించుకొని, కాంచనచిత్రంబగు ధనుస్సుపైనానుకొని, లక్ష్మణునితో నిట్లనియెను.

అని, తాత్పర్యము.

కిం కరిష్యావహే వత్స క్వా గచ్ఛావ లక్ష్మణ
కేనోపాయేన గచ్ఛేయం సీతా మితి విచింతయ. ౩

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! వత్స=బిడ్డఁడా! కిం=ఏమి; కరిష్యావహే=చేయుదము? క్వా=ఎచ్చటికి; గచ్ఛావ=పోవుదము? కేన=ఏ; ఉపాయేన=ఉపాయముచేత; సీతాం=సీతను; గచ్ఛేయం=పొందుదును? ఇతి=దీనిని; విచింతయ=ఆలోచింపుము.

లక్ష్మణుఁడా! ఏమిచేయుదము? ఎచ్చటికిఁబోవుదము? సీతనుబొందునుపాయమేదో ఆలోచింపుము. అని, రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

తం తథా పరితాపార్తం లక్ష్మణో రామ మబ్రవీత్

టీక॥ లక్ష్మణః = లక్ష్మణుఁడు; తథా=అట్లు; పరితాపార్తం = దుఃఖముచేఁబీడితుండగు; రామం= రామునిఁగూర్చి; అబ్రవీత్=చెప్పెను.

లక్ష్మణుం, డట్లు పరమదుఃఖితుండై యున్న రాముంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఇద మేవ జనస్థానం త్వ మన్వేషితు మర్హసి. ౪
రాక్షసై ర్బహుభిః కీర్ణం నానాద్రుమ లతాయుతం

స౯౭




టీక॥ త్వం=నీవు; రాక్షసైః= రాక్షసులచే; బహుభిః = పెక్కండ్రిచే; కీర్ణం=వ్యాపింపఁబడినదియు; నానాద్రుమలతాయుతం=నానావిధములయినవృక్షములతోను దీఁగెలతోనుగూడినదియునగు; ఇదం=ఈ; జనస్థానమేవ=జనస్థానమునే; అన్వేషితుం= వెదకుటకు; అర్హసి=తగుదువు.

నీవు, పెక్కండ్రిరాక్షసులతోఁగూడినదియు నానావిధరమణీయవృక్షలతలతో నొప్పుచున్నదియునగునీజనస్థానమునే వెదకవలయును. అని, తాత్పర్యము.

సంతీహ గిరిదుర్గాణి నిర్దరాః కందరాణిచ. ౫
గుహాశ్చ వివిధా ఘోరా నానామృగగణాకులాః
ఆవాసాః కిన్నరాణాంచ గంధర్వభవనానిచ. ౬

టీక॥ ఇహ= ఈజనస్థానమునందు; గిరిదుర్గాణి= పర్వతములందలిదుర్గమప్రదేశములును; నిర్దరాః= విరిసిన పెనుఱాలును; కందరాణిచ=పాషాణసంధులును; వివిధాః=నానావిధములయిన; ఘోరాః=భయంకరములగు; నానామృగగణాకులాః = నానావిధమృగముల సమూహములచే నిండినవియునగు; గుహాశ్చ=గుహలును; కిన్నరాణాం=కిన్నరులయొక్క; ఆవాసాః=వాసస్థానములును ; గంధర్వభవనానిచ = గంధర్వగృహములును; సంతి= ఉన్నవి.

ఈజనస్థానమునందు, దుర్గమప్రదేశములును విరిసిన ఱాళ్లనడుమనున్నయుండు ప్రదేశములును పాషాణసంధులును నానావిధంబులును నానావిధక్రూరమృగంబులతోఁగూడియుండుటచే భయంకరములునగు గుహలును, కిన్నరగృహములును గంధర్వగృహములును, ఉన్నవి. అని, తాత్పర్యము.

తాని యుక్తో మయాసార్ధం త్వ మన్వేషితు మర్హసి

టీక॥ త్వం=నీవు; యుక్తః= ఎచ్చరికగలవాఁడవై; మయాసార్ధం = నాతోఁగూడ; తాని=ఆస్థలములను; అన్వేషితుం=వెదకుటకు; అర్హసి= తగుదువు.

ఆస్థలంబులన్నింటిని, నీవు, నాతోఁ




గూడఁజక్కఁగా వెదకుము. అని, తాత్పర్యము.

త్వ ద్విధా బుద్ధిసంపన్నా మ్మహాత్మానో నరర్షభ. ౭
ఆపత్సు న ప్రకంపంతే వాయు వేగై రివాచలాః

టీక॥ నరర్షభ=పురుషశ్రేష్ఠుఁడా! బుద్ధిసంపన్నాః= బుద్ధితోఁగూడినవారలును; మహాత్మానః= అధికమయినధైర్యముగలవారలునగు; త్వద్విధాః= నీయట్టివారలు; వాయువేగైః=గాలియొక్క వేగములచేత; అచలాఇవ=పర్వతములువలె; ఆపత్సు=ఆపదలయందు;న ప్రకంపంతే=చలింపరు.

పురుషోత్తముఁడవగు రాముఁడా! నీయట్టి బుద్ధిమంతులును మహాత్ములునగువారలు,వాయువేగంబునఁబర్వతంబులుచలింపనట్లు ఎట్టియాపదలందేని, భయపడరు. అని, లక్ష్మణుండు రామునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యుక్త స్త ద్వనం సర్వం విచచార సలక్ష్మణః. ౮
క్రుద్ధో రామ శ్శరం ఘోరం సంధాయ ధనుషి క్షురం

టీక॥ రామః=రాముఁడు; ఇతి=ఇట్లు; ఉక్తః= చెప్పఁబడినవాఁడై; క్రుద్ధః=కోపమునొందినవాఁడై;ఘోరం= భయంకరమయిన; క్షురం= అర్ధచంద్రాకారమగు;శరం=బాణమును;ధనుషి=వింటియందు;సంధాయ = సంధించి; సలక్ష్మణః= లక్ష్మణునితోఁగూడినవాఁడై; తత్=ఆ; వనం=అడవిని; సర్వం=అంతయు;విచచార=తిరిగెను.

రాముఁడు,ఇట్లు,లక్ష్మణునిమాటను విని,కోపంబున, భయంకరంబగునర్ధచంద్రాకారబాణంబువింటంగూర్చి, లక్ష్మణునితోడం గూడి యవ్వనం బంతయుఁదిరిగెను.అని,తాత్పర్యము.

తతః పర్వత కూటాభం మహాభాగం ద్విజోత్తమం. ౯
దదర్శ పతితం భూమౌ క్షతజార్ద్రం జటాయుషం

టీక॥ తతః=అంత; పర్వతకూటాభం= పర్వతశిఖరముయొక్క కాంతివం

టికాంతిగలవాఁడును; మహాభాగం= పూజ్యమయిన యదృష్టము గలవాఁడును; ద్విజోత్తమం= పక్షిశ్రేష్ఠుండును; భూమౌ=నేలయందు; పతితం=పడినవాఁడును; క్షతజార్ద్రం=నెత్తుటందడిసినవాఁడునగు; జటాయుషం= జటాయువును; దదర్శ=చూచెను.

అంత, రాముండు, పర్వతశిఖరాకారుండును నెత్తుటందోఁగుచు నేలంబడియున్నవాఁడును పక్షిశ్రేష్ఠుండును మహాభాగుండునగు జటాయువుం జూచెను. అని, తాత్పర్యము.

తం దృష్ట్వా గిరిశృంగాభం రామో లక్ష్మణ మబ్రవీత్. ౧౦

టీక॥ రామః=రాముఁడు; గిరిశృంగాభం= పర్వతశిఖరముయొక్క కాంతివంటికాంతిగల; తం= ఆజటాయువును; దృష్ట్వా-చూచి; లక్ష్మణం=లక్ష్మణుని గూర్చి; అబ్రవీత్=చెప్పెను.

రాముండు, పర్వతశిఖరాకారుండగు నాజటాయువుంజూచి, లక్ష్మణుని కిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

అనేన సీతా వైదేహీ భక్షితా నాత్ర సంశయః

టీక॥ అనేన=ఇతనిచేత; వైదేహీ= జనకమహారాజుకొమార్తెయగు; సీతా=సీత; భక్షితా=భక్షింపఁబడినది. అత్ర=ఇందు; సంశయః=సందేహము; న=లేదు.

జనకమహారాజపుత్త్రియగు సీతను, ఈతఁడె భక్షించియుండును; సందేహము లేదు. అని, తాత్పర్యము.

గృధ్రరూప మిదం రక్షో వ్యక్తం భవతి కాననే. ౧౧
భక్షయిత్వా విశాలాక్షీ మాస్తే సీతాం యథాసుఖం

టీక॥ ఇదం=ఈ; రక్షః= రాక్షసుఁడు; గృధ్రరూపం= గద్దయొక్కరూపమువంటిరూపముగలవాఁడై; కాననే= అడవియందు; భవతి=ఉన్నాఁడు. వ్యక్తం=స్పష్టము. విశాలాక్షీం=వెడల్పులయినకన్నులుగల; సీతాం=సీతను; భక్షయిత్వా=భక్షించి; యథాసుఖం=సుఖముగా; ఆస్తే=ఉన్నాఁడు.

ఈరాక్షసుండు, గద్దరూపముదాల్చి యీవనంబుననున్నాఁడు; నిశ్చయము; విశాలంబులగుకన్నులుగల సీతనుభక్షించి, సుఖంబుగాఁ గూర్చుండియున్నాఁడు. అని, తాత్పర్యము.

ఏనం వధిష్యే దీప్తాస్యైర్ఘోరై ర్బాణై రజిహ్మగైః. ౧౨

టీక॥ దీప్తాస్యైః=మండుచున్నముఖములుగలవియు; ఘోరైః=భయంకరములును; అజిహ్మగైః= వంకరగాఁబోనివియునగు; బాణైః=బాణములచేత; ఏనం=ఈరాక్షసుని; వధిష్యే=వధించెదను.

దేదీప్యమానంబులగు ముఖంబులుగలవియు భయంకరములునులక్ష్యంబు దప్పనివియునగుబాణంబుల సీతనివధించెదను. అని, రాముండు, లక్ష్మణునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వా భ్యాపత ద్గృధ్రం సంధాయ ధనుషి క్షురం
క్రుద్ధో రామ స్సముద్రాంతాం కంపయన్నివ మేదినీమ్. ౧౩

టీక॥ రామః=రాముఁడు; ఇతి=అని; ఉక్త్వా=చెప్పి; క్రుద్ధః=కోపము నొందినవాఁడై; ధనుషి= వింటియందు; క్షురం=అర్ధచంద్రబాణంబును; సంధాయ=సంధించి; సముద్రాంతాం=సముద్రములె యెల్లలుగాఁగల ; మేదినీం= భూమిని; కంపయన్నివ=చలింపఁజేయువాఁడువలె; గృధ్రం=గద్దనుగూర్చి; అభ్యాపతత్=పోయెను.

రాముండు, ఇట్లుచెప్పి, యంతంగుపితుండై, వింట నర్ధచంద్రాకారబాణంబుగూర్చి, సముద్రపర్యంతంబగు భూమియంతయు, పాదాఘాతంబున వడంక, నాగద్దపైకిఁబోయెను.

అని, తాత్పర్యము.

తం దీనం దీనయా వాచా సఫేనం రుధిరం వమన్
అభ్యభాషత పక్షీతు రామం దశరథాత్మజం. ౧౪

టీక॥ పక్షీతు = గృధ్రంబును; దీనం= దుఃఖితుండగు; దశరథాత్మజం=

దశరథునికుమారుఁడైన; తం=ఆ; రామం=రామునిఁగూర్చి ; దీనయా=గద్గదముతోఁగూడిన; వాచా= మాటచేత; సఫేనం=నురుఁగుతోఁగూడిన; రుధిరం=నెత్తురును; వమన్=క్రక్కుచు; అభ్యభాషత=చెప్పెను.

ఆజటాయువు, దుఃఖితుండగు దశరథమహారాజపుత్రుని రామునిఁజూచి,నురుగును నెత్తురును గ్రక్కుచు, దీనవాక్యంబున, నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

యా మోషధి మివాయుష్మ న్నన్వేషసి మహావనే
సా దేవీ మమ చ ప్రాణా రావణేనోభయం హృతం. ౧౫

టీక॥ ఆయుష్మన్= అధికమయిన యాయుస్సుగలరాముఁడా! యాం=ఎవ్వతెను; ఓషధిమివ=మూలికనువలె ; మహావనే=మహారణ్యమునందు; అన్వేషసి=వెదకుచున్నావో ; సా=ఆ; దేవీ=సీతాదేవియు; మమ=నాయొక్క; ప్రాణాశ్చ = ప్రాణములును ; ఉభయం=రెండును; రావణేన= రావణునిచేత; హృతం=అపహరింపఁబడినది.

దీర్ఘాయుష్మంతుండవగు రాముఁడా! నీవు, ఎవ్వతెను, దివ్యౌషధినివలె, మహావనంబున వెదకుచున్నావో ; ఆసీతాదేవిని, నాప్రాణంబులను, రెంటిని, రావణుండపహరించెను.

అని, తాత్పర్యము.

త్వయా విరహితా దేవీ లక్ష్మణేనచ రాఘవ
హ్రియమాణా మయా దృష్టా రావణేన బలీయసా. ౧౬

టీక॥ రాఘవ=రాముఁడా! దేవీ=సీతాదేవి; త్వయా= నీచేతను; లక్ష్మణేనచ=లక్ష్మణునిచేతను;విరహితా=విడువఁబడినదై ; బలీయసా= బలిష్ఠుండగు; రావణేన = రావణునిచేత; హ్రియమాణా = అపహరింపబడుచున్నదై; మయా=నాచేత; దృష్టా= చూడఁబడినది.

రాముఁడా!సీతాదేవి, నీవును లక్ష్మణుండును లేకుండునప్పుడు , బలవంతుండగు రావణునచేత నపహరింపఁబడుచుండుటను,జూచినాను.

అని,తాత్పర్యము.

సీతా మభ్యవపన్నోహం రావణశ్చ రణే మయా
విధ్వంసిత రథశ్చాత్ర పాతితో ధరణీతలే. ౧౭

టీక॥ అహం=నేను; సీతాం=సీతను గూర్చి; అభ్యవపన్నః=పోయియుంటిని; మయా=నాచేత; రావణశ్చ= రావణుండును; రణే=యుద్ధమునందు; అత్ర= ఇచ్చట; విధ్వంసితరథశ్చ=విఱువఁబడిన రథముగలవాఁడునై; ధరణీతలే=భూమియందు; పాతితః=పడఁద్రోయఁబడినాఁడు.

నేనంత, సీతయొద్దకుఁబోయి, యుద్ధంబున, ఈస్థలంబున నే రావణునిరథంబును భగ్నంబు గావించి, యతనిని నేలపడఁద్రోసితిని. అని, తాత్పర్యము.

ఏత దస్య ధనుర్భగ్నం మే తదస్య శరావరమ్
అయమస్య రథో రామ భగ్నస్సాంగ్రామికో మయా. ౧౮

టీక॥ రామ= రాముఁడా! భగ్నం= విఱువఁబడిన; అస్య=ఇతనియొక్క; ధనుః=ధనుస్సు; ఏతత్=ఇది. అస్య= ఇతనియొక్క; శరావరం=కవచము; ఏతత్=ఇది. మయా=నాచేత; భగ్నః= విఱువఁబడిన; సాంగ్రామికః=యుద్ధార్థమయిన; అస్య=ఈతనియొక్క; రథః=రథము; అయం=ఇది.

రాముఁడా! నాచేవిఱువఁబడిన రావణునిధనుస్సు, ఇదిగోయున్నది; కవచమిదిగో; యుద్ధంబున నాచే భగ్నమయిన రావణుని యుద్ధార్హ రథంబిదిగో చూడుము. అని, తాత్పర్యము.

అయంతు సారథి స్తస్య మత్పక్షనిహతో యుధి

టీక॥ తస్య=ఆ రావణునియొక్క; అయం=ఈ; సారథిస్తు=సారథియు; యుధి=యుద్ధమునందు; మత్పక్షనిహతః= నారెక్కలచేవధింపఁబడినాఁడు.

ఇతఁడు, రావణునిసారథి; ఇతండు యుద్ధంబున నాపక్షఘాతంబునం గూలెను. అని, తాత్పర్యము.

పరిశ్రాంతస్య మే పక్షౌ ఛిత్త్వా ఖడ్గేన రావణః. ౧౯

సీతా మాదాయ వైదేహీ ముత్పపాత విహాయసమ్

టీక॥ రావణ = రావణుఁడు; పరిశ్రాన్తస్య=అలసిన; మే=నాయొక్క; పక్షౌ=రెక్కలను; ఖడ్గేన=కత్తిచేత; ఛిత్త్వా=నఱికి; వైదేహీం=జనకమహారాజుకొమాళ్తెయగు ; సీతాం=సీతను; ఆదాయ=తీసికొని; విహాయసం=ఆకాశమునుగూర్చి; ఉత్పపాత = ఎగిరెను.

రావణుండు, నేనలసియుండఁగా నాపక్షంబులను ఖడ్గంబుచే ఖండించి, జనకమహారాజపుత్రియగు సీతందీసికొని యాకాశమార్గంబునం బోయెను.

అని, తాత్పర్యము.

రక్షసా నిహతం పూర్వం నమాం హంతుం త్వ మర్హసి. ౨౦

టీక॥ త్వం=నీవు ; పూర్వం=మున్ను; రక్షసా= రాక్షసునిచేత; నిహతం=చంపఁబడిన; మాం=నన్ను; హంతుం=చంపుటకు; నార్హసి=తగవు.

మున్ను నేనొకమారు రాక్షసునిచే వధింపఁబడియున్నాను; నీవుమఱలనన్ను వధింపకుము. అని, జటాయువు రామునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

రామ స్తస్య తువిజ్ఞాయ బాష్పపూర్ణముఖ స్తదా
ద్విగుణీకృత తాపార్త స్సీతా సక్తాం ప్రియాం కథాం. ౨౧

టీక॥ తదా=అప్పుడు; రామః=రాముఁడు; తస్య=ఆజటాయువుయొక్క; సీతాసక్తాం = సీతనుసంబంధించినదియు; ప్రియాం=ఇష్టమయినదియునగు; కథాం=మాటను; విజ్ఞాయతు=తెలిసినంతనె; బాష్పపూర్ణముఖః=కన్నీళ్లచే నిండినముఖముగలవాఁడును; ద్విగుణీకృతతాపార్తః = రెండింతలుగాఁజేయఁబడిన సంతాపముచేఁ బీడింపఁబడినవాఁడును; అభూత్ (అధ్యాహృతము)=ఆయెను.

అప్పుడు, రాముండు, జటాయువుచెప్పినసీతనుగుఱించిన ప్రియమైన మాటవంత యాకర్ణింతనె, ముఖంబునిండఁగ న్నీళ్లుగాఱ రెండింతల దుఃఖమునొంది, యాతురుండయ్యెను.

అని, తాత్పర్యము.

గృధ్రరాజం పరిష్వజ్య పరిత్యజ్య మహద్ధనుః
నిపపాతా వశో భూమౌ రురోద సహలక్ష్మణః. ౨౨

టీక॥ రామః (అధ్యాహృతము)= రాముడు; గృధ్రరాజం=గద్దలఱేనిని; పరిష్వజ్య=కవుఁగిలించుకొని; మహత్=గొప్పదగు; ధనుః=వింటిని; పరిత్యజ్య=విడిచి; అవశః=పరవశుఁడై; భూమౌ=నేలయందు; నిపపాత=పడెను. సహలక్ష్మణః= లక్ష్మణునితోఁగూడినవాఁడై; రురోద=ఏడ్చెను.

రాముఁడంత, జటాయువుఁ గౌఁగిలించుకొని, చేతనుండు మహాధనుస్సును జాఱవిడిచి, దుఃఖపరవశుండై నేలంబడి, లక్ష్మణునితోఁగూడ, రోదనం బుగావించెను. అని, తాత్పర్యము.

ఏక మేకాయనే దుర్గే నిశ్శ్వసంతం కథంచన
సమీక్ష్య దుఃఖితతరో రామ స్సౌమిత్రి మబ్రవీత్. ౨౩

టీక॥ ఏకం=ఒకరుఁడును; ఏకాయనే = ఒకరునిమార్గమునందు, ఒకరుఁడు నడువఁదగిన మార్గమునందనుట; దుర్గే=ఘోరరాసిప్రదేశమునందు; కథంచన=అతిప్రయాసమున; నిశ్వసంతం =నిట్టూర్పులువుచ్చుచున్న జటాయువును; సమీక్ష్య= చూచి; రామః రాముడు; దుఃఖితతరః=మిక్కిలి దుఃఖమునొందినవాఁడై; సౌమిత్రిం=లక్ష్మణునిగూర్చి; అబ్రవీత్=చెప్పెను.

జటాయువు, ఏకాకిగా మిక్కిలియిఱుకైన దారియందు, దుర్గమప్రదేశంబునహతుండై యతిప్రయాసంబున నిట్టూర్పులు వుచ్చుచుండుటంజూచి, రాముండు,మిక్కిలి దుఃఖితుండై, లక్ష్మణుంజూచి యిట్లనిచెప్పెను.

అని, తాత్పర్యము.

రాజ్యా ద్భ్రంశో వనే వాస స్సీతా నష్టా ద్విజో హతః
ఈదృశీయం మమాలక్ష్మీ ర్నిర్దహేదపి పావకమ్. ౨౪

టీక॥ రాజ్యాత్=రాజ్యంబుననుండి; భ్రంశః=పడుట; వనే=అడవియందు; వాసః=ఉనికి; సీతా=సీత; నష్టా=నశించినది. ద్విజః=జటాయువు; హ

స ౬౭

తః=వధింపఁబడినాఁడు. ఈదృశీ=ఇట్టి; మమ=నాయొక్క; ఇయం=ఈ; అలక్ష్మీః=దౌర్భాగ్యము; పావకమపి = అగ్నిహోత్రునైనను; నిదహేత్=దహించును.

రాజ్యభ్రంశము, వనవాసము, సీతయపహరింపఁబడుట, జటాయువుహతుఁడగుట, ఇట్టినాదౌర్భాగ్యము, అగ్నిహోత్రునైనను దహించును.

అని, తాత్పర్యము.

సంపూర్ణమపిచే దద్య ప్రవిశేయం మహోదధిమ్
సోఽపి నూనం మమాలక్ష్మ్యా విశుష్యేత్సరితాం పతిః. ౨౪

టీక॥ అద్య=ఇప్పుడు; సంపూర్ణం=నిండిన; మహోదధిమపి=మహాసముద్రమునుగూడ; ప్రవిశేయంచేత్=ప్రవేశింతునేని; సః=ఆ; సరితాం=నదులకు; పతిరపి=ప్రభువైనసముద్రముగూడ; మమ=నాయొక్క; అలక్ష్మ్యా=దౌర్భాగ్యముచేత; విశుష్యేత్=ఎండును.

నూనం=నిశ్చయము.

ఇప్పుడు, నేనునిండియున్నసముద్రములోఁ బ్రవేశించితిని, నదీపతియగుసముద్రముగూడ, నాదౌర్భాగ్యముచే, ఎండిపోవును. ఇది నిశ్చయము.

అని, తాత్పర్యము.

నాస్త్యభాగ్యతరో లోకే మత్తోఽస్మిన్ సచరాచరే
యేనేయం మహతీ ప్రాప్తా మయా వ్యసనవాగురా. ౨౫

టీక॥ యేన=ఏ; మయా=నాచేత; మహతీ=గొప్పదగు; ఇయం=ఈ; వ్యసనవాగురా = దుఃఖములవలన; ప్రాప్తా=పొందఁబడినదో; తస్మాత్ (అధ్యాహృతము)=అట్టి; మత్తః=నాకన్నను; అభాగ్యతరః = అధికమయినదౌర్భాగ్యముగలవాఁడు; అస్మిన్=ఈ; సచరాచరే= జంగమస్థావరములతోఁగూడిన; లోకే=లోకమునందు; నాస్తి=లేఁడు.

ఇట్టిపరంపరగానుండు దుఃఖంబులవలలోఁజిక్కియున్న నాకన్నను అధికదౌర్భాగ్యుండు, జంగమస్థావరసహితంబగు నీప్రపంచంబున నెచ్చటనులేఁడు. అని, తాత్పర్యము.

అయం పితృవయస్యో మే గృధ్రరాజో జరాన్వితః

శేతే వినిహతో భూమౌ మమ భాగ్యవిపర్యయాత్. ౨౭

టీక॥ మే=నాయొక్క; పితృవయస్యః= తండ్రిగారి స్నేహితుండును; జర్ఘాన్వితః = ముసలితనముతోఁగూడిన వాఁడునగు; అయం=ఈజటాయువు; మమ = నాయొక్క; భాగ్యవిపర్యయాత్=భాగ్యముయొక్క వైపరీత్యమువలన; భూమౌ=నేలయందు; వినిహతః= చంపఁబడినవాఁడై; భూమౌ=నేలయందు; శేతే=పరుండియున్నాఁడు.

నాతండ్రిగారికి మిత్రుండును వృద్ధుండునగు నీజటాయువు నాదౌర్భాగ్యమువలన, నిహతుండై నేలంబడియున్నాఁడు. అని, రాముండు, లక్ష్మణునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యేవ ముక్త్వా బహుశో రాఘవ స్సహలక్ష్మణః
జటాయుషంచ పస్పర్శ పితృస్నేహం విదర్శయన్. ౨౮

టీక॥ రాఘవః=రాముఁడు; ఇత్యేవం=అనియిట్లు; బహుశః=అధికముగా; ఉక్త్వా=చెప్పి; సహలక్ష్మణః=లక్ష్మణునితోఁ గూడినవాఁడై; పితృస్నేహం= తండ్రిస్నేహమును; విదర్శయన్=చూపుచు; జటాయుషంచ = జటాయువును; పస్పర్శ= తాఁకెను.

రాముఁడు, ఈప్రకారముననేకవిధంబులం జెప్పి, లక్ష్మణునితోఁగూడఁ, దమతండ్రిపైఁ జూపవలసిన స్నేహగౌరవంబులు చూపుచు, జటాయువు దేహంబంతయుం దడవెను.

అని, తాత్పర్యము.

నికృత్తపక్షం రుధిరావసిక్తం
స గృధ్రరాజం పరిరభ్య రామః
క్వ మైథిలీ ప్రాణసమా మమేతి
విముచ్య వాచం నిపపాత భూమౌ. ౨౯

టీక॥సః=ఆ; రామః=రాముఁడు; నికృత్తపక్షం=ఛేదింపఁబడిన ఱెక్కలుగలవాఁడును; రుధిరావసిక్తం=నెత్తురుచేఁదడుపఁబడినవాఁడునగు; గృధ్రరా

జం=జటాయువును; పరిరభ్య=కవుఁగిలించుకొని; మమ=నాయొక్క; ప్రాణసమా=ప్రాణములతో సమానురాలైన; మైథిలీ=సీత; క్వ=ఎచ్చటః ఇతి=అని; వాచం=మాటను; విముచ్య=విడిచి; భూమౌ=నేలయందు; ప్రపాత=పడెను.

ఆరాముండు, అట్లుఛిన్నపక్షుండై నేలంబడి దొరలుచున్న జటాయువుం గవుఁగిలించుకొని, "నాప్రాణసమానురాలైనసీత యెచ్చట" అని, చెప్పి, శోకపరవశుండై నేలంబడెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అరణ్యకాండే, సప్తషష్టితమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అరణ్యకాండ సప్తషష్టితమసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

అష్టషష్టితమసర్గప్రారంభః.

రామ స్సంప్రేక్ష్య తం గృధ్రం భువి రౌద్రేణ పాతితమ్
సౌమిత్రిం మిత్రసంపన్న మిదం వచన మబ్రవీత్. ౧

టీక॥ రామః=రాముఁడు; రౌద్రేణ=భయంకరుండగు రావణుని చేత; భువి=నేలయందు; పాతితం=పడఁద్రోయఁబడిన; తం=ఆ; గృధ్రం=జటాయువును; సంప్రేక్ష్య=చూచి; మిత్రసంపన్నం=మిక్కిలియు స్నేహితుండగు; సౌమిత్రిం=లక్ష్మణునిఁగూర్చి; ఇదం=ఈ; వచనం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

రాముఁడు, భయంకరుండగు రావణునిచేత వధింపఁబడి నేలంబడియున్న జటాయువుంజూచి తనకుఁ బరమ మిత్రుండగు లక్ష్మణుఁతో నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

మమాయం నూన మర్థేషు యతమానో విహంగమః
రాక్షసేన హత స్సంఖ్యే ప్రాణాం స్త్యక్ష్యతి దుస్త్యజాన్. ౨

టీక॥ అయం=ఈ; విహంగమః=పక్షి యయినజటాయువు; మమ=నాయొక్క; అర్థేషు= కార్యములనిమిత్తము; యతమానః =ప్రయత్నించుచు; సంఖ్యే=యుద్ధమునందు; రాక్షసేన=రాక్షసునిచే; హతః=చంపఁబడినవాఁడై; దుస్త్యజాన్= విడువరాని; ప్రాణాన్=ప్రాణములను; త్యక్ష్యతి=విడువఁగలఁడు. నూనం=నిశ్చయము.

ఈజటాయువు , నాకార్యమునిమిత్తమయి, యుద్ధముచేసి, యుద్ధంబునరాక్షసునిచేహతుండై, విడువరాని ప్రాణంబుల,నిప్పుడువిడువఁగలఁడు.

అని, తాత్పర్యము.

అయ మస్య శరీరేస్మిన్ ప్రాణో లక్ష్మణ విద్యతే
తథాహి స్వరహీనోయం విక్లబ స్సముదీక్ష్యతే. ౩

టీక॥ లక్ష్మణ= లక్ష్మణుఁడా! అస్య=ఈతనియొక్క; అస్మిన్=ఈ; శరీరే=దేహమునందు; అయం = ఈ; ప్రాణః=ప్రాణము; విద్యతే=ఉన్నది. తథాహి=అదియుక్తమె. అయం=ఇతఁడు; స్వరహీనః=హీనమయినధ్వనిగలవాఁడై; విక్లబః=పరవశుఁడుగా; సముదీక్ష్యతే=చూడఁబడుచున్నాఁడు.

లక్ష్మణుఁడా! ఈజటాయువుదేహమునందు,ఇఁకనుప్రాణంబున్నది;ఈతఁడుహీనస్వరుండుగాను పరవశుఁడుగాను అగపడుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

జటాయో యది శక్నోషి వాక్యం వ్యాహరితుం పునః
సీతా మాఖ్యాహి భద్రం తే వధ మాఖ్యాహి చాత్మనః. ౪

టీక॥జటాయో=జటాయువా! పునః=ఇఁకను; వాక్యం=మాటను; వ్యాహరితుం=చెప్పుటకు; శక్నోషి యది=చాలుదువేని; సీతాం=సీతను; ఆఖ్యాహి=చెప్పుము. తే=నీకు;భద్రం=మంగళము; అస్తు(అధ్యాహృతము)=అగుఁగాక. ఆత్మనః=తనయొక్క; వధంచ=వధమును; ఆఖ్యాహి=చెప్పుము.

జటాయువా! నీకు, మాటచెప్పుటకు శక్తిగలదేని, సీతసంగతిచెప్పుము; నీకు మంగళమగుఁగాక; నిన్ను రాక్షసుఁడువధించినసంగతియుంజెప్పుము.

అని, తాత్పర్యము.

కిన్నిమిత్తో హర త్సీతాం రావణ స్తస్య కిం మయా
అపరాధంతు యం దృష్ట్వా రావణేన హృతా ప్రియా. ౫

టీక॥ రావణః=రావణుఁడు; కిన్నిమిత్తః=ఏమికారణముగాఁగలవాఁడై; సీతాం=సీతను; అహరత్=హరించెను? యం=ఏ; అపరాధంతు=అపరాధమును; దృష్ట్వా=చూచి; రావణేన=రావణునిచేత; ప్రియా=ప్రియురాలు; హృతా=అపహరింపఁబడినదో; తత్ (అధ్యాహృతము)=అట్టి; కిం=ఏమికార్యమును; తస్య=అతనికి; మయా=నాచేత; కృతం(అధ్యాహృతము)= చేయఁబడినది?

రావణుఁడు, ఎందుకుఁగా సీతను హరించెను? నాప్రియురాలను రావణుండుహరించునంతటి యపరాధమును నేనేమియతనికిఁజేసినాను?

అని, తాత్పర్యము.

కథం త చ్చంద్ర సంకాశం ముఖ మాసీ న్మనోహరమ్
సీతయా కానిచోక్తాని తస్మి న్కాలే ద్విజోత్తమ. ౬

టీక॥ ద్విజోత్తమ= పక్షిశ్రేష్ఠుండవగు జటాయువా! చంద్రసంకాశం=చంద్రునితోసమానమును; మనోహరం=సుందరమునగు; తత్=ఆ; ముఖం=ముగము; కథం=ఎట్లు; ఆసీత్=ఉండెను? సీతయా=సీతచేత; తస్మిన్=ఆ; కాలే=కాలమునందు; కానిచ=ఏమాటలు; ఉక్తాని=చెప్పఁబడినవి?

పక్షిశ్రేష్ఠుండవగుజటాయువా! చంద్రబింబము వంటిదియు మనోహరంబునగు నాసీతయొక్క మోము; అప్పుడెట్లుండినది? అప్పుడు, సీతయేమేమిచెప్పినది? అని, తాత్పర్యము.

కథం వీర్యః కథంరూపః కింకర్మా స చ రాక్షసః
క్వచాస్య భవనం తాత బ్రూహి మే పరిపృచ్ఛతః. ౭

టీక॥ తాత=నాయనా! సః=ఆ; రాక్షసశ్చ=రాక్షసుఁడును; కథంవీర్యః=ఎట్టిపరాక్రమముగలవాఁడు? కథంరూపః=ఎట్టియాకారముగలవాఁడు? కింకర్మా=ఎట్టికార్యముగలవాఁడు? అస్య=ఇతనియొక్క; భవనంచ=ఇల్లును; క్వ=ఎచ్చట? పరిపృచ్ఛతః=అడుగుచున్న; మే=నాకు; బ్రూహి=చెప్పుము.

నాయనా! ఆరాక్షసుని పరాక్రమమెట్టిది? అతనిరూపమెట్టిది? అతనికార్యములెట్టివి? అతనిస్థానమెచ్చట? నేనడిగెదను; చెప్పుము. అని, తాత్పర్యము.

తముద్వీక్ష్యాథ దీనాత్మా విలపన్తమనన్తరమ్
వాచాతిసన్నయా రామం జటాయురిదమబ్రవీత్. ౮

టీక॥ అథ=అంత; జటాయుః=జటాయువు; దీనాత్మా=దీనమయినమనస్సుగలవాఁడై; అనన్తరం=విడువక; విలపన్తం=ఏడ్చుచున్న; తం=ఆ; రామం=రామునిని; ఉద్వీక్ష్య=చూచి; అతిసన్నయా=మిక్కిలియుఁగృశించిన; వాచా=మాటచేత; ఇదం=ఈవాక్యమును; అబ్రవీత్=చెప్పెను.

అంత, జటాయువు, దీనుండై, నిరంతరముగా విలపించుచున్న యారాముని జూచి, మిక్కిలియుహీనమయిన స్వరంబున, నిట్లని చెప్పెను.

అని, తాత్పర్యము.

హృతా సా రాక్షసేన్ద్రేణ రావణేన విహాయసా
మాయామాస్థాయ విపులాం వాతదుర్దినసంకులామ్. ౯

టీక॥ సా=ఆసీత; రాక్షసేన్ద్రేణ=రాక్షసులకుఁబ్రభువైన; రావణేన=రావణునిచేత; విపులాం=అధికమయినదియు; వాతదుర్దినసంకులాం=గాలిచేతను మేఘాచ్ఛాదనముచేతను నిండినదియునగు; మాయాం=మాయను; ఆస్థాయ=అవలంబించి; విహాయసా=ఆకాశముచేత; హృతా=అపహరింపఁబడినది.

రాక్షసేశ్వరుండగు రావణుండు, మాయచేఁ బెనుగాలియు మేఘంబులును బుట్టించిచీఁకటిక్రమ్మునట్లు చేసి, యా

స ౬౮

కాశమార్గంబున, సీతనుహరించుకొని పోయెను. అని, తాత్పర్యము.

పరిశ్రాంతస్య మే తాత పక్షౌ ఛిత్వా స రాక్షసః
సీతా మాదాయ వైదేహీం ప్రయాతో దక్షిణాం దిశమ్. ౧౦

టీక॥ తాత=నాయనా! సః=ఆ; రాక్షసః=రాక్షసుఁడైనరావణుఁడు; పరిశ్రాంతస్య=అలసటనొందిన; మే=నా యొక్క; పక్షౌ=ఱెక్కలను; ఛిత్వా=నఱికి; వైదేహీం=జనకమహారాజపుత్త్రియగు; సీతాం=సీతను; ఆదాయ=గ్రహించి; దక్షిణాం=దక్షిణపు; దిశం=దిక్కునుగూర్చి; ప్రయాతః=పోయెను.

నాయనా! ఆరావణుండు, నేనలసియుండునప్పుడు నాఱెక్కలం దెగవేసి, జనకమహారాజపుత్త్రియగు సీతందీసికొని, దక్షిణదిశంబట్టిపోయెను. అని, తాత్పర్యము.

ఉపరుధ్యంతి మే ప్రాణా దృష్టి ర్భ్రమతి రాఘవ
పశ్యామి వృక్షా న్సౌవర్ణా నుశీర కృతమూర్ధజాన్. ౧౧

టీక॥ రాఘవ=రాముఁడా! మే=నాయొక్క; ప్రాణాః=ప్రాణములు; ఉపరుధ్యంతి=అడ్డగింపఁబడుచున్నవి. దృష్టిః=చూపు; భ్రమతి=తిరుగుచున్నది. సౌవర్ణాన్=బంగారువికారములును; ఉశీరకృతమూర్ధజాన్=వెట్టివేళులోఁజేయఁబడిన వెండ్రుకలుగలవియునగు; వృక్షాన్=వృక్షములను; పశ్యామి=చూచుచున్నాను.

రాముఁడా! నాప్రాణంబులు నిరోధింపబడుచున్నవి; దృష్టి తిరుగుడునొందుచున్నది; వెట్టివేళువంటి వెండ్రుకలుగలబంగారువృక్షంబులు నాకంటికిఅగపడుచున్నవి (మృతిఁబొందఁబోవుకాలమునబంగారు వృక్షంబులగపడుననిప్రసిద్ధి.) అని, తాత్పర్యము.

యేన యాతి ముహూర్తేన సీతా మాదాయ రావణః
విప్రణష్టం ధనం క్షిప్రం తత్స్వామీ ప్రతిపద్యతే. ౧౨

టీక॥ రావణః=రావణుఁడు; యే న=ఏ; ముహూర్తేన=ముహూర్తము చేత; సీతాం=సీతను; ఆదాయ=తీసికొని; యాతి=పోవుచున్నాఁడో; తస్మిన్ (అధ్యాహృతము)= ఆముహూర్తమునందు; విప్రణష్టం=నశించిన; ధనం=ధనమును; తత్స్వామీ=దానిప్రభువు; క్షిప్రం=శీఘ్రముగా; ప్రతిపద్యతే=పొందును.

రావణుండు ఏముహూర్తమునందు సీతనుహరించుకొనిపోయెనో ఆముహూర్తంబుననశించినసొమ్ము, శీఘ్రంబుననె స్వామియొద్దకుఁజేరఁగలదు; ఇది దానిస్వభావము.

అని, తాత్పర్యము.

విందో నామ ముహూర్తో౽యం సచ కాకుత్స్థ నాబుధత్

టీక॥ కాకుత్స్థ= రాముఁడా! అయం=ఈ; ముహూర్తః= ముహూర్తము; విందో నామ=విందమను పేరుగలది. సచ=ఆరావణుండుమాత్రము; నాబుధత్= ఎఱుఁగఁడయ్యె.

రామఁడా! ఈముహూర్తమునకు విందమనిపేరు; ఇది, రావణునకుఁ దెలియలేదు; కావున, నీవు, సీతనుశీఘ్రంబుననెపొందఁగలవు.

అని, తాత్పర్యము.

త్వత్ప్రియాం జానకీం హృత్వా రావణో రాక్షసేశ్వరః. ౧౩
ఝషవ ద్బడిశం గృహ్య క్షిప్రమేవ వినశ్యతి

టీక॥ త్వత్ప్రియాం=నీప్రియురాలయిన; జానకీం=సీతను; హృత్వా=హరించి; రాక్షసేశ్వరః=రాక్షసులకుఁబ్రభువైన; రావణః=రావణుఁడు; బడిశం=గాలమును; గృహ్య (గృహీత్వా)= మ్రింగి; ఝషవత్=మత్స్యమువలె; క్షిప్రమేవ=శీఘ్రముగనే; వినశ్యతి=నశింపఁగలఁడు.

నీప్రియురాలగుసీతనపహరించిన రాక్షసేశ్వరుఁడగురావణుండు, గాలమును మ్రింగినమత్స్యమువలె, శీఘ్రముననె, వినాశంబు నొందఁగలఁడు.

అని, తాత్పర్యము.

నచ త్వయా వ్యథా కార్యా జనకస్య సుతాం ప్రతి. ౧౪

స ౬౮

వైదేహ్యా రంస్యసే క్షిప్రం హత్వా తం రాక్షసం రణే

టీక॥ జనకస్య = జనకమహారాజుయొక్క; సుతాం ప్రతి = కొమార్తెనుగూర్చి; త్వయా = నీచేత; వ్యథా చ = దుఃఖముమాత్రము; న కార్యా = చేయఁదగినదికాదు. రణే = యుద్ధమునందు; తం = ఆ; రాక్షసం = రాక్షసుని; హత్వా = వధించి; క్షిప్రం = శీఘ్రముగా; వైదేహ్యా = సీతతో; రంస్యసే = రమింపఁగలవు.

జనకమహారాజపుత్త్రియగు సీతంగుఱించి, నీ వెంతమాత్రము దుఃఖింపవలదు; నీవు, యుద్ధంబున నా రావణునివధించి, శీఘ్రంబున సీతంబొంది రమింపఁగలవు. అని జటాయువు రామునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

అసంమూఢస్య గృధ్రస్య రామం ప్రత్యనుభాషతః. ౧౪

ఆస్యాత్సుస్రావ రుధిరం మ్రియమాణస్య సామిషమ్

టీక॥ అసంమూఢస్య = తెలివితప్పనివాఁడును; రామం ప్రతి = రామునిఁగూర్చి; అనుభాషతః = చెప్పుచున్నవాఁడును; మ్రియమాణస్య = మరణంబునొందుచున్నవాఁడునగు; గృధ్రస్య = జటాయువుయొక్క; ఆస్యాత్ = నోటనుండి; సామిషం = మాంసముతోఁగూడిన; రుధిరం = నెత్తురు; సుస్రావ = కాఱెను.

అంతవఱకుఁ దెలివితప్పక రామునితోఁ బ్రత్యుత్తరంబులు చెప్పుచున్న యా జటాయువు మరణంబునొందుచున్నప్పుడు, నోటనుండి మాంససహితంబగు నెత్తురు వెడలెను. అని, తాత్పర్యము.

పుత్రో విశ్రవసస్సాక్షాద్భ్రాతా వైశ్రవణస్య చ. ౧౫

ఇత్యుక్త్వా దుర్లభాన్ ప్రాణాన్ ముమోచ పతగేశ్వరః

టీక॥ విశ్రవసః = విశ్రవసునియొక్క; సాక్షాత్పుత్రః = సాక్షాత్కుమారుండు; వైశ్రవణస్య = కుబేరునియొక్క; భ్రాతా చ = తమ్ముండును. పతగేశ్వరః = పక్షిరాజయినజటాయువు; ఇతి = ఇట్లు; ఉక్త్వా = చెప్పెను. దుర్లభాన్-

ఘాందరాని; ప్రాణాః = ప్రాణములను; ముమోచ = విడిచెను.

జటాయువు, "రావణుండు, విశ్రవసునికొడుకుండు; కుబేరునకుదమ్ముండు;" అనిచెప్పి యాపైనేమియు నుడువక యెదుర్లభంబులగు ప్రాణంబులవిడిచెను. అని, తాత్పర్యము.

బ్రూహిబ్రూహీతి రామస్య బ్రువాణస్య కృతాంజలేః. ౧౭
త్యక్త్వా శరీరం గృధ్రస్య జగ్ముః ప్రాణా విహాయసమ్

టీక॥ రామస్య = రాముఁడు; కృతాంజలేః = చేయఁబడిన చేమోడ్పుగలవాఁడై; బ్రూహిబ్రూహీతి = చెప్పుముచెప్పుమని; బ్రువాణస్య = చెప్పుచుండఁగా; గృధ్రస్య = జటాయువుయొక్క; ప్రాణాః = ప్రాణములు; శరీరం = దేహమును; త్యక్త్వా = విడిచి; విహాయసం = ఆకాశమును; జగ్ముః = పొందినవి.

రాముండు చేమోడ్పుగీలించి, చెప్పుమనియడుగుచుండఁగానే, జటాయువు ప్రాణంబులు మేనువిడిచి యాకాశంబునొందినవి. అని, తాత్పర్యము.

స నిక్షిప్య శిరో భూమౌ ప్రసార్య చరణౌ తదా. ౧౮
విక్షిప్య చ శరీరం స్వం పపాత ధరణీతలే

టీక॥ తదా = అప్పుడు; సః = ఆజటాయువు; శిరః = తలను; భూమౌ = నేలయందు; నిక్షిప్య = ఉంచి; చరణౌ = పాదములను; ప్రసార్య = చాఁచి; స్వం = తనదైనట్టి; శరీరం = దేహమును; విక్షిప్య చ = ఎగరివేసియు; ధరణీతలే = నేలయందు; పపాత = వేడెను.

అప్పుడు, జటాయువు, తలనేలపైనునిచి కాళ్లుసాఁచి, దేహమంతయును గురివేయుచుఁ, బ్రాణంబులు విడిచి, నేలంబడెను. అని, తాత్పర్యము.

తం గృధ్రం ప్రేక్ష్య తామ్రాక్షం గతాసు మచలోపమమ్. ౧౯
రామ స్సుబహుభి ర్దుఃఖై ర్దీన స్సౌమిత్రి మబ్రవీత్

టీక॥ రామః = రాముఁడు; తామ్రాక్షః = ఎఱ్ఱనికన్నులుగలవాఁడును; ౫



తాసుం=పోయినప్రాణంబులుగలవాఁడును; అచలోపమం= పర్వతముతోఁ బోలికగలవాఁడునగు; తం=ఆ; గృధ్రం= జటాయువును; ప్రేక్ష్య=చూచి; సుబహుభిః=మిక్కిలియు నధికములయిన; దుఃఖైః =దుఃఖములచేత; దీనః=పీడితుండై; సౌమిత్రిం= లక్ష్మణునిఁగూర్చి; అబ్రవీత్=చెప్పెను.

రాముండు, ఎఱ్ఱనికన్నులతోఁ జచ్చిపడియున్న పర్వతాకారుఁడగు నాజటాయువుంజూచి, పరమదుఃఖితుండై, లక్ష్మణునితో నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

బహూని రక్షసాం వాసే వర్షాణి వసతా సుఖమ్. ౨౦
అనేన దండకారణ్యే విశీర్ణ మిహపక్షిణా

టీక॥బహూని=పెక్కులయిన; వర్షాణి=సంవత్సరములు; రక్షసాం = రాక్షసులయొక్క; వాసే=ఉనికిపట్టైన; దండకారణ్యే=దండకారణ్యమునందు; సుఖం=సుఖముగా; వసతా=ఉండునట్టి; అనేన=ఈ; పక్షిణా=జటాయువుచేత; ఇహ=ఇప్పుడు; విశీర్ణం=చచ్చుటయయ్యెను.

ఈజటాయువు రాక్షసులయునికిపట్టైన యీదండకారణ్యంబునం బెక్కుసంవత్సరములు సుఖంబుననిర్భయంబుగానుండి, యిప్పుడు, మనకుఁగా, నిహతుండై, కూలెను. అని, తాత్పర్యము.

అనేక వార్షికో యస్తు చిరకాల సముత్థితః. ౨౧
సోయ మద్య హతశ్శేతే కాలోహి దురతిక్రమః

టీక॥యస్తు=ఎవ్వఁడును; అనేకవార్షికః=అనేకసంవత్సరముల వయస్సుగలవాఁడును; చిరకాలసముత్థితః= బహుకాలముగావృద్ధినొందినవాఁడునో; సః=అట్టి; అయం=ఈజటాయువు; అద్య=ఇప్పుడు; హతః=చంపఁబడినవాఁడై; శేతే=పరుండియున్నాఁడు. కాలః=కాలము; దురతిక్రమోహి=అతిక్రమింపనలవిగానిదిగదా!

ఎవ్వఁడు, పెక్కువేలవర్షంబులవయస్సుగలిగి బహుకాలముగావృద్ధినొందియుండెనో, అట్టిజటాయువుగూడ, ఇ



స ౬౮

ష్టుడు హతుండై పరుండియున్నాఁడు; కాలమునతిక్రమింపనేరికినలవిగాదు.

అని, తాత్పర్యము.

పశ్య లక్ష్మణ గృధ్రోయ ముపకారీ హతశ్చ మే. ౨౨
సీతా మభ్యవ పన్నో వై రావణేన బలీయసా

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! అయం=ఈ; గృధ్రశ్చ=జటాయువును; సీతాం=సీతనుగూర్చి; అభ్యవపన్నః=పోయినవాఁడై, కావున నే; మే=నాకు; ఉపకారీ = ఉపకారముచేసినవాఁడై; బలీయసా = అధికమయినబలముగల; రావణేన=రావణునిచేత; హతః=వధింపఁబడినాఁడు. పశ్య=చూడుము.

లక్ష్మణుఁడా! ఈజటాయువు, నాకుపకారముచేయవలెనని సీతనురక్షింపఁబోయి, బలవంతుండగురావణునిచేవధింపఁబడియున్నాఁడుచూడుము.

అని, తాత్పర్యము.

గృధ్రరాజ్యం పరిత్యజ్య పితృపైతా మహం మహత్. ౨౩
మమ హేతో రయం ప్రాణా న్ముమోచ పతగేశ్వరః

టీక॥అయం=ఈ; పతగేశ్వరః=పక్షిరాజుండగుజటాయువు; పితృపైతామహం=తండ్రితాతలనాటనుండివచ్చిన; మహత్= గొప్పదగు; గృధ్రరాజ్యం=గద్దలరాజ్యమును; పరిత్యజ్య=విడిచి; మమ హేతోః=నానిమిత్తముగా; ప్రాణాన్= ప్రాణములను; ముమోచ=విడిచెను.

పక్షిరాజుండగునీజటాయువు, తండ్రితాతలనాటనుండి వచ్చినగొప్పగృధ్రరాజ్యంబువిడిచి , నానిమిత్తంబై, యుద్ధంబుగావించిప్రాణంబులు విడిచెను. అని, తాత్పర్యము.

సర్వత్రఖలు దృశ్యంతే సాధవో ధర్మచారిణః. ౨౪
శూరా శ్శరణ్యా స్సౌమిత్రే తిర్యగ్యోనిగతేష్వపి

టీక॥ సౌమిత్రే=లక్ష్మణుఁడా! సర్వత్ర= అంతటను; తిర్యగ్యోనిగతేష్వ

పి=మృగపక్షియోనులం బొందిన వారి యందును; సాధవః=మంచివారును; ధర్మచారిణః=ధర్మమునాచరించువారలును; శూరాః=యుద్ధమునందు భయములేనివారలును; శరణ్యాః=శరణు పొందఁదగినవారలును; దృశ్యంతే ఖలు= చూడఁబడుచున్నారుగదా!

లక్ష్మణుఁడా! అంతటను మృగపక్షిజాతులందుఁగూడ, సాధువులును ధార్మికులును శూరులును శరణ్యులునగు వారలగపడుచున్నారు.

అని, తాత్పర్యము.

సీతాహరణజం దుఃఖం న మే సౌమ్య తథాగతమ్ ౨౫
యథా వినాశే గృధ్రస్య మత్కృతే చ పరంతప

టీక॥ పరంతప= శత్రువులఁదపింపఁజేయునట్టివాఁడవు; సౌమ్య= తిన్ననివాఁడవునగు లక్ష్మణుఁడా! మత్కృతే చ=నానిమిత్తముగా; గృధ్రస్య = జటాయువుయొక్క; వినాశే=మరణమునందు; యథా=ఎట్లో; తథా=అట్లు; మే=నాకు; సీతాహరణజం= సీతనపహరించుటవలనఁగలిగిన; దుఃఖం=దుఃఖము; న ఆగతం= రాలేదు.

శత్రువులఁదపింపఁజేయునట్టివాఁడవగులక్ష్మణుఁడా! నానిమిత్తముగానీ జటాయువుమరణంబు నొందుటవలనం గలిగినంతటిదుఃఖము, నాకు,సీతాహరణంబునంగూడఁగలుగలేదు.

అని, తాత్పర్యము.

రాజా దశరథః శ్రీమాన్ యథా మమ మహాయశాః ౨౬
పూజనీయశ్చ మాన్యశ్చ తథాయం పతగేశ్వరః

టీక॥మమ=నాకు; యథా=ఎట్లు; శ్రీమాన్= అందఱికన్న నధికుండును; రాజా=రాజును; మహాయశాః=అధికమయినకీర్తిగలవాఁడునగు; దశరథః= దశరథమహారాజు; పూజనీయశ్చ=పూజింపఁదగినవాఁడో; మాన్యశ్చ=గౌరవింపఁదగినవాఁడునో; అయం=ఈ; పతగేశ్వరః=జటాయువు; తథా=అట్లు.

నాకు, శ్రీమంతుండును మహాకీర్తిశాలియునగు దశరథమహారాజు, ఎట్లో, అట్లు ఈజటాయువుగూడ, పూజ్యుండును మాన్యుండు నగుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

స ౬౮

సౌమిత్రే హర కాష్ఠాని నిర్మథిష్యామి పావకమ్. ౨౭
గృధ్రరాజం దిధక్షామి మత్కృతే నిధనం గతమ్

టీక॥ సౌమిత్రే=లక్ష్మణుఁడా! కాష్ఠాని=కట్టెలను; హర=తెమ్ము. పావకం=అగ్నిని; నిర్మథిష్యామి=మథించెదను. మత్కృతే=నానిమిత్తమయి; నిధనం=మరణమును; గతం=పొందిన; గృధ్రరాజం=జటాయువును; దిధక్షామి=దహింపఁగోరెదను.

లక్ష్మణుఁడా! కట్టెలందెమ్ము; మథనంబువనగ్నిని సంపాదించి, నానిమిత్తమయి మరణంబునొందిన, జటాయువునకు, దహనసంస్కారము గావించెదను. అని, తాత్పర్యము.

నాథం పతగలోకస్య చితా మారోప్య రాఘవ. ౨౮
ఇమం ధక్ష్యామి సౌమిత్రే హతం రౌద్రేణ రక్షసా

టీక॥ రాఘవ=రఘువంశమునందుఁ బుట్టిన; సౌమిత్రే=లక్ష్మణుఁడా! పతగలోకస్య=పక్షిలోకమునకు; నాథం=ప్రభువైనవాఁడును; రౌద్రేణ=భయంకరుండగు; రక్షసా=రాక్షసునిచేత; హతం=చంపఁబడినవాఁడునగు; ఇమం=ఈజటాయువును; చితాం=చితిని; ఆరోప్య=ఎక్కించి; ధక్ష్యామి=దహించెదను.

రఘువంశమునందుఁ బుట్టిన లక్ష్మణుఁడా! భయంకరాకారుండగు రాక్షసునిచేనిహతుండయిన పక్షిరాజుండగు నీజటాయువునుజితిపైనునిచి, దహించెదను. అని, తాత్పర్యము

యా గతి ర్యజ్ఞశీలానా మాహితాగ్నేశ్చ యా గతిః. ౨౯
అపరావర్తినాం యా చ యా చ భూమిప్రదాయినామ్
మయా త్వం సమనుజ్ఞాతో గచ్ఛ లోకా ననుత్తమాన్. ౩౦
గృధ్రరాజ మహాసత్త్వ సంస్కృతశ్చ మయా వ్రజ

టీక॥ మహాసత్త్వ=అధికమయినబలముగల; గృధ్రరాజ=జటాయువా! యజ్ఞశీలానాం=యాగముసేయు స్వభావముగలవారలకు; యా=ఏ; గతిః=లోకమో; ఆహితాగ్నేశ్చ=ఉంచబడినయగ్నులుగల, సంయాగ్ని మధ్యంబు

నం దపంబు సేయునట్టి వానప్రస్థునకు; యాః=ఏ; గతిః=లోకమో; అపరావర్తినాం=మఱలనట్టివారలకు; యాచ=ఏలోకమో; భూమిప్రదాయినాం=భూమినొసంగునట్టివారలకు; యాచ=ఏలోకమో; తాన్ (అధ్యాహృతము)=ఆ; అనుత్తమాన్=శమకన్న శ్రేష్ఠములు లేని; లోకాన్=లోకములను; త్వం=నీవు; మయా=నాచేత; సమనుజ్ఞాతః=అనుమతింపఁబడినవాఁడవై; గచ్ఛ=పొందుము. మయా=నాచేత; సంస్కృతశ్చ=సంస్కరింపఁబడినవాఁడవైయు; వ్రజ=పొందుము.

మహాబలుండవగు జటాయువా! యాగములు సేయువార లేలోకముఁ బొందుదురో, పంచాగ్నిమధ్యంబునందపంబు సేయునట్టి వానప్రస్థుం డేలోకంబునకుఁబోవునో, సన్యాసులు, ఏలోకముంబొందుదురో, భూదానము సేయుచుండువారలకు ఏలోకము గలుగునో, నీవు, నాచే సంస్కృతుండవై, నాయనుమతింబొందినవాఁడవై, యుత్తమంబులగు నాలోకంబులనన్నింటిని బొందుము. అని, రాముండు చెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా చితాం దీప్తా మారోప్య పతగేశ్వరమ్. ౩౧
దదాహ రామో ధర్మాత్మా స్వబంధుమివ దుఃఖితః

టీక॥ ధర్మాత్మా=ధర్మస్వభావుఁడగు; రామః=రాముఁడు; దుఃఖితః=దుఃఖమునొందినవాఁడవై; ఏవం=ఇట్లు; ఉక్త్వా=చెప్పి; పతగేశ్వరం=పక్షిరాజుండగు జటాయువును; దీప్తాం=మండుచున్న; చితాం=చితినిః ఆరోప్య=ఎక్కించి; స్వబంధుమివ=తనబంధువునువలె; దదాహ=దహించెను.

ధర్మాత్ముండగు రాముండు, ఈ ప్రకారమునం జెప్పి, జటాయువును చితిపైనునిచి, దుఃఖితుండై, తనబంధువునుంబోలె మంత్రపూర్వకంబుగా దహించెను. అని, తాత్పర్యము.

రామో థ సహసౌమిత్రి ర్వనం గత్వా సవీర్యవాన్. ౩౨
స్థూలాన్ హత్వా మహారోహీ ననుతస్తార తం ద్విజమ్

టీక॥ అథ=అంతట; వీర్యవాన్=అధికమయినపరాక్రమముగలః సః=అ




రామః=రాముఁడు; సహసౌమిత్రిః=లక్ష్మణునితోఁగూడినవాఁడై; వనం=అడవిని; గత్వా= పొంది; స్థూలాన్=పెద్దవగు; మహారోహీన్= కేసరీమృగములను; హత్వా=చంపి; తం=ఆ; ద్విజమను= పక్షినిఁగూర్చిన్; తస్తార=పఱచెను.

అంత, మహాపరాక్రమ శాలియగు రాముండు, లక్ష్మణునితోఁగూడనడవికిఁబోయి, పెద్దకేసరి మృగంబులంజంపి, తెచ్చి, జటాయువునకుఁ బిండప్రదానముసెయుటకై, దర్భలుపఱచెను.

అని, తాత్పర్యము.

రోహి మాంసాని చోత్కృత్య పేశీకృత్య మహాయశాః. ౩౩
శకునాయ దదౌ రామో రమ్యే హరిత శాద్వలే

టీక॥ మహాయశాః=అధికమయిన కీర్తిగల; రామః=రాముఁడు;రోహిమాంసానిచ=కేసరీమాంసములను; ఉత్కృత్య=ఎత్తి; పేశీకృత్య=ముద్దగాఁజేసి; రమ్యే=సుందరమయిన; హరితశాద్వలే=పచ్చనిపచ్చికనేలయందు; శకునాయ= పక్షియయిన జటాయువుకొఱకు; దదౌ=ఇచ్చెను,

మహాయశుండగురాముండు, ఆకేసరిమాంసములందీసి, పిండములుగాఁజేసి, రమణీయంబగు పచ్చికనేలపైజటాయువునకు, ఒసంగెను.

అని, తాత్పర్యము.

యత్తత్ప్రేతస్య మర్త్యస్య కథయంతి ద్విజాతయః. ౩౪
తత్స్వర్గ గమనం తస్య పిత్ర్యం రామో జజాపహ

టీక॥యత్=ఏ; తత్=ప్రసిద్ధమయినమంత్రమును; ప్రేతస్య=చచ్చిన; మర్త్యస్య=మనుష్యునికి; స్వర్గగమనం=స్వర్గమునుబొందించునదిగా ; ద్విజాతయః=బ్రాహ్మణులు; కథయంతి=చెప్పుదురో; తత్=ఆ; పిత్ర్యం=పితృదేవతాకమయినమంత్రమును ; తస్య=ఆజటాయువునకు; జజాప= జపించెను. ("హ" అనునదిపాదపూరణార్థము).

దేనిబ్రాహ్మణులు, మరణమునొందినమనుష్యునకు స్వర్గప్రదమని జపింతురో, అట్టిపితృదేవతాకమయిన మం




త్రమును, జటాయువునకుఁగా, రాముఁడు జపించెను. అని, తాత్పర్యము.

తతో గోదావరీం గత్వా నదీం నరవరాత్మజౌ. ౨౫
ఉదకం చక్రతు స్తస్మై గృధ్రరాజాయ తావుభౌ

టీక॥ తౌ=ఆ; నరవరాత్మజౌ=రాజకుమారులగు రామలక్ష్మణులు; ఉభౌ=ఇద్దఱు; గోదావరీం=గోదావరియను నదీం=నదిని; గత్వా=పొంది; తస్మై=ఆ; గృధ్రరాజాయ=జటాయువుకొఱకు; ఉదకం=జలతర్పణమును; చక్రతుః=చేసిరి.

రాజకుమారులగు నా రామలక్ష్మణులు ఇద్దఱు గోదావరీనదికిం బోయి, గృధ్రరాజగు జటాయువునకు జలతర్పణంబుగావించిరి.

అని తాత్పర్యము.

శాస్త్రదృష్టేన విధినా జలే గృధ్రాయ రాఘవౌ. ౨౬
స్నాత్వా తౌ గృధ్రరాజాయ ఉదకం చక్రతు స్తదా

టీక॥ తౌ=ఆ; రాఘవౌ=రామలక్ష్మణులు; తదా=అప్పుడు; గృధ్రాయ=జటాయువుకొఱకు, శాస్త్రదృష్టేన=శాస్త్రమునందుఁజూడఁబడిన; విధినా=విధిచేత; జలే=జలమునందు; స్నాత్వా=స్నానముచేసి; గృధ్రరాజాయ=జటాయువుకొఱకు; ఉదకం=జలతర్పణమును; చక్రతుః=చేసిరి.

అప్పుడు రామలక్ష్మణులు, యథాశాస్త్రముగ జటాయువు నుద్దేశించి గోదావరీజలంబున స్నానము గావించి, జటాయువునకు జలతర్పణము గావించిరి.

అని, తాత్పర్యము.

స గృధ్రరాజః కృతవా న్యశస్కరం
సుదుష్కరం కర్మ రణే నిపాతితః. ౨౭
మహర్షికల్పేనచ సంస్కృత స్తదా
జగామ పుణ్యాం గతి మాత్మన శ్శుభామ్

టీ॥ సః=ఆ; గృధ్రరాజః=జటాయువు; రణే=యుద్ధమునందు; నిపాతి

స ౭౮

తిః=చంపఁబడినవాఁడై; యశస్కరం= కీర్తిని గలిగించునదియు; సుదుష్కరం= మిక్కిలియుఁ జేయ నలవిగానిదియు న గు; కర్మ=కార్యమును; కృతవాన్=చే సెను. తదా=అప్పుడు; మహర్షికల్పే న=మహర్షితో సమానుఁడైన రామునిచేత; సంస్కృతశ్చ=సంస్కరింపఁబడినవాఁడునై; ఆత్మనః=తనకు; శుభాం= మంగళకరమును; పుణ్యాం=పవిత్రము నగు; గతిం=లోకమును; జగామ=పొం దెను.

ఆజటాయువు, సీతానిమిత్తమయి యుద్ధముచేసిహతుండగుటవలన, శూ రుండనియు నెవ్వరికింజేయ నలవిగాని కార్యముంజేసినవాఁడనియుఁగీర్తిని బొం దెను; మహర్షితుల్యుండగు రామునిచే సంస్కారముఁ బొందుటఁజేసి, శాశ్వతం బును బవిత్రమునగు పుణ్యలోకంబునుం బొందెను. అని, తాత్పర్యము.

కృతోదకౌ తావపి పక్షిసత్తమే
స్థిరాంచ బుద్ధిం ప్రణిధాయ జగ్మతుః. ౩౯
ప్రవేశ్య సీతాధిగమే తతో మనో
వనం సురేంద్రా వివ విష్ణువాసవౌ

టీక॥ తావపి= ఆరామలక్ష్మణులును; సురేంద్రౌ=దేవనాథులగు; విష్ణువా సవావివ(స్థితౌ)=విష్ణుదేవేంద్రులవలె నున్నవారలయి; కృతోదకౌ=చేయఁబ డినజలతర్పణముగలవారలయి; పక్షిస త్తమే=జటాయువునందు; స్థిరాం=ని శ్చలమైన; బుద్ధించ = బుద్ధిని. నమ్మక మును అట; ప్రణిధాయ=ఉంచి; తతః= అంత; సీతాధిగమే= సీతనుపొందుట యందు; మనః=మనస్సును; ప్రవేశ్య= ఉంచి; వనం=అడవిని; జగ్మతుః=పో యిరి.

దేవనాథులగు విష్ణుదేవేంద్రులుం బోలెనున్నయా రామలక్ష్మణులును, జ టాయువునకుం బిండోదకములుచేసి, జ టాయువుచెప్పినమాటయందు దృఢమ యిననమ్మకముగలవారలయి, యంత, సీ తను వెదకుటయందు మనస్సునుంచి, వ నంబునకుఁబోయిరి. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

అరణ్యకాండే, అష్టషష్టితమస్సర్గః.

స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అరణ్యకాండాష్టషష్టితమసర్గటీక,
ముగిసినది.

శ్రీః

ఏకోనసప్తతితమసర్గప్రారంభః.

కృత్వైవ ముదకం తస్మై ప్రస్థితౌ రామలక్ష్మణౌ
అవేక్షంతౌ వనే సీతాం పశ్చిమాం జగ్మతు ర్దిశమ్. ౧

టీక॥ రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు; ఏవం=ఇట్లు; తస్మై=ఆజటాయువు కొఱకు; ఉదకం=జలతర్పణమును; కృత్వా=చేసి; ప్రస్థితౌ=బయలుదేఱినవారలయి; వనే=అడవియందు; సీతాం=సీతను; అవేక్షంతౌ=చూచుచు; పశ్చిమాం=పడమటిదైన; దిశం=దిక్కును గూర్చి; జగ్మతుః=పోయిరి.

రామలక్ష్మణులు, అట్లు జటాయువునకు జలతర్పణాదులుగావించి, బయలుదేఱి వనంబునసీతను వెదకుచు, నిర్రృతిదిక్కుంబట్టిపోయిరి.

అని, తాత్పర్యము.

తౌ దిశం దక్షిణాం గత్వా శరచాపాసి ధారిణౌ
అవిప్రహత మైక్ష్వాకౌ పంథానం ప్రతిపేదతుః. ౨

గుల్మై ర్వృక్షైశ్చ బహుభి ర్లతాభిశ్చ ప్రవేష్టితమ్
ఆవృతం సర్వతో దుర్గం గహనం ఘోరదర్శనమ్. ౩

టీక॥ ఐక్ష్వాకౌ=ఇక్ష్వాకువంశంబునఁబుట్టిన; తౌ=ఆరామలక్ష్మణులు; శరచాపాసిధారిణౌ= బాణములనుధనుస్సును ఖడ్గమునుధరించినవారలయి; దక్షిణాం=దక్షిణపు; దిశం=దిక్కును; గత్వా=పొంది; బహుభిః=పెక్కులయి

నక్రోగుల్మైః=పొదలచేతను; వృక్షైశ్చ=చెట్లచేతను; లతాభిశ్చ=తీఁగెలచేతను; ప్రవేష్టితం=చుట్టఁబడినదియు ; సర్వతః=అంతటను; ఆవృతం=కప్పఁబడినదియు; దుర్గం=చొరరానిదియు; గహనం=కష్టమయినదియు ; ఘోరదర్శనం=భయంకరమయిన చూచుటగలదియును; అవిప్రహతం= త్రొక్కఁబడినదియునగు; పంథానం=మార్గమును; ప్రతిపేదతుః=పొందిరి.

ఇక్ష్వాకువంశమునందుఁ బుట్టినవారలగు నారామలక్ష్మణులు, ధనుర్బాణంబులు ఖడ్గంబులును దాల్చి , నిర్‌రృతిమూలం బట్టిపోయి, పెక్కుగుల్మంబులచేతను వృక్షంబులచేతను లతలచేతను అంతటను నిండినదియు దుర్గమంబును భయంకరంబును ఎవ్వరిచేతను సంచరింపఁ బడినదియునగు మార్గంబుఁ బ్రవేశించిరి. అని, తాత్పర్యము.

వ్యతిక్రమ్యతు వేగేన వ్యాళసింహ నిషేవితమ్
సుభీమం తన్మహారణ్యం వ్యతియాతౌ మహాబలౌ. ౪

టీక॥ మహాబలౌ=అధికమయినబలముగలరామలక్ష్మణులు; వేగేన= వేగముచేత; వ్యాళసింహనిషేవితం=దుష్టగజములచేతను సింహములచేతను సేవింపఁబడినదియు; సుభీమం=మిక్కిలియు భయంకరమునునగు; తత్=ఆ; మహారణ్యం=దండకారణ్యమును; వ్యతిక్రమ్య తు=అతిక్రమించియు; వ్యతియాతౌ=పోయిరి.

మహాబలశాలులగు రామలక్ష్మణులు, వేగంబున, వ్యాళసింహాదిక్రూరమృగంబులతోఁగూడినదియు మహాభయంకరమునగు నాదండకారణ్యము నతిక్రమించి,పోయిరి. అని, తాత్పర్యము.

తతః పరం జనస్థానా త్త్రిక్రోశం గమ్య రాఘవౌ
క్రౌంచారణ్యం వివిశతు ర్గహనం తౌ మహౌజసౌ. ౫

టీక॥ తతఃపరం=అటుపిమ్మట; మహౌజసౌ=అధికమయినపరాక్రమముగలిగి; తౌ=ఆ; రాఘవౌ=రామలక్ష్మణులు; జనస్థానాత్=జనస్థానమునుండి; త్రిక్రోశం=మూఁడుకోసులు; గమ్య(గత్వా)=పోయి; గహనం=దుర్గమము

స ౬౩

యిన; క్రౌంచారణ్యం= క్రౌంచారణ్యమును; వివిశతుః=ప్రవేశించిరి.

అంత, మహాపరాక్రమశాలులగు నారామలక్ష్మణులు, జనస్థానంబుదాఁట మూఁడుకోసుల దూరముపోయి, గహనంబగు, క్రౌంచారణ్యముఁ బ్రవేశించిరి. అని, తాత్పర్యము.

నానా మేఘఘన ప్రఖ్యం ప్రహృష్టమివ సర్వతః
నానాపక్షిగణై ర్జుష్టం నానావ్యాళ మృగై ర్యుతమ్. ౬
దిదృక్షమాణౌ వైదేహీం తద్వనం తౌ విచిక్యతుః
తత్ర తత్రావ తిష్ఠంతౌ సీతా హరణ కర్శితౌ. ౭

టీక॥ సీతాహరణకర్శితౌ= సీతాదేవినపహరించుటచేతఁగృశింపఁజేయఁబడినవారలగు; తౌ= ఆరామలక్ష్మణులు; నానా మేఘఘనప్రఖ్యం =నానావిధ మేఘములసమూహముతో సమానమయినదియు; సర్వతః=అంతటను; ప్రహృష్టమివ(స్థితం)= సంతోషించినట్లున్నదియు; నానాపక్షిగణైః= నానావిధములగుపక్షులతోఁ; జుష్టం = కూడినదియు; నానావ్యాళమృగైః= నానావిధములగుసర్పములతోను మృగములతోను; యుతం= కూడినదియునగు; తత్=ఆ; వనం=క్రౌంచవనమును; తత్ర తత్ర=అచ్చటచ్చట; అవతిష్ఠంతౌ=నిలుచుచున్నవారలయి; వైదేహీం=సీతను; దిదృక్షమాణౌ=చూడఁగోరుచున్నవారలయి; విచిక్యతుః=వెదకిరి.

సీతాహరణంబునఁబరమదుఃఖితులయియున్నయారామలక్ష్మణులు, నానావిధ మేఘసమూహముంబోలినదియుఁ బుష్పాదులచేనంతటను సంతుష్టంబయినట్లుచూపట్టుచున్నదియు నానావిధపక్షిసమూహయుక్తంబును నానావిధసర్పమృగయుక్తంబునగు నాక్రౌంచవనంబునందయు, విశ్రమార్థము అచ్చటచ్చటనిలుచుచు, సీతంజూడఁగోరి, వెదకిరి.

అని, తాత్పర్యము.

తతః పూర్వేణ తౌ గత్వా త్రిక్రోశం భ్రాతరౌ తదా
క్రౌంచారణ్య మతిక్రమ్య మతంగాశ్రమ మంతరా. ౮

దృష్ట్వాతు తద్వనం ఘోరం బహుభీమమృగద్విజమ్
నానాసత్త్వసమాకీర్ణం సర్వం గహన పాదపమ్. ౯
దదృశాతే తు తే తత్ర దరీం దశరథాత్మజౌ
పాతాళ సమగంభీరాం తమసా నిత్యసంవృతామ్. ౧౦

టీక॥ తతః=అంత; తదా=అప్పుడు; తౌ=ఆ; భ్రాతరౌ=అన్నదమ్ములు; పూర్వేణ=తూర్పుదిక్కుచేత; గత్వా=పోయి; క్రౌంచారణ్యం=క్రౌంచారణ్యమును; అతిక్రమ్య=అతిక్రమించి; మతంగాశ్రమమంతరా= మతంగాశ్రమమునకు నడుమ; ఘోరం= భయంకరమును; బహుభీమమృగద్విజం= అనేకములయిన భయంకరములగు మృగపక్షులు గలదియునగు; తత్=ఆ; వనం=అడవిని; సకలం=అంతయు; దృష్ట్వాతు= చూచియు; తత్రతు=అచ్చటనె; తౌ=ఆ; దశరథాత్మజౌ=దశరథమహారాజుకొడుకులయిన రామలక్ష్మణులు; పాతాళసమగంభీరాం= పాతాళముతో సమానమయినదియు లోతయినదియును; తమసా=చీకటిచేత; నిత్యసంవృతాం=ఎల్లప్పుడును గప్పబడినదియునగు; దరీం=గుహను; దదృశాతే=చూచిరి.

అంత, దశరథమహారాజ పుత్రులగు నా రామలక్ష్మణులు, తూర్పుదిక్కుఁబట్టి మూఁడుకోసులుపోయి, క్రౌంచారణ్యంబునతిక్రమించి, మతంగాశ్రమసమీపంబున, భయంకరంబునుభయంకరంబులగు మృగపక్షులతోఁ గూడినదియు నానావిధమృగసేవితంబును మహావృక్షంబులతో నొప్పుచున్నదియునగు నవ్వనంబుఁ జూచి, యచ్చట పాతాళంబువలె నతిగంభీరంబును అంధకారసంవృతంబునగునొకగుహం గనిరి.

అని, తాత్పర్యము.

ఆసాద్య తౌ నరవ్యాఘ్రౌ దర్యాస్తస్యా విదూరతః
దదృశాతే మహారూపాం రాక్షసీం వికృతాననామ్. ౧౧

టీక॥ నరవ్యాఘ్రౌ=పురుషశ్రేష్ఠులగు; తౌ=ఆ రామలక్ష్మణులు; ఆసాద్య=సమీపించి; తస్యాః=ఆ; దర్యాః=గుహకు; అవిదూరతః సంధియాకాశము)=స

మీపమునందు; మహారూపాం= పెద్ద యాకారము గలదియు ; వికృతానవాం= వికృతమయిననోరుగలదియునగు; రాక్షసీం=రాక్షసస్త్రీని; దదృశాతే=చూచిరి.

పురుషశ్రేష్ఠులగు రామలక్ష్మణులు, ఆగుహాసమీపంబునకుంబోయి, యచ్చట, వికృతంబయినరూపంబుగలదియువికృతంబయిన నోరుగలదియునగునొక రాక్షసుంజూచిరి. అని, తాత్పర్యము.

భయదా మల్పసత్త్వానాం బీభత్సాం రౌద్రదర్శనామ్
లంబోదరీం తీక్ష్ణదంష్ట్రాం కరాళీం పరుషత్వచమ్. ౧౨
భక్షయంతీంమృగాన్ భీమాన్ వికటాం ముక్తమూర్ధజామ్
ప్రైక్షేతాం తౌ తత స్తత్ర భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౧౩

టీక॥తతః=అంత; భ్రాతరౌ=అన్నదమ్ములగు; తౌ=ఆ; రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు; అల్పసత్త్వానాం=కొంచెమయిన ధైర్యముగలవారలకు; భయదాం= భయంబొసంగునదియు; బీభత్సాం=వికృతయును; రౌద్రదర్శనాం= భయంకరములయినచూపులుగలదియు; లంబోదరీం=వ్రేలుకాడుకడుపుగలదియు; తీక్ష్ణదంష్ట్రాం= కఠినములయినకోరలుగలదియు; కరాళీం=ఉన్నతమయినదియు; పరుషత్వచం=కఠినమయినచర్మముగలదియు; భీమాన్=భయంకరములయిన; మృగాన్=మృగములను; భక్షయంతీం= భక్షించుచున్నదియు; వికటాం= భయంకరాకారయును; ముక్తమూర్ధజాం=విడువంబడినవెండ్రుకలుగలదియునగు; తాం=ఆరాక్షసిని; తత్ర=అచ్చట; ప్రైక్షేతాం= చూచిరి.

అంత, అన్నదమ్ములగు నారామలక్ష్మణులు, అల్పులకుభయంబుకలిగించునదియుజుగుప్సితమయినయాకారముగలదియుభయంకరములయిన కన్నులుగలదియు లంబోదరియుంగఠినముగోఱలుగలదియుఉన్నతశరీరయుంబరుషమయిన చర్మము గలదియు భయంకరంబులగు సింహవ్యాఘ్రాది మృగంబులభక్షించుచున్నదియు భయంకరాకారయు వెండ్రుకలువిరియంబోసికొనియున్నదియునగు, నారాక్షసినచ్చటంజూచిరి.

అని, తాత్పర్యము.

సా సమాసాద్య తౌ వీరౌ వ్రజంతం భ్రాతురగ్రతః
ఏహి రంస్యావహే త్యుక్త్వా సమాలంబత లక్ష్మణమ్. ౧౪

టీక॥ సా=ఆరాక్షసి; వీరౌ=పరాక్రమశాలులగు; తౌ=ఆరామలక్ష్మణుల ను; సమాసాద్య=సమీపించి; ఏహి=రమ్ము; రంస్యావహే=రమింతము. ఇతి (సంధియార్షము)=అని; ఉక్త్వా= చెప్పి; భ్రాతుః=అన్నకు; అగ్రతః=ముందట; వ్రజంతం=పోవుచున్న ; లక్ష్మణం=లక్ష్మణుని; సమాలంబత= పట్టుకొనెను.

ఆరాక్షసి, వీరులగు రామలక్ష్మణుల చెంతకువచ్చి, అన్నముందట నడచుచున్నలక్ష్మణుంజూచి, రమింతము రమ్మని చెప్పి యతనింబట్టుకొనెను.

అని, తాత్పర్యము.

ఉవాచ చైనం వచనం సౌమిత్రి ముపగూహ్య సా

టీక॥ సా=ఆరాక్షసి; ఏనం=ఈ; సౌమిత్రిం=లక్ష్మణుని; ఉపగూహ్య=కౌఁగిలించుకొని; వచనం=మాటను; ఉవాచచ=చెప్పెను.

ఆరాక్షసి, లక్ష్మణునిం బిగియఁ గౌఁగిలించి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

అహం త్వయోముఖీనామ లబ్ధా తే త్వమసి ప్రియః. ౧౫
నాథ పర్వతకూటేషు నదీనాం పులినేషుచ
ఆయుశ్శేష మిమం వీర త్వం మయాసహ రంస్యసే. ౧౬

టీక॥ వీర=పరాక్రమశాలివగు; నాథ=నాథుఁడా! అయోముఖీనామ= అయోముఖియనుపేరుగల; అహంతు=నేనును; తే=నీకు; లబ్ధా=పొందఁబడినాను. త్వం=నీవు; ప్రియః=ప్రియుఁడవు; అసి=అగుచున్నావు. త్వం= నీవు; ఇమం=ఈ; ఆయుశ్శేషం=ఆయుస్సుయొక్క-మిగతయంతయు; పర్వతకూటేషు=పర్వతశిఖరములయందును ; నదీనాం=నదులయొక్క-; పులినేషుచ=ఇసుకదిన్నెలయందును ; మయాసహ = నాతోఁగూడ ; రంస్యసే= రమింపఁ

గలవు.

వీరుండవగు నాథుఁడా! నేను, అయోముఖి యను పేరుగలదానను నీకుదొరకినాను; నీవును నాకుఁ బ్రియుండవు దొరకితివి; కావున, నీవు, ఇంక బ్రతికియుండు నంతకును, పర్వతశిఖరములయందును నదీపులినంబులయందును, నాతోఁగూడ రమింపుచుండుము. అనియారాక్షసి, లక్ష్మణునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు కుపితః ఖడ్గ ముద్ధృత్య లక్ష్మణః
కర్ణనాసస్తనం తస్యా నిచకర్తారి సూదనః. ౧౪

టీక॥ అరిసూదనః=శత్రువులఁజంపునట్టి; లక్ష్మణః=లక్ష్మణుఁడు; ఏవం=ఇట్లు; ఉక్తస్తు=చెప్పఁబడినవాఁడైనంతనే; కుపితః=కోపమునొందినవాఁడై; ఖడ్గం=కత్తిని; ఉద్ధృత్య= ఎత్తి; తస్యాః=ఆరాక్షసియొక్క; కర్ణనాసస్తనం = చెవులనుముక్కును స్తనముల ను; నిచకర్త=ఖండించెను.

శత్రులవధించునట్టిలక్ష్మణుండు, ఈ ప్రకారమారాక్షసి చెప్పుటనువిని, కుపితుండై, ఖడ్గంబెత్తి యారాక్షసియొక్క చెవులను ముక్కును స్తనంబులను ఖండించెను. అని, తాత్పర్యము.

కర్ణనాసే నికృత్తేతు విస్వరం సా వినద్యచ
యథా గతం ప్రదుద్రావ రాక్షసీ భీమదర్శనా. ౧౫

టీక ॥ కర్ణనాసే=చెవులునుముక్కును; నికృత్తేతు= ఛేదింపఁబడఁగానే; భీమదర్శనా=భయంకరమయిన చూడ్కిగల; సా=ఆ; రాక్షసీ=రాక్షసి; విస్వరం=వికృతమయిన ధ్వనికలుగునట్లుగా; వినద్యచ= అఱచియు; యథాగతం=వచ్చినట్లుగా; ప్రదుద్రావ=పరుగెత్తెను.

చెవులను ముక్కును స్తనములను ఖండింపఁబడఁగానే, భయంకరాకారయగు నారాక్షసి, వికృత స్వరంబున నఱచి, వచ్చిన దారింబట్టి పరుగెత్తెను. అని, తాత్పర్యము.

తస్యాం గతాయాం గహనం వివిశతు ర్వన మోజసా
ఆసేదతు రమిత్రఘ్నౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౧౯

టీక॥ తస్యాం=ఆరాక్షసి; గతాయాం=పోఁగానే; అమిత్రఘ్నౌ=శత్రువులంజంపునట్టి వారలును; భ్రాతరౌ=అన్నదమ్ములయిన; రామలక్ష్మణౌ=రామలక్ష్మణులును; ఓజసా=పరాక్రమముచేత; గహనం=ప్రవేశింపనలవిగానిదియగు; వనం=అడవిని; వివిశతౌ=ప్రవేశించుచు; ఆసేదతుః=పొందిరి.

ఆరాక్షసిపోఁగానే, శత్రువులవధించునట్టి యారామలక్ష్మణులు పరాక్రమంబునవలంబించి, గహనంబగువనంబునంబోవుచు, ఈదుర్నిమిత్తంబులం గనిరి. అని, తాత్పర్యము.

లక్ష్మణస్తు మహాతేజా స్సత్త్వవాన్ శీలవాన్ శుచిః
అబ్రవీ త్ప్రాంజలి ర్వాక్యం భ్రాతరం దీప్తతేజసమ్. ౨౦

టీక॥ మహాతేజాః=అధికమయినపరాక్రమముగలవాఁడును; సత్త్వవాన్=అధికమయిన బలముగలవాఁడును; శీలవాన్=సదాచారముగలవాఁడును; శుచిః=పరిశుద్ధుండునగు; లక్ష్మణస్తు=లక్ష్మణుండుమాత్రము; ప్రాంజలిః=మంచిచేమోడ్పుగలవాఁడై; దీప్తతేజసం=ప్రకాశించుచున్న కాంతిగల; భ్రాతరం=అన్ననుగూర్చి; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

మహాతేజుండును బలవంతుండును సదాచారసంపన్నుండునుపరిశుద్ధుండునగులక్ష్మణుండు, దీప్తతేజుండగునన్నంజూచి, చేమోడ్పుగీలించి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

స్పందతే మే దృఢం బాహు రుద్విగ్నమివ మే మనః
ప్రాయశశ్చా ప్యనిష్టాని నిమిత్తా న్యుపలక్షయే. ౨౧

టీక॥ మే=నాయొక్క; బాహుః=ఎడమభుజము; దృఢం=మిక్కిలియు; స్పందతే=చలించుచున్నది. మే=నాయొక్క; మనః=మనస్సు; ఉద్విగ్నమివ=ది

గులుపడినట్లున్నది. ప్రాయశశ్చాపి=అధికముగాను; అనిష్టాని=అప్రియములయిన; నిమిత్తాని=నిమిత్తములను; ఉపలక్షయే=చూచుచున్నాను.

నాయెడమభుజము, అధికముగానదరుచున్నది; నామనస్సులో చాలదిగులు గలిగియున్నది; అధికముగా దుర్నిమిత్తములుచూపట్టుచున్నవి.

అని, తాత్పర్యము.

తస్మా త్సజ్జీభవా ర్యత్వం కురుష్వ వచనం హితమ్
మమేవహి నిమిత్తాని సద్య శ్శంసంతి సంభ్రమమ్. ౨౨

టీక॥ ఆర్య=పూజ్యుఁడా! తస్మాత్=అందువలన; త్వం=నీవు; సజ్జీభవ=ఆయత్తుండవగుము. హితం=మేలుగలిగించునట్టి; కురుష్వ=చేయుము. మమ=నాకు; నిమిత్తాని= దుర్నిమిత్తములు; సద్యః=తత్క్షణమె; సంభ్రమం = భయమును; శంసంతీవహి=చెప్పునట్లున్నవి గదా!

పూజ్యుఁడవగు రాముఁడా! అందువలన, నీవు ఆయత్తుండవై యుండుము; హితంబగు నామాటం జేయుము; ఈదుర్నిమిత్తంబులం జూడగా, "తత్క్షణంబు భయంబుగలుగు"నని నాకుఁదోఁచుచున్నది. అని, తాత్పర్యము.

ఏష వఞ్చులకో నామ పక్షీ పరమ దారుణః
ఆవయో ర్విజయం యుద్ధే శంసన్నివ వినర్దతి. ౨౩

టీక॥ పరమదారుణః=మిక్కిలియు భయంకరమగు; ఏషః = ఈ; వంచులకోనామ=వంచులనమనునట్టి; పక్షీ=పక్షి; యుద్ధే= యుద్ధమునందు; ఆవయోః=మనకు; విజయం= గెలుపును; శంసన్నివ=చెప్పునదివలె; వినర్దతి = అఱచుచున్నది.

పరమభయంకరంబగు నీవంచులకపక్షి, యఱచుటంజూడఁగా, మనకు యుద్ధంబునం జయంబుగలుగునని తెలియవచ్చుచున్నది. అని, లక్ష్మణుండు, రామునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

తయో రన్వేషతో రేవం సర్వం తద్వన మోజసా

సంజజ్ఞే విపుల శ్శబ్దః ప్రభంజన్నివ తద్వనమ్. ౨౪

టీక॥ తయోః=ఆరామలక్ష్మణులు; ఏవం=ఇట్లు; ఓజసా=పరాక్రమముచేత; తత్=ఆ; వనం=అడవిని; సర్వం=అంతయు; అన్వేషతోః=వెదకుచుండఁగా; తత్=ఆ; వనం=అడవిని; ప్రభంజన్నివ (స్థితః)=విఱుచుచున్నట్లున్న; విపులః=పెద్దదైన; శబ్దః=ధ్వని; సంజజ్ఞే=పుట్టెను.

అట్లు రామలక్ష్మణులు పరాక్రమంబున వలంబించి, ఆవనంబంతయు సీతను వెదకుచుండఁగా, నచ్చట, నవ్వనంబంతయు విఱుచునట్లు, మహాధ్వని యొకటి పుట్టెను. అని, తాత్పర్యము.

సంవేష్టిత మివాత్యర్థం గగనం మాతరిశ్వనా
వనస్య తస్య శబ్దోభూ ద్దివ మాపూరయన్నివ. ౨౫

టీక॥ తస్య=ఆ; వనస్య=అరణ్యము యొక్క; శబ్దః=ధ్వని; గగనం=ఆకాశమును; మాతరిశ్వనా=వాయువుచేత; అత్యర్థం=మిక్కిలియు; సంవేష్టితమివ=చుట్టఁబడిన దానివలె; కుర్వన్ (అధ్యాహృతము)=చేయుచు; దివం=ఆకాశమును; ఆపూరయన్నివ=నిండించుచున్నదివలె; అభూత్=ఉండినది.

ఆవనంబునందలి ధ్వని, ఆకాశంబునంతయుఁ దీనువాయువుచే నావృతంబు సేయుచు, నాకాశంబు నిండి చెలంగినది. అని, తాత్పర్యము.

తం శబ్దం కాంక్షమాణస్తు రామః కక్షే సహానుజః
దదర్శ సుమహాకాయం రాక్షసం విపులోరసమ్. ౨౬

టీక॥ రామః=ఆరాముఁడు; తం=ఆ; శబ్దం=ధ్వనిని; కాంక్షమాణస్తు=కోరినవాఁడైయె; సహానుజః=తమ్మునితోఁ గూడినవాఁడై; సుమహాకాయం=మిక్కిలియు గొప్ప దేహము గలవాఁడును; విపులోరసం=విశాలమయిన ఱొమ్ము గలవాఁడునగు; రాక్షసం=రాక్షసుని; దదర్శ=చూచెను.

రాముఁడు, అధ్వని యొక్క మూలంబుఁ దెలియఁగోరి, తమ్మునితోఁగూడం

స ౬౯

| | |
|---|---|
| బోయి, యొక్కపాదయందు, మహాకా యుందును విశాలవక్షుండునగు రాక్ష | సుండు జూచెను. అని, తాత్పర్యము. |

ఆసేదతు స్తత స్తత్ర తావృభౌ ప్రముఖే స్థితమ్
వివృద్ధ మశిరోగ్రీవం కబంధ ముదరే ముఖమ్. ౨౭
రోమభి ర్నిచితై స్తీక్ష్ణై ర్మహాగిరి మివోచ్ఛ్రితం
నీలమేఘ నిభం రౌద్రం మేఘ స్తనిత నిస్స్వనమ్. ౨౮
అగ్నిజ్వాలానికాశేన లలాటస్థేన దీప్యతా
మహాపక్ష్మేణ పింగేన విపులే నాయతేన చ ౨౯
ఏకేనోరసి ఘోరేణ నయనే నాశుదర్శినా
మహా దంష్ట్రోపపన్నం తం లేలిహానం మహాముఖమ్. ౩౦
భక్షయంతం మహాఘోరా నృక్షసింహ మృగద్విపాన్
ఘోరౌ భుజౌ వికుర్వాణ ముభౌ యోజన మాయతౌ. ౩౧
కరాభ్యాం వివిధాన్ గృహ్య ఋక్షాన్ పక్షిగణాన్ మృగాన్
ఆకర్షంతం వికర్షంత మనేకాన్ మృగయూథపాన్. ౩౨
స్థిత మావృత్య పంథానం తయో ర్భ్రాత్రోః ప్రపన్నయోః

టీక॥ తతః=అంత; తత్ర= అచ్చట; ప్రముఖే=సమీపమునందు; స్థితం= ఉన్నవాఁడును; వివృద్ధం= వృద్ధిఁబొందినవాఁడును; అశిరోగ్రీవం=తలయును కంఠమును లేనివాఁడును; కబంధం = మొండెమును; ఉదరేముఖం = కడుపునందునోరుగలవాఁడును; తీక్ష్ణైః=కఱకులయిన; నిచితైః = దట్టముగానున్న; రోమభిః= వెండ్రుకలచేత; ఉచ్ఛ్రితం=ఉన్నతమగు; మహాగిరిమివ (స్థితం)= మహాపర్వతమువలెనున్నవాఁడును; నీలమేఘనిభం= నల్లనిమేఘముతో సమానుఁడును; రౌద్రం = భయంకరుండును; మేఘస్తనితనిస్స్వనం= మేఘగర్జనమువంటి ధ్వనిగలవాఁడును; అగ్నిజ్వాలానికాశేన = నిప్పుమంటలతో సమానమయినదియు; లలాటస్థేన= నొసటనున్నదియు; దీప్యతా =మండుచున్నదియు; మహాపక్ష్మేణ (మహాపక్ష్మణా)= పెద్దఱెప్పగలదియు; పింగేన=గోరోజనపు వన్నెగలదియు; విపులేన=విశాలమును; ఆయతేన

చ=నిడుపయినదియు; ఏకేన=ఒక్కటి యు; ఘోరేణ=భయంకరమును; ఆశుదర్శినా=శీఘ్రముగాఁజూచునదియునగు; నయనేన=కంటితో ; ఉరసి=ఱొమ్మునందు ; యుక్తం (అధ్యాహృతము)=కూడినవాఁడును; మహాదంష్ట్రోపపన్నం= పెద్దకోఱలతోఁగూడినవాఁడును; లేలిహానం = నాకుచున్నవాఁడును; మహాముఖం= పెద్దనోరుగలవాఁడును; మహాఘోరాన్=మిక్కిలియు భయంకరములయిన; ఋక్షసింహమృగద్విపాన్=ఎలుఁగుబంటులను సింహములనుమృగంబులను ఏనుఁగులను ; భక్షయంతం = భక్షించుచున్నవాఁడును; యోజనం=ఆమడ; ఆయతౌ= దీర్ఘములయిన; ఘోరౌ= భయంకరములుగు; భుజౌ=చేతులను; ఉభౌ=రెంటిని; వికుర్వాణం= చాఁచుచున్నవాఁడును; కరాభ్యాం=చేతులచే; వివిధాన్=నానావిధములగు;ఋక్షాన్= ఎలుఁగుబంటులను;పక్షిగణాన్=పక్షిసమూహములను;మృగాన్=జింకలను;అనేకాన్=అనేకములైన;మృగయూథపాన్=మృగశ్రేష్ఠములను;గృహ్య (గృహీత్వా)=పట్టుకొని;ఆకర్షంతం=ఈడ్చుకొనుచున్నవాఁడును; వికర్షంతం=విశేషించిలాగుచున్నవాఁడును; ప్రపన్నయోః=సమీపమునొందిన;తయోః=ఆ రామలక్ష్మణులయొక్క;పంథానం=మార్గమును;అవృత్య=అడ్డగించి; స్థితం=ఉన్నవాఁడునగు;తం=ఆరాక్షసుని;ఆసేదతుః=సమీపించిరి.

అంత, నారామలక్ష్మణులు, మహాకాయుండును దలయును మెడయును లేనివాఁడును గడుపుననోరుగలవాఁడును దేహమంతయు దట్టముగాఁ దీక్ష్ణములయిన వెండ్రుకలుగలవాఁడును మహాపర్వతంబువలె నత్యున్నతాకారుండును నల్లనిమేఘమువంటి మేనుగలవాఁడును రౌద్రాకారుండును మేఘగర్జనను వంటి ధ్వనిగలవాఁడును అగ్నిజ్వాల బోలినదియు పెద్దఱెప్పతో వెలుఁగుచున్నదియుఁ బింగలవర్ణంబును విశాలంబును దీర్ఘంబును శీఘ్రదృష్టిగలదియు వక్షస్థలంబుననున్నదియునగు నొక్కనేత్రముతోఁ గూడినవాఁడును పెద్దకోఱలుగలవాఁడును నాలికను గదలించుచున్నవాఁడును భయంకరాకారంబును గంభీరంబునగు నోరుగలవాఁడును మహాభయంకరంబులగు నెలుఁగుబంటులను సింహములను మృగంబులను ఏనుఁగులను భక్షించుచున్నవాఁడును భయంకరంబులును యోజనాయతంబులు నగు చేతులరెంటిని జాఁచుచున్నవాఁడును నానావిధంబులగు మృగంబులనుబ

త్ములను ఇటు నటు నాకర్షించుచున్న వాఁడును, మార్గమునడ్డగించియున్న వాఁడునగు, నారాక్షసునిసమీపించిరి.
అని, తాత్పర్యము.

అథ తౌ సమభిక్రమ్య క్రోశమాత్రే దదర్శతుః. ౩౩
మహాంతం దారుణం భీమం కబంధం భుజసంవృతమ్
కబంధమివ సంస్థానా దతిఘోర ప్రదర్శనమ్. ౩౪

టీక॥ అథ=అంత; తౌ=ఆరామలక్ష్మణులు; సమభిక్రమ్య = ఎదురుగాఁబోయి; క్రోశమాత్రే= సమీపమునందు; మహాంతం=గొప్పవాఁడును, గొప్పశరీరముగలవాఁడును; దారుణం,భీమం=మిక్కిలియు భయంకరుండును; భుజసంవృతం=భుజములచే నావరించు వాఁడును ; సంస్థానాత్=ఉనికివలన;కబంధమివ(స్థితం) = మొండెమువలెను న్నవాఁడును; అఘోరప్రదర్శనం = మిక్కిలియుభయంకరమయిన నేత్రము గలవాఁడునగు ; కబంధం=కబంధుని; దదర్శతుః=చూచిరి.

అంత, నారామలక్ష్మణులు, ఎదురుగాఁబోయి, సమీపంబున, మహాకాయుండును మహాభయంకరాకారుండును భుజములచేవ్యాగాదుల నాకర్షించువాఁడు నగు మొండెమువలెనున్నవాఁడును మిక్కిలియుభయంకరమయిననేత్రముగలవాఁడునగుకబంధునింజూచిరి.
అని, తాత్పర్యము.

స మహాబాహు రత్యర్థం ప్రసార్య విపులౌ భుజౌ
జగ్రాహ సహితావేవ రాఘవౌ పీడయ న్బలాత్. ౩౫

టీక॥ మహాబాహుః=పెద్దచేతులుగల; సః=ఆకబంధుఁడు; అత్యర్థం= మిక్కిలియు;విపులౌ = విశాలములయిన; భుజౌ=చేతులను; ప్రసార్య=చాఁచి; సహితావేవ= కూడినవారలుగానేయున్న ; రాఘవౌ=రామలక్ష్మణులను; బలాత్=బలమువలన;పీడయన్= పీడించుచు; జగ్రాహ= గ్రహించెను.

మహాబాహుండగు నాకబంధుండు మహాదీర్ఘంబులయిన తనబాహువులనుజాఁచి, భుజబలంబున, రామలక్ష్మణులనిద్దఱంజేర్చిపట్టి, యాకర్షించెను. అని, తాత్పర్యము.

ఖడ్గినౌ దృఢధన్వానౌ తిగ్మతేజోవపుర్ధరౌ
భ్రాతరౌ వివశం ప్రాప్తౌ కృష్యమాణౌ మహాబలౌ. ౩౬

టీక॥ఖడ్గినౌ=కత్తులుగలవారలును; దృఢధన్వానౌ=దృఢములయిన ధనుస్సులుగలవారలును ; తిగ్మతేజోవపుర్ధరౌ=తీక్ష్ణమయిన తేజస్సుగలదేహమును ధరించినవారలును; మహాబలౌ=అధికమయినబలముగలవారలునగు ; భ్రాతరౌ=అన్నదమ్ములు; కృష్యమాణౌ=ఆకర్షింపఁబడుచున్నవారలై; వివశం=పరవశతను; ప్రాప్తౌ=పొందిరారు.

కత్తులును దృఢములయిన ధనుస్సులును ధరించియున్నవారలును మహాతేజంబున వెలుఁగుచున్న మేనుగలవారలును మహాబలశాలులునగు నాయన్నదమ్ములు ఇర్వురును, కబంధుని బాహువులచేనాకర్షింపఁబడినవారలై, పరవశులైరి. అని, తాత్పర్యము.

తత్ర స్థైర్యేణ శూరస్తు రాఘవో నైవ వివ్యథే
బాల్యాద నాశ్రయత్వాచ్చ లక్ష్మణ స్త్వతి వివ్యథే. ౩౭

టీక॥తత్ర=అప్పుడు; శూరః=యుద్ధమునందు భయములేనివాఁడగు; రాఘవస్తు=రాముఁడుమాత్రము; స్థైర్యేణ=స్థైర్యముచేత; నవివ్యథే=దుఃఖింపఁడయ్యె. లక్ష్మణస్తు=లక్ష్మణుఁడుమాత్రము; బాల్యాత్=చిన్నతనమువలనను; అనాశ్రయత్వాచ్చ=స్థైర్యావలంబములేమివలనను; అతివివ్యథే=మిక్కిలియు దుఃఖించెను.

ఆయవస్థయందు, శూరుండగు రాముండు, స్థైర్యమునఁ,గొంచెమేని దుఃఖము నొందకుండెను; లక్ష్మణుండుమాత్రము, బాలుండగుటచేతను, అంతస్థైర్యములేనివాఁడగుటచేతను , మిక్కిలియుదుఃఖమునొందెను.

అని, తాత్పర్యము.

ఉవాచ చ విషణ్ణస్సన్ రాఘవం రాఘవానుజః

టీక॥రాఘవానుజః=రామునితమ్ముండగు లక్ష్మణుఁడు; విషణ్ణస్సన్=దుఃఖితుఁడై; రాఘవం=రామునిగూర్చి; ఉవాచచ=చెప్పెను.

రామునితమ్ముండగులక్ష్మణుండు , దుఃఖితుఁడై, రామునితోనిట్లనిచెప్పెను.

అని, తాత్పర్యము.

పశ్యమాం వీర వివశం రాక్షసస్య వశంగతమ్. ౩౮
మయ్యైకేన వినిర్యుక్తః పరిముంచస్వ రాఘవ

టీక॥ వీర=పరాక్రమశాలివగు; రాఘవ=రాముఁడా! రాక్షసస్య=రాక్షసునియొక్క; వశం=అధీనతను; గతం=పొందినవాఁడును; వివశం=పరాధీనుఁడునగు; మాం=నన్ను; పశ్య=చూడుము. ఏకేన=ఒకఁడనగు; మయా=నాచేత; వినిర్యుక్తః=వినియోగించినవాఁడవై; పరిముంచస్వ=విడిపించుకొనుము.

పరాక్రమశాలివగు రాముఁడా! నేను, రాక్షసునిచేతులంజిక్కి పరవశుండనై యున్నానుజూడుము; నన్నొకనివినియోగించి నీవువిడిపించుకొనుము.

అని, తాత్పర్యము.

మాంహి భూతబలిం దత్వా పలాయస్వ యథాసుఖం. ౩౯

టీక॥ మాంహి=నన్నే; భూతబలిం=భూతమునకుబలినిగా; దత్వా=ఇచ్చి; యథాసుఖం=సుఖముఁగా; పలాయస్వ=పరుగెత్తుము.

నీవు, నన్ను, ఈభూతముకుబలియొసంగి, సుఖంబుగా పరుగెత్తుము.

అని, తాత్పర్యము.

అధిగంతాసి వైదేహీ మచిరేణేతి మే మతిః

టీక॥ అచిరేణ=శీఘ్రముగా; వైదేహీం=సీతను; అధిగంతాసి=పొందఁగలవు, ఇతి=అని; మే=నాయొక్క; మతిః=అభిప్రాయము.

శీఘ్రమునసీవుసీతనుంబొందఁగలవని నాయభిప్రాయము.

అని, తాత్పర్యము.

ప్రతిలభ్య చ కాకుత్స్థ పితృపైతామహీం మహీం. ౪౦
తత్ర మాం రామ రాజ్యస్థ స్స్మర్తుమర్హసి సర్వదా

టీక॥ కాకుత్స్థ=కకుత్స్థవంశమునందుఁబుట్టిన; రామ=రాముఁడా! పితృపైతామహీం=తండ్రితాతలవలనవచ్చిన; మహీం=భూమిని; ప్రతిలభ్యచ=పొం

దియు; తత్ర = అచ్చట; రాజ్యస్థః = రాజ్యమునందున్నవాఁడవై; సర్వదా = ఎల్లప్పుడును; మాం = నన్ను; స్మర్తుం = తలంచుటకు; అర్హసి = తగుదువు.

కాకుత్స్థవంశమునఁబుట్టిన రామునా! అచ్చటనయోధ్యకుఁబోయి, పిత్రుపైతామహంబు రాజ్యంబునొంది, రాజ్యపరిపాలనంబు సేయుచు దివ్యభోగంబులననుభవించుచు, నన్నుఁ దలంచుకొనుచుండుము. అని, లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

లక్ష్మణే నైవ ముక్తస్తు రామ స్సౌమిత్రి మబ్రవీత్. ౪౧

టీక॥ రామః = రాముఁడు; లక్ష్మణేన = లక్ష్మణునిచేత; ఏవం = ఇట్లు; ఉక్తస్తు = చెప్పఁబడినవాఁడైనంతనే; సౌమిత్రిం = లక్ష్మణునిగూర్చి; అబ్రవీత్ = చెప్పెను.

రాముఁడు, లక్ష్మణుఁడు చెప్పినమాటనువిని, యతనింజూచి యిట్లుఁ, పలికెను. అని, తాత్పర్యము.

మా స్మ త్రాసం కృథావీర నహిత్వా దృగ్విషీదతి

టీక॥ వీర = పరాక్రమశాలివగులక్ష్మణుఁడా! త్రాసం = భయమును; మాకృథాస్స్మ = చేయకుము. త్వాదృక్ = నీయట్టివాఁడు; నవిషీదతిహి = దుఃఖింపఁడుగదా!

వీరుఁడా! భయపడకుము; నీయట్టివాఁడిట్లు విషాదంబునొందుట సరిగాదు. అని, రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఏతస్మిన్నంతరే క్రూరో భ్రాతరౌ రామ లక్ష్మణౌ. ౪౨
పప్రచ్ఛ ఘన నిర్ఘోషః కబంధో దానవోత్తమః

టీక॥ ఏతస్మిన్నంతరే = ఈనడుమ; క్రూరః = దయలేనివాఁడును; ఘననిర్ఘోషః = మేఘముయొక్క ధ్వనివంటి ధ్వనిగలవాఁడును; దానవోత్తమః = దానవశ్రేష్ఠుండునగు; కబంధః = కబంధుఁడు; భ్రాతరౌ = అన్నదమ్ములగు; రామలక్ష్మణౌ = రామలక్ష్మణులను; పప్రచ్ఛ = అడిగెను.

ఇంతలో, క్రూరుండగు దానవోత్తముఁడు కబంధుండు, అన్నదమ్ముల

గునారామలక్ష్మణులంజూచి, మేఘగర్జనంబోలు గంభీరధ్వనితో, నిట్లని, యడిగెను. అని, తాత్పర్యము.

కౌ యువాం వృషభస్కంధౌ మహా ఖడ్గ ధనుర్ధరౌ. ౪౩
ఘోరం దేశ మిమం ప్రాప్తౌ మమ భక్షా వుపస్థితౌ

టీక॥ వృషభస్కంధౌ= ఆంబోతులమూంపులవంటి మూంపులుగల వారలును; మహాఖడ్గధనుర్ధరౌ= గొప్పఖడ్గములను ధనుస్సులను ధరించినవారలునగు; యువాం=మీరలు; కౌ=ఎవ్వరు; ఘోరం=భయంకరమయిన; ఇమం= ఈ; దేశం= ప్రదేశమును; ప్రాప్తౌ= పొందినారు? మమ=నాకు; భక్షౌ=ఆహారముగా; ఉపస్థితౌ=వచ్చినారు?

ఆంబోతుమూంపులవంటి భుజశిఖరములుగల్గిగొప్పవగుఖడ్గములునుధనుస్సులునుదాల్చియున్నారలు; మీరలెవ్వరు? భయంకరంబగునీవనంబునకువచ్చి నాకాహారంబయితిరి? అని, తాత్పర్యము.

వదతం కార్య మిహ వాం కిమర్థం చాగతౌ యువామ్. ౪౪
ఇమం దేశ మనుప్రాప్తౌ క్షుధార్తస్యేహ తిష్ఠతః

టీక॥ ఇహ=ఇచ్చట ; వాం=మీయొక్క; కార్యం=పనిని; వదతం=చెప్పుండు. యువాం=మీరలు; కిమర్థం చ= ఎందుకొఱకు; ఆగతౌ= వచ్చినవారలయి; మమ(అధ్యాహృతము)=నేను; క్షుధార్తస్య= ఆంకలిచేం బీడింపంబడినవాండనై; ఇహ=ఇచ్చట ; తిష్ఠతః=ఉండంగా; ఇమం=ఈ; దేశం=ప్రదేశమును; అనుప్రాప్తౌ=పొందినారు?

ఇచ్చట మీకేమికార్యమున్నది చెప్పుండు; నేనాంకలిగొనియుండంగా నాయాంకలిదీఱునట్లు, ఇచ్చటికేలవచ్చినారలు? అని, తాత్పర్యము.

సబాణచాప ఖడ్గౌచ తీక్ష్ణశృంగా వివర్షభౌ. ౪౫
మమాస్య మనుసంప్రాప్తౌ దుర్లభం జీవితం పునః

టీక॥ సబాణచాపఖడ్గౌ చ=బాణములతోను ధనుస్సులతోను ఖడ్గములతోఁగూడినవారలును, కావునసె; తీక్ష్ణశృంగౌ= కఱకులయిన కొమ్ములుగల; ఋషభావివ(స్థితౌ)= ఆఁబోతులువలె నున్నవారలునగుమీరలు;మమ=నాయొక్క; అస్యం=నోరును; అనుసంప్రాప్తౌ=సమీపించినారు. పునః= మఱల; జీవితం=బ్రతుకు; దుర్లభం= పొందనలవిగాదు.

ధనుర్బాణంబులు ఖడ్గంబులును ధరించి తీక్ష్ణశృంగములగు ఆబోతుల వలెనున్నమీరలు నానోటి సమీపంబునకు వచ్చినారు; ఇంకమిమ్ము ప్రాణంబులతోఁబోనివ్వను. అని, తాత్పర్యము.

తస్య తద్వచనం శ్రుత్వా కబంధస్య దురాత్మనః. ౭౬
ఉవాచ లక్ష్మణం రామో ముఖేన పరిశుష్యతా

టీక॥ రామః=రాముఁడు ; దురాత్మనః=దుష్టబుద్ధిగల; తస్య=ఆ; కబంధస్య=కబంధునియొక్క; తత్ =ఆ; వచనం=మాటను; శ్రుత్వా= విని; పరిశుష్యతా=ఎండుచున్న; ముఖేన= నోరుతో; లక్ష్మణం=లక్ష్మణునిఁగూర్చి; ఉవాచ=చెప్పెను.

రాముఁడు, దురాత్ముండగునా కబంధునిమాటనువిని, భయంబుననోరెండఁగా, లక్ష్మణుంజూచి, యిట్లని, చెప్పెను.అని, తాత్పర్యము.

కృచ్ఛ్రాత్ కృచ్ఛ్రతరం ప్రాప్య దారుణం సత్యవిక్రమ. ౭౭
వ్యసనం జీవితాంతాయ ప్రాప్తమప్రాప్య తాం ప్రియామ్

టీక॥ సత్యవిక్రమ=సత్యమయినపరాక్రమముగలలక్ష్మణుఁడా! కృచ్ఛ్రాత్=కష్టమునుండి; కృచ్ఛ్రతరం= మిక్కిలిగష్టమును; ప్రాప్య=పొంది;ప్రియాం=ప్రియురాలయిన; తాం=ఆసీతను; అప్రాప్య= పొందక; జీవితాంతాయ=ప్రాణనాశముకొఱకు; దారుణం=భయంకరమయిన; వ్యసనం= కష్టమును; ప్రాప్తం=పొందఁబడినది.

సత్యపరాక్రముఁడవగు లక్ష్మణుఁడా! మొదటరాజ్యభ్రంశము వనవాసము ఆవల, సీతాపహరణము, ఇట్లుక

ష్టముపయిఁగష్టము నొంది, మనము, నీ తంబొందక యె, ప్రాణనాశకరంబగు నీకష్టంబునొందిరోము.

అని, తాత్పర్యము.

కాలస్య సుమహద్వీర్యం సర్వభూతేషు లక్ష్మణ. ౪౮
త్వాంచ మాంచ నరవ్యాఘ్ర వ్యసనైః పశ్య మోహితౌ

టీక॥ నరవ్యాఘ్ర=పురుషశ్రేష్ఠుఁడవగు; లక్ష్మణ=లక్ష్మణుఁడా! సర్వభూతేషు=సమస్తభూతములయందును; కాలస్య = కాలముయొక్క; వీర్యం=పరాక్రమము; సుమహత్=మిక్కిలియుగొప్పది. వ్యసనైః= కష్టములచేత; మోహితౌ=మోహమునొందిన; త్వాంచ=నిన్నును; మాంచ=నన్నును; పశ్య=చూచుకొనుము.

పురుషశ్రేష్ఠుఁడవగు లక్ష్మణుఁడా! సమస్త భూతములయందును గాలముయొక్క బలమున కెదురులేదు; నీవును నేనును, ఇట్లుకష్టములచేఁబీడింపఁబడుచున్నాము; చూడుము.

అని, తాత్పర్యము.

నాతిభారో స్తికాలస్య సర్వభూతేషు లక్ష్మణ. ౪౯

టీక॥లక్ష్మణ=లక్ష్మణుఁడా ! సర్వభూతేషు= సమస్తభూతములయందును; కాలస్య= కాలమునకు; అతిభారః=మిక్కిలియుబరువు; నాస్తి=లేదు.

లక్ష్మణుఁడా ! సమస్తభూతములయందును గాలంబునకసాధ్యమయినదేదియు లేదు.

అని, తాత్పర్యము.

శూరాశ్చ బలవంతశ్చ కృతాస్త్రాశ్చ రణాజిరే
కాలాభిపన్నా స్సీదంతి యథా వాలుకసేతవః. ౫౦

టీక॥రణాజిరే=యుద్ధభూమియందు; శూరాశ్చ=శూరులును; బలవంతశ్చ= అధికమయిన బలముగలవారలును; కృతాస్త్రాశ్చ = నేర్వఁబడినయస్త్రములు గలవారును ; కాలాభిపన్నాః=కాలముచేఁగొట్టఁబడిన వారలయి; వాలుకసేతవోయథా = ఇసుకతోఁ జేయఁబడిన యన కట్టలువలె ;

స ౬౯

సీదంతి=నశించుచున్నారు.

యుద్ధభూమియందుశూరులును బలవంతులును అస్త్రవేత్తలునగువారలు నుగూడ,కాలహతులయి, యినుకతోఁ గట్టఁబడిన యనకట్టలువలె, నాశంబు నొందుదురు.అని,రాముండు,లక్ష్మణుని తోఁజెప్పెను. అని,తాత్పర్యము.

ఇతి బ్రువాణో దృఢసత్యవిక్రమో
మహాయశా దాశరథిః ప్రతాపవాన్
అవేక్ష్య సౌమిత్రి ముదగ్రపౌరుషం
స్థిరాం తదా స్వాం మతి మాత్మనా కరోత్. ౫౧

టీక॥దృఢసత్యవిక్రమః=దృఢమును వ్యర్థముకానిదియునగు పరాక్రమము గలవాఁడును; మహాయశాః=అధికము యినకీర్తిగలవాఁడును;ప్రతాపవాన్=అధికమైన ప్రతాపము గలవాఁడునగు; దాశరథిః=దశరథమహారాజు పుత్రుఁడైనరాముఁడు;ఇతి=అని; బ్రువాణః=చెప్పుచు; ఉదగ్రపౌరుషం=అధికమయినపౌరుషముగల; సౌమిత్రిం=లక్ష్మణునిః అవేక్ష్య=చూచి; తదా=అప్పుడు; స్వాం=తనదైన; మతిం=బుద్ధిని; ఆత్మనా=ధైర్యముచేత; స్థిరాం=నిలుకడగా;అకరోత్=చేసెను.

దృఢంబును సత్యంబునగు పరాక్రమముగలవాఁడును మహా కీర్తిశాలియుఁ బ్రతాపవంతుండునగు దశరథమహారాజుపుత్రుఁడైనరాముండు, మహాపౌరుషశాలియగు లక్ష్మణుంజూచి , ధైర్యంబునఁ, దనబుద్ధినిస్థిరంబుగావించుకొనెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అరణ్యకాండే, ఏకోనసప్తతితమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అరణ్యకాండైకోనసప్తతితమసర్గటీక, ముగిసినది.




శ్రీ

## సప్తతితమసర్గప్రారంభః.

**తౌ తు తత్ర స్థితౌ దృష్ట్వా భ్రాతరౌ రామలక్ష్మణౌ**
**బాహుపాశపరిక్షిప్తౌ కబంధో వాక్య మబ్రవీత్. ౧**

టీక॥ కబంధః = కబంధుఁడు; తత్ర=అచ్చట; బాహుపాశపరిక్షిప్తౌ=త్రాళ్లవంటిబాహువులచేఁ జుట్టఁబడినవారలును; స్థితౌ=నిలుచున్నవారలునగు; భ్రాతరౌ=అన్నదమ్ములగు; తౌ= ఆ; రామలక్ష్మణౌ=రామలక్ష్మణులను; దృష్ట్వాతు=చూచినంతనె; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

కబంధుండు, పాశంబులవంటితన బాహువులచేఁబరివేష్టితులయి యచ్చటనిలుచున్నయన్నదమ్ముల నారామలక్ష్మణులంజూచియిట్లనిచెప్పెను.

అని, తాత్పర్యము.

**తిష్ఠతః కిన్ను మాం దృష్ట్వా క్షుధార్తం క్షత్రియర్షభౌ**
**ఆహారార్థం తు సందిష్టౌ దైవేన గతచేతసౌ. ౨**

టీక॥ క్షత్రియర్షభౌ=క్షత్రియశ్రేష్ఠులారా! యువాం(అధ్యాహృతము)=మీరలు; దైవేన=దైవముచేత; ఆహారార్థంతు=ఆహారముకొఱకై యె ; సందిష్టౌ=పంపఁబడినవారలయి; గతచేతసౌ=పోయినబుద్ధిగలవారలయి; క్షుధార్తం=ఆఁకలిచేఁబీడింపఁబడిన; మాం=నన్ను; దృష్ట్వా=చూచి; కిన్ను=ఎందుకు; తిష్ఠతః=నిలుచుండియున్నారు?

క్షత్రియశ్రేష్ఠులారా! దైవము నాకాహారార్థముగాఁ బంపగా మీరలిచ్చటికివచ్చినారే; బుద్ధిలేనివారివలె, ఏలయూరక నిలుచున్నారు? అని,కబంధుండు,రామలక్ష్మణులతోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

**తచ్ఛ్రుత్వా లక్ష్మణో వాక్యం ప్రాప్తకాలం హితం తదా**
**ఉవాచార్తం సమాపన్నో విక్రమే కృతలక్షణః. ౩**




టీక॥ లక్ష్మణః=లక్ష్మణుఁడు; తత్=ఆ; వాక్యం=మాటను; శ్రుత్వా=విని; ఆర్తిం=దుఃఖమును; సమాపన్నః=పొందినవాఁడై; తదా=అప్పుడు; విక్రమే=పరాక్రమమునందు; కృతలక్షణః=చేయఁబడిన ప్రయత్నముగల వాఁడై; ప్రాప్తకాలం=పొందఁబడిన కాలము గలదియు; హితం=మేలుగలిగించునది యునగుమాటను; ఉవాచ=చెప్పెను.

లక్ష్మణుండామాటనువిని, దుఃఖితుండై, వెట్టకేలకుఁబరాక్రమంబు నవలంబించి, యప్పటికిఁదగినదియు హితంబునగునీమాటంజెప్పెను.

అని, తాత్పర్యము.

త్వాంచ మాంచ పురా తూర్ణ మాదత్తే రాక్షసాధమః
తస్మా దసిభ్యా మస్యాశు బాహూ ఛిందావహై గురూ. ౪

టీక॥ రాక్షసాధమః=రాక్షసులలోఁదక్కువయినకబంధుండు; పురా=ముందు; తూర్ణం=శీఘ్రముగా; త్వాంచ=నిన్నును; మాంచ=నన్నును; ఆదత్తే=గ్రహించుచున్నాఁడు, మ్రింగుచున్నాఁడనుట; తస్మాత్=అందువలన; ఆశు=శీఘ్రముగా; అస్య=ఈరాక్షసుని యొక్క; గురూ=పెద్దవగు; బాహూ=చేతులను; అసిభ్యాం=కత్తులచేత; ఛిందావహై=ఛేదింతము.

ఈరాక్షసాధముఁడు, ఇంకశీఘ్రము ననిన్నునునన్నునుమ్రింగును; కావున, నీతనివి స్తీర్ణంబులగు బాహువులరెంటిని శీఘ్రంబున ఖడ్గంబులచే నఱకుదము.

అని, తాత్పర్యము.

భీషణో యం మహాకాయో రాక్షసో భుజవిక్రమః
లోకం హ్యతిజితం కృత్వా హ్యావాం హంతు మిహేచ్ఛతి. ౫

టీక॥ భీషణః=భయంకరుండును; మహాకాయః=పెద్దశరీరము గలవాఁడును; భుజవిక్రమః=భుజములయందుఁ బరాక్రమముగలవాఁడునగు; అయం=ఈరాక్షసుఁడు; లోకం=లోకమును; అతిజితం=మిక్కిలియుజయింపఁబడినదానిఁగా; కృత్వా=చేసి ("హి" అనునది పాదపూరణార్థము); ఇహ=ఇప్పుడు; ఆవాం=మనలను; హంతుం=చంపుటకు; ఇచ్ఛతి=కోరుచున్నాఁడు

గదా!

భయంకరాకారుండును మహాకాయుండును భుజములయందు మాత్రమె పరాక్రమము గలవాఁడునగు నీరాక్షసుండు, లోకమునంతయు వశముచేసికొని, మనలంభింపఁగోరుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

నిశ్చేష్టానాం వధో రాజన్ కుత్సితో జగతీపతేః
క్రతుమధ్యోపనీతానాం పశూనామివ రాఘవ. ౬

టీక॥ రాజన్=రాజవయిన; రాఘవ= రాముఁడా! క్రతుమధ్యోపనీతానాం=యాగమధ్యమును బొందింపఁబడిన; పశూనామివ=పశువులయొక్కవలె; నిశ్చేష్టానాం= ఏమియుఁజేయనివారలయొక్క; వధః=చంపుట; జగతీపతేః= రాజునకు; కుత్సితః=నిందితము.

రాజవగు రాముఁడా! యాగమధ్యమునకు దక్షిణార్థమై తేఁబడినపశువులను వధింపఁగూడనట్లు, ఏమియు నపకారము చేయనివారలను రాజు వధింపరాదు. అని, లక్ష్మణుండు రామునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఏతత్సంజల్పితం శ్రుత్వా తయోః క్రుద్ధస్తు రాక్షసః
విదార్యాస్యం తదా రౌద్రస్తౌ భక్షయితు మారభత్. ౭

టీక॥ రౌద్రః=భయంకరుండగు; రాక్షసః=కబంధుఁడు; తయోః=ఆ రామలక్ష్మణులయొక్క; ఏతత్=ఈ; సంజల్పితం=మాటను; శ్రుత్వాతు= విన్నంతనే; క్రుద్ధః=కోపమునొందినవాఁడై; తదా=అప్పుడు; ఆస్యం=నోటిని; విదార్య=తెరచి; తౌ=ఆ రామలక్ష్మణులను; భక్షయితుం=తినుటకు; ఆరభత్=ప్రారంభించెను.

భయంకరాకారుండగు నాకబంధుఁడు, రామలక్ష్మణులయామాటను విని, కుపితుండై, యంత, నోరు దెఱచి, వారలమ్రింగఁబోయెను.

అని, తాత్పర్యము.

తతస్తౌ దేశకాలజ్ఞౌ ఖడ్గాభ్యామేవ రాఘవౌ
అచ్ఛిందతాం సుసంవిగ్నౌ బాహూ తస్యాంసదేశతః. ౮

టీక॥ తతః=అంత; దేశకాలజ్ఞౌ=దేశకాలములనెఱింగిన; తౌ=ఆ; రాఘవౌ=రామలక్ష్మణులు; ఖడ్గాభ్యామేవ=కత్తులచేతనే; సుసంవిగ్నౌ=మిక్కిలి యుభయమునొందినవగు; తస్య=ఆకబంధునియొక్క; బాహూ=చేతులను; అంసదేశతః= మూఁపులయందు; అచ్ఛిందతాం=నఱికిరి.

అంత, ఏదేశమునందే కాలమునందే యికర్తవ్యమో చక్కఁగాఁ దెలిసినట్టియా రామలక్ష్మణులు, భయంబున వడంకుచున్న కబంధుని రెండుచేతులను, మూఁపులవఱకుఁ ఖడ్గంబులచే ఖండించెను. అని, తాత్పర్యము.

దక్షిణో దక్షిణం బాహు మసక్త మసినా తతః
చిచ్ఛేద రామో వేగేన సవ్యం వీరస్తు లక్ష్మణః. ౯

టీక॥ తతః=అంత; దక్షిణః=సమర్థుఁడగు; రామః=రాముఁడు; అసినా=కత్తిచేత; దక్షిణం = కుడిదైన; బాహుం=చేతిని; అసక్తం=అడ్డిలేకుండునట్లుగా; వేగేన=వేగముచేత; చిచ్ఛేద=నఱికెను. వీరః=పరాక్రమశాలియగు; లక్ష్మణస్తు=లక్ష్మణుఁడు మాత్రము; సవ్యం=ఎడమదగుచేతిని; చిచ్ఛేద(అధ్యాహృతము) = నఱికెను.

అంత, సమర్థుఁడగు రాముఁడు, వేగంబున, ఎంతమాత్రము అడ్డములేకుండునట్లు, కబంధుని కుడిభుజమును ఖండించెను; పరాక్రమశాలియగులక్ష్మణుండు, ఎడమచేతిని నఱికెను.

అని, తాత్పర్యము.

సపపాత మహాబాహు శ్ఛిన్నబాహు ర్మహాస్వనః
ఖంచ గాంచ దిశశ్చైవ నాదయన్ జలదో యథా. ౧౦

టీక॥ మహాబాహుః=పెద్దచేతులుగల; సః = ఆకబంధుఁడు; ఛిన్నబాహుః=నఱకఁబడిన చేతులుగలవాఁడై; మహాస్వనః=అధికమయినధ్వనిగలవాఁడై; జలదో యథా=మేఘమువలె; ఖంచ=ఆకాశమును; గాంచ= భూమిని; దిశశ్చైవ=దిక్కులను; నాదయన్ = ధ్వనింపఁజేయుచు; పపాత=పడెను.

మహాబాహుండగునాకబంధుఁడు, చేతులుదెగి, పేరెలుంగుననఱుచుచు, మే

స ౭౦

ఘమువలె ధరాన్త్యాకాశంబులనుదిక్కు-లనుబ్రతిధ్వనిగదురగర్జించుచు, నేలంబడెను.

అని, తాత్పర్యము.

స నికృత్తౌ భుజౌ దృష్ట్వా శోణితౌఘ పరిప్లుతః
దీనః పప్రచ్ఛ తౌ వీరౌ కౌయువా మితిదానవః. ౧౧

టీక॥సః=ఆ; దానవః= కబంధుఁడు; శోణితౌఘపరిప్లుతః=నెత్తురుప్రవాహముచేఁ దడుపఁబడినవాఁడై ; నికృత్తౌ=నఱకఁబడిన; భుజౌ= చేతులను; దృష్ట్వా=చూచి; దీనః= గర్వముడిగినవాఁడై; తౌ=ఆ; వీరౌ=పరాక్రమశాలులగురామలక్ష్మణులను; "యువాం=మీరలు; కౌ=ఎవ్వరు?" ఇతి=అని; పప్రచ్ఛ=అడిగెను.

ఆకబంధుండు, నెత్తుటందోఁగుచుఁదనచేతులు రెండును ఖండింపఁబడుటనుగని దీనుండై, వీరులగు నారామలక్ష్మణులంజూచి, "మీరలెవ్వరు?" అనియడిగెను. అని, తాత్పర్యము.

ఇతి తస్య బ్రువాణస్య లక్ష్మణ శ్శుభలక్షణః
శశంస రాఘవం తస్య కబంధస్య మహాత్మనః. ౧౨

టీక॥ ఇతి=ఇట్లు; తస్య= ఆకబంధుఁడు; బ్రువాణస్య=చెప్పుచుండఁగా; శుభలక్షణః = మంగళకరములగులక్షణములుగల;లక్ష్మణః=లక్ష్మణుఁడు; మహాత్మనః= అధికమయినపరాక్రమముగల; తస్య=ఆ ; కబంధస్య=కబంధునకు; రాఘవం = రాముని; శశంస= చెప్పెను.

ఇట్లు,కబంధుండడుగ, మంగళలక్షణుండగులక్ష్మణుండు, మహాపరాక్రమశాలియగునతనికి, రామునివృత్తాంతంబుచెప్పెను. అని,తాత్పర్యము.

అయ మిక్ష్వాకుదాయాదో రామోనామ జనై శ్శ్రుతః
అస్యైవా వరజం విద్ధి భ్రాతరం మాంచ లక్ష్మణమ్. ౧౩

టీక॥అయం= ఈతఁడు; ఇక్ష్వాకుదాయాదః=ఇక్ష్వాకువంశమునఁ బుట్టి

వ దశరథమహారాజుకొడుకు. రామో నామ=రాముఁడని; జనైః= జనులచేత; శ్రుతః= వినఁబడినవాఁడు. మాం చ=నన్నును; అస్యైవ= ఇతనియొక్క యె; అవరజం= వెనుకఁబుట్టిన; భ్రాతరం=తోఁబుట్టువునుగాను; లక్ష్మణం= లక్ష్మణుండనుపేరుగలవానిగాను;విద్ధి= ఎఱుంగుము.

ఈతఁడు, ఇక్ష్వాకువంశంబునంబుట్టిన దశరథమహారాజు కుమారుండు; ఇతని రాముండని జనులుపిలుతురు; నేన తనితమ్ముఁడ లక్ష్మణుండను.

అని, తాత్పర్యము.

అస్య దేవప్రభావస్య వసతో విజనే వనే
రక్షసా పహృతా పత్నీ యా మిచ్ఛంతా విహా గతౌ. ౧౪

టీక॥విజనే=జనులులేని; వనే=అడవియందు;వసతః=ఉండునట్టి; దేవప్రభావస్య=దేవతయొక్క ప్రభావమువంటిప్రభావముగల; అస్య= ఈరాముని యొక్క; పత్నీ=భార్య; రక్షసా=రాక్షసునిచేత;అపహృతా=అపహరింపఁబడినది. యాం=ఎవ్వతెను;ఇచ్ఛంతౌ= వెదకుచు;ఇహ=ఇచ్చటికి; ఆగతౌ=వచ్చినామో.

విజనంబగువనంబునవాసముసేయుచున్నదేవేంద్రపరాక్రముఁడగునీరాముని భార్యను రాక్షసుండొకఁడపహరించినాఁడు ; మేమాబిడనె వెదకుకొనుచు యిచ్చటికివచ్చినాము.

అని, తాత్పర్యము.

త్వంతు కో వా కిమర్థం వా కబంధసదృశో వనే
ఆస్యేనో రసి దీప్తేన భగ్నజంఘో వివేష్టసే. ౧౫

టీక॥త్వంతు=నీవును;కోవా=ఎవ్వఁడవు? కిమర్థంవా=ఎందుకొఱకు; వనే= అడవియందు; కబంధసదృశః= మొండెముతోసమానుఁడవై; భగ్నజంఘః=విఱిగినపిక్కలుగలవాఁడవై; ఉరసి=ఱొమ్మునందు; దీప్తేన=ప్రకాశించుచున్న;ఆస్యేన=ఱొమ్ముతో; వివేష్టసే=పొరలుచున్నావు?

నీవెవ్వఁడవు? కబంధాకారుండవై,పిక్కలుదలయులేక,ఱొమ్మునఁబ్రకాశ

స ౭౦




మానంబగునోరుఁగలిగి, యిట్టివనంబునఁ బొరలుచున్నావేల? అని, లక్ష్మణుండు, కబంధునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్తః కబంధస్తు లక్ష్మణే నోత్తరం వచః
ఉవాచ పరమప్రీత స్తదింద్ర వచనం స్మరన్

టీక॥ కబంధస్తు=కబంధుఁడును; లక్ష్మణేన=లక్ష్మణునిచేత; ఏవం=ఇట్లు; ఉక్తః=చెప్పఁబడినవాఁడై; తత్=ఆ; ఇంద్రవచనం= ఇంద్రునిమాటను; స్మరన్=తలంచుచు; పరమప్రీతః=మిక్కిలియు సంతోషమునొందినవాఁడై; ఉత్తరం=బదులయిన; వచః=మాటను; ఉవాచ=చెప్పెను.

కబంధుండు, లక్ష్మణునిమాటనువిని, పూర్వకాలమునకింద్రుఁడుచెప్పిన మాటలందలంచుకొని, శాపావసానకాలము వచ్చినదని పరమసంతుష్టుండై, యిట్లనిచెప్పెను. అని, తాత్పర్యము.

స్వాగతం వాం నరవ్యాఘ్రౌ దిష్ట్యా పశ్యామి చాప్యహమ్
దిష్ట్యాచేమౌ నికృత్తౌ మే యువాభ్యాం బాహుబంధనౌ. ౧౭

టీక॥ నరవ్యాఘ్రౌ= పురుషశ్రేష్ఠులారా! వాం=మీకు; స్వాగతం=సుఖముతోడిరాక; అస్తు(అధ్యాహృతము)=అగుఁగాక. యువాం= మిమ్మును; అహం=నేను; దిష్ట్యా=భాగ్యముచేత; పశ్యామిచాపి=చూడనుజూచుచున్నాను. మే=నాయొక్క; బాహుబంధనౌచ=చేతుల బంధించునట్టి మారెఁడులును; దిష్ట్యా=భాగ్యముచేత; యువాభ్యాం=మీచేత; నికృత్తౌ=ఛేదింపఁబడినవి.

పురుషశ్రేష్ఠులారా! మీకుస్వాగతం బగుఁగాక; నాభాగ్యవశంబునమీదర్శనంబునాకుఁగలిగినది; నాభాగ్యవశంబుననె, నాభుజశిఖరంబులురెండునుమీచేఛేదింపఁబడుటయు, నాకుఁ బ్రాప్తమయినది. అని, తాత్పర్యము.

విరూపం యచ్చ మే రూపం ప్రాప్తం హ్యవినయా ద్యథా
తన్మే శృణు నరవ్యాఘ్ర తత్త్వత శ్శంసత స్తవ. ౧౮




టీక॥ నరవ్యాఘ్ర=పురుషశ్రేష్ఠుఁడవగు రామునఁడా! యథా=ఎట్లు; మే=నాకు; అవినయాత్=దౌష్ట్యమువలన; విరూపం=వికృతమయిన; రూపం=ఆకారము; ప్రాప్తంహి (ఇతి) యత్=పొందఁబడినదనునది యేదిగలదో; తత్ = ఆవృత్తాంతమును; తవ=నీకు; తత్త్వతః = యథార్థముగా; శంసతః=చెప్పుచున్న; మే(మత్)=నావలన; శృణు=వినుము.

పురుషోత్తముఁడవగు రామునఁడా! నాయవినయ దోషంబున, నాకీవికృత రూపముగల్గినవిధంబంతయును, నీకుయథార్థముగాఁ జెప్పెదను; వినుము.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, అరణ్యకాండే,సప్తతితమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, అరణ్యకాండ సప్తతితమసర్గటీక, ముగిసినది.

---

శ్రీ

ఏకసప్తతితమసర్గప్రారంభః.

పురా రామ మహాబాహో మహాబల పరాక్రమ
రూపమాసీన్మమాచిన్త్యం త్రిషు లోకేషు విశ్రుతం. ౧
యథా సోమస్య శక్రస్య సూర్యస్యచ యథా వపుః

టీక॥మహాబాహో=గొప్పవగునే తులుగల; మహాబలపరాక్రమ=అధికమయినబలమును బరాక్రమమునుగల; రామ=రామునఁడా! సోమస్య=చంద్రునియొక్క; వపుః(అధ్యాహృతము)యథా=దేహమువలె; శక్రస్య=ఇంద్రునియొక్కయు;సూర్యస్యచ=సూర్యునియొక్కయు; వపుర్యథా= దేహమువలె; పురా=మున్ను; మమ=నాకు; అచింత్యం=ఎన్నరానిదియు; త్రిషు= మూఁ

స ౭౧

డైన; లోకేషు= లోకములయందును; విశ్రుతం=ప్రసిద్ధంబునగు; రూపం=రూపము; ఆసీత్=ఉండినది.

మహాబాహుండవు మహాబలపరాక్రమశాలివగు రామఁడా! చంద్రునకును ఇంద్రునికిని సూర్యునకును బోలెము న్నానాకు అచింత్యంబును ముల్లోకంబులందును బ్రసిద్ధంబునగు దివ్యరూపంబు గలిగియుండినది. అని, తాత్పర్యము.

సోహం రూప మిదం కృత్వా లోకవిత్రాసనం మహత్. ౨
ఋషీ న్వనగతా న్రామ త్రాసయామి తత స్తతః

టీక॥ రామ=రామఁడా! సః= అట్టి; అహం=నేను; లోకవిత్రాసనం= లోకములను భయపఱచునట్టి; మహత్=గొప్పదగు; ఇదం= ఈ; రూపం=రూపును; కృత్వా=చేసి; తత స్తతః=అచ్చటచ్చట; వనగతాన్=అడవిని బొందిన; ఋషీన్=ఋషులను; త్రాసయామి=భయపఱచుచుంటిని.

అట్టిదివ్యరూపధరుండనగు నేను, లోకంబులకు భయంబుగలిగించు నట్టి యీమహాభయంకరరూపంబుదాల్చి, వనంబులనుండు ఋషులను, భయపెట్టుచుంటిని. అని, తాత్పర్యము.

తత స్స్థూలశిరానామ మహర్షిః కోపితో మయా. ౩
సంచిన్వ న్వివిధం వన్యం రూపేణా నేన ధర్షితః

టీక॥ తతః=అంత; వివిధం=నానావిధమయిన; వన్యం=అడవియందుఁబుట్టినపదార్థమును; సంచిన్వన్=వెదకుచున్నట్టి; స్థూలశిరానామ=స్థూలశిరుఁడను; మహర్షిః=పూజ్యుఁడైనఋషి; మయా=నాచేత; అనేన=ఈ; రూపేణ=రూపముచేత; ధర్షితః=అవమానింపఁబడినవాఁడై; కోపితః=కోపమునొందఁజేయఁబడినాఁడు.

అంత, నొకప్పుడు, కందమూలంబులకు గావనంబునకువచ్చినస్థూలశిరుండను మహర్షిని, నేను ఈరూపంబునధర్షించి, యతనికిఁగోపంబుగలుగఁజేసినాను. అని, తాత్పర్యము.

తేనా హ ముక్తః ప్రేక్ష్యైవం ఘోరశాపాభిధాయినా. ४

ఏత దేవ నృశంసంతే రూప మస్తు విగర్హితమ్

టీక॥ అహం=నేను; ఘోరశాపాభిధాయినా=భయంకరమయిన శాపమును జెప్పునట్టి; తేన=అస్థూలశిరుని చేత; ప్రేక్ష్య=చూచి; "తే=నీకు; నృశంసం=క్రూరంబును; విగర్హితం=నిందింపఁబడినదియునగు; ఏతత్=ఈ; రూపమేవ=ఆకారమె; తే=నీకు; అస్తు=అగుఁగాక." ఏవం=ఇట్లు; ఉక్తః=చెప్పఁబడినాను.

అంత, నాస్థూలశిరుండు, నన్నుఁ జూచి, "క్రూరంబును నిందితంబునగు ఈ యాకారమె నీకెల్లప్పుడు నుండుఁగాక" యనిభయంకరంబగు శాపంబొసంగెను. అని, తాత్పర్యము.

స మయా యాచితః క్రుద్ధ శ్శాపస్యాంతో భవే దితి. ౫
అభిశాపకృతస్యే తి తేనే దం భాషితం వచః

టీక ॥ క్రుద్ధః=కోపమునొందిన; సః=ఆమహర్షి; మయా=నాచేత; అభిశాపకృతస్య = అపరాధముచేఁజేయఁబడిన; శాపస్య = శాపమునకు; అంతః=తుది; భవేత్ = అగుఁగాక. ఇతి=అని; యాచితః=యాచింపఁబడినాఁడు. తేన=ఆయునచేత; ఇతి=ఇట్లు; ఇదం=ఈ; వచః=మాట; భాషితం=చెప్పఁబడినది.

కుపితుండగు నమ్మహర్షిం జూచి నేను, నాయపరాధముచేఁ గలిగిన యీ శాపమునకు, అంతము ననుగ్రహింపుఁడని ప్రార్థించితిని ; ఆయన యిట్లని యానతిచ్చెను. అని, తాత్పర్యము.

యదా ఛిత్త్వా భుజౌ రామ స్త్వాం దహే ద్విజనే వనే. ౬
తదా త్వం ప్రాప్స్యసే రూపం స్వ మేవ విపులం శుభమ్

టీక॥యదా= ఎప్పుడు; రామః=రాముఁడు; విజనే=జనులులేని; వనే=అడవియందు; భుజౌ = చేతులను; ఛిత్త్వా=ఖండించి; త్వాం=నిన్ను; దహేత్=దహించునో; తదా = అప్పుడు; త్వం=నీవు; స్వం=నీదైన; విపులం=విశాలమును; శుభం=మంగళకరంబునగు; రూపం=రూపమును; ప్రాప్స్య

సే=పొందఁగలవు.

ఎప్పుడు, రాముండు విజనంబగు నరణ్యంబునకు వచ్చి, నీ చేతులు ఖండించి నిన్ను దహించునో, అప్పుడు, నీవు శాపవిముక్తుండవై, దివ్యంబును సుందరంబునగు నీరూపంబున్ పొందఁగలవు. అని, యా ఋషి చెప్పెను.

అని, తాత్పర్యము.

శ్రియో విరాజితం పుత్రం దనో స్త్వం విద్ధి లక్ష్మణ. ౭
ఇంద్రకోపా దిదం రూపం ప్రాప్త మేవం రణాజిరే

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! త్వం=నీవు; మాం(అధ్యాహృతము) = నన్ను; దనోః=దనువంశమునందుఁ బుట్టిన; శ్రియః = శ్రీ యనువాని యొక్క; పుత్రం=కొడుకునుగా; విద్ధి=ఎఱుంగుము. రణాజిరే=యుద్ధభూమియందు; ఇంద్రకోపాత్ = ఇంద్రుని కోపమువలన; ఏవం=ఇట్టి; ఇదం=ఈ; రూపం=ఆకారము; ప్రాప్తం=పొందఁబడినది.

లక్ష్మణుఁడా! నేను దనువంశజుఁడైన శ్రీయనువాని పుత్రుఁడనని యెఱుంగుము; యుద్ధభూమియందు, ఇంద్రునికోపంబున, నాకిట్టి, కబంధరూపంబు ప్రాప్తించినది.

అని, తాత్పర్యము.

అహం హి తపసో గ్రేణ పితామహ మతోషయమ్. ౮
దీర్ఘ మాయుస్స మే ప్రాదా త్తతో మాం విభ్రమో స్పృశత్

టీక॥ అహం=నేను; ఉగ్రేణ=భయంకరమయిన; తపసా=తపస్సుచేత; పితామహం = బ్రహ్మదేవుని; అతోషయం=సంతోషింపఁజేసినాను. సః=ఆ బ్రహ్మదేవుఁడు; మే=నాకొఱకు; దీర్ఘం=అధికమయిన; ఆయుః=ఆయుస్సును; ప్రాదాత్=ఇచ్చెను. తతః=అంత; విభ్రమః=గర్వము; అస్పృశత్=తాఁకెను.

నేనంతభయంకరమగు, తపస్సుగావించి, బ్రహ్మదేవుని సంతోషపెట్టితిని; అతండు నాకు దీర్ఘాయుస్సునొసంగెను; అంత నాకు మిక్కిలియు గర్వంబు కలిగెను. అని, తాత్పర్యము.

దీర్ఘ మాయు ర్మయా ప్రాప్తం కిం మే శక్రః కరిష్యతి. ౯

ఇత్యేవం బుద్ధి మాస్థాయ రణే శక్ర మధర్షయమ్

టీక॥మయా=నాచేత; దీర్ఘం=అధికమయిన; ఆయుః=ఆయుస్సు; ప్రాప్తం=పొందఁబడినది. మే=నాకు ; శక్రః=ఇంద్రుఁడు; కిం=ఏమిటిని; కరిష్యతి=చేయఁగలఁడు? ఇతి=అని; ఏవం=ఇట్లు; బుద్ధిం=బుద్ధిని; ఆస్థాయ=అవలంబించి; రణే=యుద్ధమునందు; శక్రం=ఇంద్రుని; అధర్షయం=ఎదిరించితిని.

దీర్ఘాయుస్సును బొందితిని; ఇంక నన్ను దేవేంద్రుం డేమి చేయఁగలఁడు? అనితలంచి నేను, యుద్ధంబున దేవేంద్రు నెదిరించితిని.

అని, తాత్పర్యము.

తస్య బాహుప్రముక్తేన వజ్రేణ శతపర్వణా. ౧౦
సక్థినీ చైవ మూర్ధా చ శరీరే సంప్రవేశితమ్

టీక॥ తస్య= ఆయింద్రునియొక్క; బాహుప్రముక్తేన=భుజముచేఁబ్రయోగింపఁబడిన; శతపర్వణా=నూఱంచులుగల; వజ్రేణ= వజ్రముచేత; సక్థినీచైవ=తొడలును; మూర్ధా చ=తలయును; శరీరే=దేహమునందు; సంప్రవేశితం=ప్రవేశింపఁజేయఁబడినది.

ఆయింద్రుండు ప్రయోగించిన శతధారంబగు వజ్రాయుధము, నాతొడలను తలను, దేహములోపలికిఁదోసివేసినది. అని, తాత్పర్యము.

స మయా యాచ్యమాన స్సన్నానయ ద్యమసాదనమ్. ౧౧
పితామహ వచ స్సత్యం త దస్త్వితి మమా బ్రవీత్

టీక॥సః=ఆయింద్రుఁడు; మయా=నాచేత; యాచ్యమానస్సన్=ప్రార్థింపఁబడుచున్నవాఁడగుచు; యమసాదనం= యమునియింటికిని; నానయత్=పొందింపలేదు. తత్=ఆ; పితామహవచః=బ్రహ్మదేవునిమాట; సత్యం=అబద్ధముకానిది; అస్తు=అగుఁగాక; ఇతి=అని; మమ=నాకు; అబ్రవీత్=చెప్పెను.

నన్నువధించి వేయుమని నేనెంత ప్రార్థించినను, ఇంద్రుండు నన్ను వ

ధింపఁడయ్యె; బ్రహ్మదేవుండు నాఁడు నీకొఱకు సంగినవరము సత్యము కావలెనని, యతండు నాకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

అనాహారః కథం శక్తో భగ్నసక్థిశిరోముఖః. ౧౨
వజ్రేణా భిహతః కాలం సుదీర్ఘ మపి జీవితుమ్

టీక ॥ వజ్రేణ=వజ్రాయుధముచేత; అభిహతః=కొట్టఁబడినవాఁడనై; భగ్నసక్థిశిరోముఖః=విఱిగినతొడలును తలయునునోరునుగలవాఁడనై; అనాహారః = ఆహారములేనివాఁడనై; సుదీర్ఘం=మిక్కిలియుదీర్ఘమయిన; కాలం = కాలమును; జీవితుమపి=బ్రతుకుటకుఁగూడ; కథం=ఎట్లు;శక్తః=సమర్థుఁడ నగుదును?

వజ్రాయుధముచేఁగొట్టఁబడి, తొడలును తలయునునోరునువిఱిగి, తినుటకునోరుగూడలేమింజేసి, యిట్లునిరాహారుండనై దీర్ఘకాలమెట్లు జీవింతును? అని నేనింద్రునితోఁజెప్పితిని.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు మే శక్రో బాహూ యోజన మాయతౌ. ౧౩
ప్రాదా దాస్యంచ మే కుక్షౌ తీక్ష్ణదంష్ట్ర మకల్పయత్

టీక॥ శక్రః=ఇంద్రుఁడు; ఏవం=ఇట్లు; ఉక్తస్తు=చెప్పఁబడినవాఁడై నంతనే; మే=నాకు; యోజనం=ఆమడ;ఆయతౌ=నిడుపులయిన; బాహూ=చేతులను; ప్రాదాత్=ఇచ్చెను; మే=నాకు; కుక్షౌ=కడుపునందు; తీక్ష్ణదంష్ట్రం= కఱకుకోఱలుగల; ఆస్యంచ=నోటినిగూడ; అకల్పయత్ =నిర్మించెను.

ఇంద్రుండు, నామాటనువిని, ఆమడదూరముదీర్ఘములయిన బాహువులను రెంటిని నాకొసంగెను; మఱియు నా కడుపునందు, కఱకుకోఱలతో నోరుని ర్మించెను. అని, తాత్పర్యము.

సోహం భుజాభ్యాం దీర్ఘాభ్యాం సంకృష్యాస్మిన్ వనేచరాన్. ౧౪
సింహద్విపమృగవ్యాఘ్రాన్ భక్షయామి సమం తతః

టీక॥సః=అట్టి; అహం=నేను; దీర్ఘాభ్యాం = నిడువులయిన; భుజాభ్యాం=చేతులచేత; అస్మిన్=ఈ; వనే=అడవియందు; చరన్=తిరుగుచున్న; సింహద్వీపమృగవ్యాఘ్రాన్=సింహములను ఏనుంగులను జింకలను పెద్దపులులను; సంకృష్య=ఆకర్షించుకొని; సమంతతః=అన్నిటిని; భక్షయామి=తినుచున్నాను.

అట్టినేను, ఇవ్వనంబునకువచ్చినసింహంబులును ఏనుంగులునుమృగంబులును వ్యాఘ్రంబులును మొదలగుమృగంబుల నెల్ల, దీర్ఘభుజంబులనాకర్షించుకొని, భక్షించుచున్నాను. అని, తాత్పర్యము.

స తు మా మబ్రవీ దింద్రో యదా రామ స్సలక్ష్మణః. ౫౧
ఛేత్స్యతే సమరే బాహూ తదా స్వర్గం గమిష్యసి

టీక॥యదా=ఎప్పుడు; సలక్ష్మణః=లక్ష్మణునితోఁగూడిన; రామః=రాముఁడు; సమరే=యుద్ధమునందు; బాహూ=చేతులను; ఛేత్స్యతే=నఱకునో; తదా=అప్పుడు; స్వర్గం=స్వర్గమును; గమిష్యసి=పొందఁగలవు. ఇతి (అధ్యాహృతము)= అని; సః=ఆ; ఇంద్రస్తు=ఇంద్రుండును; మాం=నన్నుఁగూర్చి; అబ్రవీత్=చెప్పెను.

ఎప్పుడు రామలక్ష్మణులువచ్చి, యుద్ధంబున నీబాహువులను ఛేదింతురో, అప్పుడునీవు స్వర్గంబు నొందఁగలవు; అనియింద్రుండును నాతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

అనేన వపుషా రామ వనే స్మి న్రాజసత్తమ. ౧౨
యద్య త్పశ్యామి సర్వస్య గ్రహణం సాధు రోచయే

టీక॥రాజసత్తమ= రాజశ్రేష్ఠుండవగు; రామ=రాముఁడా ! అనేన=ఈ; వపుషా=ఈశరీరముతో; అస్మిన్=ఈ; వనే=అడవియందు; యద్యత్=దేనిదేని; పశ్యామి=చూచుచున్నానో; తస్య(అధ్యాహృతము)=ఆ; సర్వస్య=అన్నిటియొక్క; గ్రహణం=గ్రహించుటను; సాధు=మంచిదానిఁగా; రోచయే=తలంచుచున్నాను.

రాజశ్రేష్ఠుఁడవగు రాముఁడా! ఈశరీరమువచ్చినదిమొదలు ఇవ్వనంబునఏదేదిచూచుచున్నానో , దానినంతయు

భక్షింపవలెననియో నాకుఁ దోఁచుచున్నది; ఇదిభక్ష్యముఇదియభక్ష్యము అని చూచుటలేదు. అని, తాత్పర్యము.

అవశ్యం గ్రహణం రామో మన్యే హం స ముపైష్యతి. ౧౭
ఇమాం బుద్ధిం పురస్కృత్య దేహాన్యాసకృతశ్రమః

టీక॥అవశ్యం=తప్పక; రామః=రాముఁడు; గ్రహణం = గ్రహింపఁబడువాఁడుగా; సముపైష్యతి=రాఁగలఁడు. ఇతి(అధ్యాహృతము)=అని; అహం=నేను; మన్యే= తలంచుచున్నాను. దేహాన్యాసకృతశ్రమః = దేహరక్షణమునందుఁజేయఁబడిన శ్రమము గలవాఁడనై; ఇమాం=ఈ; బుద్ధిం=బుద్ధిని; పురస్కృత్య = ముందిడుకొని; వర్తే(అధ్యాహృతము)=ఉన్నాను.

రాముండుతప్పకనాయొద్దకు వచ్చును, అని,యమ్మహర్షిచెప్పినమాటచే దృఢమైననమ్మకము గలవాఁడనై , దేహరక్షణమునందు , ఎంతోశ్రమముగలుగుచున్నను, ఓర్చినీరాకకెదురు చూచుచున్నాను. అని, తాత్పర్యము.

స త్వం రామో సి భద్రం తే నా హ మన్యేన రాఘవ. ౧౮
శక్యో హంతుం యథా తత్త్వ మేవ ముక్తం మహర్షిణా

టీక॥ రాఘవ=రాముఁడా! త్వం=నీవు; సః=ఆ; రామః = రాముఁడవు; అసి=అగుచున్నావు! తే=నీకు;భద్రం=మంగళము. అస్తు(అధ్యాహృతము)=అగుఁగాక. అహం=నేను; అన్యేన=ఇతరునిచేత; హంతుం=చంపుటకు ; న శక్యః=అలవిగాను. యథాతత్త్వం=యథార్థముగా; మహర్షిణా=స్థూలశిరుఁడనుమహర్షిచేత ; ఏవం = ఇట్లు; ఉక్తం=చెప్పఁబడినది.

రాముఁడా! నీవారాముఁడవై వచ్చినావు; నన్నువధించుటకు మఱియొకనికెంతమాత్రమలవిగాదు; ఇదియథార్థము; ఈప్రకారమ్మహర్షియానతిచ్చెను.అని, తాత్పర్యము.

అహం హి మతిసాచివ్యం కరిష్యామి నరర్షభ. ౧౯
మిత్రంచైవో పదేక్ష్యామి యువాభ్యాం సంస్కృతో గ్నినా

టీక ॥ నరర్షభ= పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! అహం= నేను ; యువాభ్యాం=మీచేత ; అగ్నినా=అగ్నిచేత; సంస్కృతః = సంస్కరింపఁబడినవాఁడనై ; మతిసాచివ్యం=బుద్ధిసాహాయ్యమును; కరిష్యామిహి = చేసెదనుగదా! మిత్రంచైవ = స్నేహితునిఁగూడ; ఉపదేక్ష్యామి = ఉపదేశించెదను.

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! మీరలిద్దఱు నాకు అగ్నిసంస్కారముగావించినపిదప, నేనుమీకు, నాబుద్ధికొలఁదియోచనచెప్పుటయె గాక, మీకుందగుమిత్రుసింగూడఁ దెలిపెదను. అని, కబంధుండు, రామునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు ధర్మాత్మా దనునా తేన రాఘవః. ౭౦
ఇదం జగాద వచనం లక్ష్మణస్యో పశృణ్వతః

టీక॥ ధర్మాత్మా=ధర్మబుద్ధిగలి; రాఘవః=రాముఁడు; తేన=ఆ; దనునా= దనువంశమునంబుట్టిన కబంధుని చేత;ఏవం=ఇట్లు; ఉక్తస్తు=చెప్పఁబడినవాఁడైవంతనే; లక్ష్మణస్య=లక్ష్మణుఁడు;ఉపశృణ్వతః=సమీపంబునవినుచుండఁగా;ఇదం=ఈ;వచనం=మాటను;జగాద=చెప్పెను.

ధర్మాత్ముండగు రాముఁడు, దనువంశజుండగు నాకబంధునిమాటను విని, లక్ష్మణుండు సమీపంబునవినుచుండఁ, గబంధునితో నిట్లని చెప్పెను.

అని, తాత్పర్యము.

రావణేన హృతా భార్యా మమ సీతా యశస్వినీ. ౭౧
నిష్క్రాంతస్య జనస్థానా త్సహభ్రాత్రా యథా సుఖమ్

టీక॥ జనస్థానాత్=జనస్థానమునుండి; భ్రాత్రాసహ = తమ్మునితోఁగూడ;నిష్క్రాంతస్య=వెడలిన;మమ=నాయొక్క; భార్యా = భార్యయయిన; యశస్వినీ= అధికమయినకీర్తిగల ; సీతా=సీత; రావణేన=రావణుని చేత; యథాసుఖం=సుఖముగా ; హృతా=అపహరింపఁబడినది.

నేను, తమ్మునితోడ జనస్థానమునుండి మూరముగాఁ బోయియుండు నప్పు




డు, రావణుండు, మేమెవ్వరము లేకుం డుటం జేసి, సుఖముగా, పతివ్రతయయి ననాథ యగు సీతను రావణుండు హరించెను. అని, తాత్పర్యము.

నామమాత్రం తు జానామి న రూపం తస్య రక్షసః. ౨౨
నివాసం వా ప్రభావం వా వయం తస్య న విద్మహే

టీక॥ తస్య=ఆ; రక్షసః= రాక్షసుని యొక్క; నామమాత్రం తు= పేరును మాత్రమె; జానామి= ఎఱుంగుదును. వయం=మేము; తస్య=అతనియొక్క; నివాసం వా=వాసస్థానమును గాని; ప్రభావం వా=ప్రభావమును గాని; నవిద్మహే=ఎఱుంగము.

ఆరాక్షసుని పేరుమాత్రము మాకుఁ దెలియును గాని, యతనియొక్క పట్టుగాని ప్రభావంబుగాని, రూపము గాని మాకెంతమాత్రము దెలియదు' అని, తాత్పర్యము.

శోకార్తానా మనాథానా మేవం విపరిధావతామ్. ౨౩
కారుణ్యం సదృశం కర్తు ముపకారే చ వర్తతామ్

టీక॥ శోకార్తానాం= దుఃఖము చేఁబీడింపఁబడినవారలమును; అనాథానాం = నాథుఁడు లేనివారలమును; ఏవం=ఇట్లు; విపరిధావతాం=అల్లాడుచున్నవారలమును; ఉపకారే=ఉపకారమునందు; వర్తతాం చ (వర్తమానానాం చ)= ఉన్నవారలమునగు; అస్మాకం (అధ్యాహృతము)=మాకు; కారుణ్యం=దయ; కర్తుం=చేయుటకు; సదృశం=యుక్తము.

దుఃఖితులును అనాథులును ఇట్లు దిక్కులేక అల్లాడుచున్నవారలును బరోపకారాసక్తులునగు మా వంటివారలవిషయమయి, దయయుంచుట, యుక్తమయినది. అని, తాత్పర్యము.

కాష్ఠాన్యా దాయ శుష్కాణి కాలే భగ్నాని కుంజరైః. ౨౪
ధక్ష్యామ స్త్వా వయం వీర శ్వభ్రే మహతి కల్పితే




టీక॥ వీర = పరాక్రమవంతుఁడవగుకబంధుఁడా! వయం = మేము; కాలే=బహుకాలమునందు; కుంజరైః=ఏనుఁగులచేత; భగ్నాని=విఱువఁబడినవియు; శుష్కాణి=ఎండినవియునగు; కాష్ఠాని=కట్టెలను; ఆదాయ=తీసి; కల్పితే=నిర్మింపఁబడిన; మహతి= గొప్పదగు; శ్వభ్రే = రంధ్రమునందు; త్వాం=నిన్ను; ధక్ష్యామః = దహించెదము.

పరాక్రమవంతుఁడవగు కబంధుఁడా! ఏనుఁగులచే విఱువఁబడి బహుకాలమై యుండుటచేతఁ జక్కఁగా ఎండియుండు కట్టెలందీసి, పెద్దపల్లము ద్రవ్వి, యందు నిన్ను దహించెదము.

అని, తాత్పర్యము.

స త్వం సీతాం సమాచక్ష్వ యేన వా యత్ర వా హృతా. ౨౫
కురు కల్యాణ మత్యర్థం యది జానాసి తత్త్వతః

టీక॥ సః=అట్టి; త్వం=నీవు; సీతాం=సీతను; సమాచక్ష్వ=చెప్పుము; యేన వా=ఎవ్వనిచేత; యత్రవా= ఎచ్చటికి; హృతా = అపహరింపఁబడినదో. తత్త్వతః = యథార్థముగా; జానాసియది=ఎఱుంగుదువే; అత్యర్థం=మిక్కిలియు; కల్యాణం=మంగళమును; కురు=చేయుము.

అట్టినీవు, యథార్థముగా నెఱుంగుదువేని, సీత యెవ్వనిచే నెచ్చటికిఁగొనిపోఁబడినదో, నాకుఁదెలియఁజేసి, మహోపకారము చేయుము. అని, రాముండు కబంధునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు రామేణ వాక్యం దను రనుత్తమమ్. ౨౬
ప్రోవాచ కుశలో వక్తుం వక్తార మపి రాఘవమ్

టీక॥ వక్తారం=చెప్పుచున్న; రాఘవమపి=రామునిఁగూర్చియు; వక్తుం=చెప్పుటకు; కుశలః=సమర్థుఁడగు; దనుః = దనువంశమునఁబుట్టిన కబంధుండు; రామేణ= రామునిచేత; ఏవం=ఇట్లు; అనుత్తమం= తనకన్న శ్రేష్ఠములేని; వాక్యం=మాటను; ఉక్తస్తు = చెప్పఁబడినవాఁడైనంతనే; ప్రోవాచ=చెప్పెను.

మాటలయందుఁబండితుండగు రా

మునిలోఁగూడ మాటలాడుటకు సమర్థుండగు నాకబంధుఁడు, రాముండు చెప్పిన యుత్తమంబగు మాటనువిని, ఇట్లని, బదులుచెప్పెను.

అని, తాత్పర్యము.

దివ్య మస్తి న మే జ్ఞానం నాభిజానామి మైథిలీమ్. ౨౭
యస్తాం జ్ఞాస్యతి తం వక్ష్యే దగ్ధ స్స్వం రూప మాస్థితః

టీక॥ మే=నాకు; దివ్యం=ఉత్తమమయిన; జ్ఞానం=జ్ఞానము; నాస్తి=లేదు. మైథిలీం=సీతను; నాభిజానామి=ఎఱుంగను. దగ్ధః=దహింపఁబడినవాఁడనై; స్వం=నాదైన; రూపం=ఆకారమును; ఆస్థితః=పొందినవాఁడనై; యః=ఎవ్వఁడు; తాం=ఆసీతను; జ్ఞాస్యతి=ఎఱుంగఁగలఁడో; తం=అతని; వక్ష్యే=చెప్పెదను.

నాకు, దివ్యజ్ఞానము లేదు; సీతసంగతిని నేనెఱుగఁజాలను; నన్నుదహించిమైనపిమ్మట, నానిజరూపము నొంది, సీతనెఱుంగఁగలవానిం జెప్పెదను.

అని, తాత్పర్యము.

అదగ్ధస్య తు విజ్ఞాతుం శక్తి రస్తి న మే ప్రభో. ౨౮
రాక్షసం తం మహావీర్యం సీతా యేన హృతా తవ

టీక॥ ప్రభో=రాజవగు రాముఁడా! యేన=ఎవ్వనిచేత; తవ=నీయొక్క; సీతా=సీత; హృతా=అపహరింపఁబడినదో; తం=ఆ; మహావీర్యం=అధికమయిన పరాక్రమముగల; రాక్షసం=రాక్షసుని; విజ్ఞాతుం=తెలిసికొనుటకు; అదగ్ధస్య=దహింపఁబడనట్టి; మమతు=నాకు మాత్రము; శక్తిః=సామర్థ్యము; నాస్తి=లేదు.

రాజవగు రాముఁడా! దహింపఁబడుటకుమున్నునాకు, నీభార్యనుసీతనపహరించిన మహాపరాక్రమ శాలియగు రాక్షసునిఁదెలిసికొనుటకు, శక్తిలేదు.

అని, తాత్పర్యము.

విజ్ఞానంహి మమ భ్రష్టం శాపదోషేణ రాఘవ. ౨౯
స్వకృతేన మయా ప్రాప్తం రూపం లోకవిగర్హితమ్

టీక॥ రాఘవ=రాముఁడా! మమ=నాయొక్క; విజ్ఞానం=దివ్యజ్ఞానము; శాపదోషేణ=శాపముయొక్క దోషముచేత; భ్రష్టంహి=నశించినదిగదా! మయా=నాచేత; స్వకృతేన=కార్యముచేత; లోకవిగర్హితం=లోకులచేనిందింపఁబడిన; రూపం=రూపము; ప్రాప్తం=పొందఁబడినది.

రాముఁడా! శాపముచేనాదివ్యజ్ఞానము నశించినది; అట్లు, నేను జేసికొన్న దుష్కృతమువలననే, యీలోకనిందితమగురూపంబును నాకుఁగల్గినది.

అని, తాత్పర్యము.

కింతు యావన్నయా త్యస్తం సవితా శ్రాంతవాహనః. ౩౦
తావ న్మా మవటే క్షిప్త్వా దహ రామ యథావిధి

టీక॥ రామ=రాముఁడా! కింతు=ఇంకనేమన్నను; యావత్=ఎంతవఱకు; సవితా=సూర్యుఁడు; శ్రాంతవాహనః=అలసినగుఱ్ఱములుగలవాఁడై; అస్తం=అస్తమయమును; నయాతి=పొందఁడో; తావత్=అంతలోపల; మాం=నన్ను; అవటే=పల్లమునందు; క్షిప్త్వా=ఉంచి; యథావిధి=చక్కఁగా; దహ=దహించుము.

రాముఁడా! సూర్యుఁడు, అలసినగుఱ్ఱములతోఁగూడినవాఁడై, యస్తమయమునొందుటకుమున్నె, నన్నుఁబల్లమున నుంచి, చక్కఁగాదహింపుము.

అని, తాత్పర్యము.

దగ్ధ స్త్వయాహ మవటే న్యాయేన రఘునందన. ౩౧
వక్ష్యామి తమహం వీర య స్తం జ్ఞాస్యతి రాక్షసమ్

టీక॥ వీర=పరాక్రమశాలివగు; రఘునందన=రాముఁడా! అహం=నేను; త్వయా=నీచేత; న్యాయేన=క్రమముచేత; అవటే=పల్లమునందు; దగ్ధః=దహింపఁబడినవాఁడనైౌ; యః=యెవ్వఁడు; త్వం=నీ; రాక్షసం=రాక్షసుని; జ్ఞాస్యతి=ఎఱుంగఁగలఁడో; తం=అట్టివాని; అహం=నేను; వక్ష్యామి=చెప్పెదను.

పరాక్రమశాలివగురాముఁడా! నీవు నన్నుఁగ్రమంబుగాఁ, బల్లంబుననుంచి దహించినపిదప, నేను సీతనపహరించిన రాక్షసునెఱుంగఁగలయట్టివాని, నీకుఁజెప్పెదను. అని, తాత్పర్యము.

తేన సఖ్యంచ కర్తవ్యం న్యాయ్యవృత్తేన రాఘవ. ౩౨
కల్పయిష్యతి తే ప్రీత స్సాహాయ్యం లఘువిక్రమః

టీక॥ రాఘవ=రాముఁడా! న్యాయ్యవృత్తేన= న్యాయముగలచరిత్రముగల; తేన=అతనితోఁ; సఖ్యంచ= స్నేహము గూడ; కర్తవ్యం=చేయఁబడవలసినది; లఘువిక్రమః = శీఘ్రమయినపరాక్రమముగలయతఁడు; ప్రీతః=సంతుష్టుండై; తే=నీకు; సాహాయ్యం=తోడ్పాటును; కల్పయిష్యతి=చేయఁగలఁడు.

రాముఁడా! న్యాయ్యమయినచరిత్రముగలయాపురుషుఁతో స్నేహముగా వింపుము; అతండుమహాపరాక్రమవంతుఁడు; సంతోషంబున నీకుసాహాయ్యముగావించును. అని, తాత్పర్యము.

నహి తస్యా స్త్యవిజ్ఞాతం త్రిషు లోకేషు రాఘవ. ౩౩
సర్వా౯ పరిసృతో లోకా౯ పురాసౌ కారణాంతరే

టీక॥ రాఘవ = రాముఁడా! త్రిషు=మూఁడైన; లోకేషు=లోకముల యందు; తస్య=అతనికి; అవిజ్ఞాతం= తెలియనిది; నాస్తిహి=లేదుగదా! అసౌ=ఈతఁడు; పురా=మున్ను ; కారణాంతరే= మఱియొకకారణమునకుఁగా; సర్వా౯=సమస్తములయిన; లోకా౯=లోకములను ; పరిసృతః=తిరిగినాఁడు.

రాముఁడా! అతనికిఁదెలియనిప్రదేశము ముల్లోకంబులయందునులేదు; అతండొకకారణమునకుఁగా మున్నొకమాఱుసమస్తలోకంబులనుం దిరిగియున్నాఁడు. అని, కబంధుండు, రామునితోఁజెప్పెను.అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అరణ్యకాండే, ఏకసప్తతితమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రి

వ్యాఖ్యానంబునందు, అరణ్యకాండైకసప్తతితమసర్గటీక, ముగిసినది.

శ్రీ

ద్విసప్తతితమసర్గప్రారంభః.

ఏవ ముక్తౌతు తౌ వీరౌ కబంధేన నరేశ్వరౌ
గిరిప్రదర మాసాద్య పావకం విససర్జతుః. ౧

టీక॥ నరేశ్వరౌ=మనుష్యులకు(బ్ర)భులగు; వీరౌ= పరాక్రమశాలులయిన; తౌ=ఆరామలక్ష్మణులు; కబంధేన=కబంధునిచేత; ఏవం=ఇట్లు; ఉక్తౌతు=చెప్పఁబడినవారలైనంతనె; గిరిప్రదరం=పర్వతములోనిపల్లమును, ఆసాద్య=పొందించి; పావకం=నిప్పును; విససర్జతుః=విడిచిరి.

మనుష్యేశ్వరులును బరాక్రమవంతులునగు నారామలక్ష్మణులు, కబంధుండు చెప్పినమాటనువిని, కబంధునికళేబరమును బర్వతంబులోని యొకపల్లములోనుంచి, నిప్పంటించిరి.

అని, తాత్పర్యము.

లక్ష్మణస్తు మహోల్కాభి ర్జ్వలితాభి స్సమంతతః
చితా మాదీపయామాస సా ప్రజజ్వాల సర్వతః. ౨

టీక॥లక్ష్మణస్తు=లక్ష్మణుఁడునను; జ్వలితాభిః=మండుచున్న; మహోల్కాభిః=పెద్దకొఱవికట్టెలచేత; చితాం=చితిని; సమంతతః=అంతటను; ఆదీపయామాస=మండించెను. సా=ఆచితి; సర్వతః=అంతటను; ప్రజజ్వాల=మండెను.

లక్ష్మణుండును జకఁగా మండినపెద్దకొఱవుల నలుప్రక్కలం బెట్టి చితినిజకఁగా మండునట్లు గావింప, ఆచితిచక్కఁగా మండెను. అని, తాత్పర్యము.

తచ్ఛరీరం కబంధస్య ఘృతపిండోపమం మహత్
మేదసా పచ్యమానస్య మందం దహతి పావకః. ౩

టీక॥పచ్యమానస్య=దహింపఁబడుచున్న; కబంధస్య=కబంధునియొక్క; ఘృతపిండోపమం=నేతిసమూహముతోఁబోలికగల; మహత్=గొప్పదగు; తత్=ఆ; శరీరం=దేహమును; పావకః=అగ్ని; మేదసా=మేదస్సుచేత; మందం=మెల్లఁగా; దహతి=దహించుచుండెను.

గొప్పదగు నాకబంధునికళేబరము ఘృతప్రాయమయియున్నను, మేదఃపూర్ణమగుటంజేసి, దానిని, అగ్నితిన్నతిన్నఁగాదహించెను. అని, తాత్పర్యము.

స విధూయ చితా మాశు విధూ మోగ్నిరివో త్థితః
అరజే వాససీ బిభ్ర న్మాలాం దివ్యాం మహాబలః. ౪

టీక॥ మహాబలః=అధికమయినబలముగల; సః=ఆకబంధుఁడు; ఆశు=శీఘ్రముగా; చితాం=చితిని; విధూయ=త్రోసివేసి; అరజే(అరజసీ)=నిర్మలములయిన; వాససీ=వస్త్రములను; దివ్యాం=స్వర్గమునందుఁబుట్టిన; మాలాం=మాలికను; బిభ్రత్=ధరించుచు; విధూమః=పొగలేని; అగ్నిరివ=నిప్పువలె; ఉత్థితః=లేచెను.

మహాబలుండగు నాకబంధుండంత, శీఘ్రంబున చితింద్రోసివేసి, నిర్మలములయినవస్త్రములను దివ్యంబగుమాలికనుందాల్చి, పొగలేనియగ్నికైవడింబ్రకాశించుచు, లేచెను.

అని, తాత్పర్యము.

తత శ్చితాయా వేగేన భాస్వరో విమలాంబరః
ఉత్పపాతాశు సంహృష్ట స్సర్వప్రత్యంగభూషణః. ౫

టీక॥తతః=అంత; సః(అధ్యాహృతము)=ఆకబంధుఁడు; వేగేన=వేగముచే; చితాయాః=చితియందుండి; భాస్వరః=ప్రకాశమానుండై; విమలాంబరః=స్వచ్ఛమయిన వస్త్రములుగల వాఁడై; సంహృష్టః=సంతోషమునొందినవాఁడై;

సర్వప్రత్యంగభూషణః= సమస్తములైయిన ప్రత్యవయవములయందును సొమ్ములుగలవాఁడై; ఆశు=శీఘ్రముగా; ఉత్పపాత=వెడలెను.

అంత, నాకబంధుండు, దివ్యతేజంబున వెలుంగుచు, నిర్మలంబులగు వస్త్రంబులు ధరించి సమస్తావయవంబులందునుభూషణంబులు దాల్చి సంతుష్టుండై, వేగంబుననాచితినుండి బయలు వెడలెను. అని, తాత్పర్యము.

విమానే భాస్వరే తిష్ఠన్ హంసయుక్తే యశస్కరే
ప్రభయాచ మహాతేజా దిశో దశ విరాజయన్. ౬

టీక ॥ మహాతేజాః=అధికమయిన కాంతిగలకబంధుండు; భాస్వరే= ప్రకాశించుచున్నదియు; హంసయుక్తే=హంసలతోఁగూడినదియు; యశస్కరే=కీర్తినిగల్గించునదియునగు; విమానే=విమానమునందు; తిష్ఠన్= ఉన్నవాఁడై; ప్రభయాచ= కాంతిచేతను; దశ=పదియయిన; దిశః= దిక్కులను; విరాజయన్=ప్రకాశింపఁజేయుచు, అభూత్ (అధ్యాహృతము)=ఉండెను.

మహాతేజుండగుకబంధుండు, ప్రకాశమానంబును హంసలచేనలంకరింపఁబడినదియు యశస్కరంబునగు విమానంబునొంది, కాంతిచే దశదిశల వెలుంగంజేయుచుండెను. అని, తాత్పర్యము.

సోం తరిక్షగతో రామం కబంధో వాక్య మబ్రవీత్

టీక॥సః=ఆ; కబంధః=కబంధుఁడు; అంతరిక్షగతః=ఆకాశమునొందినవాఁడై; రామం=రామునిగూర్చి; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

ఆకబంధుండు, అంతరిక్షంబుననుండి, రామునిఁజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

శృణు రాఘవ తత్త్వేన యథా సీతా మవాప్స్యసి. ౭

టీక॥ రాఘవ= రామఁడా! యథా=ఎట్లు; సీతాం=సీతను; అవాప్స్యసి=పొందఁగలవో; తథా (అధ్యాహృతము)=అవిధమును; తత్త్వేన=యాథా

ర్థ్యము చేత; శృణు=వినుము.

రాముఁడా! నీకుసీతా కవిహారకును పాయమునుయథార్థముగాఁజెప్పెదను; వినుము. అని, తాత్పర్యము.

రామ షద్యుక్తయో లోకే యాభి స్సర్వం విమృశ్యతే

టీక॥ రామ=రాముఁడా! యాభిః=వేనిచేత; సర్వం=సమస్తమును; విమృశ్యతే=ఆలోచింపఁబడునో; తాః (అధ్యాహృతము)=అట్టి; షట్=ఆఱయిన; యుక్తయః=ఉపాయములు; లోకే=లోకమునందు; వర్తంతే (అధ్యాహృతము)=ఉన్నవి.

రాముఁడా! లోకంబున, సంధివిగ్రహయానాసనద్వైధీభావసమాశ్రయములని యాఱుఉపాయంబులుగలవు; వానింబట్టియే రాజులు సమస్తకార్యంబులను నిర్వహించుకొందురు.

అని, తాత్పర్యము.

పరిమృష్టో దశాంతేన దశాభాగేన సేవ్యతే. ౮

టీక॥ దశాంతేన= దురవస్థయొక్క పరిపాకముచేత; పరిమృష్టః=తాఁకఁబడినవాఁడు; దశాభాగేన=దురవస్థయొక్క పరిపాకరూపమయిన యంశముగలవానిచేత; సేవ్యతే= సేవింపఁబడుచున్నాఁడు.

కష్టమునొందినవాఁడు, తనవలెనే కష్టమునొందియున్నవానితోఁజేరి, కార్యమునుసాధించుకొనును.

అని, తాత్పర్యము.

దశాభాగగతో హీన స్త్వం హి రామ సలక్ష్మణః

యత్కృతే వ్యసనం ప్రాప్తం త్వయా దారప్రధర్షణమ్. ౯

టీక॥ రామ=రాముఁడా! యత్కృతే=ఏనిమిత్తముచేత; త్వయా=నీచేత; దారప్రధర్షణం= భార్యనపహరించుటయును; వ్యసనం=కష్టము; ప్రాప్తం=పొందఁబడినదో; తత్కృతే (అధ్యాహృతము)=అనిమిత్తముచేత; సలక్ష్మణః=లక్ష్మణునితోఁగూడిన; త్వం=నీవు; దశాభాగగతః= దురవస్థయొక్క పరిపాకాంశమునొందినవాఁడవును; హీనో హి=తక్కువయైనవాఁడవునుగదా!

రాముఁడా! నీవు, భార్యయపహరింపఁబడి మహాదుఃఖము నొందియు న్నావుకావున, నీవును లక్ష్మణుండును, దురవస్థనొందిన వారలై తఱుచుపయి యునారు అని, తాత్పర్యము.

తదవశ్యం త్వయా కార్య స్స సుహృ త్సుహృదాం వర
అకృత్వా హి న తే సిద్ధి మహం పశ్యామి చింతయన్. ౧౧

టీక॥సుహృదాం= స్నేహితులలో పలః వర=శ్రేష్ఠుఁడవగురాముఁడా! తత్=అందువలన; అవశ్యం=అవశ్యముగా;త్వయా=నీచేత;సః=అట్టి, దురవస్థనుబొందినవాఁడు;సుహృత్=స్నేహితుఁడుగా; కార్యః= చేయఁదగినవాఁడు.అకృత్వా=చేయక; తే=నీకు; సిద్ధిం=కార్యసిద్ధిని; చింతయన్= ఆలోచించువాఁడనయ్యు; నపశ్యామిహి= చూడనుగదా!

రాముఁడా! అట్లుకావున,నీయట్లు దురవస్థాపీడితుండగువానికి నీవు స్నేహితుఁడవయి, యతనినీవవశ్యముస్నేహితునిఁగాఁజేసికొనవలయును; అట్లుచేయనియెడ, నీకుఁగార్యసిద్ధియగుఁట్లు, ఎంతయాలోచించినను నాకుఁదోఁచదేదు. అని, తాత్పర్యము.

శ్రూయతాం రామ వక్ష్యామి సుగ్రీవో నామ వానరః
భ్రాత్రా నిర స్తః క్రుద్ధేన వాలినా శక్రసూనునా. ౧౨

టీక॥ రామ= రాముఁడా! వక్ష్యామి=చెప్పెదను. శ్రూయతాం=వినఁబడుఁగాక. సుగ్రీవోనామ= సుగ్రీవుండను పేరుగల; వానరః=వానరుఁడు; క్రుద్ధేన = కోపంబునొందిన; శక్రసూనునా=ఇంద్రునికొడుకయిన; భ్రాత్రా- అన్నయగు; వాలినా=వాలిచేత; నిరస్తః=తఱుమఁబడినాఁడు.

రాముఁడా! అట్టివానింజెప్పెదనవినుము; సుగ్రీవుఁడనువానరునొకని,అతనియన్నయింద్రపుత్రుండగు వాలికోపించి రాజ్యంబుననుండి తఱుమఁగొట్టినాఁడు. అని,తాత్పర్యము.

ఋశ్యమూకే గిరివరే పంపా పర్యంతశోభితే

నివసత్యాప్తవా న్వీర శ్చతుర్భి స్సహవానరైః. ౧౨

టీక॥ ఆత్మవాన్= అధికమయినబలముగలవాఁడును; వీరః= పరాక్రమశాలియునగుసుగ్రీవుఁడు; పంపాపర్యంతశోభితే=పంపాసరస్సుసమీపమునందుఁ బ్రకాశించుచున్న; ఋశ్యమూకే=ఋశ్యమూకమను; గిరివరే= పర్వతశ్రేష్ఠమునందు; చతుర్భిః= నలువురయిన; వానరైస్సహ= వానరులతోఁగూడ; నివసతి=వాసముచేయుచున్నాఁడు.

బలవంతుండును మహాపరాక్రమశాలియునగునాసుగ్రీవుండు, పంపాసరోవరసమీపంబున రాజిల్లుచున్న ఋశ్యమూకంబను పర్వతంబునందు, నలువురువానరవీరులతోఁగూడ, నివసించుచున్నాఁడు. అని, తాత్పర్యము.

వానరేంద్రో మహావీర్య స్తేజోవా నమితప్రభః

సత్యసంధో వినీతశ్చ ధృతిమా న్మతిమా న్మహాన్. ౧౩

టీక॥ వానరేంద్రః= వానరరాజుఁడగుసుగ్రీవుఁడు; మహావీర్యః=అధికమయినపరాక్రమము గలవాఁడు. తేజోవాన్ = అధికమయినతేజస్సుగలవాఁడు. అమితప్రభః=కొలఁదిలేనికాంతిగలవాఁడు. సత్యసంధః=సత్యమయినప్రతిజ్ఞగలవాఁడు. వినీతశ్చ= వినయము నొందినవాఁడును. ధృతిమాన్=అధికమయిన ధైర్యముగలవాఁడు. మతిమాన్= అధికమయినబుద్ధిగలవాఁడు; మహాన్= పూజ్యుఁడు.

వానరరాజుఁడగు నాసుగ్రీవుఁడు, మహాపరాక్రమశాలి, తేజస్వి, అమితమయినకాంతిగలవాఁడు; సత్యసంధుఁడు; వినయసంపన్నుఁడు; ధైర్యవంతుఁడు; బుద్ధిమంతుఁడు ; పూజనీయుఁడు. అని, తాత్పర్యము.

దక్షః ప్రగల్భో ద్యుతిమాన్ మహాబలపరాక్రమః

టీక॥ సః(అధ్యాహృతము)= ఆసుగ్రీవుఁడు; దక్షః=సమర్థుఁడు; ప్రగ

భ్యః=ప్రౌఢుఁడు; ద్యుతిమాన్= అధికమయినకాంతిగలవాఁడు ; మహాబలపరాక్రమః=అధికమయినబలమును బరాక్రమమునుగలఁవాడు.

మతియునతండు, సమర్థుఁడు ? ప్రౌఢుఁడు, కాంతిమంతుండు, మహాబలపరాక్రమశాలి.

అని, తాత్పర్యము.

భ్రాత్రా వివాసితో రామ రాజ్యహేతో ర్మహాబలః. ౧౪

టీక॥ రామ= రాముఁడా! మహాబలః= అధికమయినబలముగల సుగ్రీవుఁడు; రాజ్యహేతోః= రాజ్యమునిమిత్తమయి, భ్రాత్రా=అన్న చేత ; వివాసితః=తఱుమఁబడినాఁడు.

రాముఁడా! అతనియన్న వాలిరాజ్యమునిమిత్తమయి, మహాబలుండగునాసుగ్రీవుని,ఊరువెడలఁగొట్టినాడు.

అని, తాత్పర్యము.

స తే సహాయో మిత్రంచ సీతాయాః పరిమార్గణే
భవిష్యతి హి తే రామ మా చ శోకే మనః కృథాః. ౧౫

టీక॥ రామ = రాముఁడా! సః= ఆసుగ్రీవుఁడు; తే=నీకు; సీతాయాః= సీతయొక్క-వెదకుటయందును;హి తే= మేలునందును; సహాయః=తోడును;మిత్రంచ=స్నేహితుఁడును; భవిష్యతి = కాఁగలఁడు.శోకేచ = దుఃఖమునందును; మనః=మనస్సును; మాకృథాః = ఉంచకుము.

రాముఁడా! ఆసుగ్రీవుఁడు, సీతను వెదకుటయందును నీకుహితముసేయుటయందును, నీకుఁతోడును స్నేహితుఁడునుగానుండగలఁడు ; నీవుమనంబున దుఃఖంబుంచకుము.

అని, తాత్పర్యము.

భవితవ్యం హి యచ్చాపి న త చ్ఛక్య మిహా న్యథా
కర్తు మిక్ష్వాకుశార్దూల కాలో హి దురతిక్రమః. ౧౬

టీక॥ ఇక్ష్వాకుశార్దూల= ఇక్ష్వాకువంశమునఁబుట్టినవారలలోనుత్తము

డవగు రాముఁడా! యత్=ఏది; భవిత వ్యం=కావలయునో; తచ్చ= దానిని; అన్యథా=వేఱువిధముగా; కర్తుం = చేయుటకు ; నశక్యంహి=అలవిగాదు గదా! కాలః=కాలము; దురతిక్రమో హి=అతిక్రమింపనలవికానిదిగదా!

ఇక్ష్వాకువంశమునఁ బుట్టినవారల లో నుత్తముఁడవగు రాముఁడా! మఱి యు నేదియెట్లుకావలయునో అదియ ట్లె యగును గాని దానిని వేఱువిధముగాఁజే య నేరికి నలవి గాదు; కాలమును, ఎవ్వ రతిక్రమింపఁజాలుదురు?

అని, తాత్పర్యము.

గచ్ఛ శీఘ్రమితో రామ సుగ్రీవం తం మహాబలమ్

టీక॥ రామ=రాముఁడా! ఇతః=ఇ చ్చటనుండి; శీఘ్రం=శీఘ్రముగా; మహా బలం= అధికమయినబలముగల; తం= ఆ; సుగ్రీవం= సుగ్రీవునిఁగూర్చి; గ చ్ఛ=పొమ్ము.

రాముఁడా! నీవిచ్చటనుండిబయలు దేఱిశీఘ్రమున మహాబలశాలియగునా సుగ్రీవునొద్దకుఁబొమ్ము.

అని, తాత్పర్యము.

వయస్యం తం కురు క్షిప్రమితో గత్వాద్య రాఘవ. ౧౭
అద్రోహాయ సమాగమ్య దీప్యమానే విభావసౌ

టీక॥ రాఘవ=రాముఁడా! అద్య= ఇప్పుడు; క్షిప్రం=శీఘ్రముగా; ఇతః=ఇ చ్చటనుండి; గత్వా=పోయి; సమాగ మ్య=చేరి; అద్రోహాయ=ద్రోహములే మికొఱకు; విభావసౌ=అగ్ని; దీప్యమా నే=మండుచుండఁగా; తం=ఆసుగ్రీవు ని; వయస్యం=స్నేహితునిఁగా; కురు= చేయుము.

రాముఁడా! నీవిప్పుడు శీఘ్రముగ ని చ్చటనుండిపోయి, సుగ్రీవునింజేరి, ఎవ్వ రికిని మఱల ద్రోహబుద్ధిగలుగకుండుట కై దీప్యమానంబగు నగ్నిసాక్షిగానుం చుకొని, యతనిమిత్రుం జేసికొనుము.

అని, తాత్పర్యము.

సచ తే నావమంతవ్యస్సుగ్రీవో వానరాధిపః. ౧౮
కృతజ్ఞః కామరూపీచ సహాయార్థీచ వీర్యవాన్

టీక॥కృతజ్ఞః=తనకుఁబరులుచేసిన యుపకారముకొంచెమైనను దానినధికముగానెఱుంగువాఁడును; కామరూపీచ = ఇచ్ఛాధీనమగురూపముగలవాఁడును; సహాయార్థీ=సహాయునిఁగోరుచున్నవాఁడును; వీర్యవాన్= అధికమయిన పరాక్రమముగలవాఁడునగు; వానరాధిపః=వానరరాజయిన; సః= ఆ;సుగ్రీవశ్చ=సుగ్రీవుఁడును; తే=నీకు; నావమంతవ్యః = అవమానింపఁదగినవాఁడుకాఁడు.

కృతజ్ఞుండునుగామరూపియు ఆపన్నుండై సహాయుంగోరుచున్నవాఁడును బరాక్రమశాలియునగు వానరాధీశ్వరు నాసుగ్రీవుని నీవు,వానరుండితఁడెంతమాత్రమని, చులకనగాఁదలంపరాదు.అని,తాత్పర్యము.

శక్తౌ హ్యద్య యువాం కర్తుం కార్యం తస్య చికీర్షితం. ౧౯
కృతార్థోవాఽకృతార్థోవా కృత్యం తవ కరిష్యతి

టీక॥యువాం=మీరలు; అద్య=ఇప్పుడు;తస్య=ఆసుగ్రీవునియొక్క; చికీర్షితం=చేయఁగోరఁబడిన; కార్యం=పనిని;కర్తుం=చేయుటకు;శక్తౌహి= సమర్థులరుకదా! సః(అధ్యాహృతము)=ఆసుగ్రీవుఁడు; కృతార్థోవా= చేయఁబడిన కార్యముగలవాఁడైగాని; అకృతార్థోవా= చేయఁబడినకార్యముగలవాఁడుకానివాఁడైగాని; తవ= నీయొక్క;కృత్యం=పనిని; కరిష్యతి=చేయఁగలఁడు.

మీరలిప్పుడాసుగ్రీవుఁడు గోరియుండుకార్యమునుసాధించుటకుసమర్థులరైయున్నారుగదా! అతండును, తనకార్యము నెఱవేఱినను నెఱవేఱకున్నను,మీకార్యమునుజేయును.

అని, తాత్పర్యము.

సఋక్షరజసః పుత్రః పంపా మటతి శంకితః. ౨౦
భాస్కరస్యౌరసః పుత్రో వాలినా కృతకిల్బిషః

టీక॥ ఋక్షరజసః = ఋక్షరజుండనువానరునియొక్క; పుత్రః=క్షేత్రజపుత్రుండును; భాస్కరస్య= సూర్యునియొక్క; ఔరసః=వీర్యమువలనఁబుట్టి

న; పుత్రః=కొడుకునగు; సః=ఆసుగ్రీవుఁడు; వాలినా=వాలితో ; కృతకిల్బిషః = చేయఁబడినవైరముగలవాఁడై; శంకితః=భయపడినవాఁడై; పంపాం=పంపాతీరమును; అటతి=సంచరించుచున్నాఁడు.

ఋక్షరజుని క్షేత్రంబున, సూర్యునివీర్యంబునకుఁబుట్టిన యాసుగ్రీవుండు, వాలితో వైరంబుచేసికొని, భయంబునఁ, బంపాతీరంబునసంచరించుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

సన్నిధా యాయుధం క్షిప్ర మృశ్యమూకాలయం కపిం. ౨౧
కురు రాఘవ సత్యేన వయస్యం వనచారిణం

టీక॥ రాఘవ=రామఁడా! క్షిప్రం=శీఘ్రముగా; ఆయుధం=ఆయుధమును; సన్నిధాయ=దగ్గిఱనుంచుకొని; సత్యేన=సత్యముచేత; వనచారిణం=అడవియందుఁదిరుగువాఁడును ; ఋశ్యమూకాలయం = ఋశ్యమూకపర్వతమిల్లుగాఁగలవాఁడునగు; కపిం=వానరుని; వయస్యం=మిత్రునిఁగా; కురు=చేసికొనుము.

రామఁడా! నీవు శీఘ్రింబునఁబోయి, ఆయుధసాక్షికంబుగా, సత్యముచేత, ఋశ్యమూక పర్వతంబుననున్న సుగ్రీవునితో సఖ్యముగావింపుము.

అని, తాత్పర్యము.

సహి స్థానాని సర్వాణి కాత్స్న్యేన కపికుంజరః. ౨౨
నరమాంసాశినాం లోకే నైపుణ్యా దధిగచ్ఛతి

టీక॥ కపికుంజరః= వానరశ్రేష్ఠుండగు; సః=ఆసుగ్రీవుఁడు; లోకే=ప్రపంచమునందు; నరమాంసాశినాం=మనుష్యమాంసమునుదినునట్టి రాక్షసులయొక్క; సర్వాణి=సమస్తములయిన; స్థానాని=స్థానములను; నైపుణ్యాత్ =సామర్థ్యమువలన; కాత్స్న్యేన=సాకల్యముచేత; అధిగచ్ఛతి=ఎఱుంగును.

వానరోత్తముఁడగు నాసుగ్రీవుండు, లోకంబున, రాక్షసులుండు స్థానంబులనన్నింటిని, తనసామర్థ్యంబునం జేసి, ఎఱింగియున్నాఁడు.

అని, తాత్పర్యము.

న తస్యా విదితం లోకే కించిదస్తి హి రాఘవ. ౨౩
యావత్సూర్యః ప్రతపతి సహస్రాంశు రరిందమ

టీక॥ అరిందమ= శత్రువులనణంగఁద్రొక్కునట్టి; రాఘవ= రాముఁడా! యావత్ = ఎంతవఱకు; సహస్రాంశుః= వేయికిరణములుకల; సూర్యః= సూర్యుఁడు; ప్రతపతి= తపింపఁజేయుచున్నాఁడో; తావత్ (అధ్యాహృతము)= అంతవఱకు; లోకే=లోకమునందు; తస్య=ఆసుగ్రీవునకు; అవిదితం= తెలియనిది; కించిత్ =కొంచెమేనిః; నాస్తిహి= లేదుగదా!

శత్రువులనడంగఁద్రొక్కునట్టి రాముఁడా! సహస్రకిరణుండగు సూర్యుం డెంతవఱకు నెండగాయుచున్నాఁడో, అంతవఱకు, ఈలోకంబున, ఆసుగ్రీవునకుఁ దెలియని ప్రదేశ మేమియు లేదు. అని, తాత్పర్యము.

స నదీ ర్విపులాన్ శైలాన్ గిరిదుర్గాణి కందరాన్. ౨౪
అన్విష్య వానరైస్సార్ధం పత్నీం తేఽధిగమిష్యతి

టీక॥ సః=ఆసుగ్రీవుఁడు; వానరైస్సార్ధం=వానరులతోఁగూడ; నదీః= నదులను; విపులాన్= విశాలములయిన; శైలాన్= పర్వతములను; గిరిదుర్గాణి=పర్వతములచొరరాని ప్రదేశములను; కందరాన్=గుహలను; అన్విష్య=చూచి; తే=నీయొక్క; పత్నీం= భార్యను; అధిగమిష్యతి = ఎఱుంగఁగలఁడు.

ఆసుగ్రీవుఁడు, వానరులంగూడి విశాలంబులగు పర్వతంబులను దుర్గమంబులగు పర్వతప్రదేశములను గుహలను, వెదకి, నీభార్యయగు సీతయుండు స్థలంబు నెఱుంగఁగలఁడు. అని, తాత్పర్యము.

వానరాంశ్చ మహాకాయాన్ ప్రేషయిష్యతి రాఘవ. ౨౫
దిశో విచేతుం తాం సీతాం త్వద్వియోగేన శోచతీమ్

టీక॥ రాఘవ=రాముఁడా! త్వద్వియోగేన = నీయెడఁబాటుచేతఁ; శోచతీం=దుఃఖించుచున్న; తాం=ఆ; సీతాం=సీతను; విచేతుం=వెదకుటకు; దిశః = దిక్కులనుగూర్చి; మహాకాయాన్=పెద్దదేహములుగల; వానరాం

శ్చ=వానరులనుగూడ; ప్రేషయిష్యతి=పంపఁగలఁడు.

నీవియోగంబునంజేసిపరితపించుచున్నసీతనువెదకుటకై, యాసుగ్రీవుండు, మహాకాయులగువానరులను, దిక్కులకుం బంపును. అని, తాత్పర్యము॥

స జ్ఞాస్యతి వరారోహాం నిర్మలాం రావణాలయే. ౨౫

టీక॥ సః=ఆసుగ్రీవుఁడు; రావణాలయే = రావణునిగృహమునందు; స్థితాం(అధ్యాహృతము)=ఉన్న; నిర్మలాం=కల్మషములేని; వరారోహాం = శ్రేష్ఠములయినపిఱుందులుగల సీతను; జ్ఞాస్యతి=ఎఱుంగఁగలఁడు.

ఆసుగ్రీవుఁడు, రావణునింటనున్నదియుమహాపతివ్రతయు సుందరంబులగుపిఱుందులుగలదియునగుసీతాదేవిని, గనుంగొనఁగలఁడు. అని, తాత్పర్యము.

స మేరుశృంగాగ్రగతా మనిందితాం
ప్రవిశ్య పాతాళతలే పివాశ్రితామ్
ప్లవంగమానాం ప్రవర స్తవ ప్రియాన్
నిహత్య రక్షాంసి పునః ప్రదాస్యతి. ౨౬

టీక॥ ప్లవంగమానాం= వానరులలో; ప్రవరః=శ్రేష్ఠుఁడగు; సః=ఆసుగ్రీవుఁడు; మేరుశృంగాగ్రగతాం=మేరుశిఖరముయొక్క కొననుబొందినదైనను; పాతాళతలే=పాతాళమునందు; శ్రితామపివా = పొందినదైనను; ప్రియాం=ప్రియురాలను; ప్రవిశ్య= చొచ్చి; రక్షాంసి=రాక్షసులను; నిహత్య=చంపి; పునః=మఱల; తవ=నీకు; ప్రదాస్యతి=ఇవ్వఁగలఁడు.

వానరోత్తముఁడగునాసుగ్రీవుఁడు, నీప్రియురాలగు సీత, మేరుశిఖరాగ్రంబుననున్నను పాతాళలోకంబుననున్నను, అచ్చటికిఁబోయి, రాక్షసులనందఱవధించి, నీకుమఱలనొసంగఁగలఁడు. అని, కబంధుండు రామునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే

ఆరణ్యకాండే, ద్విసప్తతితమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండ ద్విసప్తతితమసర్గటీక, ముగిసినది.

శ్రీ:

త్రిసప్తతితమసర్గప్రారంభః.

నిదర్శయిత్వా రామాయ సీతాయాః ప్రతిపాదనే
వాక్య మన్వర్థ మర్థజ్ఞః కబంధః పునరబ్రవీత్. ౧

టీక॥ అర్థజ్ఞః= కార్యములనెఱింగిన; కబంధః=కబంధుఁడు; రామాయ=రామునికొఱకు; సీతాయాః= సీతయొక్క; ప్రతిపాదనే= పొందుటనిమిత్తమయి; నిదర్శయిత్వా (నిదర్శ్య)= ఉపాయమునుజూపి; పునః=మఱల; అన్వర్థం=అర్థమననుసరించునట్టి; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

కార్యములుసాధించుటయందుఁబండితుండగు నాకబంధుండు, ఈప్రకారంబున రామునకుసీతంబొందు నుపాయంబుఁజెప్పి, మఱల, అర్థయుక్తంబగుసీమాటంజెప్పెను. అని, తాత్పర్యము.

ఏష రామ శివః పంథా యత్రైతే పుష్పితా ద్రుమాః
ప్రతీచీం దిశ మాశ్రిత్య ప్రకాశంతే మనోరమాః. ౨
జంబూప్రియాళపనస ప్లక్షన్యగ్రోధతిందుకాః
అశ్వత్థాః కర్ణికారాశ్చ చూతాశ్చాన్యే చ పాదపాః. ౩
ధన్వనా నాగవృక్షాశ్చ తిలకా నక్తమాలకాః
నీలాశోకాః కదంబాశ్చ కరవీరాశ్చ పుష్పితాః. ౪

అగ్నిముఖ్యా అశోకాశ్చ సురక్తాః పారిభద్రకాః

టీక॥ రామ=రాముఁడా! యత్ర=ఎచ్చట; ఏతే=ఈ; పుష్పితాః=పూచిన; మనోరమాః = మనోహరములయిన; నగాః=వృక్షములు; జంబూప్రియాళపనసప్లక్షన్యగ్రోధతిందుకాః= నేరెడుచెట్లును మోరటిచెట్లును పనసచెట్లును జువ్విచెట్లును మఱ్ఱిచెట్లును తుమ్మికిచెట్లును; అశ్వత్థాః=రావిచెట్లును; కర్ణికారాశ్చ=కొండగోఁగుచెట్లును; చూతాశ్చ=మామిడిచెట్లును; అన్యే=ఇతరములయిన; పాదపాశ్చ=చెట్లును; ధన్వనాః=చండ్రచెట్లును; నాగవృక్షాశ్చ=పొన్నచెట్లును; తిలకాః=బొట్టుగుచెట్లును; నక్తమాలకాః=కానుగుచెట్లును; నీలాశోకాః=నల్లని యశోకవృక్షములును; కదంబాశ్చ=కదంబవృక్షములును; పుష్పితాః=పూచిన; కరవీరాశ్చ=గన్నేరుచెట్లును; అగ్నిముఖ్యాః=భల్లాతకవృక్షములును; అశోకాశ్చ=అశోకవృక్షములును; సురక్తాః=రక్తచందనవృక్షములును; పారిభద్రకాః=వేఁపచెట్లును; ప్రతీచీం=పడమటిదైన; దిశం=దిక్కును; ఆశ్రిత్య=పొంది; ప్రకాశంతే=ప్రకాశించుచున్నవో; ఏషః=ఇది; శివః=మంగళకరమయిన; పంథాః=మార్గము.

రాముఁడా! ఇటుపడమటిప్రక్కను నేరెడుచెట్లును మోరటిచెట్లును పనసవృక్షంబులును జువ్విచెట్లును వటవృక్షములును తిందుకవృక్షములును అశ్వత్థవృక్షంబులును కర్ణికారంబులును మామిడిచెట్లును మఱియు నితరములు పెక్కువృక్షములును చండ్రచెట్లును పొన్నలును తిలకంబులును కానుగులును నీలాశోకంబులును గదంబంబులును గరవీరంబులును భల్లాతకంబులును అశోకంబులును వేఁపచెట్లును, పుష్పితంబులయి మనోహరంబుగాఁ బ్రకాశించుచున్నవే; ఇది యొ, శుభమైనమార్గము.

అని, తాత్పర్యము.

తా నారుహ్య థవా భూమౌ పాతయిత్వాచ తాన్ బలాత్. ౫
ఫలా న్యమృతకల్పాని భక్షయంతౌ గమిష్యథః

టీక॥ యువాం(అధ్యాహృతము)=మీరలు; తాన్=ఆవృక్షములను; ఆరుహ్య=ఎక్కి-గాని; అథవా=లేక; తాన్=ఆవృక్షములను; బలాత్=బలిమివలన;

భూమౌ=నేలయందు; పాతయిత్వా చ=పడద్రోసిగాని; అమృతకల్పాని=అమృతముతో సమానములయిన; ఫలాని=పండ్లను; భక్షయంతౌ=తినుచు; గమిష్యథః=పోఁగలరు.

మీరలు, ఆవృక్షములవారోహించిగాని, లేక, బలంబునవాని నేలంబడఁద్రోచిగాని, అమృతసమానంబులగువానిఫలంబులను భక్షించుచుఁబోఁగలరు.

అని, తాత్పర్యము.

తదతిక్రమ్య కాకుత్స్థ వనం పుష్పితపాదపమ్. ౬
నందనప్రతిమం చాన్య త్కురవో హ్యుత్తరా ఇవ

టీక॥ కాకుత్స్థ=రామచంద్రా! తత్=అవనమును; అతిక్రమ్య=అతిక్రమించి; పుష్పితపాదపం=పూచినవృక్షములుగలదియు; నందనప్రతిమంచ=నందనవనములోఁబోలికగలదియు; ఉత్తరాః కురవఇవ(స్థితం)= ఉత్తరకురుదేశమువలెనున్నదియునగు; అన్యత్ = మఱియొక; వనం=అడవి; వర్తతే(ఆస్త్యా)=ఉన్నది.

రామచంద్రా! ఆవనమును దాఁటఁగానే, పుష్పించియుండు వృక్షములుగలదియును నందనవనముంబోలునదియు నుత్తరకురుదేశమువలె సర్వకామసమృద్ధంబునగు మఱియొకవనంబున్నది.

అని, తాత్పర్యము.

సర్వకామఫలా వృక్షాః పాదపాస్తు మధుస్రవాః. ౭

టీక॥ వృక్షాః=మ్రానులు; సర్వకామఫలాః=అంతటఁగోరఁబడుఫలములుగలవి. పాదపాస్తు=వృక్షములును; మధుస్రవాః= తేనెనుస్రవించుచుండునవి.

అచ్చటివృక్షంబులు, నానావిధరమణీయఫలంబులుగలిగి, తేనెస్రవించుచుండును. అని, తాత్పర్యము.

సర్వే చ ఋతవ స్తత్ర వనే చైత్రరథే యథా

టీక॥ చైత్రరథే=చైత్రరథమను; వనేయథా=వనమునందువలె; తత్ర=అ

స ౭౩

వనమునందు; సర్వే=సమస్తములయి న;ఋతవశ్చ=ఋతువులును; సంతి(అధ్యాహృతము)=ఉన్నవి.

కుబేరుని చైత్రరథవనంబునందుంబోలె, యవ్వనంబునయందెల్ల సర్వమునుసమస్తఋతువులును,సన్నిహితంబులయియుండును. అని, తాత్పర్యము.

ఫలభారానతా స్తత్ర మహావిటపధారిణః. ౯
శోభంతే సర్వత స్తత్ర మేఘపర్వతసన్నిభాః

టీక॥తత్ర=అచ్చట; తత్ర=అవ్వనమునందు; పాదపాః (అధ్యాహృతము)=వృక్షములు; ఫలభారానతాః=పండ్లబరువుచే వంగినవై; మహావిటపధారిణః=పెద్దకొమ్మలనుధరించునవై; మేఘపర్వతసన్నిభాః=మేఘములతోను బర్వతంబులతోనుసమానములయి; సర్వతః=అంతటను;శోభంతే=ప్రకాశించుచున్నవి.

అవ్వనంబునందంతటను, వృక్షంబులుపెద్దపెద్దకొమ్మలుగలవై,ఫలంబులధికంబుగాఁగలుగుటంజేసివంగినవై, మేఘపర్వతాకారంబులయి, ప్రకాశించుచుండును.అని, తాత్పర్యము.

తానారుహ్యా థవా భూమౌ పాతయిత్వా యథాసుఖమ్. ౯
ఫలా న్యమృతకల్పాని లక్ష్మణ స్తే ప్రదాస్యతి

టీక ॥ లక్ష్మణః = లక్ష్మణుఁడు; తాన్=ఆవృక్షములను; ఆరుహ్య=ఎక్కిగాని; అథవా=లేకున్న; యథాసుఖం=సుఖముగా; భూమౌ=నేలయందు; పాతయిత్వా= పడఁద్రోసిగాని; అమృతకల్పాని=అమృతముతోసమానములయిన; ఫలాని=ఫలములను; తే=నీకొఱకు; ప్రదాస్యతి=ఇవ్వఁగలఁడు.

లక్ష్మణుండు, ఆవృక్షంబులనారోహించిగానిలేక నేలంబడఁద్రోసిగాని, యమృతసమానంబులగు ఫలంబులంగోసినీకొసంగఁగలఁడు.అని, తాత్పర్యము.

చంక్రమంతౌ వరాన్ దేశాన్ శైలాచ్ఛైలం వనాద్వనమ్. ౧౦
తతః పుష్కరిణీం వీరౌ పంపాంనామ గమిష్యథః

అశర్కరామవిభ్రంశాం సమతీర్థా మశైవలామ్. ౧౧
రామ సంజాతవాలూకాం కమలోత్పలశాలినీమ్

టీక॥ రామ=రాముఁడా! వీరౌ=పరాక్రమశాలులగు; యువాం(అధ్యాహృతము)=మీరలు; తతః=అంత; శైలాత్ = పర్వతమునుండి; శైలం=పర్వతమునకు; వనాత్ = అడవినుండి; వనం=అడవికి; వరాన్ = ఉత్తమములయిన; దేశాన్=ప్రదేశములను; చంక్రమంతౌ=తిరుగుచు; అశర్కరాం = మొరపఱాళ్లులేనిదియు; అవిభ్రంశాం= జాఱుటలేనిదియు; సమతీర్థాం=సమానములయిన (ఎచ్చుతక్కువలేనిలోఁతుగల) రేవులుగలదియు; అశైవలాం=పాఁచిలేనిదియు; సంజాతవాలూకాం(సంజాతవాలుకాం)=కలిగినయిసుకగలదియు; కమలోత్పలశాలినీం = తామరపూలచేతనువల్ల కలువలచేతనుప్రకాశించుచున్నదియునగు; పంపాంనామ=పంపయను; పుష్కరిణీం=సరస్సును; గమిష్యథః=పొందఁగలరు.

రాముఁడా! అంతఁ, బరాక్రమవంతులగుమీరలు, ఈపర్వతంబుననుండిఅపర్వతంబునకు, ఈవనంబుననుండియావనంబునకు, ఇట్లుత్తమప్రదేశంబులవిహరించుచుఁ బోయి, మొఱపఱాళ్లుగాని జాఱుటగానిపాఁచిగానిలేక, అంతమిట్టయునంతలోఁతునుంగాని రేవులుగలిగిమంచియిసుకతోఁగూడి, కమలోత్పలంబులతోనొప్పుచున్నపంపయను సరస్సునుబొందఁగలరు.

అని, తాత్పర్యము.

తత్ర హంసాః ప్లవాః క్రౌంచాః కురరాశ్చైవ రాఘవ. ౧౨
వల్గుస్వనాని కూజంతి పంపాసలిలగోచరాః

టీక॥రాఘవ=రాముఁడా! తత్ర=అచ్చట; పంపాసలిలగోచరాః=పంపాసరస్సుయొక్క జలంబుల నగపడునట్టి; హంసాః=హంసలును; ప్లవాః=నీరుకోళ్లును; క్రౌంచాః= క్రౌంచపక్షులును; కురరాశ్చైవ=ఒకవిధమయిన క్రౌంచపక్షులును; వల్గుస్వనాని=మధురధ్వనులను; కూజంతి=కూయుచున్నవి.

రాముఁడా! ఆపంపాసరసియందు, హంసలును బ్లవంబులును గ్రౌంచంబులును గురరంబులును మధురంబుగాఁ గూయుచుండును. అని, తాత్పర్యము.

నోద్విజంతే నరాన్ దృష్ట్వా వధస్యాకోవిదా శ్శుభాః. ౧౩

టీక॥ వధస్య=చంపుటకు, చంపుటనుట; అకోవిదాః=ఎఱుంగనట్టి; శుభాః= సుందరంబులగు నాపక్షులు; నరాన్=మనుష్యులను; దృష్ట్వా=చూచి; నోద్విజంతే=భయపడవు.

వధమెట్టిదో యెఱుఁగనివగుటచేత, సుందరంబులగు నాపక్షులు, మనుష్యులం జూచి భయపడవు. అని, తాత్పర్యము.

ఘృతపిండోపమాన్ స్థూలాం స్తాన్ ద్విజాన్ భక్షయిష్యథః

టీక॥ ఘృతపిండోపమాన్=నేతిముద్దతోఁబోలికగలవియు; స్థూలాన్=బలిసినవియునగు; తాన్=ఆ; ద్విజాన్=పక్షులను; భక్షయిష్యథః=భక్షింపఁగలరు.

నేతిముద్దవంటివియు మాంసపుష్టంబులునగు నాపక్షులను మీరు భక్షింపఁగలరు. అని, తాత్పర్యము.

రోహితా న్వక్రతుండాశ్చ నడమీనాంశ్చ రాఘవ. ౧౪
పంపాయా మిషుభిర్మత్స్యాన్ తత్ర రామ వరాన్ హతాన్
నిస్త్వక్పక్షా నయస్తప్తా నకృశానేక కంటకాన్. ౧౫
తవ భక్త్యా సమాయుక్తో లక్ష్మణ స్సంప్రదాస్యతి

టీక॥ రాఘవ=రఘువంశమునందుఁ బుట్టిన; రామ=రాముఁడా! లక్ష్మణః=లక్ష్మణుఁడు; భక్త్యా=భక్తితో; సమాయుక్తః=కూడినవాఁడై; తత్ర=అచ్చట; పంపాయాం=పంపాసరస్సునందు; ఇషుభిః= బాణములచేత; హతాన్=చంపఁబడినవియు; వరాన్=ఉత్తమములును; నిస్త్వక్పక్షాన్=చర్మమును ఱెక్కలును లేనివియు; అయస్తప్తాన్=ఇనుపశలాకతోఁ దపింపఁజేయఁబడినవియు; అకృశానేకకంటకాన్=చిక్కినవియు పెక్కుముండ్లుగలవియు కానివియునగు; మత్స్యాన్=మీనులను; రోహితాన్=గండుమీనులను; వక్రతుండాంశ్చ= చారమీనులను; నడమీనాంశ్చ=రొయ్యమీనులను; తవ=నీకు; సంప్రదాస్యతి= ఇవ్వఁగలఁడు.

రాముఁడా! అచ్చటపంపాసరస్సు

నందు, లక్ష్మణుండు, ఉత్తమంబులును బలిసియున్నవియు అధికముగా నుండ్లు లేనివియు నగు గండుమీనులు చారమీనులు రొయ్యమీనులు మొదలుగాఁగల మత్స్యంబులను, బాణంబులచే వధించి, చర్మమును ఱెక్కలను దీసి, యినుపశలాకంగుచ్చి పక్వముగా వండి, భక్తితో నీకొసంగఁగలఁడు: అని, తాత్పర్యము.

భృశం తే ఖాదతో మత్స్యాన్ పంపాయాః పుష్పసంచయే. ౧౬
పద్మగంధి శివం వారి సుఖశీత మనామయమ్
ఉద్ధృత్య సతతా క్లిష్టం రౌప్యస్ఫాటికసన్నిభమ్. ౧౭
అసౌ పుష్కరపర్ణేన లక్ష్మణః పాయయిష్యతి

టీక: అసౌ=ఈ; లక్ష్మణః=లక్ష్మణుఁడు; భృశం=మిక్కిలియు; మత్స్యాన్=మీనులను; ఖాదతః=తినుచున్న; తే=నీకు; పుష్పసంచయే=పూలరాశియందు; స్థితం (అధ్యాహృతము)=ఉన్నదియు, కావుననే; పద్మగంధి=కమలములచే సుగంధము గలదియు; శివం=మంగళకరమును; సుఖశీతం=సుఖముగాఁ జల్లనైనవియు; అనామయం=ఆరోగ్యకరమును; సతతాక్లిష్టం=ఎల్లప్పుడును నిర్మలమయినదియు; రౌప్యస్ఫాటికసన్నిభం=వెండితోను స్ఫటికముతోను సమానమయినదియునగు; వారి=జలమును; పంపాయాః=పంపాసరస్సునుండి; పుష్కరపర్ణేన=తామరాకుచేత; ఉద్ధృత్య=ఎత్తి; పాయయిష్యతి=త్రాగింపఁగలఁడు.

నీవట్లు యథేచ్ఛముగా మత్స్యములు భక్షించుచుండఁగా, ఈలక్ష్మణుఁడు, పుష్పరాశి గలసియుండుటంజేసి కమలగంధియు పాపహరంబును సుఖకరంబగునట్లు చల్లఁగానుండునదియు ఆరోగ్యకరంబును స్వచ్ఛమును వెండివలె స్ఫటికశిలవలెఁ బ్రకాశించుచున్నదియు నగు జలంబును, పంపాసరస్సునుండి, తామరాకుదొప్పలోఁగొని తెచ్చి నీకొసంగఁగలఁడు. అని, తాత్పర్యము.

స్థూలాన్ గిరిగుహాశయ్యాన్ వరాహాన్ వనచారిణః. ౧౮
అపాం లోభా దుపావృత్తాన్ వృషభానివ నర్దతః
రూపాన్వితాంశ్చ పంపాయాం ద్రక్ష్యసి త్వం నరోత్తమ. ౧౯

టీక॥ నరోత్తమ=పురుషశ్రేష్ఠుఁడ వగు రాముఁడా! పంపాయాం= పంపాసరస్సునందు; స్థూలాన్=బలిసినవియు; గిరిగుహాశయ్యాన్=పర్వతగుహలుపాన్పులుగాఁగలవియు; వనచారిణః=అడవియందుఁదిరుగునవియు; అపాం=నీళ్లయొక్క; లోభాత్=ఆశవలన; ఉపావృత్తాన్ = వచ్చినవియు; వృషభానివ= ఆఁబోతులువలె; నదతః= గర్జించుచున్నవియు; రూపాన్వితాంశ్చ= సౌందర్యముతోఁగూడినవియునగు; వరాహాన్ = పందులను; త్వం=నీవు; ద్రక్ష్యసి = చూడఁగలవు.

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! ఆ పంపాసరస్సునకు నీళ్లు ద్రావుటకుఁగా వచ్చునట్టి స్థూలంబులును పర్వతగుహలనుండునవియు ఆఁబోతులుంబోలె గర్జించునవియు సుందరంబులునగు వరాహంబులంజూడఁగలవు.

అని, తాత్పర్యము.

సాయాహ్నే విచర న్రామ విటపీ న్మాల్యధారిణః
శీతోదకంచ పంపాయా దృష్ట్వా శోకం విహాస్యసి. ౨౧

టీక॥ రామ=రాముఁడా! సాయాహ్నే = సాయంకాలమునందు; విచరన్=విహరించుచు; మాల్యధారిణః= పుష్పమాలికలను దాల్చినట్టి; విటపీన్(విటపినః)=వృక్షములను; పంపాయాః= పంపాసరస్సుయొక్క; శీతోదకంచ= చల్లనిజలమును; దృష్ట్వా=చూచి; శోకం=దుఃఖమును; విహాస్యసి=విడువఁగలవు.

రాముఁడా! నీవు, సాయంకాలంబున విహరించుచుఁ, బుష్పమాలికలు ధరించియుండు వృక్షంబులను, పంపాసరస్సునందలి చల్లనినీళ్లనుం జూచి, దుఃఖమువిడిచి, సంతోషంబునొందఁగలవు.

అని, తాత్పర్యము.

సుమనోభి శ్చితాం స్తత్ర తిలకా న్నక్తమాలకాన్
ఉత్పలానిచ ఫుల్లాని పంకజానిచ రాఘవ. ౨౨

టీక॥ రాఘవ=రాముఁడా! తత్ర= అచ్చట; సుమనోభిః=పుష్పములచేత; చితాన్=వ్యాపింపఁబడినట్టి; తిలకాన్= బొట్టుగుచెట్లను; నక్తమాలకాన్=కా

మగుచెట్లను; ఫుల్లాని=వికసించిన; ఉత్పలానిచ=నల్లకలువలను; పంకజానిచ=తామరపూలను; దృష్ట్వా, శోకం, విహాస్యసి(అధ్యాహృతము)= చూచి, దుఃఖమును, విడువఁగలవు.

రాముఁడా! నీవచ్చట, పుష్పములలో నిండియుండు తిలకవృక్షంబులను నక్తమాలంబులను వికసించిన కలువలను కమలంబులనుం జూచి, దుఃఖములేనివాఁడవు కాఁగలవు. అని, తాత్పర్యము.

న తాని కశ్చి న్మాల్యాని తత్రా రోపయితా నరః
న చ వై మ్లానతాం యాంతి నచ శీర్యంతి రాఘవ. ౨౨

టీక॥ రాఘవ=రామఁడా! తత్ర=అచ్చట; తాని=ఆ; మాల్యాని=పుష్పములను; ఆరోపయితా=ధరించువాఁడు; కశ్చిత్=ఒకానొక; నరః= మనుష్యుఁడును; న=లేఁడు. మ్లానతాం = వాడుటను ("వై" అనునది పాదపూరణార్థము); నయాంతిచ= పొందవు; శీర్యంతిచ=రాలవు.

రాముఁడా! అచ్చటనా పుష్పంబుల ధరించువాఁడెవ్వఁడును లేఁడు; అవివాడిపోవకుండుటయె గాక, రాలుటయు లేక, క్రొత్తపుష్పములవలెనే యెల్లప్పుడును జూపట్టుచుండును. అని, తాత్పర్యము.

మతంగ శిష్యా స్తత్రా స న్నృషయ స్సుసమాహితాః

టీక॥ తత్ర=అచ్చట; సుసమాహితాః= మంచిసమాధిగలవారలును; మతంగశిష్యాః=మతంగమహామునియొక్క-శిష్యులనగు; ఋషయః=ఋషులు; ఆసన్= ఉండిరి.

అచ్చట, మతంగమహామునిశిష్యులయిన, ఉత్తమంబగుసమాధిగల మహర్షులుండిరి. అని, తాత్పర్యము.

తేషాం భారాభి తప్తానాం వన్య మాహరతాం గురోః. ౨౩
యే ప్రపేతు ర్మహీం తూర్ణం శరీరా త్స్వేదబిందవః
తాని జాతాని మాల్యాని మునీనాం తపసా తదా. ౨౪

టీక॥ గురోః=గురువునకు; వన్యం=అడవియందుఁ బుట్టిన పదార్థమును;




ఆహరతాం = తెచ్చుచున్నవారలును; భారాభితప్తానాం=బరువుచేఁబీడింపఁబడినవారలునగు; తేషాం= ఆమునులయొక్క; శరీరాత్ = దేహమునుండి; తూర్ణం=శీఘ్రముగా; యే=ఏ; స్వేదబిందవః=చెమటబిందువులు; మహీం=భూమిని; ప్రపేతుః= పొందినవో; తాః=ఆబిందువులు; తదా=అప్పుడు; మునీనాం=మునులయొక్క; తపసా=తపస్సుచేత; మాల్యాని=పుష్పమాలికలుగా; జాతాని=అయినవి.

ఆమునులు గురువునకుఁగా వన్యపదార్థములంగొనిపోవుచు, బరువుచేఁ బీడింపఁబడఁగా, వారి దేహంబుననుండి నేలంబడిన చెమట బిందువులన్నియు, వారితపోబలాతిశయంబునం జేసి, పుష్పంబులయినవి.

అని, తాత్పర్యము.

స్వేదబిందు సముత్థాని న వినశ్యంతి రాఘవ

టీక॥ రాఘవ=రాముఁడా! స్వేదబిందుసముత్థాని= చెమటబిందువులవలనఁ బుట్టిన; తాని(అద్యాపిఇతిశేషః)=ఆపుష్పములు; నవినశ్యంతి= నాశము నొందవు.

రాముఁడా! ఆమునుల చెమటబిందువులవలనంబుట్టినయాపుష్పంబులు, వారితపోమహిమంబునం జేసి , నాశంబు నొందకున్నవి. అని, తాత్పర్యము.

తేషాం గతానా మద్యాపి దృశ్యతే పరిచారిణీ. ౨౪
శ్రమణీ శబరీనామ కాకుత్స్థ చిరజీవినీ

టీక॥ కాకుత్స్థ=రాముఁడా! గతానాం=పోయిన; తేషాం= ఆమతంగశిష్యులయొక్క; పరిచారిణీ=పనికత్తెయైన; చిరజీవినీ=బహుకాలముబ్రతుకునట్టి; శబరీనామ=శబరియనుపేరుగల; శ్రమణీ = సన్న్యాసిని ; అద్యాపి = ఇప్పుడును; దృశ్యతే= చూడఁబడుచున్నది.

రాముఁడా! ఆమతంగ శిష్యులందఱుస్వర్గస్థులైరి;వారలపనికత్తె చిరజీవినియయిన సన్న్యాసిస్త్రీ శబరియనుపేరుగలదిమాత్రము, ఇప్పటికినున్నది.

అని, తాత్పర్యము.




త్వాంతు ధర్మే స్థితా నిత్యం సర్వభూత నమస్కృతమ్. ౨౬
దృష్ట్వా దేవోపమం రామ స్వర్గలోకం గమిష్యతి

టీక॥ రామ=రాముఁడా! నిత్యం=ఎల్లప్పుడును; ధర్మే=ధర్మము నందు; స్థితా = ఉన్నట్టిశబరి; సర్వభూతనమస్కృతం= సమస్తప్రాణులచేతను నమస్కరింపఁబడినవాఁడవును; దేవోపమం= దేవతతోఁ బోల్కిఁగల వాఁడవునగు; త్వాం=నిన్ను; దృష్ట్వాతు=చూచినంతనే; స్వర్గలోకం=స్వర్గలోకమును; గమిష్యతి=పొందఁగలదు.

రాముఁడా! ఎల్లప్పుడును ధర్మము నేయాశ్రయించియున్నట్టియాశబరి, సమస్తభూతంబులచేతను నమస్కరింపఁబడినవాఁడవును దేవేంద్రతుల్యుండవునగు నీదర్శనంబునొంది, స్వర్గలోకంబునకుఁ బోఁగలదు. అని, తాత్పర్యము.

తత స్తద్రామ పంపాయా స్తీర మాశ్రిత్య పశ్చిమమ్. ౨౭
ఆశ్రమ స్థాన మతులం గుహ్యం కాకుత్స్థ పశ్యసి

టీక॥ కాకుత్స్థ= కకుత్స్థవంశంబునఁబుట్టిన; రామ=రాముఁడా! తతః=అంత; పంపాయాః= పంపాసరస్సుయొక్క; తత్=ఆ; పశ్చిమం= పడమటిదైన; తీరం= గట్టును; ఆశ్రిత్య=పొంది; అతులం= సాటిలేనిదియు; గుహ్యం=రహస్యమునగు; ఆశ్రమస్థానం=ఆశ్రమపదమును; పశ్యసి= చూతువు.

రాముఁడా! అంత, నీవా పంపాసరస్సుయొక్క పశ్చిమతీరంబునకుఁ బోదువేని, యచ్చట, ఉత్తమంబును రహస్యంబునగు నొక్క యాశ్రమపదంబుఁ జూడఁగలవు. అని, తాత్పర్యము.

న తత్రాక్రమితుం నాగా శ్శక్నువంతి తమాశ్రమమ్. ౨౮

టీక॥ తత్ర=అచ్చట; నాగాః=ఏనుంగులు; తం=ఆ; ఆశ్రమం=ఆశ్రమమును; ఆక్రమితుం= ఆక్రమించుటకు; నశక్నువంతి=చాలవు.

అచ్చట, ఏనుంగులు, అయ్యాశ్రమంబులోనికిఁబోఁజాలవు.

అని, తాత్పర్యము.

వివిధా స్తత్ర వై నాగా వనే తస్మింశ్చ పర్వతే

టీక॥ తత్ర=అ(వై అనునది పాదపూరణార్థము); వనే = అడవియందును; తస్మిన్=ఆ; పర్వతేచ=కొండయందును; వివిధాః=నానావిధములయిన; నాగాః=ఏనుంగులు; సంతి (అధ్యాహృతము)=ఉన్నవి.

అవ్వనంబునందును ఆపర్వతంబునందును, నానావిధంబులయిన గజంబులు పెక్కులున్నవి. అని, తాత్పర్యము.

ఋషే స్తస్య మతంగస్య విధానా త్తచ్చ కాననమ్. ౨౯

టీక॥ తస్య=ఆ; మతంగస్య=మతంగుడను; ఋషేః=ఋషియొక్క; విధానాత్=నిర్మాణమువలన; తత్=ఆ; కాననంచ=వనమును; జాతం(అధ్యాహృతము)=కలిగినది.

ఆయాశ్రమవనంబు మతంగమహర్షిచే నిర్మింపఁబడినది, కావున, చుట్టుపక్కలవనంబునందును బర్వతంబునందును, ఏనుంగులు కావలసినవి యున్నను, అవ్వనంబునకు మాత్రము, మతంగమహామునితపఃప్రభావంబున, నయ్యేనుంగులు పోఁజాలవు.

అని, తాత్పర్యము.

తస్మి న్నందనసంకాశే దేవారణ్యోపమే వనే
నానావిహగసంకీర్ణే రంస్యసే రామ నిర్వృతః. ౩౦

టీక॥ రామ=రాముఁడా! నందనసంకాశే=నందనవనముతో సమానమును; దేవారణ్యోపమే=చైత్రరథాదివనములతోఁబోల్కి గలదియు; నానావిహగసంకీర్ణే=నానావిధపక్షులచే వ్యాపింపఁబడినదియు నగు; తస్మిన్=ఆ; వనే=అడవియందు; నిర్వృతః= దుఃఖములేనివాఁడవై; రంస్యసే=విహరింపఁగలవు.

రాముఁడా! నందనము చైత్రరథము మొదలగు దేవవనములతో సమానమయినదియు మధురంబుగాఁ గూయుచుండు నానావిధపక్షులతోఁ గూడినదియు నగు నావనంబునందు, నీవు, దుఃఖము వీడి, విహరింపఁగలవు. అని, తాత్పర్యము.

ఋశ్యమూకశ్చ పంపాయాః పురస్తాత్పుష్పితద్రుమః
సుదుఃఖారోహణో నామ శిశునాగాభిరక్షితః. 3౧
ఉదారో బ్రహ్మణాచైవ పూర్వకాలే వినిర్మితః

టీ॥ పంపాయాః=పంపాసరస్సునొక్క; పురస్తాత్=ముందట; పుష్పితద్రుమః = పూచినవృక్షములుగలదియు; సుదుఃఖారోహణోనామ=మిక్కిలియు దుఃఖకరమయిన యెక్కుటగలదని ప్రసిద్ధమయినదియు; శిశునాగాభిరక్షితః= పిల్ల యేనుంగులచే రక్షింపఁబడినదియు; ఉదారః=ప్రశస్తమును; పూర్వకాలే=మునుపటికాలమునందు; బ్రహ్మణాచైవ=బ్రహ్మదేవునిచేతనె; వినిర్మితః = నిర్మింపఁబడినదియునగు; ఋశ్యమూకశ్చ= ఋశ్యమూకపర్వతమును; వర్తతే (అధ్యాహృతము)= ఉన్నది.

పుష్పితంబులగువృక్షములుగలదియు యేనుంగుపిల్లలెచ్చుగాఁగల్గియుండుటం జేసి యారోహింపసులభసాధ్యము కాసిదియుఁ బ్రశస్తంబును మున్నుబ్రహ్మదేవునిచేత నిర్మింపఁబడినదియునగు ఋశ్యమూక పర్వతము, పంపాసరస్సునకుముందటనెయున్నది.

అని, తాత్పర్యము.

శయానః పురుషో రామ తస్య శైలస్య మూర్ధని. 3౨
యత్స్వప్నే లభతే విత్తం తత్ప్రబుద్ధోధి గచ్ఛతి

టీక॥ రామ=రాముఁడా! తస్య=ఆ; శైలస్య= ఋశ్యమూకపర్వతముయొక్క; మూర్ధని=శిఖరమునందు; శయానః=పరుండియున్న; పురుషః=పురుషుఁడు; స్వప్నే=కలయందు; యత్=ఏ; విత్తం=ధనమును; లభతే= పొందునో; తత్=ఆధనమును; ప్రబుద్ధః=మేలుకొన్నవాఁడై; అధిగచ్ఛతి=పొందును.

రాముఁడా! ఆఋశ్యమూకపర్వత శిఖరంబునఁబరుండినపురుషుండు, ఏధనమునుపొందినట్లు కలగనునో, మేలుకొన్నపిమ్మట, ఆధనమునుదప్పకపొందును.

అని, తాత్పర్యము.

నత్వేవం విషమాచారః పాపకర్మాధి రోహతి. 33




టీక॥విషమాచారః=సరికాని యాచారముగలవాఁడును; పాపకర్మాతు=పాపముగలిగించు కార్యముగలవాఁడునగువాఁడుమాత్రము; ఏనం=ఈపర్వతమును; నాధిరోహతి=ఎక్కఁడు.

పాపిష్ఠుండును దురాచార వంతుండునగువాఁడుమాత్రము, ఈపర్వతము నారోహింపఁజాలఁడు.

అని, తాత్పర్యము.

యస్తు తం విషమాచారః పాపకర్మాధి రోహతి
తత్రైవ ప్రహరంత్యేనం సుప్త మాదాయ రాక్షసాః. ౩౪

టీక॥యస్తు=ఎవ్వఁడేని; విషమాచారః=సరికాని యాచారము గలవాఁడును; పాపకర్మా= పాపముగలిగించు కార్యముగలవాఁడునగువాఁడు; తం= ఆపర్వతమును; అధిరోహతి=ఎక్కునో; తత్రైవ=అచ్చటనే; రాక్షసాః=రాక్షసులు; సుప్తం=నిదురించిన; ఏనం=ఈతని; ఆదాయ=తీసికొని; ప్రహరంతి=వధింతురు.

ఎవ్వఁడేని, దురాచారిసంపన్నుండును పాపిష్ఠుండునగువాఁడు, ఆపర్వతంబు నారోహించునేని, రాక్షసులు, అచ్చటనేనిదురనొందినప్పుడతనిఁబట్టివధింతురు. అని, తాత్పర్యము.

తత్రాపి శిశునాగానా మాక్రంద శ్శ్రూయతే మహాన్
క్రీడతాం రామ పంపాయాం మతంగారణ్యవాసినామ్. ౩౫

టీక॥ రామ= రాముఁడా! తత్రాపి=అచ్చటనుగూడ; పంపాయాం=పంపాసరస్సునందు; క్రీడతాం= క్రీడించుచున్న; మతంగారణ్యవాసినాం=మతంగవనంబుననుండునట్టి; శిశునాగానాం= పిల్ల యేనుంగులయొక్క; మహాన్=గొప్పదగు; ఆక్రందః=అఱపు ; శ్రూయతే=వినఁబడుచుండును.

రాముఁడా! పంపాసరస్సునఁ గ్రీడించుచుండుమతంగవనవాసులగు నేనుఁగుపిల్లలగజఘ్వనులు , సమీపంబగుటవలన, ఆఋశ్యమూకపర్వతంబున, వినఁబడుచుండును.

అని, తాత్పర్యము.

సిక్తా రుధిరధారాభి స్సంహృత్య పరమద్విపాః
ప్రచరంతి పృథక్కీర్ణా మేఘవర్ణా స్తరస్వినః. ౩౬




టీక॥ మేఘవర్ణాః=మేఘముయొక్క వన్నెవంటివన్నెగల; తరస్విన=బలవంతంబులగు; పరమద్విపాః=ఉత్తమగజములు; సంహృత్య=కొట్టుకొని; రుధిరధారాభిః= నెత్తురుధారలచేత; సిక్తాః=తడుపఁబడినవై; పృథక్=వేఱువేఱుగా; కీర్ణాః=వ్యాపించినవై; ప్రచరంతి=తిరుగుచుండును.

మేఘమువలెనల్లనిమేనుగలవియు బలవంతంబులునగునాయుత్తమగజంబులు, ఒకొకప్పుడు, పరస్పరము నెత్తురువెల్లువలుగాఁ గొట్టుకొని, యంతవేఱువేఱువిహరించుచుండును.

అని, తాత్పర్యము.

తే తత్ర పీత్వా పానీయం విమలం శీత మవ్యయమ్
నిర్వృతాః సంవిగాహంతే వనాని వనగోచరాః. ౩౨

టీక॥వనగోచరాః = వనంబులందగపడునట్టి; తే= ఆయేనుంగులు; తత్ర=ఆపంపాసరస్సునందు; విమలం=నిర్మలమును; శీతం=నల్లనిదియు; అవ్యయం=ఆరోగ్యకారియునగు; పానీయం=జలమును; పీత్వా=త్రావి; నిర్వృతాః=సుఖమునొందినవై; వనాని=అడవులను; సంవిగాహంతే=ప్రవేశించును.

వనంబులనుండునట్టియాయేనుంగులు, పంపాసరస్సునందు నిర్మలంబును సుశీతలంబునుఆరోగ్యకరంబునగు జలంబు ద్రావి, సుఖితంబులయి, వనంబులం బ్రవేశించును. అని, తాత్పర్యము.

ఋక్షాంశ్చ ద్వీపినశ్చైవ నీలకోమలకప్రభాన్
రురూ నపేతాపజయాన్ దృష్ట్వా శోకం జయిష్యసి. ౩౩

టీక॥ ఋక్షాంశ్చ = ఎలుఁగుబంటులను; ద్వీపినశ్చైవ=పెద్దపులులను; నీలకోమలకప్రభాన్ = నీలమణివలెమనోహరమయినకాంతిగల ; అపేతాపజయాన్=పోయిన రాజయము గల; రురూన్ = నల్లచారలుదుప్పులను; దృష్ట్వా=చూచి; శోకం=దుఃఖమును; జయిష్యసి=లోఁగొనఁగలవు.

నీవిచ్చటనుండు నెలుంగుబంటులను వ్యాఘ్రంబులను నీలమణికిఁబోలె మనోహరకాంతిగలవియు భయమునే మెఱుఁగనివియునగునల్లచారలదుప్పులను

జూచి, దుఃఖముమఱచి, సుఖంబునొందఁగలవు. అని, తాత్పర్యము.

రామ తస్య తు శైలస్య మహతీ శోభతే గుహా
శిలాపిధానా కాకుత్స్థ దుఃఖం చాస్యాః ప్రవేశనమ్. ౩౯

టీక॥ కాకుత్స్థ = కకుత్స్థవంశమునఁబుట్టిన; రామ=రాముఁడా! తస్య=ఆ; శైలస్య=పర్వతముయొక్క; మహతీ=గొప్పదగు; శిలాపిధానా=ఱాయిమూఁత గాఁగల; గుహాతు=గుహమాత్రము; శోభతే=ప్రకాశించుచున్నది. అస్యాః=దీనియొక్క; ప్రవేశనం=చొచ్చుటయు; దుఃఖం=కష్టము.

రాముఁడా! ఆపర్వతమునందు, పెనుఱాయిచేమూయఁబడియుండు నొక గొప్పగుహప్రకాశించుచున్నది; దానిలోనికిఁబోవుటమిక్కిలియుఁగష్టము.

అని, తాత్పర్యము.

తస్యా గుహాయాః ప్రాగ్ద్వారే మహాన్ శీతోదకో హ్రదః
ఫలమూలాన్వితో రమ్యో నానామృగసమావృతః. ౪౦

టీక॥ తస్యాః=ఆ; గుహాయాః=గుహయొక్క; ప్రాగ్ద్వారే=తూర్పువాకిలియందు; మహాన్=గొప్పదియు; శీతోదకః=చల్లనిజలముగలదియు; ఫలమూలాన్వితః=పండ్లతోనుగడ్డలతోనుకూడినదియు; రమ్యః=సుందరమును; నానామృగసమావృతః=నానావిధములయినమృగములచేఁజుట్టఁబడినదియునగు; హ్రదః=మడుఁగు; అస్తి(అధ్యాహృతము)=ఉన్నవి.

ఆగుహయొక్క తూర్పుద్వారంబున, తీరంబులందుఫలమూలంబులతోఁగూడినదియు నానావిధమృగసమన్వితంబును సుందరంబును చల్లనినీళ్లుగలదియునగు నొకగొప్పమడుఁగున్నది. అని, తాత్పర్యము.

తస్యాం వసతి సుగ్రీవ శ్చతుర్భి స్సహవానరైః
కదాచి చ్ఛిఖరే తస్య పర్వతస్యావతిష్ఠతే. ౪౧

టీ॥ సుగ్రీవః=సుగ్రీవుఁడు; చతుర్భిః=నలువురయిన; వానరైస్సహ=




వానరులతోఁగూడ; తస్యాం=ఆగుహయందు; వసతి=ఉన్నాఁడు. కదాచిత్=ఒకానొకప్పుడు; తస్య=ఆ; పర్వతస్య=పర్వతము యొక్క ; శిఖరే= శిఖరమునందు; అవతిష్ఠతే=ఉండును.

సుగ్రీవుండు, నలుగురు వానరులం గూడి, ఆగుహయందున్నాఁడు; ఒకానొకప్పుడు, అతండు, విహారార్థము, ఆఋశ్యమూకపర్వతశిఖరంబుపైనినుం దిరుగును. అని, కబంధుఁడు, రామలక్ష్మణులకుఁజెప్పెను. అని, తాత్పర్యము.

కబంధస్త్వనుశాస్యైవం తావుభౌ రామలక్ష్మణౌ
స్రగ్వీ భాస్కరవర్ణాభః ఖే వ్యరోచత వీర్యవాన్. ౭౨

టీక ॥ వీర్యవాన్=అధికమయినపరాక్రమము గలవాఁడును; స్రగ్వీ=పుష్పమాలిక గలవాఁడును; భాస్కరవర్ణాభః = సూర్యునివర్ణముపంటి కాంతిగలవాఁడునగు; కబంధస్తు= కబంధుండుమాత్రము; తౌ=ఆ; రామలక్ష్మణౌ=రామలక్ష్మణులను; ఉభౌ=ఇద్దఱనుగూర్చి; ఏవం= ఇట్లు; అనుశాస్య=చెప్పి; ఖే=ఆకాశమునందు; వ్యరోచత=ప్రకాశించెను.

పరాక్రమశాలియగు నాకబంధుండు, ఇట్లు, రామలక్ష్మణులకిద్దఱకునుం జెప్పి, పుష్పమాలికతోనొప్పుచు, సూర్యుండుంబోలెనాకాశంబున వెలుంగుచుండెను. అని, తాత్పర్యము.

తం తు ఖస్థం మహాభాగం కబంధం రామలక్ష్మణౌ
ప్రస్థితౌ త్వం వ్రజస్వేతి వాక్యమూచతు రంతికే. ౭౩

టీక॥ రామలక్ష్మణౌతు=రామలక్ష్మణులును; ప్రస్థితౌ= బయలుదేఱినవారలై; అంతికే= సమీపంబునందు; ఖస్థం= ఆకాశముననున్నవాఁడును; మహాభాగం=పూజ్యమయిన యదృష్టము గలవాఁడునగు; తం=ఆ; కబంధం= కబంధునిఁగూర్చి; "త్వం=నీవు; వ్రజస్వ=పొమ్ము" ఇతి=అను; వాక్యం = మాటను; ఊచతుః=చెప్పిరి.

రామలక్ష్మణులు అంతట బయలుదేఱినవారలయి, ఆకాశంబుననున్నమహాభాగుండగు కబంధునిసమీపించి, "నీవింక




పోవచ్చును" అని, చెప్పిరి. అని, తాత్పర్యము.

గమ్యతాం కార్యసిద్ధ్యర్థ మితి తా వబ్రవీ త్సచ
సుప్రీతౌ తా వనుజ్ఞాప్య కబంధః ప్రస్థిత స్తదా. ౪౪

టీక॥ సచ=ఆకబంధుండును; తౌ=ఆ రామలక్ష్మణులనుగూర్చి; కార్యసిద్ధ్యర్థం= కార్యము నెఱవేఱుటకొఱకును; గమ్యతాం=పోవుటయగుఁగాక. ఇతి=అని; అబ్రవీత్=చెప్పెను. తదా=అప్పుడు; కబంధః=కబంధుఁడు; సుప్రీతౌ=మిక్కిలియుసంతోషించిన; తౌ=ఆరామలక్ష్మణులను; అనుజ్ఞాప్య=ఒప్పించి; ప్రస్థితః=పోయెను.

అప్పుడు, కబంధుండును, రామలక్ష్మణులంజూచి, "కార్యసిద్ధికొఱకు మీరలు పొం"డని చెప్పి, సంతుష్టులయినయారామలక్ష్మణులయనుమతిఁగైకొని, పోయెను. అని, తాత్పర్యము.

స తత్కబంధః ప్రతిపద్య రూపం
వృతః శ్రియా భాస్కరతుల్యదేహః
నిదర్శయ న్రామ మవేక్ష్య ఖస్థః
సఖ్యం కురుష్వే తి తదా భ్యువాచ. ౪౫

టీక॥ తదా=అప్పుడు; సః=ఆ; కబంధః=కబంధుఁడు; తత్=ఆ; రూపం=శరీరమును; ప్రతిపద్య=పొందీ; శ్రియా=కాంతిచేత; వృతః=చుట్టబడినవాఁడై; భాస్కరతుల్యదేహః= సూర్యునితో సమానమయినదేహముగలవాఁడై; ఖస్థః=ఆకాశమునను న్నవాఁడై; రామం=రాముని; అవేక్ష్య=చూచి; నిదర్శయన్= చూపుచు; సఖ్యం=స్నేహమును; కురుష్వ=చేయుము. ఇతి=అని; అభ్యువాచ=చెప్పెను.

అప్పుడాకబంధుండు, అట్లు, దివ్యరూపంబునొంది, మహాతేజంబున సూర్యుండువలె వెలుంగుచు, ఆకాశంబుననుండి రాముంజూచి, ఋశ్యమూకమార్గంబుఁజూపుచు, "సుగ్రీవునితోఁదప్పసఖ్యంబుగావింపు" మని చెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే
ఆరణ్యకాండే, త్రిసప్తతితమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండ త్రిసప్తతితమసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

చతుస్సప్తతితమసర్గప్రారంభః.

తౌ కబంధేన తం మార్గం పంపాయా దర్శితం వనే
ప్రతస్థతు ర్దిశం గృహ్య ప్రతీచీం నృపాత్మజౌ. ౧

టీక నృపాత్మజౌ=రాజపుత్రులగు; తౌ=ఆ రామలక్ష్మణులు; కబంధేన=కబంధునిచేత; దర్శితం=చూపఁబడిన; తం=ఆ; మార్గం=మార్గమునుగూర్చి; ప్రతీచీం=పడమటిదగు; దిశం=దిక్కును; గృహ్య(గృహీత్వా)=గ్రహించి; ప్రతస్థతుః=వెడలిరి.

రాజపుత్రులగు రామలక్ష్మణులు, కబంధుండు చెప్పిన ప్రకారంబునఁ, బంపాసరోవరంబునకుఁబోవు మార్గంబు నవలంబించి, పడమటిదిక్కును బట్టిపోయిరి. అని, తాత్పర్యము.

తౌ శైలే ష్వాచితా నేతాన్ క్షౌద్రకల్ప ఫలాన్ ద్రుమాన్
వీక్షంతౌ జగ్మతు ర్ద్రష్టుం సుగ్రీవం రా  క్ష్మణౌ. ౨

టీక॥ తౌ=ఆ; రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు; శైలేషు=పర్వతములయందు; ఆచితాన్=వ్యాపించిన; క్షౌద్రకల్పఫలాన్= తేనెతోసమానములయినఫలములుగల; ఏతాన్=ఈ; ద్రుమాన్=వృక్షములను; వీక్షంతౌ=చూ

చుచు; సుగ్రీవం=సుగ్రీవుని; ద్రష్టుం=చూచుటకు; జగ్మతుః=పోయిరి.

ఆరామలక్ష్మణులు, పర్వతంబులనిండియుండు తేనియవంటిఫలంబులుగలవృక్షంబులఁజూచుచు, సుగ్రీవునింజూడవలెననుకోర్కితోఁబోయిరి.

అని, తాత్పర్యము.

కృత్వాచ శైలపృష్ఠేతు తౌ వాసం రామలక్ష్మణౌ
పంపాయాః పశ్చిమం తీరం రాఘవా వుపతస్థతుః. ౩

టీక॥ రాఘవౌ=రఘువంశమునఁబుట్టిన; తౌ=ఆ; రామలక్ష్మణౌ= రామలక్ష్మణులు; శైలపృష్ఠే=పర్వతముపైని; వాసం=ఉనికిని; కృత్వాచతు=చేసినంతనె; పంపాయాః= పంపాసరస్సుయొక్క; పశ్చిమం=పడమటిదైన; తీరం=గట్టును; ఉపతస్థతుః= పొందిరి.

ఆరామలక్ష్మణులు, పర్వతంబుపై నారాత్రియుండి, మఱునాఁడు, పంపాసరోవరముయొక్క పశ్చిమతీరంబు నొందిరి. అని, తాత్పర్యము.

తౌ పుష్కరిణ్యాః పంపాయా స్తీర మాసాద్య పశ్చిమమ్
అపశ్యతాం తత స్తత్ర శబర్యా రమ్య మాశ్రమమ్. ౪

టీక॥ తౌ=ఆరామలక్ష్మణులు; పంపాయాః=పంపయను; పుష్కరిణ్యాః=సరస్సుయొక్క; పశ్చిమం=పడమటిదైన; తీరం=గట్టును; ఆసాద్య=పొంది; తతః= అంత; తత్ర = అచ్చట; శబర్యాః=శబరియొక్క; రమ్యం= సుందరమయిన; ఆశ్రమం=ఆశ్రమమును; అపశ్యతాం=చూచిరి.

ఆరామలక్ష్మణులు, పంపాసరస్సు పశ్చిమతీరంబుఁజేరి, యంతనచ్చట, రమణీయంబగుశబరియాశ్రమంబుఁజూచిరి.

అని, తాత్పర్యము.

తౌ త మాశ్రమ మాసాద్య ద్రుమై ర్బహుభి రావృతమ్
సురమ్య మభివీక్షంతౌ శబరీ మభ్యుపేయతుః. ౫

టీక॥ తౌ=ఆరామలక్ష్మణులు, బహుభిః=పెక్కులయిన; ద్రుమైః=వృక్ష

ములచేత; ఆవృతం=చుట్టంబడిన; తం= ఆ; ఆశ్రమం=శబర్యాశ్రమమును; ఆసాద్య=పొంది; సురమ్యం=మిక్కిలియుసుందరమయినయాయాశ్రమమును; అభివీక్ష్య తౌ=చూచుచు; శబరీం=శబరినిగూర్చి; అభ్యుపేయతుః= పోయిరి.

ఆ రామలక్ష్మణులు, బహువృక్షములచేఁబరివేష్టితమయిన యాశబర్యాశ్రమమును జేరి, యందలిసౌందర్యంబునకచ్చెరువందిచూచుచు, శబరియొద్ద కుఁబోయిరి. అని, తాత్పర్యము.

తౌచ దృష్ట్వా తదా సిద్ధా సముత్థాయ కృతాంజలిః
రామస్య పాదౌ జగ్రాహ లక్ష్మణస్యచ ధీమతః. ౬

టీక॥ తదా=అప్పుడు; సిద్ధా=సిద్ధురాలగుశబరి; తౌ=ఆ రామలక్ష్మణులను; దృష్ట్వాచ=చూచినంతనె; సముత్థాయ=లేచి; కృతాంజలిః=చేయెఁబడిన చేమోడ్పుగలదై; రామస్య= రామునియొక్కయు; ధీమతః=బుదిమంతుండగు; లక్ష్మణస్యచ = లక్ష్మణునియొక్కయు; పాదౌ=చరణములను; జగ్రాహ=పట్టుకొనెను.

అప్పుడు, యోగసిద్ధినొందియున్న యాశబరి, యారామలక్ష్మణులంజూచినంతనె, లేచి, చేమోడ్పుగీలించి, రామునిపాదంబులకు నమస్కరించి, బుద్ధిమంతుండగులక్ష్మణునిపాదంబులకును నమస్కరించెను. అని, తాత్పర్యము.

పాద్య మాచమ నీయంచ సర్వం ప్రాదా ద్యథా విధి

టీక॥ పాద్యం=పాదోదకమును; ఆచమనీయంచ=ఆచమనోదకమును; సర్వం=అంతను; యథావిధి=యథాశాస్త్రముగా; ప్రాదాత్=ఇచ్చెను.

అంత, రామలక్ష్మణులకు, యథాశాస్త్రముగా, అర్ఘ్యపాద్యంబులను ఆచమనీయంబును, ఒసంగెను.

అని, తాత్పర్యము.

తా ముహాచ తతో రామ శ్శ్రమణీం సంశితవ్రతామ్. ౭

టీక॥ తతః=అంత; రామః=రాముఁడు; సంశితవ్రతాం=మిక్కిలియుదీక్ష్ణ

మయినవ్రతముగల; తాం=ఆ; శ్రమణీం=సన్న్యాసినిగూర్చి; ఉవాచ=చెప్పెను.

అంత, రాముండు, తీక్ష్ణమగువ్రతము గలసన్న్యాసినియగు నాశబరింజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

కచ్చిత్తే నిర్జితా విఘ్నాః కచ్చిత్తే వర్ధతే తపః
కచ్చిత్తే నియతః క్రోధ ఆహారశ్చ తపోధనే. ౮

టీక॥ తపోధనే=తపస్సే ధనముగాఁ గలశబరీ! తే=నీయొక్క; విఘ్నాః=విఘ్నములు; నిర్జితాః కచ్చిత్=జయింపఁబడినవా యేమి? తే=నీయొక్క; తపః=తపస్సు; వర్ధతే కచ్చిత్=వృద్ధిఁబొందుచున్నదా యేమి? తే=నీయొక్క; క్రోధః=కోపము; నియతః కచ్చిత్=నిగ్రహింపఁబడినదా యేమి? ఆహారశ్చ=ఆహారమును; నియతః కచ్చిత్ (అధ్యాహృతము)=నిగ్రహింపఁబడినదా యేమి?

తపస్సే ధనముగాఁగలశబరీ! నీవుతపోవిఘ్నంబులన్నింటిని జయించితివా? నీ తపస్సువృద్ధిఁబొందుచున్నదా? కోపంబును ఆహారంబును నిగ్రహించి కొంటివా? అని, తాత్పర్యము.

కచ్చిత్తే నియమాః ప్రాప్తాః కచ్చిత్తే మనసస్సుఖమ్
కచ్చిత్తే గురుశుశ్రూషా సఫలా చారుభాషిణి. ౯

టీక॥ చారుభాషిణి=సుందరముగా మాటలాడునట్టిశబరీ! తే(త్వయా)=నీచేత; నియమాః=వ్రతములు; ప్రాప్తాః కచ్చిత్=పొందఁబడినవా యేమి? తే=నీయొక్క; మనసః=మనసునకు; సుఖం కచ్చిత్=సుఖమా యేమి? తే= నీయొక్క; గురుశుశ్రూషా=గురుసేవ; సఫలా కచ్చిత్ = ఫలముతోఁ గూడినదా యేమి?

సుందరముగా మాటలాడునట్టి శబరీ! నీవుచాంద్రాయణాది వ్రతంబులం బొందితివా యేమి? నీమనస్సుసుఖముగానున్నదా యేమి? నీవుచేసినగురుశుశ్రూషసఫలమయినదా యేమి? అని, రాముండు, శబరినడిగెను. అని, తాత్పర్యము.

రామేణ తాపసీ పృష్టా సా సిద్ధా సిద్ధసమ్మతా
శశంస శబరీ వృద్ధా రామాయ ప్రత్యవస్థితా. ౧౦

టీక॥ తాపసీ=తపస్సుగలదియు; సిద్ధా=యోగసిద్ధినొందినదియు; సిద్ధసమ్మతా=యోగసిద్ధులచేఁ బూజింపఁబడినదియు; వృద్ధా=ముసలిదియునగు; సా=ఆ; శబరీ=శబరి; రామేణ=రామునిచేత; పృష్టా=అడుగఁబడినదై; రామాయ=రామునికొఱకు; ప్రత్యవస్థితా=ఎదురునిలిచినదై; శశంస=చెప్పెను.

తపస్వినియు సిద్ధురాలును సిద్ధులచే గౌరవింపఁబడినదియు వృద్ధురాలు నగు నా శబరి, రామునిచే నడుగఁబడినదై, రామునకెదురునిలిచి, యిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

అద్య ప్రాప్తా తపస్సిద్ధి స్తవ సందర్శనా న్మయా
అద్య మే సఫలం తప్తం గురవశ్చ సుపూజితాః. ౧౧

టీక॥ తవ=నీయొక్క; సందర్శనాత్=చూచుటవలన; మయా=నాచేత; అద్య=ఇప్పుడు; తపస్సిద్ధిః=తపస్సిద్ధి; ప్రాప్తా=పొందఁబడినది. అద్య=ఇప్పుడు; తప్తం=తపస్సు; సఫలం=ఫలముతోఁగూడినది. గురవశ్చ=గురువులును; సుపూజితాః=చక్కఁగాఁ బూజింపఁబడినారు.

నీదర్శనముచేయుటవలన, ఇప్పుడు నాకుఁ దపస్సిద్ధి కలిగినది; ఇప్పుడు నా తపస్సంతయు సఫలమైనది; ఇప్పుడు, నాగురుశుశ్రూషయు సఫలమయినది. అని, తాత్పర్యము.

అద్య మే సఫలం జన్మ స్వర్గశ్చైవ భవిష్యతి
త్వయి దేవవరే రామ పూజితే పురుషర్షభ. ౧౨

టీక॥ పురుషర్షభ=పురుషశ్రేష్ఠుండవగు; రామ=రాముఁడా! దేవవరే=దేవతలలోనుత్తముఁడవయిన; త్వయి=నీవు; పూజితే=పూజింపఁబడినవాఁడవు కాఁగా; అద్య=ఇప్పుడు; మే=నాయొక్క; జన్మ=పుట్టుక; సఫలం=ఫలము

తోఁగూడినది. స్వర్గశ్చైవ= స్వర్గమును; భవిష్యతి=కాఁగలదు.

పురుష శ్రేష్ఠుఁడవగు రాముఁడా! దేవతలయందరిలోను ఉత్తముఁడవగు నిన్నుఁబూజించుటవలన, ఇప్పుడు నాజన్మము సఫలమయినది; నాకింక స్వర్గాదిదివ్యలోకంబులును సిద్ధింపఁగలవు.

అని, తాత్పర్యము.

చక్షుషా తవ సౌమ్యేన పూతాస్మి రఘునందన
గమిష్యా మ్యక్షయాన్ లోకాన్ త్వత్ప్రసాదా దరిందమ. ౧౩

టీక॥అరిందమ=శత్రువుల నడఁగఁద్రొక్కునట్టి; రఘునందన= రాముఁడా! తవ=నీయొక్క; సౌమ్యేన=శాంతమగునట్టి; చక్షుషా=దృష్టిచేత; పూతా=పరిశుద్ధురాలను; అస్మి=అగుచున్నాను. త్వత్ప్రసాదాత్ = నీయనుగ్రహమువలన; అక్షయాన్=నాశములేని ; లోకాన్ = లోకములను; గమిష్యామి= పొందెదను.

శత్రువుల నడఁగద్రొక్కునట్టి రాముఁడా! నీసౌమ్యదృష్టిచేత, పాపంబులన్నియు హరింపఁబడినేను బరిశుద్ధురాలనైతిని; నీయనుగ్రహంబువలన, ఇంక, నక్షయంబులగు పుణ్యలోకంబులకుఁ బోయెదను. అని, తాత్పర్యము.

చిత్రకూటం త్వయి ప్రాప్తే విమానై రతుల ప్రభైః
ఇత స్తే దివ మారూఢా యానహం పర్యచారిషమ్. ౧౪

టీక॥త్వయి= నీవు; చిత్రకూటం= చిత్రకూటపర్వతమును; ప్రాప్తే=పొందినవాఁడవగుచుండఁగా; అహం=నేను; యాన్=ఎవ్వరిని; పర్యచారిషం=కొలిచితినో; తే=ఆమునులు; ఇతః=ఇచ్చటనుండి; అతులప్రభైః= సరిలేనికాంతిగల; విమానైః=విమానములచేత; దివం= స్వర్గమును; ఆరూఢాః=పొందిరి.

నేనెవ్వరిని సేవించుచుంటినో, యామతంగశిష్యులగు మహర్షులు, నీవు చిత్రకూటంబునకువచ్చినప్పుడే, మహాతేజంబున వెలుంగుచుండు విమానంబుల నారోహించి, స్వర్గంబునొందిరి.

అని, తాత్పర్యము.

తైశ్చాహ ముక్తా ధర్మజ్ఞై ర్మహాభాగై ర్మహర్షిభిః

టీక॥ ధర్మజ్ఞైః = ధర్మముఁ దెలిసిన వారలును; మహాభాగైః = పూజ్యమయి నయదృష్టముగలవారలునగు; తైః = ఆ; మహర్షిభిశ్చ = మహామునులచేతను; అహం = నేను; ఉక్తా = చెప్పఁబడినాను.

ధర్మజ్ఞులును మహాభాగులునగు నమ్మహర్షులు, అప్పుడు నన్నుఁజూచి, యిట్లని చెప్పిరి. అని, తాత్పర్యము.

ఆగమిష్యతి తే రామ స్సుపుణ్య మిమ మాశ్రమమ్. ౧౫
స తే ప్రతిగృహీతవ్య స్సౌమిత్రి సహితోఽతిథిః

టీక॥ రామః = రాముఁడు; తే = నీయొక్క; సుపుణ్యం = మిక్కిలియుఁ బవిత్రమయిన; ఇమం = ఈ; ఆశ్రమం = ఆశ్రమమును గూర్చి; ఆగమిష్యతి = రాఁగలఁడు. సౌమిత్రిసహితః = లక్ష్మణునితోఁ గూడిన; సః = ఆ రాముఁడు; తే (త్వయా) = నీచేత; అతిథిః = అతిథిగా; ప్రతిగృహీతవ్యః = స్వీకరింపఁబడవలసినవాఁడు.

రాముఁడు, నిన్నుఁజూచుటకై పవిత్రమగు నీయాశ్రమంబునకు రాఁగలఁడు; అప్పుడు, నీవు, రామునకును లక్ష్మణునకును, జక్కఁగా నతిథిసత్కారంబు గావింపవలయును. అని, తాత్పర్యము.

తంచ దృష్ట్వా వరాన్ లోకా నక్షయాం స్త్వం గమిష్యసి. ౧౬

టీక॥ త్వం = నీవు; తంచ = ఆ రామునిని; దృష్ట్వా = చూచి; వరాన్ = ఉత్తమంబులును; అక్షయాన్ = నాశములేనివియునగు; లోకాన్ = లోకంబులను; గమిష్యసి = పొందఁగలవు.

నీవా రామునిసందర్శించి, పునరావృత్తిలేనట్టి, యుత్తమంబులగు పుణ్యలోకంబులం బొందఁగలవు. అని, యమ్మహామునులు నాకుఁ జెప్పిరి. అని, తాత్పర్యము.

మయాతు వివిధం వన్యం సంచితం పురుషర్షభ

తవార్థే పురుషవ్యాఘ్ర పంపాయా స్తీరసంభవమ్. ౧౭

టీక॥ పురుషర్షభ=పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! తవార్థే=నీనిమిత్తము; పంపాయాః=పంపాసరస్సుయొక్క; తీరసంభవం=గట్టునఁబుట్టిన; వివిధం=నానావిధములగు; వన్యం=వనంబునఁబుట్టినపదార్థము; పురుషవ్యాఘ్ర=పురుషోత్తముఁడవగు రాముఁడా! మయాతు=నాచేతను; సంచితం=చేర్పఁబడినది.

పురుషోత్తముఁడవగు రాముఁడా! నేనునీనిమిత్తముయి, పంపాసరస్సుతీరంబులంబుట్టిననానావిధమయిన, ఫలాదివన్యపదార్థములను, అప్పటినుండి, సేకరించియున్నాను. అని, శబరి, రామునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్త స్స ధర్మాత్మా శబర్యా శబరీ మిదమ్

రాఘవః ప్రాహ విజ్ఞానే తాం నిత్య మబహిష్కృతామ్. ౧౮

టీక॥ ధర్మాత్మా=ధర్మబుద్ధిగల; సః=ఆ; రాఘవః=రాముఁడు; శబర్యా=శబరిచేత; ఏవం=ఇట్లు; ఉక్తః=చెప్పఁబడినవాఁడై; విజ్ఞానే=జ్ఞానవిషయమందు; నిత్యం=ఎల్లప్పుడును; అబహిష్కృతాం=వెలుపలనుండనట్టి; తాం=ఆ; శబరీం=శబరినిగూర్చి; ఇదం=ఈమాటను; ప్రాహ=చెప్పెను.

ధర్మాత్ముఁడగునారాముండు, శబరిచెప్పినమాటనువిని, ఎల్లప్పుడును, బ్రహ్మజ్ఞానానుసంధానపరాయణయయినయాశబరింజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

దనోస్సకాశా త్తత్త్వేన ప్రభావం తే మహాత్మనః

శ్రుతం ప్రత్యక్ష మిచ్ఛామి సంద్రష్టుం యదిమన్యసే. ౧౯

టీక॥ మహాత్మనః=పూజ్యమయిన స్వభావముగల; దనోస్సకాశాత్=దనువంశమునఁబుట్టిన కబంధునియొద్దనుండి; శ్రుతం=వినఁబడిన; తే=నీయొక్క; ప్రభావం=మాహాత్మ్యమును; యది మన్యసే=నీవుతలంతువేని; ప్రత్యక్షం=

ప్రత్యక్షముగా; సంద్రష్టుం=చూచుటకు; ఇచ్ఛామి=కోరుచున్నాను.

మహాత్ముండగుకబంధుండు, నీయొక్కయా నీగురువులయొక్కయుఁ బ్రభావమును, నాకుఁజెప్పినాఁడు; నీకు, ఇష్టమయినయెడల, వానినన్నిఁటిని, బ్రత్యక్షముగాఁజూడవలెనని యున్నాను. అని, రాముండు, శబరితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏతత్తు వచనం శ్రుత్వా రామవక్త్రాద్వినిస్సృతమ్
శబరీ దర్శయామాస తావుభౌ తద్వనం మహత్. ౨౦

టీక॥ రామవక్త్రాత్=రామునినోటనుండి; వినిస్సృతం=బయలువెడలిన; ఏతత్=ఈ; వచనం=మాటను; శ్రుత్వా తు=విన్నంతనే; శబరీ=శబరి; ఉభౌ=ఇద్దఱయిన; తౌ=ఆరామలక్ష్మణులను, రామలక్ష్మణులకనుట; మహత్=గొప్పదగు; తత్=ఆ; వనం=అడవిని; దర్శయామాస=చూపెను.

రామునినోటనుండి చెప్పిన యామాటను విన్నంతనే, శబరి, యారామలక్ష్మణులకిర్వురకును, అమ్మహావనంబంతయుఁజూపెను. అని, తాత్పర్యము.

పశ్య మేఘఘనప్రఖ్యం మృగపక్షిసమాకులమ్
మతంగవనమిత్యేవ విశ్రుతం రఘునందన. ౨౧

టీక॥ రఘునందన=రాముఁడా! మేఘఘనప్రఖ్యం=మేఘసమూహముతోసమానమయినదియు; మృగపక్షిసమాకులం=మృగములతోను బక్షులతోనునిండినదియు; మతంగవనమిత్యేవ=మతంగవనమనియె; విశ్రుతం=ప్రసిద్ధమునగువనమును; పశ్య=చూడుము.

రాముఁడా! మేఘసమూహము వలెఁజూపట్టుచున్నదియు మృగపక్షులనిండియున్నదియు మతంగవనంబని పేరువడసినదియునగు నిమ్మహావనంబుఁజూడుము. అని, తాత్పర్యము.

ఇహ తే భావితాత్మానో గురవో మే మహాద్యుతే
జుహవాం చక్రిరే తీర్థం మంత్రవన్మంత్రపూజితమ్. ౨౨

స ౭౪

టీక॥ మహాద్యుతే= అధికమయిన కాంతిగలరాముఁడా! ఇహ=ఇచ్చట; భావితాత్మానః=ధ్యానింపఁబడినయాత్మగల; తే=ఆ; మే=నాయొక్క; గురవః=ఆచార్యులు; మంత్రవన్మంత్రపూజితం = మంత్రవేత్తలచేమంత్రములఁ బూజింపఁబడనిదగునట్లు; తీర్థం = యాగమును; జహావాంచక్రిరే-చేసిరి.

కాంతిమంతుఁడవగురాముఁడా! ఇచ్చటఁ, బరమాత్మవేత్తలగు నాయాచార్యులు, మంత్రవేత్తలబుత్విజులం బురస్కరించికొని, మంత్రయుక్తంబుగా, యాగంబులు గావించిరి.

అని, తాత్పర్యము.

ఇయం ప్రత్యక్స్థలీ వేదిర్యత్ర తే మే సుసత్కృతాః
పుష్పోపహారం కుర్వంతి శ్రమాదుద్వేపిభిః కరైః. ౨౩

టీక॥ యత్ర=ఎచ్చట; మే=నాయొక్క; సుసత్కృతాః=చక్కఁగఁబూజింపఁబడిన; తే = ఆగురువులు; శ్రమాత్=అలసటవలన; ఉద్వేపిభిః= వణఁకుచున్న; కరైః=చేతులచేత; పుష్పోపహారం = పూలచేఁబూజను;కుర్వంతి = చేసిరో; సా(అధ్యాహృతము)=అట్టి; ప్రత్యక్స్థలీ=పడమటమిట్టయయిన; వేదిః=యాగవేది; ఇయం= ఇది.

ఇదిగో యాగవేదిక; నాచేఁజక్కఁగాఁ సేవింపఁబడుచుండిననాగురువులు, ముసలితనముచే వడంకుహస్తంబులచే దీనిఁబుష్పములం బూజించుచుందురు.

అని, తాత్పర్యము.

తేషాం తపఃప్రభావేన పశ్యాద్యాపి రఘూద్వహ
ద్యోతయంతి దిశస్సర్వా శ్శ్రియా వేద్యోతులప్రభాః. ౨౪

టీక॥ రఘూద్వహ=రాముఁడా! అద్యాపి=ఇప్పుడుగూడ; తేషాం=వారలయొక్క; తపఃప్రభావేన=తపోమహిమచేత; వేద్యః= వేదికలు; అతులప్రభాః= సరిలేనికాంతిగలవై; శ్రియా= కాంతిచేత; సర్వాః=సమస్తములయిన; దిశః=దిక్కులను; ద్యోతయంతి=ప్రకాశింపఁజేయుచున్నవి. పశ్య = చూడుము.

రాముఁడా! ఈవేదులు, నాయాచా

ర్యులనమ్మహాఘలల తపఃప్రభావమువ లననిప్పటికిఁగూడ, అసదృశమగుకాంతి చేసమస్తదిక్కులను వెలుంగంజేయుచు న్నవి;చూడుము. అని, తాత్పర్యము.

అశక్నువద్భి స్తైః గంతు ముపవాసశ్రమాలసైః
చింతితే భ్యాగతాన్ పశ్య సహితాన్ సప్త సాగరాన్. ౨౫

టీక॥ ఉపవాసశ్రమాలసైః= ఉపవాసములచేతను శ్రమముచేతనుఓపికలేనట్టివారును, కావునసె; గంతుం=పోవుటకు; అశక్నువద్భిః= శక్తిలేనివారలునగు; తైః= అమునులచేత; చింతితే = తలంపఁబడఁగానే; అభ్యాగతాన్ = ఎదురుగావచ్చిన ; సహితాన్=కూడిన; సప్త=ఏడైన ; సాగరాన్=సముద్రములను; పశ్య = చూడుము.

ఉపవాసములచేతనుముసలితనముచేతనుపోవుటకుశక్తిలేక,యమ్మునులు, మనస్సునస్మరించినంతనె , సప్తసముద్రంబులునువారియాశ్రమంబునకె , వచ్చియున్నవిచూడుము.

అని,తాత్పర్యము.

కృతాభిషేకై స్తైః న్యస్తా వల్కలాః పాదపేష్విహ
అద్యాపి నావశుష్యంతి ప్రదేశే రఘునందన. ౨౬

టీక॥ రఘునందన=రాముఁడా! ఇహ= ఈ;ప్రదేశే=ప్రదేశమునందు;కృతాభిషేకైః= చేయఁబడినస్నానముగలట్టి; తైః=అమునులచేత;పాదపేషు=వృక్షములయందు; న్యస్తాః=ఉంచఁబడిన; వల్కలాః= నారచీరలు; అద్యాపి=ఇప్పటికిని ; నావశుష్యంతి = ఎండకున్నవి.

రాముఁడా! అమ్మునీంద్రులు, ఈసప్తసాగరంబుల స్నానముచేసివృక్షంబులనాఱవేసినవల్కలంబులు,వారితపఃప్రభావంబునంజేసి, యిప్పటికిని, ఎండకున్నవిచూడుము.అని, తాత్పర్యము.

దేవకార్యాణి కుర్వద్భి ర్యానీ మాని కృతాని వై
పుష్పైః కువలయైస్సార్ధం మ్లానత్వం నోపయాంతి వై. ౨౭

టీక॥ దేవకార్యాణి=దేవతాకార్యములను; కుర్వద్భిః=చేయుచున్నట్టియామునులచేత; కువలయైస్సార్ధం=నల్లకలువలతోఁగూడ; పుష్పైః=పూలచేత; యాని=ఏ; ఇమాని=ఈపుష్పమాలికలచేత; కృతాని=చేయఁబడినవో ("వై" అనునదిపాదపూరణార్థము); తాని (అధ్యాహృతము)=ఆపుష్పమాలికలు; మ్లానత్వం=వాడుటను; నోపయాంతి=పొందకున్నవి("వై" అనునదిపాదపూరణార్థము).

దేవపూజకుఁగా నమ్మునీంద్రులచేత, కువలయంబులను ఇతరపుష్పంబులనుంగూర్చికట్టఁబడిన పుష్పమాలికలు, వారితపఃప్రభావంబున, ఇప్పటికిఁవాడకున్నవి చూడుము.

అని, తాత్పర్యము.

కృత్స్నం వన మిదం దృష్టం శ్రోతవ్యంచ శ్రుతం త్వయా
త దిచ్ఛా మ్యభ్యనుజ్ఞాతా త్యక్తు మేత త్కళేబరమ్. ౨౮

టీక॥ త్వయా=నీచేత; ఇదం=ఈ; వనం=అడవి; కృత్స్నం = అంతయు; దృష్టం=చూడఁబడినది. శ్రోతవ్యంచ=వినఁబడవలసినదియు; శ్రుతం=వినఁబడినది. తత్=అందువలన; అభ్యనుజ్ఞాతా= అనుమతింపఁబడినదాననై; ఏతత్=ఈ; కళేబరం=దేహమును; త్యక్తుం=విడుచుటకు; ఇచ్ఛామి = కోరుచున్నాను.

నీవు, ఈవనంబునంతయుఁ జూచినావు; వినవలసినసంగతంబులనువిన్నావు; ఇంకనాకనుజ్ఞయొసంగుదువేని, నేనీశరీరంబు విడిచెదను.

అని, తాత్పర్యము.

తేషా మిచ్ఛా మ్యహం గంతుం సమీపం భావితాత్మనామ్
మునీనా మాశ్రమో యేషా మహంచ పరిచారిణీ. ౨౯

టీక॥ అయం(అధ్యాహృతము)= ఇది; యేషాం=ఎవ్వరియొక్క; ఆశ్రమః= ఆశ్రమమో; అహంచ=నేనును; యేషాం(అధ్యాహృతము) = ఎవ్వరియొక్క; పరిచారిణీ=పరిచర్యచేయుదాననో; అహం=నేను; తేషాం=ఆ; భావితాత్మనాం= ధ్యానింపఁబడినయాత్మగల; మునీనాం=మునులయొక్క; సమీ

పం=సమీపమును; గంతుం=పొందుట కు;ఇచ్ఛామి=కోరుచున్నాను.

ఇది యెవ్వరి యాశ్రమమో, నేనేమహాత్ములపరిచారికనో, అట్టియాత్మవేత్తలగుమహామునుల పాదమూలమును పొందగోరుచున్నాను; అని,శబరి రాముని తోఁజెప్పెను.అని తాత్పర్యము.

ధర్మిష్ఠంతు వచ శ్శ్రుత్వా రాఘవ స్సహలక్ష్మణః
ప్రహర్ష మతులం లేభే ఆశ్చర్యమితి తత్త్వతః. ౩౦

టీక॥సహలక్ష్మణః= లక్ష్మణునితోఁ గూడిన; రాఘవః=రాముఁడు; ధర్మిష్ఠం=అధికమయినధర్మముగల; వచః= మాటను; శ్రుత్వాతు=విన్నంతనె; తత్త్వతః= యథార్థముగా; ఆశ్చర్యమితి=ఆశ్చర్యమని;అతులం=సాటిలేని; ప్రహర్షం=సంతోషమును; లేభే=పొందెను.

రాముండును లక్ష్మణుండును ధర్మిష్ఠంబగు నాశబరియొక్క మాటనంతయువిని , ఈతపోవనవైభవము ఆశ్చర్యకరమని,పరమ సంతోషంబునొందిరి.

అని, తాత్పర్యము.

తా మువాచ తతో రామ శ్శ్రమణీం సంశితవ్రతామ్

టీక॥తతః=అంత;రామః=రాముఁడు;సంశితవ్రతాం=మిక్కిలియుఁ దీక్ష్ణమయినవ్రతముగల; తాం=ఆ; శ్రమణీం=సన్న్యాసినియగుశబరినిగూర్చి; ఉవాచ=చెప్పెను.

అంత, రాముండు,మిక్కిలియుఁ దీక్ష్ణమగు వ్రతముగల యాశబరింజూచి , యిట్లని చెప్పెను.

అని, తాత్పర్యము.

అర్చితోహం త్వయా భక్త్యా గచ్ఛ కామం యథాసుఖమ్. ౩౧

టీక॥ త్వయా=నీచేత; భక్త్యా=భక్తిచేత; అహం=నేను; అర్చితః=పూజింపఁబడినాను. యథాసుఖం=సుఖముగా; కామం= యథేచ్ఛగా; గచ్ఛ= పొమ్ము.

నీవుభక్తితోనన్నుఁబూజకొనిగాఁబూ

జించినావు; ఇంకసుఖముగాయథేచ్ఛం బొమ్ము. అని, రాముండు, శబరితోఁజె ప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యుక్తా జటిలా వృద్ధా చీరకృష్ణాజినాంబరా
తస్మిన్ముహూర్తే శబరీ దేహం జీర్ణం జిహాసతీ. ౩౨
అనుజ్ఞాతాతు రామేణ హుత్వాత్మానం హుతాశనే
జ్వలత్పావక సంకాశా స్వర్గమేవ జగామ సా. ౩౩

టీక॥ జటిలా=జటలుగలదియు; వృద్ధా=ముసలిదియు; చీరకృష్ణాజినాంబరా=నారచీరలునుజింకచర్మములునువస్త్రములుగాఁగలదియునగు; సా=ఆ; శబరీ=శబరి; ఇతి=ఈప్రకారము; ఉక్తా=చెప్పఁబడినదై; రామేణ=రామునిచేత; అనుజ్ఞాతాతు=అనుమతింపఁబడినదైనంతనె; తస్మిన్=ఆ; ముహూర్తే=సమయమునందు; జీర్ణం=శిథిలమయిన; దేహం=దేహమును; జిహాసతీ=విడువఁగోరినదై; హుతాశనే=అగ్నిహోత్రమునందు; ఆత్మానం=దేహమును; హుత్వా=వ్రేల్చి; జ్వలత్పావకసంకాశా=మండుచున్నయగ్నితోసమానమై; స్వర్గమేవ=స్వర్గమునే; జగామ=పొందెను.

జటలుదాల్చియున్నదియువృద్ధురాలునువల్కలంబులను కృష్ణాజినంబులను వస్త్రములుగా ధరించియుండునదియు నగునాశబరి, రాముండుచెప్పినమాటను విని, రామునియనుజ్ఞనొందినంతనే, యప్పుడెజీర్ణంబగు తనదేహమువిడువఁగోరి, దేహమును అగ్నిహోత్రంబున హోమముచేసి, జాజ్వల్యమానంబగు నగ్నివంటి దివ్యదేహంబునొంది, స్వర్గంబునొందెను. అని, తాత్పర్యము.

దివ్యాభరణ సంయుక్తా దివ్యమాల్యానులేపనా
దివ్యాంబరధరా తత్ర బభూవ ప్రియదర్శనా. ౩౪
విరాజయంతీ తం దేశం విద్యుత్సౌదామినీయథా

టీక॥ సా(అధ్యాహృతము)= ఆశబరి; తత్ర=అచ్చట; దివ్యాభరణసంయుక్తా = శ్రేష్ఠములయిన యాభరణములతోఁగూడినదై ; దివ్యమాల్యానులేప

నా=శ్రేష్ఠములయినపుష్పమాలికలును గంధమును గలదై ; దివ్యాంబర ధ రా= శ్రేష్ఠములయినవస్త్రములనుదాల్చినదై; ప్రియదర్శనా=సంతోషకరంబగుచూచుటగలదై; విద్యుత్=మిక్కిలి యుప్రకాశించునట్టి; సౌదామినీయథా=మెఱుపువలె ; తం=ఆ; దేశం=ప్రదేశమును; విరాజయంతీ = ప్రకాశింపఁజేయుచు; బభూవ=ఉండెను.

ఆశబరి, దివ్యాభరణంబులనుదివ్యమాల్యంబులును దివ్యగంధమును దివ్యవస్త్రములును దాల్చి, చూపరులెంతో సంతోషంబునొంద , మహాప్రకాశంబగు మెఱుపువలె, నాప్రదేశంబు వెలుఁగంజేయుచు, నుండెను.

అని, తాత్పర్యము.

యత్ర తే సుకృతాత్మానో విహరంతి మహర్షయః. ౩౫
తత్పుణ్యం శబరీ స్థానం జగామాత్మ సమాధినా

టీక॥ సుకృతాత్మానః=చక్కఁగా నేర్పఁబడినయాత్మగల; తే=ఆ;మహర్షయః=మహర్షులు; యత్ర=ఎచ్చట;విహరంతి= విహరించుచున్నారో ; శబరీ=శబరి;తత్ =ఆ;పుణ్యం= పవిత్రమయిన; స్థానం=స్థానమును; ఆత్మసమాధినా=తనసమాధిచేత; జగామ=పొందెను.

పరమాత్మ వేత్తలగు నమ్మతంగశిష్యులయినమహర్షులు,ఎచ్చటవిహరించుచున్నారో, అట్టిపుణ్యస్థానంబునకు, శబరి, సమాధి యోగబలంబునంబోయెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే
అరణ్యకాండే , చతుస్సప్తతితమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు,అరణ్యకాండచతుస్సప్తతితమసర్గటీక, ముగిసినది.

శ్రీ

పంచసప్తతితమసర్గప్రారంభః.

దివంతు తస్యాం యాతాయాం శబర్యాం స్వేన తేజసా
లక్ష్మణేనసహ భ్రాత్రా చింతయామాస రాఘవః. ౧

టీక॥ తస్యాం=ఆ; శబర్యాం= శబరి; స్వేన=తనదైన; తేజసా= కాంతితో; దివం=స్వర్గమును; యాతాయాంతు = పొందఁగానే; రాఘవః= రాముఁడు; భ్రాత్రా=తమ్ముఁడైన; లక్ష్మణేనసహ=లక్ష్మణునితోఁగూడ; చింతయామాస=ఆలోచించెను.

ఆశబరినిజకాంతితో వెలుఁగుచు స్వర్గమునొందినంతనె, రాముఁడు, తమ్ముఁడగులక్ష్మణునితోఁగూడ, నాలోచించెను. అని, తాత్పర్యము.

స చింతయిత్వా ధర్మాత్మా ప్రభావం తం మహాత్మనామ్
హితకారిణ మేకాగ్రం లక్ష్మణం రాఘవో బ్రవీత్. ౨

టీక॥ ధర్మాత్మా= ధర్మబుద్ధిగల; సః=ఆ; రాఘవః=రాముఁడు; మహాత్మనాం=అధికమయినప్రభావముగలమునులయొక్క; తం=ఆ;ప్రభావం= మహిమమును;చింతయిత్వా=తలంచి; ఏకాగ్రం = ఒకటేవిధమయిన మనస్సుగల; హితకారిణం=మేలుచేయునట్టి; లక్ష్మణం = లక్ష్మణునిగూర్చి; అబ్రవీత్=చెప్పెను.

ధర్మాత్ముండగు నారాముఁడు, మహాత్ములగునమ్మునుల ప్రభావములను దలఁచితలఁచి, తనకుహితమునే గావించువాఁడును ఏకాగ్రచిత్తుండునగులక్ష్మణుంజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

దృష్టో య మాశ్రమ స్సౌమ్య బహ్వాశ్చర్యః కృతాత్మనామ్
విశ్వస్త మృగశార్దూలో నానా విహగసేవితః. ౩

స ౭౫

టీక॥ సౌమ్య=తిన్ననివాఁడవగులక్ష్మణుఁడా! బహ్వాశ్చర్యః=పెక్కాశ్చర్యములు గలదియు; విశ్వస్తమృగశార్దూలః=నిర్భయములయినమృగములును బెద్దపులులును గలదియు; నానావిహగసేవితః= నానావిధపక్షులచేసేవింపఁబడినదియునగు; అయం=ఈ; కృతాత్మనాం=నేర్పఁబడినయాత్మగలమునులయొక్క; ఆశ్రమః=ఆశ్రమము; దృష్టః=చూడఁబడినది.

సౌమ్యుండవగులక్ష్మణుఁడా! అనేకాశ్చర్యములుగలదియు నిర్భయముగా సంచరించుచుండు మృగంబులును పులులునుగలదియు నానాపక్షులతోఁగూడినదియునగు, నీపరమాత్మవేత్తలగు మహామునులయాశ్రమముంజూచినాము.

అని, తాత్పర్యము.

సప్తానాంచ సముద్రాణా మేషు తీర్థేషు లక్ష్మణ
ఉపస్పృష్టంచ విధివ త్పితరశ్చాపి తర్పితాః. ౪

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! సప్తానాం=ఏడైన; సముద్రాణాంచ=సముద్రములయొక్కయు; ఏషు=ఈ; తీర్థేషు=తీర్థములయందు; విధివత్=యథాశాస్త్రముగా; ఉపస్పృష్టంచ=స్నానమునుచేయఁబడినది. పితరశ్చాపి=పితరులును; తర్పితాః=తృప్తిఁబొందింపఁబడిరి.

లక్ష్మణుఁడా! ఈసప్తసముద్రముల తీర్థములయందును స్నానము చేసినాము; పితృతర్పణముగూడఁ గావించినాము. అని, తాత్పర్యము.

ప్రణష్ట మశుభం తత్త త్కల్యాణం సముపస్థితమ్
తేన తత్త్వేన హృష్టం మే మనో లక్ష్మణ సంప్రతి. ౫

టీక॥లక్ష్మణ = లక్ష్మణుఁడా! తత్=ఆయా; అశుభం= అమంగళము; ప్రణష్టం=నశించినది. కల్యాణం=మంగళము; సముపస్థితం=సమీపించినది. తేన=అందుచేత; తత్త్వేన=యాథార్థ్యముచేత; మే=నాయొక్క; మనః=మనస్సు; సంప్రతి=ఇప్పుడు; హృష్టం=సంతోషమునొందినది.

లక్ష్మణుఁడా! అశ్రేయమంగళములన్నియు నశించినవి; ఇంకమంగళ

ము, సమీపించియున్నది; అందుచేత, యథార్థముగా నామనస్సుసంతోషము నొందినది. అని, తాత్పర్యము.

హృదయే హి నరవ్యాఘ్ర శుభ మావిర్భవిష్యతి

టీక॥ నరవ్యాఘ్ర=పురుషశ్రేష్ఠుఁడ వగులక్ష్మణుడా! శుభం= మంగళము; హృదయే=మనస్సునందు; ఆవిర్భవిష్యతిహి=పొడసూపునుగదా!

పురుషశ్రేష్ఠుఁడవగు లక్ష్మణుఁడా! మంగళము వచ్చునట్లుండునేని, యది ముందే మనస్సునందోఁచును.

అని, తాత్పర్యము.

తదా గచ్ఛ గమిష్యామి పంపాం తాం ప్రియదర్శనామ్. ౮
ఋశ్యముకో గిరిర్యత్ర నాతిదూరే ప్రకాశతే
యస్మి న్వసతి ధర్మాత్మా సుగ్రీవోంశుమత స్సుతః. ౯
నిత్యం వాలి భయా త్త్రస్త శ్చతుర్భి స్సహ వానరైః

టీక॥ తత్=అందువలన; యత్ర=ఎచ్చట; నాతిదూరే= సమీపమునందు; యస్మిన్=దేనియందు; ధర్మాత్మా=ధర్మబుద్ధిగల వాఁడును; అంశుమతః=సూర్యునియొక్క; సుతః=కొడుకునగు; సుగ్రీవః= సుగ్రీవుఁడు; వాలిభయాత్=వాలిభయంబువలన; త్రస్తః=భయపడినవాఁడై; చతుర్భిః=నలువురైన; వానరైస్సహ=వానరులతోఁగూడ; నిత్యం=ఎల్లప్పుడు; వసతి=వాసముసేయుచున్నాఁడో; సః (అధ్యాహృతము)=అట్టి; ఋశ్యముకః=ఋశ్యమూకమను; గిరిః=పర్వతము; ప్రకాశతే=ప్రకాశించుచున్నదో; తాం=ఆ; ప్రియదర్శనాం= సంతోషకరమయినచూచుటగల; పంపాం=పంపాసరస్సునుగూర్చి; గమిష్యామి=పోయెదను.

అందువలన, శీఘ్రమునరమ్ము; వాలిభయంబున, ధర్మాత్ముండును సూర్యపుత్రుండునగుసుగ్రీవుండు, నలువురు వానరవీరులంగూడి, యెల్లప్పుడును, ఏ పర్వతంబున వాసముచేయుచుండునో, అట్టి ఋశ్యమూకపర్వతంబు దేనిసమీపంబునఁబ్రకాశించుచుండునో, ఆరమణీయంబగు పంపాసరస్సునకుఁ బోవుదము. అని, తాత్పర్యము.

అభిత్వరేచ తం ద్రష్టుం సుగ్రీవం వానరర్షభమ్. ౮
తదధీనంహి మే సౌమ్య సీతాయాః పరిమార్గణమ్

టీక॥ సౌమ్య= తిన్ననివాఁడవగులక్ష్మణుఁడా! వానరర్షభం=వానరశ్రేష్ఠుఁడగు; తం=ఆ; సుగ్రీవం=సుగ్రీవుని; ద్రష్టుం=చూచుటకు; అభిత్వరేచ=వేగిరపడుచున్నాను. మే=నాయొక్క; సీతాయాః= సీతయొక్క; పరిమార్గణం=వెదకుట; తదధీనంహి=ఆసుగ్రీవునియధీనముగదా!

సౌమ్యుఁడవగులక్ష్మణుఁడా! వానరోత్తముఁడగు సుగ్రీవుని శీఘ్రంబునం జూడఁగోరుచున్నాను; సీతను వెదకుటంతయు, నాకతనివలననేగదాకావలసియున్నది. అని, రాముండు, లక్ష్మణునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఏవం బ్రువాణం తం ధీరం రామం సౌమిత్రి రబ్రవీత్. ౯

టీక॥సౌమిత్రిః = లక్ష్మణుఁడు; ఏవం=ఇట్లు; బ్రువాణం=చెప్పుచున్న; ధీరం=ధైర్యశాలియగు; తం= ఆ; రామం=రామునిఁగూర్చి; అబ్రవీత్= చెప్పెను.

లక్ష్మణుఁడు,ధీరుండగు రామునిమాటనువిని,రామునిఁజూచి, యిట్లనిచెప్పెను. అని, తాత్పర్యము.

గచ్ఛావ స్త్వరితం తత్ర మమాపి త్వరతే మనః

టీక॥ తత్ర=అచ్చటికి; త్వరితం=శీఘ్రముగా; గచ్ఛావః=పోవుదము. మమ= నాయొక్క ; మనోపి=మనస్సుగూడ; త్వరతే=వేగిరపడుచున్నది.

శీఘ్రముగాఁబంపాసరస్సునకుఁబోవుదము; నామనస్సునకు శీఘ్రముగాఁబోవలెననియేయున్నది. అని,లక్ష్మణుండురామునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఆశ్రమా త్తు తత స్తస్మా న్నిష్క్రమ్య స విశాం పతిః౧౦
ఆజగామ తతః పంపాం లక్ష్మణేనసహా భిభూః

స ౬౫

టీక॥ అభిఘ్నాః=శత్రువులందిరస్కరించునట్టి; విశాం= మనుష్యులకు; పతిః=ప్రభువయిన; సః= ఆరాముఁడు; తతః=అంత; లక్ష్మణేనసహ=లక్ష్మణునితోఁగూడ; తస్మాత్=ఆ; ఆశ్రమాత్=ఆశ్రమమునుండి; నివర్త్య=వెడలి; తతః=అంత; పంపాం= పంపాసరస్సును; ఆజగామ=పొందెను.

శత్రువులజయించునట్టినరేంద్రుండగురాముండు, అంతలక్ష్మణునితోఁగూడ, నాయాశ్రమంబునుండి వెడలి, పంపాసరస్సునకుఁబోయెను.

అని, తాత్పర్యము.

స దదర్శ తతః పుణ్యా ముదార జన సేవితామ్. ౧౧
నానాద్రుమ లతా కీర్ణాం పంపాం పానీయవాహినీమ్
పద్మైః స్సౌగంధికై స్తామ్రాం శుక్లాం కుముద మండలైః. ౧౨
నీలాం కువలయో ద్ఘాటై ర్బహువర్ణాం కుథామివ

టీక॥తతః=అంత; సః=ఆరాముఁడు; పుణ్యాం=పవిత్రమును; ఉదారజనసేవితాం=శ్రేష్ఠులయినజనులచేసేవింపఁబడినదియు; నానాద్రుమలతాకీర్ణాం= నానావిధములయినవృక్షములచేతను తీఁగలచేతను వ్యాపింపఁబడినదియు; పానీయవాహినీం=తాగుటకర్హమయినజలమునువహించునదియు; పద్మైః=ఎఱ్ఱదామరపూలచేతను; సౌగంధికైః= ఎఱ్ఱకలువలచేతను; తామ్రాం=ఎఱ్ఱనైనదియు; కుముదమండలైః=తెల్లకలువలసమూహములచేత; శుక్లాం=తెల్లనిదియు; కువలయోద్ఘాటైః=నల్లకలువలసమూహముచేత; నీలాం=నల్లనిదియు; కావున నే; బహువర్ణాం=పెక్కువన్నెలుగల; కుథామివ(స్థితాం)= చిత్రకంబలమువలెనున్నదియునగు; పంపాం= పంపాసరస్సును; దదర్శ=చూచెను.

అంత, రాముండు, పవిత్రంబును మహామునులచే సేవింపఁబడినదియు నానావిధవృక్షలతాలంకృతంబును తాగుటకు దగునట్లుగా శీతలంబును సుగంధియు మధురంబునగు జలంబుగలదియు, ఎఱ్ఱదామరపూలచేతను ఎఱ్ఱకలువలచేతను నెఱ్ఱనై తెల్లకలువలచేఁదెల్లనై నల్లకలువలసమూహముచేనల్లనై చిత్రకంబలమువలె నానావర్ణములు గలిగినదియునగు పంపాసరస్సును, దూరంబునుండి చూచెను. అని, తాత్పర్యము.

సతామాసాద్య వై రామో దూరాదుదకవాహినీమ్. ౧౩
మతంగ సరసం నామ హ్రదం సమవగాహత

టీక॥ సః=ఆ; రామః=రాముఁడు; దూరాత్=దూరంబున; తాం=ఆ; ఉదకవాహినీం=పంపాసరస్సును; ఆసాద్య=పొంది; ("వై" అనునది పాదపూరణార్థము); మతంగసరసంనామ=మతంగసరస్సను పేరుగల; హ్రదం=సరస్సును; సమవగాహత (సమవాగాహత)=అవగాహించెను, స్నానము చేసెను.

రాముండు, అట్లు, పంపాసరస్సమీపంబునకుఁబోయి, యచ్చట దానికిఁ గొంత దూరంబుననుండు మతంగసరస్సని ప్రసిద్ధిఁ జెందినసరస్సునందు, స్నానముగావించెను. అని, తాత్పర్యము.

అరవిందోత్పలవతీం పద్మ సౌగంధికాయుతామ్. ౧౪
పుష్పితామ్రవణోపేతాం బర్హిణోద్ఘుష్టనాదితామ్
తిలకైర్బీజపూరైశ్చ ధవైశ్శుక్లద్రుమైస్తథా. ౧౫
పుష్పితైః కరవీరైశ్చ పున్నాగైశ్చ సుపుష్పితైః
మాలతీ కుంద గుల్మైశ్చ భాండీరైర్నిచులైస్తథా. ౧౬
అశోకైస్సప్తపర్ణైశ్చ కేతకైరతిముక్తకైః
అన్యైశ్చ వివిధైర్వృక్షైః ప్రమదామివ భూషితామ్. ౧౭
సమీక్షమాణౌ పుష్పాఢ్యం సర్వతో విపులద్రుమమ్
కోయష్టికైశ్చార్జునకైశ్శతపత్రైశ్చ కీరకైః. ౧౮
ఏతైశ్చాన్యైశ్చ విహగైర్నాదితంతు వనం మహత్
తతో జగ్మతు రవ్యగ్రౌ రాఘవౌ సుసమాహితౌ. ౧౯
తద్వనం చైవ సరసః పశ్యంతౌ శకునైర్యుతమ్

టీక॥ తతః=అంత; రాఘవౌ=రామలక్ష్మణులు; అవ్యగ్రౌ=ఏమఱుపాటులేనివారలై; సుసమాహితౌ=మిక్కిలియు నెచ్చరికగలవారలై; అరవిందోత్పలవతీం=ఎఱ్ఱతామరపూలును కలువలునుగలదియు; పద్మసౌగంధికాయుతాం=తెల్లతామరపూలతోను ఎఱ్ఱకలువలతోనుగూడినదియు; పుష్పితామ్ర

వణోపేతాం = పూచినమామిడితోఁ గూడినదియు; బర్హిణోద్ఘుష్ట నాదితాం= నెమిళ్ల ధ్వనులచే ధ్వనింపఁ జేయఁబడినదియు; తిలకైః=బొట్టుగు చెట్లచేతను; బీజపూరైశ్చ= దాడిమీ వృక్షములచేతను, ధవైః=చండ్రచెట్ల చేతను; తథా=అట్లు; శుక్లద్రుమైః= ఏఱుమద్దిచెట్లచేతను; పుష్పితైః= పూచిన; కరవీరైశ్చ = గన్నేరుచెట్లచేతను; సుపుష్పితైః=చక్కఁగాఁబూచిన; పున్నాగైశ్చ=సురపొన్నచెట్లచేతను; మాలతీకుందగుల్మైశ్చ= జాజిపొదలచేతను మొల్లపొదలచేతను ; భాండీరైః=మఱ్ఱిచెట్లచేతను; తథా=అట్లు; నిచులైః= తినాసపుచెట్లచేతను; అశోకైః= అశోకవృక్షములచేతను; సప్తపర్ణైః=ఏడాకులయరఁటిచెట్లచేతను; కేతకైః=మొగిలిచెట్లచేతను ; అతిముక్తకైః=పువ్వులగురివిందచెట్లచేతను; అన్యైః=ఇతరములయిన; వివిధైః = నానావిధములయిన; వృక్షైశ్చ=చెట్లచేతను; భూషితాం=అలంకరింపఁబడినదియు; ప్రమదామివ(స్థితాం)=స్త్రీవలెనున్నదియునగు పంపాసరస్సును; సర్వతః= అంతటను; సమీక్షమాణౌ= చూచుచు; పుష్పాఢ్యం=పూలతోఁగూడినదియు; విపులద్రుమం=విశాలములయినవృక్షములుగలదియు; కోయష్టికైశ్చ= చీకుఁగొక్కెరలచేతను; అర్జునకైః=నెమిళ్లచేతను; శతపత్రైశ్చ= బెగ్గురుపక్షులచేతను; కీరకైః=చిలుకలచేతను; ఏతైశ్చ=ఈపక్షులచేతను; అన్యైః=ఇతరములయిన; విహగైశ్చ=పక్షులచేతను; నాదితం=ధ్వనింపఁజేయఁబడినదియు; మహత్=గొప్పదియునగు; వనంతు=వనమునుగూర్చి యే; శకునైః=పక్షులలో; యుతం= కూడిన; తత్=ఆ; సరసః= పంపాసరస్సుయొక్క; వనం=వనమును; పశ్యంతౌ చైవ= చూచుచునే; జగ్మతుః=పోయిరి.

అంత, ఎఱ్ఱదామరపూలతోను తెల్లతామరపూలతోను తెల్లకలువలతోను ఎఱ్ఱకలువలతోను ఒప్పుచున్నదియుఁ బుష్పించియుండు మామిడితోఁపుతోఁగూడినదియు మయూరధ్వనులచే ధ్వనింపఁజేయఁబడుచున్నదియు, బొట్టుగుచెట్లు దాడిమచెట్లు చండ్రచెట్లు ఏఱుమద్దిచెట్లు పుష్పించిన గన్నేరుచెట్లు పొన్నచెట్లు జాజిచెట్లు మొల్లచెట్లు వటవృక్షంబులు వంజులవృక్షంబులు అశోకవృక్షంబులు సప్తపర్ణవృక్షంబులు మొగిలిపొదలు పువ్వులగురివిందచెట్లు మొదలగు వృక్షంబులచేనలంకృతమై యాభరణాలంకృతయయినసారీమణివలెఁ బ్రకాశించుచున్నది

స ౭౫

యునగు నా పంపాసరస్సునంతయుఁ జూచుచుఁ, బుష్పంబులచేనిండినదియుఁ బెద్దపెద్దవృక్షంబులుగలదియు మధురంబుగాఁగూయుచుండు చీకుఁగోకిలలు నెమిళ్లు బెగ్గురులు చిలుకలు మొదలగుపక్షులతోఁగూడినదియునగు నా పంపాసరస్సంబంధివనంబుఁ జూచుచు, నా రామలక్ష్మణులు, ఎంత మాత్రమేమఱుపాటు లేక యెచ్చరికతో నవ్వనంబునకుఁ బోయిరి. అని, తాత్పర్యము.

స దదర్శ తతః పంపాం శీతవారినిధిం శుభామ్. ౨౦
తిలకాశోకపున్నాగవకుళోద్దాలకాశినీమ్

టీక॥ తతః=అంత; సః=ఆరాముఁడు; శీతవారినిధిం = చల్లనిజలమునకు నిధి యయినదియు; శుభాం=సుందరమయినదియు; తిలకాశోకపున్నాగవకుళోద్దాలకాశినీం=బొట్టుగుచెట్లచేతను అశోకవృక్షములచేతను పున్నాగవృక్షములచేతను పొగడచెట్లచేతను విరిగిచెట్లచేతను బ్రకాశించుచున్నదియునగు; పంపాం=పంపాసరస్సును; దదర్శ=చూచెను.

అంత, రాముండు, చల్లనిజలముగలదియు సుందరమును తిలకవృక్షంబులు అశోకవృక్షంబులు పున్నాగవృక్షంబులు పొగడచెట్లు విరిగిచెట్లు మొదలగువృక్షంబులచే నొప్పుచున్నదియునగు పంపాసరస్సుం జూచెను. అని, తాత్పర్యము.

స రామో వివిధాన్ వృక్షాన్ సరాంసి వివిధానిచ. ౨౧
పశ్యన్ కామాభిసంతప్తో జగామ పరమం హ్రదమ్

టీక॥ సః=ఆ; రామః=రాముఁడు; వివిధాన్= నానావిధములయిన; వృక్షాన్=వృక్షములను; వివిధాని=నానావిధములగు; సరాంసిచ=సరస్సులను; పశ్యన్=చూచుచు; కామాభిసంతప్తః=మన్మథునిచేఁదపింపఁజేయఁబడినవాఁడై; పరమం=శ్రేష్ఠమయిన; హ్రదం=సరస్సైన పంపాసరస్సును; జగామ=పోయెను.

రాముండు నానావిధములయిన వృక్షములను నానావిధములయిన సరస్సులను జూచుచు మన్మథబాణాభిహతుండై, పంపాసరస్సునకుఁ బోయెను.

అని, తాత్పర్యము.

స ౭౫

పుష్పితోప వనోపేతాం సాలచంపక శోభితామ్. ౨౨

షట్పదౌఘ సమావిష్టాం శ్రీమతీ మతులప్రభామ్

స్ఫటికోప మతోయాఢ్యాం శ్లక్ష్ణవాలుక సంతతామ్. ౨౩

స తాం దృష్ట్వా పునః పంపాం పద్మసౌగంధికైర్యుతామ్

ఇత్యువాచ తదా వాక్యం లక్ష్మణం సత్యవిక్రమః. ౨౪

టీక॥ సత్యవిక్రమః= సత్యమయినపరాక్రమముగల; సః=ఆరాముఁడు; పుష్పితోపవనోపేతాం=పూచినసమీపంబునను౦డు వనములతోఁ గూడినదియు; సాలచంపకశోభితాం= మద్దిచెట్లచేతను సంపెఁగచెట్లచేతను ప్రకాశించుచున్నదియు; షట్పదౌఘసమావిష్టాం=తుమ్మెదలసమూహముచే వ్యాపింపఁబడినదియు; శ్రీమతీం=అధికమయినకాంతిగలదియు; అతులప్రభాం=సరిలేనికాంతిగలదియు; స్ఫటికోపమతోయాఢ్యాం=స్ఫటికశిలలతోఁ బోలికగల జలముతోఁ గూడినదియు; శ్లక్ష్ణవాలుకసంతతాం=మెత్తనియిసుకచే వ్యాపింపఁబడినదియు; పద్మసౌగంధికైః=కమలములతోను చెంగలువలతోను; యుతాం=కూడినదియునగు; తాం=ఆ; పంపాం=పంపాసరస్సును; పునః=మఱల; దృష్ట్వా=చూచి; తదా=అప్పుడు; లక్ష్మణం=లక్ష్మణునిఁగూర్చి; ఇతి=ఇట్లు; ఉవాచ=చెప్పెను.

సత్యపరాక్రముఁడగు నా రాముండు, పుష్పితంబులగు వనంబులతోఁ గూడినదియు మద్దిచెట్లతోను చంపకవృక్షములతోను బ్రకాశించుచున్నదియుఁ దుమ్మెదలసమూహముతోఁ గూడినదియు అసదృశమయిన కాంతిగలదియు స్ఫటికమువలె స్వచ్ఛమయినజలముగలదియు మెత్తనియిసుకగలదియు కమలంబులు సౌగంధికంబులు మొదలగు పుష్పంబులతోఁ గూడినదియు నగు నా పంపాసరస్సును జూచి, లక్ష్మణు నితో నిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

అస్యాస్తీరేతు పూర్వోక్తః పర్వతో ధాతుమండితః

ఋశ్యమూక ఇతి ఖ్యాతః పుణ్యః పుష్పితపాదపః. ౨౫

టీక॥ అస్యాః= ఈపంపాసరస్సుయొక్క; తీరేతు=గట్టునందె; ధాతుమండితః=గైరికధాతువులచేనలంకరింపఁబడినదియు; పుణ్యః=పవిత్రమును; పు

ష్పితపాదపః=పుష్పించినవృక్షములుగలదియు; ఋశ్యమూక ఇతి=ఋశ్యమూకమని; ఖ్యాతః=ప్రసిద్ధమునగు; పర్వతః=పర్వతము; అస్తీతి (అధ్యాహృతము)=ఉన్నదని; పూర్వోక్తః=ముందు చెప్పఁబడినది.

ఈపంపాసరస్సుతీరంబునందె, గైరికధాతువులచే నలంకృతంబును బవిత్రంబును పుష్పితంబులగువృక్షములుగలదియునగు ఋశ్యమూకపర్వతమున్నదని, మున్నుకబంధుండు చెప్పినాఁడు.

అని, తాత్పర్యము.

హరే ఋక్షరజోనామ్నః పుత్త్ర స్తస్య మహాత్మనః
అధ్యా స్తే తం మహావీర్య స్సుగ్రీవ ఇతి విశ్రుతః. ౬౮

టీక॥ మహాత్మనః= అధికమయినపరాక్రమముగల; తస్య = ఆ; ఋక్షరజోనామ్నః=ఋక్షరజస్సను పేరుగల; హరేః=వానరునియొక్క; పుత్త్రః=కొడుకును; మహావీర్యః= అధికమయినపరాక్రమముగలవాఁడునగు ; సుగ్రీవ ఇతి=సుగ్రీవుఁడని; విశ్రుతః= ప్రసిద్ధుఁడయినవాఁడు; తం= ఆఋశ్యమూకపర్వతమును; అధ్యాస్తే=అధిష్ఠించియున్నాఁడు.

మహాపరాక్రమశాలియగు ఋక్షరజుండను వానరవీరునిపుత్త్రుండును మహాపరాక్రమశాలియునగుసుగ్రీవుండు, ఆ ఋశ్యమూకపర్వతంబునందున్నాఁడు.

అని, తాత్పర్యము.

సుగ్రీవ మభిగచ్ఛ త్వం వానరేంద్రం నరర్షభ

టీక॥ నరర్షభ= పురుషశ్రేష్ఠుఁడవగులక్ష్మణుఁడా! త్వం=నీవు; వానరేంద్రం=వానరరాజుఁడగు; సుగ్రీవం=సుగ్రీవునిఁగూర్చి; అభిగచ్ఛ=పొమ్ము.

పురుషశ్రేష్ఠుఁడవగు లక్ష్మణుఁడా! నీవు,వానరరాజుండగు సుగ్రీవునొద్దకుఁ బొమ్ము. అని, రాముండులక్ష్మణునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యువాచ పునర్వాక్యం లక్ష్మణం సత్యవిక్రమమ్. ౭౦

టీక॥ సః(అధ్యాహృతము)= ఆరాముఁడు; సత్యవిక్రమం=సత్యమయిన ప




రాక్రమముగల; లక్ష్మణం= లక్ష్మణుని గూర్చి; ఇతి=ఇట్లని; పునః=మఱల; వాక్యం=మాటను; ఉవాచ=చెప్పెను.

రాముండు, సత్యపరాక్రముండగు నాలక్ష్మణుండూచి, మఱలనిట్లనిచెప్పెను. అని, తాత్పర్యము.

రాజ్యభ్రష్టేన దీనేన తస్యా మాసక్తచేతసా
కథం మయా వినా శక్యం సీతాం లక్ష్మణ జీవితుమ్. ౫౫

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! రాజ్యభ్రష్టేన= రాజ్యముననుండి పడినవాఁడను; దీనేన=దుఃఖితుండను; తస్యాం=ఆసీతయందు; ఆసక్తచేతసా=తగిలినమనస్సుగలవాఁడనగు; మయా=నాచేత; సీతాం వినా=సీతనువిడిచి; జీవితుం=బ్రతుకుటకు; కథం=ఎట్లు; శక్యం=అలవియగును?

లక్ష్మణుఁడా! రాజ్యభ్రష్టుండను దీనుండను సీతయందు మిక్కిలియు నాసక్తిగలవాఁడనగునేను, సీతనువిడిచి, యెట్లుజీవింపఁగలను? అని, రాముండు, లక్ష్మణునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యేవ ముక్త్వా మదనాభిపీడిత
స్స లక్ష్మణం వాక్య మనన్యచేతసమ్
వివేశ పంపాం నలినీం మనోరమాం
రఘూత్తమ శ్శోకవిషాదయంత్రితః. ౫౬

టీక॥ సః=ఆ; రఘూత్తమః= రాముఁడు; మదనాభిపీడితః=మన్మథునిచేఁ బీడింపఁబడినవాఁడై; శోకవిషాదయంత్రితః= దుఃఖముచేతనుదిగులుచేతనుగట్టఁబడినవాఁడై; అనన్యచేతసం=ఇతరమందుమనస్సులేనట్టి; లక్ష్మణం=లక్ష్మణునిఁగూర్చి; ఇత్యేవం=అనియిట్లు; ఉక్త్వా=చెప్పి; మనోరమాం=సుందరమయిన; పంపాం=పంపయను; నలినీం=సరస్సును; వివేశ=ప్రవేశించెను.

రాముండు, మన్మథపీడితుండై, దుఃఖపరవశుండై, తనమాటయందె దృష్టియుంచి సావధానుండైయున్న లక్ష్మణుఁజూచి, యిట్లుచెప్పి, మనోహరంబగునాపంపాసరస్సువద్దకుఁబోయెను.

అని, తాత్పర్యము.




తతో మహద్వర్త్మ సుదూరసంక్రమం
క్రమేణ గత్వా ప్రవిలోకయ న్వనమ్
దదర్శ పంపాం శుభదర్శకాననా
మనేకనానావిధపక్షిజాలకామ్. ౩౦

టీక॥ తతః = అంత; సః(అధ్యాహృతము)=ఆరాముఁడు; సుదూరసంక్రమం=మిక్కిలియుదూరమయినగమనముగల; మహత్ = గొప్పదగు; వర్త్మ=మార్గమును; వనం=అడవిని; ప్రవిలోకయన్ = చక్కఁగాఁజూచుచు; క్రమేణ=వరుసగా; గత్వా=పోంది; శుభదర్శకాననాం=మంగళకరమయినచూచుటగలయడవులుగలదియు; అనేకనానావిధపక్షిజాలకాం = పెక్కులయిననానావిధములగుపక్షుల సమూహములు గలదియునగు ; పంపాం=పంపాసరస్సును;దదర్శ=చూచెను.

అంత నారాముండు, అక్లుబహుదూరము, క్రమముగా, సుందరంబగు నవ్వనంబుఁజూచుచుంబోయి, సుందరములయినయడవులుగలదియు అధికముగా నానావిధపక్షి సమూహములతో నొప్పుచున్నదియునగు పంపాసరస్సునుజూచెను.అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అరణ్యకాండే, పంచసప్తతితమస్సర్గః.
అరణ్యకాండస్సమాప్తః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు,అరణ్యకాండపంచసప్తతితమసర్గటీక,
ముగిసినది.

అరణ్యకాండంబుసమాప్తంబయ్యె.
శ్రీరామచంద్రార్పణమస్తు.

శ్రీః







శ్రీరామచంద్ర శ్రితపారిజాతః సమస్త కల్యాణ గుణాభిరామః।
సీతాముఖాంభోరుహచంచరీకో నిరంతరం మంగళమాతనోతు॥